# ఫ్రౌను - తెలుగు కావ్య సముద్ధరణము

మద్రాసు విశ్వవిద్యాలయమువారి
డాక్టరేట్ పట్టము పొందిన
**సిద్ధాంత గ్రంథము**

**డాక్టర్. ఆర్. పద్మావతి**
ప్రెసిడెన్సీ కళాశాల, మద్రాసు.

**నవ్యపరిశోధక ప్రచురణ**
18-1-699, భవానీనగర్,
**తిరుపతి.**

వేమపరిశోధక ప్రచురణ - ౩
పర్యసాక్యమ్మ సంకలితము
ప్రతులు : వేయి
ప్రచురణ : మే, 1986.

వెల : రూ. 50/-

ప్రతులకు :-
జి. లక్ష్మమ్మ
18-1-699
భవానీనగర్
తిరుపతి

ముఖపత్ర రచన : డా॥ పి. సి. నరసింహారెడ్డి

ముద్రణ :
వెరైటీ ప్రింటర్స్, ఏలూరు - 1.

# అభినందన

ఆచార్య జి. యస్. రెడ్డి
ఉపాధ్యక్షులు
శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం

బ్రౌన్ ఆంగ్లేయుడు అవివాహితుడు :

గ్రీకు లాటిన్, హీబ్రూ, ఫ్రెంచి, ఇటాలియన్, పర్షియన్, సంస్కృతాంగ్లాంధ్రాది బహుభాషా పండితుడు;

బహుభాషా దక్షిణనాయకుడైనా, తెలుగుభాషను పట్టమహిషిగా వరించిన ధీరోదాత్తుడు.

జీవితాంతం తెలుగు భాషా సాహిత్యాలు తన ఊపిరిగా జీవించిన యోగమూర్తి ;

ఆర్జించిన ప్రతిపైసాను తెలుగు సాహిత్యోద్ధరణకు, పండిత పోషణకు. గ్రంథ ప్రచురణకు వినియోగించిన త్యాగధనుడు ;

ఆంధ్రుల అదృష్టంకొద్దీ అవతరించిన మహనీయుడు; ఆంధ్రులకు సర్వథా ఆరాధ్యుడు బ్రౌన్ సాహిత్యజీవితం అత్యద్భుతం.

బ్రౌన్ కార్యదక్షుడు.

తెలుగు భాషాసాహిత్య పునరుజ్జీవనానికి, వికాసానికి బ్రౌన్ చేసిన సేవ అపూర్వం అనితరం, బహుముఖం.

అటకల మీద మగ్గిపోతున్న వేలాది తాళపత్ర గ్రంథాలను సేకరించి రక్షించినాడు. ఆనాడు బ్రౌన్ వాటిని సేకరించకపోయి వుంటే ఈనాడు మనకు అనేక తెలుగు కావ్యాలు నామమాత్రావశిష్టాలుగా వుండేవి. సేకరించిన తాళపత్ర రూప కావ్య ప్రబంధాలకు సొంత ఖర్చుతో కాగితపు ప్రతులు వ్రాయించి పండితులకు జీతమిచ్చి పరిష్కరించి ప్రామాణిక ప్రతులు సిద్ధపరచినాడు. నిజానికి తెలుగు పండితులకు గ్రంథపరిష్కరణ విద్యాభిక్ష పెట్టిన తొలి సాహిత్యవేత్త బ్రౌన్.

పరిష్కరించిన అనేక తెలుగు గ్రంథాలను నూరార్లు లెక్కసేయక అప్పులుపెట్టి పండిత సహాయంతో పరిష్కరించి, కొన్నిటికి వ్యాఖ్యలు వ్రాయించి, మొట్ట మొదటిసారిగా ముద్రించి, ప్రచురించిన సంపాదక ఘనుడు బ్రౌన్‌దొర.

తెలుగు సాహిత్యరంగంలో తొలి పరిశోధకుడుగా, గ్రంథ సంపాదకుడుగా గుర్తింపదగ్గవాడు, కీర్తింపదగ్గవాడు, బ్రౌన్.

బహుముఖమైన బ్రౌన్‌దొర తెలుగు సాహిత్యసేవలో ఒక ముఖ్యాంశం అతడు చేపట్టిన గ్రంథ సేకరణ, పరిష్కరణ, ప్రచురణ.

19 వ శతాబ్దంలో ఇప్పటికి సుమారు పద్దెదు దశాబ్దాలకు ముందు తెలుగునాట రవాణాసౌకర్యాలు, ముద్రణాలయాలు, అక్షరాస్యత అంతంత మాత్రంగా వున్న గడ్డుకాలంలో తెలుగు భాషా సాహిత్యానికి విలువను, వెలుగును, దేశాంతర వ్యాప్తిని కలిగించిన కర్మయోగి బ్రౌన్. నిజానికి బ్రౌన్ సాహిత్యాన్ని గురించి, అతని జీవితాన్ని గురించి పరిశోధించడానికి కనీసం పదిమంది పరిశోధకులు చేపట్టదగినంత సామగ్రి వుంది.

బహుముఖరూపమైన బ్రౌన్ సాహిత్యకృషిలో తెలుగు కావ్య సముద్ధరణం ఒక అంశం. తెలుగు కావ్యాలను బ్రౌన్ ఉద్ధరించినాడని అందరూ చెప్పడమేకాని,

ఆ సముద్ధరణ ప్రయత్న ఫలితాల స్వరూపాన్ని లోతుగా పరిశీలించిన బ్రౌన్ అభిమానులు లేరు. అట్టి పరిశోధనకు తొట్టతొలిసారిగా పూనుకొన్న బ్రౌన్ అభిమాని శ్రీమతి పద్మావతి.

మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారంలోని బ్రౌన్ సంపుటాలకు దుమ్ము దులిపి, ఆ సంపుటాల్లోని ప్రతిపుటను అక్షర చక్షువుగా పరిశీలించి విషయసేకరణ చేసి, సేకరించిన విషయాన్నంతా గ్రంథవిస్తరభీతితో సంగ్రహపరచి, వజ్రరూపతుల్యమైన బ్రౌన్ సాహిత్యమూర్తిమత్వంలోని ఒక పక్షాన్ని ప్రత్యక్షీకరించిన శ్రీమతి పద్మావతిని మనసారా అభినందిస్తున్నాను.

బ్రౌన్ మహాశయుని సూక్ష్మబుద్ధిని, తీక్షణదృష్టిని, ప్రమాణ ప్రీతిని, విమర్శపద్ధతిని, ఔచిత్యపాలనపరతను, సాహిత్య వ్యాసంగాన్ని ప్రసన్నం చేసే విశేషాలు – లోకానికి ఇంతవరకు తెలియనివి – అనేకం ఈ గ్రంథంలో చోటుచేసుకోవడం ప్రశంసనీయం.

బ్రౌన్‌దొర తెలుగు భాషాసాహిత్యాభివృద్ధికి ప్రామాణికమైన పాఠ్యగ్రంథాలు, ఛందో వ్యాకరణాలు, నిఘంటువులు, స్వయంగా రచించి ప్రచురించినాడు. వీటిన్నిటినీ కూడా పరిశోధక విమర్శదృష్టితో పరిశీలించాలి. అట్టి పరిశోధనకు డా॥ పద్మావతి రచించిన గ్రంథం ఒక మార్గదర్శకం కాగలదని నా నమ్మకం. సమగ్రమైన బ్రౌన్ జీవితచరిత్ర వ్రాయవలసిన అవసరం, బాధ్యత కూడా మనకున్నది. అట్టి ప్రయత్నానికి ముందు బ్రౌన్‌సాహిత్యం మీద సమగ్రమైన పరిశోధన జరగాలి. అట్టి పరిశోధనకు కూడా డా॥ పద్మావతి రచించిన ఈ గ్రంథం నాంది పలకడం విశేషం. ఈ గ్రంథరచనలో రచయిత్రి పాటించిన విశ్లేషణ విధానం, పొందుపరచిన ఆకర విశేషాలు, వినమ్రంగా చాటిన సిద్ధాంతాలు, పండిత విమర్శకుల ఆదరణాభిమానాలను ఆకర్షించగలవని నా అభిప్రాయం.

బ్రౌన్ సాహిత్యంమీద ఈ పరిశోధనగ్రంథాన్ని ముద్రించి తెలుగు లోకానికి అందించిన డా॥ పద్మావతిని మరొక మారు అభినందిస్తున్నాను. విశ్వవిద్యాలయాల్లోని తెలుగు సాహిత్య పరిశోధక విద్యార్థులకు ఈ గ్రంథమొక ప్రేరకం కాగలదని నా విశ్వాసం.

15—5—86 — జి. యస్. రెడ్డి

# అంజలి

బ్రౌను సముద్ధరించిన వ్రాతప్రతులను పరిశీలింప అనుమతించిన తమిళనాడు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయాధికారులకు —

బ్రౌనుకు సంబంధించిన అమూల్యమైన మైక్రో ఫిల్ములను ఒసగి నా పరిశోధనకు సహకరించి, ఈ గ్రంథముద్రణకు కారకులై, దీనిని వెలుగులోనికి తెచ్చుటకు తోడ్పడుటయేకాక, గ్రంథమును సావధానముగ చదివి సమీక్షారూపమైన అభిప్రాయములను వెలిబుచ్చిన అప్పటి బ్రౌన్ ప్రాజెక్ట్ డైరెక్టరు, ఇప్పటి శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు అయిన ఆచార్య జి. యన్ రెడ్డిగారికి—

బ్రౌను తెలుగుకావ్య సముద్ధరణమును పరిశోధనాంశముగ ఎన్నుకొనినందుకు ఎంతయో సంతసించి ఇండియా ఆఫీసు లైబ్రరీ కేటలాగును ఇచ్చిన కీ. శే. బంగోరె గారికి-

కావ్యపరిష్కరణ పద్ధతులను, నిర్దుష్ట పాఠ నిర్ణయ రీతులను విశదీకరించు సందర్భమున పెక్కు ఛందో వ్యాకరణ విషయములను శిష్యవాత్సల్యముతో వివరించిన పూజ్యులు, గురుతుల్యులు, విద్వత్ శిరోమణులు కీ. శే. రావూరి దొరస్వామి శర్మగారికి—

నా పరిశోధనకు పర్యవేక్షకులైన డా. యస్. వి. శంకరరావుగారికి—

వ్యాసరచనా సమయమున ఉచిత సలహాల నొసగిన ఆచార్య సాళ్వ కృష్ణమూర్తిగారికి—

పరిశోధనకు తగిన సూచనలను చేసిన డా. దేవళ్ల చిన్నికృష్ణయ్యగారికి—

బ్రౌనును గురించి ఇష్టాగోష్ఠి నెరపిన శ్రీ తీర్థం శ్రీధరమూర్తిగారికి—

నా సాహిత్య కృషిని సర్వవిధముల ప్రోత్సహించిన ఆచార్య జి. లలితగారికి—

పరిశోధనావకాశము ప్రసాదించిన ప్రభుత్వ కళాశాలల అధ్యక్షులకు మద్రాసు విశ్వవిద్యాలయాధికారులకు—

గ్రంథ ముద్రణకై ఆర్థిక సాహాయ్యమొనర్చిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సాంస్కృతిక శాఖవారికి—

కోరినదే తడవుగ గ్రంథముద్రణ భారమునంతయు తామే వహించిన ఆచార్య జి. నాగయ్యగారికి—

గ్రంథము నందముగ ముద్రించుటలో శ్రద్ధవహించిన వెరైటీ ప్రింటర్స్, ఏలూరువారికి

నా కృతజ్ఞతాంజలులు.

# మున్నుడి

బ్రౌను తెలుగు సాహిత్యమున కొనర్చిన సేవ అపారమని లోకవిదితము. బ్రౌను జీవిత చరిత్ర, ఆతని రచనలను గూర్చిన పరిశోధన ఇప్పటికి కొంత జరిగి యున్నది.

బ్రౌను మహాశయుని ఆంధ్రభాషాభిమానమును గూర్చి ప్రప్రథమమున ప్రకటించినవారు శివయ్యశాస్త్రిగారు (ఉగాది సంచిక 1912). తెలుగు సాహిత్యమునకు బ్రౌను ఒనర్చిన సేవను గురించి భారతి (1929)లో పేర్కొనినవారు నిడదవోలు వెంకటరావుగారు. తదుపరి శ్రీ కొత్తపల్లి వీరభద్రరావుగారి 'సి పి. బ్రౌన్' (1963) జీవిత చరిత్రను, నేటి సాహిత్యసేవను అనుసంధించి చేసిన పరిశోధన పుస్తకరూపమున ప్రకటింపబడెను. శ్రీ నార్ల వెంకటేశ్వరరావుగారు, శ్రీ మరుపూరు కోదండరామిరెడ్డిగారు 'వేమన–పాశ్చాత్యులు' (1971) అను పరిశీలనమున బ్రౌను వేమన శతక సముద్ధరణకు పడినపాట్లను విశదీకరించిరి. పిదప కే. శే. బంగోరె బ్రౌనుదొర చేసిన తెలుగుభాషాకృషిని వెల్లడించు 'బ్రౌన్ జాబులు : తెలుగు జర్నలిజం చరిత్ర 1832 నుంచి 1854 దాక' (1973), 'సి. పి. బ్రౌన్ సంతరించిన తాతాచార్ల కథలు' (1974) అను గ్రంథముల ప్రచురించిరి. శ్రీ చల్లా రాధాకృష్ణశర్మగారు 'సి పి. బ్రౌన్ సాహితీసేవ' (1975) అను పుస్తకమున దిఙ్మాత్రముగ బ్రౌనును గురించి రచించిరి. శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం తెలుగు అధ్యయన శాఖవారు 'బ్రౌన్ ప్రోజెక్ట్' ఆధ్వర్యమున 'బ్రౌన్ లేఖలు-ఆధునికాంధ్ర సాహిత్య చరిత్ర శకలాలు' (1977), 'బ్రౌన్ జాబుల్లో స్థానిక చరిత్ర శకలాలు – కడపజాబుల సంకలనం' (1977), 'Literary Autobiography of C. P. Brown' (1978), అను గ్రంథములను ముద్రించిరి. శ్రీ మోహన్‌గారు 'పాశ్చాత్యులు తెలుగుభాషా సంస్కృతులు' (1978) అను పుస్తకమున బ్రౌనును గూర్చి ప్రస్తావించిరి.

జీర్ణావస్థలోనున్న తెలుగు వాఙ్మయమును సముద్ధరింప అవతరించిన అవతార పురుషుడు బ్రౌను అని ఈ పరిశోధకులు, వ్యాసకర్తలు ప్రస్తుతించిరి. ఇందలి సత్యాసత్యములను లోతుగ పరిశీలింపవలయుననెడి జిజ్ఞాసయే ఈ సిద్ధాంత వ్యాసమునకు

ప్రేరకము. విదేశీయుడైనను బ్రౌను తెలుగు సాహితీవేత్తగ, తెలుగు వాఙ్మయ చరిత్రలో యుగపురుషుడుగ నిలువదగిన వ్యక్తియగునా అని అన్వేషించుటకు పూనుకొనగా అది సత్యమని నిరూపితమాయెను.

'బ్రౌను-తెలుగు కావ్యసముద్ధరణము' అను ఈ గ్రంథమున తెలుగుకావ్యమను శబ్దములో పురాణేతిహాసములు, ప్రబంధములు, కథాకావ్యములు, ద్విపదలు, శతకములు అంతర్గతములు. బ్రౌను పద్యకావ్యములనే గాక యక్షగానములను, జానపదగేయములను, వచనరచనలను కూడ సముద్ధరించెను. కాని వాని పరిశీలనము ఈ గ్రంథమున లేదు.

బ్రౌను సాహిత్యసేవ నవగాహన చేసికొనుటకు అతని జీవిత సంక్షిప్త చరిత్ర పొందుపరచబడెను. బ్రౌను తెలుగు కావ్యముల పునరుద్ధరింప అవలంబించిన విధానములు, గ్రంథపరిష్కరణ, పాఠనిర్ణయ పద్ధతులు, శుద్ధప్రతుల నిర్మాణము, కావ్యముద్రణ రీతులు స్థూలముగ చర్చింపబడినవి. ఈ విధానమంతయు తెనుగునకు అపూర్వము కదా !

బ్రౌను పరిష్కరించి, తయారుచేసిన పురాణేతిహాసముల, ప్రబంధముల, కథాకావ్యముల, ద్విపదల, శతకముల యొక్క శుద్ధప్రతుల వివరములు సవిస్తరముగ ప్రదర్శింపబడెను.

బ్రౌను తెలుగు కావ్యములకు పాఠకుల సులభావగాహన నిమిత్తము వ్యాఖ్యలను సంతరింపజేసెను. బహుళ ప్రయోజన కారులగు పదసూచికలను సంకలనము చేయించెను. ఉపోద్ఘాతములను అనుసంధించెను. అతనికి నచ్చిన కొన్ని పద్యములను ఆంగ్లములోనికి అనువదించెను. భాషాదృష్టితో లేఖలను సంపుటములుగ సమకూర్చెను. తెలుగు కావ్యసముద్ధరణమున బ్రౌను ఒనర్చిన ఈ బహుముఖసేవ ప్రస్తావింపబడెను

బ్రౌను సంకల్పించిన ఈ వాఙ్మయ మహాయజ్ఞమున ఆతనికి తోడ్పడిన సహచరులును చిరస్మరణీయులే. వారిని గూర్చిన పరిచయములు అనుసంధింపబడినవి.

బ్రౌను విమర్శలు, ఉపోద్ఘాతములు, విషయ సూచికలు, కథాసంగ్రహములు చాలవరకు ఆంగ్లభాష యందున్నవి. బ్రౌను హృదయ మవగాహన కావలయునన్న ఆతని వాక్యములనే యథాతథముగ ఉద్ధరింపవలయును. అనువాదములు పూర్ణప్రయో

జనకారులు కాజాలవు. కావున అవసరమయిన ఘట్టములందు బ్రౌను వాక్యములు ఉన్నవి ఉన్నట్లే ఉద్ధరింపబడినవి. తీట్లే వ్రాతప్రతులందలి పద్యములు సవరింపక యథాతథముగ ఉదాహృతములు.

ఈ రచనయందు సరళ గ్రాంథికశైలి ఉపయుక్తము. బ్రౌను పరిహరించిన అరసున్నలు, శకటరేఫలు ఇందును పరిహరింపబడినవి. స్పష్టప్రతిపత్తికై విసంధులు పాటింపబడెను.

ఇందు రెండు అనుబంధములు గలవు. మొదటి అనుబంధము బ్రౌను సేకరించిన, పరిష్కరించిన కావ్యముల వివరములు. బ్రౌను దొరను సమకాలికులు ప్రస్తుతించుచు చెప్పిన పద్యముల కూర్పు రెండవ అనుబంధము. ఈ అనుబంధములు భావి పరిశోధకుల కుపకరించునను ఉద్దేశముతో కూర్పబడినవి.

గ్రహించిన విషయము బహు విస్తృతమయినది. గ్రంథ విస్తరభీతిచే దీనిని సంక్షిప్తపరచవలసి వచ్చెను. బ్రౌను తెనుగునకు చేసిన సేవను తెలిసికొనగోరు వారికిది విహంగవీక్షా సదృశమగును. బ్రౌను సేవను సాకల్యముగ పరిశీలింపగోరు పరిశోధకులకు ఈ నా ప్రయత్నమేమాత్రము తోడ్పడినను నా పరిశ్రమకు ఫలము దక్కినట్లే భావింతును.

ఆర్. పద్మావతి.

వంధువైరికిన్ వనమ్మాలికిఁ గౌస్తుభ
హారునకును సంశ్రితావనునకు
రాధికా ప్రియునకు రామ సోదరునకు
జగదీశునకు దయాసాగరునకు
శ్రీనాధునకును రక్షితదేవ సమితికిఁ
ప్రౌఢ భావునకు నారాయణునకు
సురగేంద్ర తల్పున కరిశంఖధరునకు
దొగలరాయనిగేరు మొగముదొరకు
రణవిహత దుష్టరాక్షస రమణునకును
గానమోహిత వల్లవీకాంతునకును
రిపు విదారికి హారికి శ్రీ కృష్ణునకును
శిల్పిపారికి నే నమస్కృతి యొనర్తు

— పిండిప్రోలు లక్ష్మణకవి

---

## -: సంకేత వివరణము :-

*(Abbreviations)*

| | |
|---|---|
| B. P. in India — | Book Printing in India. |
| Es. on. Tel Lit — | Essay on the Language and Literature of the Telugus. |
| Literary Life — | Some Account of the Literary Life of C P. Brown, London. 1866, 1895. |
| p. R. T. L. — | Plans for the Revival and Promotion of Telugu Literature |
| P — ... ... ... | Page |
| Pp — — ... ... | Pages. |
| Sr. of Lt ... ... | Series of letters. |
| + ... ... ... | సమగ్రము. |
| — ... ... ... | అసమగ్రము. |
| కా ప్ర. ... ... | కాగితపు ప్రతి. |
| తా. ప్ర. ... ... | తాళపత్ర ప్రతి. |

# ఉపయుక్త గ్రంథసూచి

## 1. తెలుగు :

1. అనంత కృష్ణశర్మ, రాళ్లపల్లి, వేమన, వాల్తేరు,
ఆంధ్రవిశ్వకళా పరిషత్తు, 1929.

2. అప్పకవి, కాకునూరి, అప్పకవీయము, మద్రాసు,
వావిళ్ల 1970.

3. ఆరుద్ర, సమగ్ర ఆంధ్రసాహిత్యం. 12 సం. మద్రాసు;
యం. శేషాచలం అండ్ కంపెనీ. 1965

4. కడిరీపతి, పాలవేకరి, శుకసప్తతి, చెన్నపురి, వావిళ్ల, 1951.

5. ————, ", , హైదరాబాద్,
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, 1979.

6. కోదండ రామరెడ్డి, మరుపూరు, వేమన – పాశ్చాత్యులు,
నెల్లూరు వర్ధమాన సమాజము, 1971.

7. ——— ఆంధ్రవాఙ్మయము, వావిళ్ల, 1977.

8. గౌరన, హరిశ్చంద్ర చరిత్ర, మదరాసు, వేపేరి,
మిషన్ ప్రెస్, 1842.

9. ఘట్టు ప్రభువు, కుచేలోపాఖ్యానము, మద్రాసు,
అమెరికన్ మిషన్ ప్రెస్, 1841.

10. ———— " , చెన్నపురి, వావిళ్ల 1924

11. జోగారావు, యస్వీ, ఆంధ్రయక్షగాన వాఙ్మయచరిత్ర,
వాల్తేరు, ఆంధ్ర విశ్వకళాపరిషత్తు. 1961.

11. దొరసామిశర్మ, రావూరి, తెలుగుభాషలో ఛందోరీతులు,
మద్రాసు, గ్రంథకర్త, 1962.

13. ———— తెలుగులో తిట్టుకవిత్వము, మద్రాసు, శేషాచలం
అండ్ కంపెనీ, 1968

14. నన్నయ, ఆంధ్ర మహాభారతము (ఆదిపర్వము)
పూంబావై – శృంగారమొదలారి, పోయిగై – అప్పాస్వామి మొదలారి,
మదరాసు, సైదాపురం ఉమాపతి మొదలారి కల్విక్కళం
జమసె ముద్రాక్షరశాల, 1843

15. ——— ,, (ఆది సభాపర్వములు) సంశోధిత ముద్రణము,
హైదరాబాదు, తెలుగుశాఖ, ఉస్మానియా విశ్వవిద్యాలయము 1970

16. నారాయణకవి, దూబగుంట, పంచతంత్రము, చెన్నపురి, వావిళ్ళ, 1938

17. నారాయణామాత్యుడు, అయ్యలరాజు, హంసవింశతి, హైదరాబాదు,
ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమి, 1977

18. పాపరాజు, కంకంటి, ఉత్తరరామాయణము, మద్రాసు,
వేమూరు వేంకట కృష్ణయసెట్టి అండ్ సన్స్, 1903

19. పిచ్చయ్యశాస్త్రి, దీపాల, సారంగధర చరిత్రము, 'జితకాశి' టీకాసహితము.
తెనాలి భారతీ ముద్రణాలయము, 1942.

20. పెద్దన, అల్లసాని, మనుచరిత్ర, జూలూరి అప్పయ్య టీకాసహితము.
మద్రాసు, భువనగిరి చిన్నరంగయ్యశెట్టి, 1851.

21. పోతన, బమ్మెర. శ్రీ మహాభాగవతము, హైదరాబాదు, ఆంధ్రప్రదేశ్
సాహిత్య అకాడమి, 1964.

22. ప్రతాపరెడ్డి, సురవరము, ఆంధ్రుల సాంఘిక చరిత్ర
హైదరాబాదు, ఆంధ్రసారస్వత పరిషత్తు, 1949

23. ప్రభాకరశాస్త్రి, వేటూరి, చాటుపద్యమణి మంజరి, మద్రాసు, వావిళ్ళ, 1924

24. ———, తెలుఁగు మెఱుఁగులు, మద్రాసు, ఆంధ్ర గ్రంథమాల, 1948

25. బంగోరె, బ్రౌను జాబులు : తెలుగు జర్నలిజం చరిత్ర
1832-1857, నెల్లూరు, 1973

26. ——— సి. పి. బ్రౌన్ సంతరించిన తాతాచార్ల కథలు,
మద్రాసు, యం. శేషాచలం అండ్ కో, 1974.

27. భాస్కరుడు, భాస్కరరామాయణము, చెన్నపురి, వావిళ్ళ. 1910

28. ముద్దుపళని రాధికాసాంత్వనము, చెన్నపురి, వావిళ్ళ, 1950

29. మోహన్, కె ఆర్. కె. పాశ్చాత్యులు తెలుగుభాషా సంస్కృతులు, హైదరాబాదు, శ్రీ ముఖ పబ్లికేషన్స్, 1978

30. రమాపతిరావు, అక్కిరాజు వీరేశలింగం పంతులు - సమగ్ర పరిశీలన, విజయవాడ, విశాలాంధ్ర ప్రచురణాలయము, 1972.

31. రాఘవాచార్యులు. చక్రపురి, నలచక్రవర్తి చరిత్ర, మద్రాసు, 1841

32. రాధాకృష్ణ, బూదరాజు. ప్రాచీనాంధ్ర శాసనాలు క్రీ. శ.1100 వరకు. హైదరాబాదు : ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, 1971.

33. రాధాకృష్ణశర్మ, చల్లా, సి. పి. బ్రౌన్ సాహితీసేవ, హైదరాబాదు, సి. యల్. యన్. బుక్ షాప్. 1975

34. రామయ్య పంతులు, జయంతి, ఆధునికాంధ్ర వికాసవైఖరి. శ్రీ విద్వజ్జన మనోరంజనీ ముద్రాక్షరశాల, 1937.

35. రామయ మంత్రి, ధరణిదేవుల, దశావతార చరిత్ర చెన్నపురి, పమ్మి త్యాగరాయశెట్టి, శ్రీరాజరాజేశ్వరీ నికేతన ముద్రాక్షరశాల, 1907,

36. ——— ,, చెన్నపురి, వావిళ్ల, 1926.

37. రామలింగారెడ్డి, కట్టమంచి, ముసలమ్మ మరణము, పటమట పోస్టు, కృష్ణా జిల్లా, గ్రంథాలయ పుస్తకశాల, 1948.

38. రామారావు, ఎస్. వి, తెలుగులో సాహిత్య విమర్శ హైదరాబాదు, పసిడి ప్రచురణలు, 1974.

39. రెడ్డి, జి. యన్. పర్య. బంగోరె పరిశోధన ; బ్రౌన్ లేఖలు, తిరుపతి, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, 1977.

40. ———, బ్రౌన్ జాబుల్లో స్థానిక చరిత్ర శకలాలు- కడప జాబుల సంకలనం, తిరుపతి, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, 1977.

41. లక్ష్మీరంజనం, ఖండవల్లి, ఆంధ్ర సాహిత్య చరిత్ర సంగ్రహము, హైదరాబాదు, వేంకట రమణా పబ్లికేషన్సు, 1955.

42 ———, ఆంధ్రుల చరిత్ర సంస్కృతి, మద్రాసు, బాల సరస్వతి బుక్ డిపో, 1957.

43. వీరభద్రరావు, కొత్తపల్లి, తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము, 1960.

44. ———————— సి. పి. బ్రౌన్, హైదరాబాదు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, 1963.

45. వేంకట నారాయణరావు, కే, ఆంధ్రవాఙ్మయ చరిత్ర సంగ్రహము, చెన్నపురి, వావిళ్ల, 1928, 1948, 1967.

46. వేంకటపతి, శేషము, శశాంకవిజయము, మద్రాసు, యం. శేషాచలం అండ్ కో, 1972.

47. వేంకట రమణయ్య, బులుసు, ఆంధ్రకవి సప్తశతి, మద్రాసు, గ్రంధకర్త, 1956.

48. వేంకటరామశర్మ, కోన, చరిత్రపరిశోధకులు, విజయవాడ, వేంకట్రామ అండ్ కో, 1959.

49. వేంకటరావు, నిడుదవోలు, శ్రీపరవస్తు చిన్నయసూరి జీవితము, చెన్నపురి, వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్, 1953.

50. ———————— ఆంధ్రవచన వాఙ్మయము, మద్రాసు, ఆంధ్ర గ్రంథమాల, 1954.

51. ———————— దక్షిణాంధ్ర వాఙ్మయము, మద్రాసు, మదరాసు విశ్వవిద్యాలయము, 1960.

52. వేంకటావధాని, దివాకర్ల, ఆంధ్రవాఙ్మయ చరిత్ర, హైదరాబాదు, ఆంధ్రసారస్వత పరిషత్తు, 1967.

53. శేషయ్య, చాగంటి, ఆంధ్రకవి తరంగిణి, 12 సం. కపిలేశ్వరము : హిందూధర్మశాస్త్ర గ్రంధనిలయము, 1958.

54. సత్యనారాయణశాస్త్రి, మధునా పంతుల, ఆంధ్రరచయితలు, ప్రథమ భాగము, రాజమండ్రి, అద్దేపల్లి అండ్ కో, 1973

55. సత్యనారాయణరావు, యండమూరి, ఉషఃకిరణాలు, విజయవాడ, ఉత్తమ సాహితి, 1960.

56. సుబ్బారావు పంతులు, వంగూరి, శతక కవుల చరిత్రము, నరసాపురము, కమలాకుటీర్ ప్రెస్ అండ్ పబ్లికేషన్సు, 1957.

57. సూరన, వెన్నెలకంటి. విష్ణుపురాణము, చెన్నపురి,
వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్;

2. సంస్కృతము

1. కవితారత్నాకరము, బ్రౌను ప్రోత్సాహముతో పసల పార్థసారధి నాయని వారి విద్వన్మోద తరంగిణి యను ముద్రాక్షరశాలయందు అచ్చు వేయించి ప్రకటింపబడినది, 1865.

2. "చన్నపట్టణమందు కాలీజాలో వుండే చార్లెసు-ఫిలీపు-బ్రౌన్ దొరగారి దగ్గెరవుండే గీర్వాణ పుస్తకముల యొక్క పట్టీ."

3. నిఘంటువులు :

1. బ్రౌన్ సి.పి తెలుగు-ఇంగ్లీషు నిఘంటువు. మద్రాసు క్రిస్టియన్ నాలెడ్జ్ సొసైటీ ప్రెస్, 1852.

2. రామయ్య పంతులు, జయంతి; మొ॥ సూర్యరాయాంధ్ర. నిఘంటువు 8 సంపుటములు. కాకినాడ; ఆంధ్రసాహిత్య పరిషత్తు, 1936-1958.

3. సీతారామాచార్యులు, బహుజనపల్లి, శబ్దరత్నాకరము, మద్రాసు : మద్రాస్ స్కూల్ బుక్ అండ్ లిటరేచర్ సొసైటి, 1969

4. విజ్ఞానసర్వస్వములు :

1. విజ్ఞాన సర్వస్వము. విశ్వసాహితి, మద్రాసు, తెలుగు భాషాసమితి, 1961

2. వేంకట లక్ష్మణరావు, కొమర్రాజు, ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము - 1, 2 భాగములు, మద్రాసు విజ్ఞాన చంద్రికా మండలి, 1961

5. పత్రికలు :

1. అముద్రిత గ్రంథచింతామణి, నెల్లూరు

2. ఆంధ్ర పత్రిక ఉగాది సంచికలు, మదరాసు

3. ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికలు, కాకినాడ

4. కిన్నెర, మదరాసు

5. భారతి, మదరాసు

6. సరస్వతి, ముక్త్యాల

7. స్రవంతి, హైదరాబాదు

8 వివేచన, పరిశోధన పత్రిక, తెలుగుశాఖ, ఉస్మానియా విశ్వవిద్యాలయము


### 6. ప్రత్యేక సంచికలు :

1. ప్రపంచతెలుగు మహాసభల ప్రత్యేక సంచిక "తెలుగువాణి" హైదరాబాదు, 1975

2. ప్రపంచ తెలుగు మహాసభల ప్రత్యేక సంచిక ఎల్లోర(సం) తెలుగు వెలుగు, మదరాసు, 1975.

3. త్రిలిఙ్గ రజతోత్సవ సంఘము శ్రీ వావిళ్ల వేంకటేశ్వర శాస్త్రులు గారి సన్మానసంపుటము. మదరాసు, 1941.

4. వేంకటరత్నం, తెలికచర్ల. సం. వ్యాస సంగ్రహము, గుంటూరు. 1933.

5. Professor K. A. Nilakanta Sastri Felicitation Volume, 1971


## 7. Catalogues :

1, నాగేశ్వరరావు, కాశీనాథుని (ప్రకాశకులు) ఆంధ్రవాఙ్మయ సూచిక- ముద్రితా ముద్రిత గ్రంథముల పట్టిక, మదరాసు, 1929.

2. Kuppuswami Sastri, S. A. Descriptive catalogue of the Telugu Manuscripts in the Government Oriental Manuscripts Library. 5 volumes. Madras, 1935,

3. A Catalogue of Telugu Books in the Library of the British Museum, London.

4. Indian Manuscripts in the Library of the India Office, London


## 8. English :

1. Arden. A H, A Progressive Grammer of the Telugu Language, Madras, The Christian Litarary Society, 1969.

2. Chenchiah, P and Bhujanga Rao, M. A History of Telugu Literature, The Heritage of India Series. Oxford University Press.

3. Mangamma, J. Book Printing in India.

4. Reddy, G. N. ch. Ed; Bangorey Ed, Literaray Autobiography of C. P. Brown - TIRUPATI S.V. University, 1978.

5. Riccaz, A, An Abridgement of the Telugu Grammar for the use of schools, London Mission Press.

6. Robert Caldwell, A Comparative Grammar of the Dravidian Languages, Madras, University of Madras, 1956.

7. Sarma, C. R Landmarks in Telugu Literature, Madras, Lakshminarayana Granthamala, 1975

8. Sitapati, G. V, History of Telugu Literature, New Delhi, Sahitya Akademi, 1968.

9. Srinivasachari, C. S., The Promotion of Dravidian Linguistic Studies in the Company's Days, Madras, Printed at the British India Press, 1927.

---

# విషయసూచిక

# 1

## బ్రౌను జీవితాలోకనము

1.0 ఆంధ్ర సాహిత్యమును శ్రీమంతమొనర్చిన విదేశీయ విద్వాంసులు పలువురు. వారిలో క్రైస్తవ మిషనరీ అధికారులు, సివిలు ఉద్యోగులు, సైనికాధికారులు పెక్కురున్నారు. పరదేశములో పరభాష నలవరచుకొని, ఆ భాషామతల్లికి నీరాజనము లర్పించిన విదేశీయ పండిత ప్రకాండ గణనా ప్రసంగములో సి. పి. బ్రౌను కనిష్ఠికాధిష్ఠితుడు.

వసివాడి విశీర్ణమైయున్న తెనుగుభాషను ప్రోదిచేసి, నీరుపెట్టి, పరిరక్షించిన యీతనిని తెనుగుభాష నుద్ధరింప అవతరించిన పుంభావ సరస్వతిగ ఆనాటివారు తలంచుటలో ఆశ్చర్యములేదు. గత శతాబ్దిలో భారతీయ భాషా సాహిత్యములను అభిమానించి, అధ్యయనము చేసి, గ్రంథరచన మొనర్చిన పాశ్చాత్య భారతీయ కోవిదులలో (Western Indologists) సి. పి. బ్రౌను విలక్షణమైన వ్యక్తి. ద్రావిడ భాషా విద్యార్థులకు, ముఖ్యముగా తెలుగువారికి బ్రౌను జీవితము, అతని – రచనలు, తెలుగు కావ్యసముద్ధరణ, పరిష్కరణ, ముద్రణ – అనునవి మిక్కిలి ఆసక్తిదాయకములు.

### 1.1. బాల్యము :

కౌలే (Cowley) సతీమణి, రెవరెండు డేవిడ్ బ్రౌను (Rev. David Brown) ల ద్వితీయ పుత్రుడు, చార్లెస్ ఫిలిప్ బ్రౌను (Charles Philip Brown). క్రీ. శ. 1798 సం॥, నవంబరు, 10-వ తేది అతని జన్మదినము. కలకత్తా మహానగర మాతని జన్మస్థలము. రెవ డేవిడ్ భాషావేత్త. తండ్రి శిక్షణమున, ప్రోత్సాహమున బ్రౌను చిన్ననాటనే హీబ్రూ, సిరియన్, అరబ్బీ, పార్సీ, గ్రీక్, లాటిన్, హిందూస్తానీ

మున్నగు భాషలతోడి పరిచయము నలవరచుకొనెను. బ్రౌనునకు అతని తండ్రి వివిధ భాషాసాహిత్యము లందభిరుచి కలిగించుటయే కాక గ్రంథపాతములను పూరించుట, తప్పొప్పుల పట్టికలను తయారుచేయుట మున్నగు పనులందు శిక్షణ నొసగెను. ఈ శిక్షణ బ్రౌనునకు - తదుపరి కాలమున - ఆంధ్రకావ్యముల పరిష్కరణము నందు మిక్కిలి ఉపకరించెను. 14-వ ఏట ఆతనికి పితృవియోగము సంభవించెను. 1812 వ సం॥న రెవ. డేవిడ్ మరణానంతరము, బ్రౌను కుటుంబము ఇంగ్లాండు దేశమునకు తరలిపోయెను.

## 1 2 విద్యాభ్యాసము :

1814-వ సం॥న బ్రౌను ఇంగ్లాండు నందలి హెయిల్‌బరి (Haileybury) కళాశాలలో రెండేండ్లు విద్యనభ్యసించెను. అప్పటికి బ్రౌను 16 ఏండ్ల ప్రాయము వాడు. 1816-వ సం. జూన్ 30-న బ్రౌను 'Writer's Rank' అను పట్టమును బొందెను. హిందూస్థానీ భాషలో బహుమతిని పడసెను. విద్యార్థిదశలో కళాశాల యందాతడు నేర్చినది తక్కువయే కావచ్చును. కాని కళాశాలను వీడిన పిదప గురుని రపేక్షముగ ఆతడు వర్జిల్, హోరేస్, ల్యుక్రేటస్ ఓవిడ్, ప్లాటస్ ప్రభృతి మహాకవుల సుప్రసిద్ధ గ్రంథములను పఠించి, లాటిన్ భాషలో అపార పాండిత్యమును గడించెను, బ్రౌను బహుభాషావేత్త. గ్రీకు, లాటిన్, హీబ్రూ, ఫ్రెంచి, పర్షియన్, బెంగాలీ, మరాటీ, హిందూస్థానీ, అరబ్బీ మున్నగు భాషలందును ప్రావీణ్యమును సంపాదించెను. 1817 – 1820 సం॥ మదరాసు కాలేజీలో నున్నపుడును, ఆ గ్రంథాలయమున గల గ్రీకు, హిందూ పౌరాణిక గాధలను అత్యంతాసక్తితో పఠించెను. 1820 సం॥లో బ్రౌను ఉద్యోగములో ప్రవేశించిన అనంతరము కూడ భిన్నభాషాధ్యయనమును విడనాడలేదు. అతని సాహిత్య పిపాస తన ఔద్యోగిక ధర్మములను కూడ విస్మరించునట్లొనర్చు చుండెడిది. ఒక ఫ్రెంచి నవలను చదువవలయుననెడి కుతూహలము ఆతనిని ఆ భాషలో ప్రావీణ్యము సంపాదించునట్లొనర్చెను. అప్పటి కాతనికి గల లాటిన్ భాషా పరిచయము వలన అచిరకాలములోనే ఫ్రెంచి భాషను నేర్చుకొన గలిగెను. ఈ ఫ్రెంచి భాషా పరిజ్ఞానము 40 సం॥ల అనంతరము తెలుగు ఫ్రెంచి నిఘంటువును పరిష్కరించుటలో అతనికి తోడ్పడెను.

షేక్స్పియర్, మిల్టన్, కౌపర్, బర్న్స్ స్కాట్, బైరన్, మూర్ మున్నగువారి కావ్యములను పఠించుటవలన బ్రౌను దొరకు ఆంగ్లభాషలో పద్యరచన అలవడినది. కాని అతని ఆంగ్లపద్యములలో నొక్కటి తక్క తక్కినవి నష్టములు.[1] ఈ ఏకైక పద్యము "Literary Autobiography of C. P Brown"[2] అను గ్రంథమున అనుబంధమున నుద్ధరింపబడెను. ఇది కాక అతడు పరిష్కరింపజేసిన తెలుగు కావ్యములందు అందందు కొన్ని పద్యములకు అతడొనరించిన పద్యాత్మక ఆంగ్లానువాదములు కలవు. (చూ. అను - 2)

## 1. 3. ఆంధ్రభాషాధ్యయనము :

భారతదేశమందే పుట్టి, ఒక పుష్కరకాల మీదేశమందే గడిపినను, తనకు తెనుగు భాష ఉసికియైనను తెలియదని బ్రౌను పేర్కొనెను.[3] 1817 వ సం॥న సివిల్ సర్వీసునందు ఉద్యోగిగ నియుక్తుడై ఇంగ్లాండు నుండి మదరాసునకు తరలి వచ్చిన బ్రౌను, ఆనాటి కుంఫిణీ నియమావళి ననుసరించి ఫోర్టు సెంట్ జార్జి కాలేజిలో చేరి ప్రాంతీయ భాషయగు తెలుగును అభ్యసింపవలసిన వాడాయెను. అప్పుడే తెనుగుబాస తియ్యదనమును, తేటదనమును ప్రప్రథమముగ చవి చూచెను. వెలగపూడి కోదండరామయ్య పంతులుగారు బ్రౌనుకు అక్షరాభ్యాసము గావించిరి [4]

పరభాషాధ్యయనమున అభిముఖమగు కష్టనష్టములు సువిదితములు. అందును ప్రారంభకుల కుపయుక్తములగు నిఘంటువు, వ్యాకరణము, వాచకములు లేని భాషను అభ్యసింప బూనుకొనుట కష్టతరము. బ్రౌను తెనుగును నేర్చుకొనునాటికి ప్రచారములో నున్న వ్యాకరణము ఆంధ్రశబ్దచింతామణి. అది సంస్కృతమున విరచితము బ్రౌనునకు తెనుగును బోధించిన పండితులు ఉభయభాషాప్రవీణులు. విదేశీ

---

1. Some Account of the Literary Life of C. P. Brown. P. xiii
2. S. V. University publication. P. 118-119.
3. Some Account of the Literary Life of C. P. Brown. P. xii.
4. "This Bramin (Velagapudi Codanda Rama Pantulu) taught me the Telugu alphabet when I entered the Madras College in 1817".— English Translation of the Telugu Reader : C. P. Brown. P. 55

యులు భారతీయభాషల నేర్చుకొనుటలోని క్లేశములను వారు గుర్తింపరైరి. వారు సాంప్రదాయికమైన పద్ధతిలోనే సిఘంటువును, 'భట్టీయము'ను బట్టీ పట్టుమని బ్రౌను దొరను ఆదేశించిరి. దీనికితోడు ఈ పండితుల పాండిత్యప్రకర్ష ప్రదర్శనము బ్రౌనును నిరుత్సాహపరచినది వారు క్లిష్టమార్గమున భాషను బోధింప పూనుకొనిరి. ఆదిలో ఆంగ్ల భాష నెఱుగని పండితుల సాహాయ్యముననే తెనుగు భాషాభ్యసమును ఆరంభించెను.

మూడేండ్లు (1817-20) 'మదరాసు కాలేజీ' విద్యార్థిగ బ్రౌను తెలుగుభాష తోడి పరిచయమును మాత్రము సముపార్జించెను అతడు రెండవ తరగతిలో తెలుగునందు తీర్ణుడయ్యెను. ఆతని సహాధ్యాయులగు విదేశీయులలో పలుపురాతని కన్నను తెనుగున 'మార్కు' లను అధికముగ సంపాదించినవారు కలరు కాని ఒక్క బ్రౌను మాత్రమే తెలుగుభాషలో పాండిత్యమును గడించి, ఆ భాషా సాహిత్యముల నుద్ధరింప యావజ్జీవము పాటుపడిన నిష్కామకర్ముడు.

సర్ థామస్ మన్రో 1820 వ సం॥ న మద్రాసు గవర్నరు పదవిని స్వీకరించెను. అతని సమక్షమందే బ్రౌనుదొర సివిల్ సర్వీసు తుది పరీక్ష జరిగెను. ఆ సందర్భమున మన్రో, సివిల్ సర్వీస్ ఉద్యోగుల నుద్దేశించి చేసిన ఉపన్యాసములో ప్రాదేశిక భాషాధ్యయ నావశ్యకతను విశదీకరించెను. ఈ ఉపన్యాసము బ్రౌను దొరను అత్యంత మాకర్షించుటయే కాక ఆతని జీవితములో ఒక చక్కని మలుపునకు మార్గదర్శకమయ్యెను.

బ్రౌనునకు తెనుగుభాషపైగల ఆదరాభిమానములు 'మదరాసు కాలేజీ' విద్యార్థి దశ వరకు మాత్రమే పరిమితములు కాలేదు. అతడు తెలుగు ప్రాంతములగు కడప, మచిలీపట్టణములందు ఉద్యోగిగా నియుక్తుడాయెను. ఉద్యోగధర్మముల నిర్వహించు చునే అతడు తన తెలుగుభాషా పరిజ్ఞానమును పటిష్ఠమొనర్చుకొన సాగెను. కడపలో ఆతని పైఅధికారియగు హన్‌బరీదొర తెలుగులో అసర్గళముగ భాషించువాడట. బ్రౌను, రెండేండ్లలో ఆతనిని మించి, తెలుగులో సునాయాసముగ సంభాషింప సమర్థుడాయెనట. హన్‌బరీదొరయే బ్రౌనుదొర నిట్లు ప్రశంసించెను. **"I think in English and then put it into Telugu; but you seem to talk Telugu without care or forethought."5**

---

**5. L. A. B. of C. P. Brown P. 32.**

అంతవరకు బ్రౌను తెనుగుకావ్య పఠనమునకు పూనుకొనలేదు. అప్పటికి బ్రౌను నిండు జవ్వనమున నుండెను. అతని యొద్ద చదువ దగిన తెలుగుపుస్తక మొక్కటియు లేదట. 1817 లో అతడు తెనుగు చదువు ప్రారంభించినను, 1824 లో గాని దానిని ప్రత్యేక శ్రద్ధతో నియమబద్ధముగ చదువ మొదలుపెట్టలేదు. అతని పాశ్చాత్యమిత్రులు కొందరు తెలుగు చదువు విషయమున అతనిని నిరుత్సాహ పరచిరి. జేరెట్ (Jarret) అనునతడు దేశభాషలందు పరిశ్రమించుట నిష్ప్రయోజన మని, ఆరంభమున నున్న ఉత్సాహము అంతమున నుండదనియు బ్రౌనుకు తెలిపెను. తెలుగులో ఉత్తమ సాహిత్యము మృగ్యమని, దానిని చదువుట నిష్ఫల మనియు విలియమ్ బ్రౌను అను నాతడు పేర్కొనెను. కాని వజ్రసంకల్పుడగు బ్రౌను వీరి మాటలనులక్ష్యపెట్టక, తెలుగు భాషాధ్యయనమునకు 'ధృత్యున్నతోత్సాహముతో' పూనుకొని కృతకృత్యుడాయెను.

ఆ నాటికి ఉపలబ్ధమగు కాంబెల్ తెలుగు నిఘంటువు (1821), విల్సన్ సంస్కృత నిఘంటువు (                ) ఆధారములుగ బ్రౌను తెలుగు కావ్యములను పఠించెను. హిందీ భాష నెఱిగిన వృద్ధ పండితుడొకడు అతనికి హిందీలోను, వ్యావహారిక తెలుగు భాషలోను తెలుగు పద్యముల కర్థము చెప్పెడివాడు. బ్రౌను ఆయా కావ్యములు చదువునపుడు కలిగిన సందేహముల నొక పుస్తకములో గుర్తించి, తదుపరి తన వ్యాకరణ గ్రంథములో వానిని వివరించెను.

జె ఎ అబ్బే దుబాయ్ (J A Abbe Dubois) రచించిన "HINDU MANNERS, CUSTOMS AND CEREMONIES" అను గ్రంథమును బ్రౌను చదివి, వేమన అను తెలుగు కవి యొకడున్నట్లు తెలిసికొని, వేమన పద్యములను సేకరించి, పఠించి, వానిని ఆంగ్లములోనికి అనువదించెను. అటు తరువాతనే సుప్రసిద్ధాంధ్ర కవుల కావ్యముల చదివెను. ఛందోబద్ధమును, తత్సమపద భూయిష్ఠమును అగు నీయవి భాషాప్రారంభకులకు అంతగా ఉపకరింపవని బ్రౌను అభిప్రాయము.

తాను కవియని భావించు పండితుడొకడు బ్రౌనుకు తెలుగు ఛందస్సును నేర్పెను. గ్రీకు, పర్షియను భాషా ఛందస్సుల నెఱిగిన బ్రౌనునకు తెలుగు ఛందస్సు సులభముగ అర్థమయ్యెను. మఱొక పండితుడు బ్రౌనునకు 'భట్టీయము'ను బోధించు

టయేకాక దాని ననుపదింప అభిరుచిని కలిగించెను. బ్రౌను ఈ వ్యాకరణ విషయముల నవగత మొనర్చుకొని, తదాధారముగ ముప్పది యేండ్లు పరిశ్రమించి తన వ్యాకరణమును రచించెను.

ఇట్లు బ్రౌను బహుకార్య నిమగ్నుడయ్యు, తన విశ్రాంతి కాలమును తెనుగు భాషా సాహిత్య వ్యాసంగమున గడపెను.

## 1.4. ఉద్యోగ నిర్వహణము :

బ్రౌను మదరాసు సివిల్ సర్వీసు నందు ప్రవేశించి 1820 వ సం॥న కడప అసిస్టెంటు కలెక్టరుగ నియమితుడయ్యెను.

1822 : మచిలీపట్టణము జిల్లాకోర్టు రిజిస్ట్రారుగ బదిలీ అయెను.

1823 : జడ్జిగారి 'సెలవు కాళీ'లో జడ్జిగ పనిచేసి, ఆ కోర్టు "నజీరు"ను ఉద్యోగము నుండి తొలగించెను. బ్రౌను దొరవారి యీ నిర్ణయము పొరపాటని తదుపరి ప్రభుత్వమువారు తీర్మానించి, అతడు తొలగించిన ఉద్యోగిని పునఃస్థాపించిరి.

1825 : కలెక్టరు హెడ్ అసిస్టెంటుగ, మేజిస్ట్రేటుగ రాజమండ్రికి బదిలీ అయెను. లంచము గ్రహించెనని గవర్రాజను ప్రభుత్వోద్యోగిని పదవినుండి తొలగించెను. ఆ తరువాత ప్రభుత్వమువారు బ్రౌను జారీ చేసిన ఈ ఉత్తరువును రద్దుచేసి గవర్రాజును పనిలో నియోగించిరి.

1826 : కడపకు జిల్లాకోర్టు రిజిస్ట్రారుగ నియుక్తుడాయెను. అసిస్టెంట్ జడ్జిగ జాయింట్ జడ్జిగ కొంతకాలము పనిచేసి, లోయర్ కోర్టు జడ్జిగ కంబమునకు వెళ్ళెను.

1829 : దక్షిణ విభాగ ప్రొవిన్షియల్ కోర్టు ఆఫ్ అప్పీల్ అండ్ సర్క్యూట్ రిజిస్ట్రారుగ తిరుచునాపల్లిలో పనిచేసెను.

1832 : గుంటూరు మహాక్షామ సమయములో గుంటూరు జిల్లా కలెక్టరుగ వ్యవహరించెను.

1833 : జిల్లాజడ్జిగ చిత్తూరునకు బదిలీ ఆయెను. ఒక నెల తరువాత మరల రాజమండ్రికి మార్చబడెను. ఈ సమయముననే మచిలీపట్టణములో తెలుగు ముద్రణాలయమును స్థాపింప బ్రౌను గావించిన ప్రయత్నములు ఫలోన్ముఖముకాలేదు.

1834 : ఔద్యోగిక బాధ్యతా నిర్వహణమున బ్రౌను ఒనర్చిన పొరపాటుల కారణముగ ఆతడు ఉద్యోగము నుండి తొలగింపబడెను. కాని తన ఉద్యోగము నిమిత్తము ప్రభుత్వమునకు దరఖాస్తు పెట్టుకొని మూడేండ్లు సెలవులో ఇంగ్లాండునకు వెడలెను

1837 : భారతదేశమునకు తిరిగి వచ్చెను.

1838 : ప్రభుత్వ పర్షియన్ భాషానువాదకుడుగ నియుక్తుడాయెను. మార్చి 2 : కాలేజిబోర్డు, నేటివ్ ఎడ్యుకేషన్ కమిటి కార్యదర్శిగ నియమింపబడి తరువాత ఆ బోర్డు సభ్యుడాయెను.

1839 : జనవరి 22 : అదాలత్ కోర్టు రిజిస్ట్రారుగ పనిచేసెను. మే 20 : గవర్నమెంటు లాటరీన్ సూపరింటెండెంటుగ నుండెను. **"Madras Journal of Literature and Science"** పత్రిక ఉపసంపాదకుడుగ వ్యవహరించెను.

1840 : ఏప్రిల్ 7 :ఆక్టింగ్‌సివిల్ ఆడిటరుగ, సూపరింటెండెంట్ ఆఫ్ స్టాంప్సుగ ఉండెను.

1841 : ఫిబ్రవరి 12 : ఆక్టింగ్ ఆఫ్ సీ కస్టమ్స్.
ఆగస్టు 31 : పోస్టుమాష్టర్ జనరల్‌గ నియమింపబడెను

1843 : సెప్టెంబరు 29 : మద్రాసు యూనివర్సిటీ బోర్డు కార్యదర్శి ఆయెను.

1846 : జూలై 3 : పోస్టుమాష్టర్ జనరల్‌గ సంపూర్ణాధికారమును, బాధ్యతలను చేపట్టెను.
ప్రభుత్వ తెనుగు అనువాదకుడుగ నియోగింపబడెను.
ఆగస్టు 4 : కౌన్సిల్ ఆఫ్ ఎడ్యుకేషన్ సభ్యుడాయెను.

1848 : ఏప్రిల్ 20 : మద్రాసు బ్యాంక్‌కు గవర్నమెంట్ డైరెక్టర్‌గ, మద్రాసు కాలేజి లైబ్రరీలో వ్రాతప్రతుల క్యూరేటర్‌గ నుండెను.

1852 : మార్చి 29 : బ్రౌనుకు ఫస్ట్‌క్లాస్ సివిల్ సర్వెంట్ హోదా కలిగినది

1854 : మే 1 : అనారోగ్యకారణముగ ఉద్యోగ విరమణము.

1865 : లండన్ విశ్వవిద్యాలయములో తెలుగు ఆచార్య పదవిని నిర్వహించినట్లు తెలియుచున్నది. ఆ తేదిని నిర్ణయించుటకు ఇప్పటికిని వీలుపడుటలేదు.

1869 : **I. C. S.** పరీక్షాధికారిగ నుండెను.

పై కాలానుగత సూచిని పరిశీలించిన ఈ క్రింది విషయములు విశదములగును.

1. బ్రౌను పలురకములైన ఉద్యోగములను (న్యాయాధిపతి జిల్లా అధికారి, తంతి తపాలా అధికారి, లాటరీల నిర్వాహకుడు, లెక్కల తనిఖీదారు, విద్యా సంస్థల కార్యదర్శి, పత్రికాసంపాదకుడు, పరీక్షాధకారి, విశ్వవిద్యాలయాచార్యుడు) నిర్వహించెను. కనుక బ్రౌను ఔద్యోగిక జీవితము వివిధ పదవీ విన్యాసమునకు ఆకరము.

2 తఱచు ఒక స్థలము నుండి మఱియొక స్థలమునకు మారుచుండెను.

3. ఏ ఉద్యోగమును కూడ దీర్ఘకాలము చేయలేదు.

4. నిర్ణయములను చేయుపట్ల నిదానము లేనివాడుగ కనుపించును. అతని నిర్ణయములు కొన్ని పరులకు అంగీకార్యములు కాక పోయినట్లు స్పష్టమగును. అతని అసహనము అతని ఉద్యోగమునకే ముప్పు తెచ్చెను.

### 1.5. వైయక్తిక జీవితము :

బ్రౌను వ్యక్తిగత జీవిత విశేషములుగాని, అతని అంతరంగిక విషయములుగాని, తెలిసికొనుటకు ఆధారములు అత్యల్పములు. 'బ్రౌను లేఖలు' ఆధారములుగ కొన్ని విశేషములను గ్రహింపనగును. బ్రౌనుదొర తన తెలుగు రీడరు నందు ముద్రించిన జాబులను పరిశీలించి శ్రీ కొత్తపల్లి వీరభద్రరావుగారు బ్రౌను వైయక్తిక జీవితమును కొంతవరకు విస్తరముగ వివరించిరి [6]

అవివాహితుడై అహోరాత్రములు తన సర్వస్వమును తెనుగు భాషాసాహిత్యములకు అర్పించిన బ్రౌనుదొరను అతని ఆంగ్ల మిత్రులు కొందరు పరిహసించినట్లాతడు

6. 'సి పి. బ్రౌన్' పు : 214-258.

పేర్కొనెను. "At various times I have been considered (and by myself) as somewhat insane ... ... Those who have known me intimately have judged me wholly sane."7

ఆనాడు తెలుగుదేశములోని వివిధ ప్రాంత ప్రజలతో అతడు జరపిన ఉత్తర ప్రత్యుత్తరములను బట్టి యాతని వితరణ గుణము వ్యక్తమగును. నిరుద్యోగులకు పనులు కల్పించెను 8 పేదసాదలకు తన 'సాయశక్తు'ల సాహాయ్యపడెను.9

తెలుగు పిల్లలకు పాఠశాలలను స్థాపించి, వానిని నిర్వహించిన విద్యాదాత బ్రౌను 1821 సం॥లో కడపలో రెండు పాఠశాలలు, 1823 లో మచిలీపట్టణములో రెండును స్థాపింపబడినవి. 1844 సం॥లో మదరాసులో ఒక "ధర్మపాఠశాల" స్థాపింపబడినది 10

బ్రౌను హైందవసమాజ సంప్రదాయములలో ఎన్నడు జోక్యము కల్పించుకొనలేదు. ఆంధ్రప్రజల మతాచారముల నాతడు మన్నించెను. కాని ఒక సందర్భమున మాత్రము సహగమనమును చేయనున్న ఒక స్త్రీని ఆ ప్రయత్నము నుండి విరమింపజేసెను 11

బ్రౌను అభిమానము సాహిత్యమునకు మాత్రమే పరిమితము కాలేదు. అతనికి ప్రాచీన శిల్ప సంగ్రహణమునందును, మంత్ర శాస్త్రగ్రంథ సంపాదనమునందును అభినివేశము కలదు 12

బ్రౌను పరిచితులలో బిషప్ కాల్డ్‌వెల్ ఆతని వ్యక్తిత్వమును కొంత విపులముగ వివరించెను. బిషప్ కాల్డ్‌వెల్, బ్రౌనుదొర లిరువురును ఇంగ్లాండు నుండ

---

7. L. A. B. of C. P. Brown. p. 76.
8. సి. పి. బ్రౌను : తెలుగు రీడరు : పు : 138, 140, 141
9. బ్రౌను లేఖలు (Series as Letters) M. 427. పు : 256, 257
10. C. P. Brown: "Some Account of the Literary Life of C. P. Brown," P. xvii.
11. Ibid P xvii
12. బ్రౌను లేఖలు. (Series of Letters) M. 418. పు. 471 - 474, 475 - 478. మ ప్రా. పు. భాండాగారము.

భారత దేశమునకు ఒక ఓడయందే కలసి ప్రయాణము చేయుట తటస్థించెను బ్రౌను తోడి తొలి కలయికలోనే అతడు గొప్ప పండితుడుగ కాల్డ్‌వెల్ గుర్తించెను. ప్రయాణ సౌకర్యములు తక్కువైన ఆ రోజులలో ఓడ ప్రయాణములు మిక్కిలి శ్రమాపాదకములుగ నుండెడివి. బ్రౌనుదొర కాల్డ్‌వెల్‌కు తెలుగును నేర్ప ప్రయత్నించెను. కాని కాల్డ్‌వెల్ తమిళదేశమున మిషనరీగ పోవుచుండుటచే తనకు తెలుగు భాషా పరిచయము నిష్ప్రయోజనమని నిరాకరించెను. అంత బ్రౌను అతనికి సంస్కృతమును నేర్పెను. అది తనకు జీవితమంతయు ఉపకరించినట్లు కాల్డ్‌వెల్ తెలిపెను.13

భారతదేశమున గురించిన పెక్కు విషయములను బ్రౌను అతనికి తెలిపెను. కాని బ్రౌను అభిప్రాయములు, తీర్మానములు పెక్కు సందర్భములలో నమ్మశక్యములు కావని కాల్డ్‌వెల్ వెల్లడించెను.

బ్రౌనుకు మంచి ధారణాశక్తి యున్నదనియు అనేక భాషలలోని కావ్యభాగములను అనాయాసముగ నల్లించగలడనియు కాల్డ్‌వెల్ పేర్కొనెను. పరిశోధనయందాతనికి గల శక్తి అపారమైనను, ఆతని నిర్ణయములు సహేతుకముగ నుండవనెను.14

బ్రౌనునకు తన పాండిత్యమును ప్రదర్శించుట యందు ప్రీతి మెండు. అతడు విశ్వవిద్యాలయమునందు విద్య నభ్యసించియున్నను లేక ఆతనికి బహుశ్రుతుల తోడి సాంగత్యమున్నను ఇట్టి బలహీనతకు లోనైయుండడు. చాల వరకు స్వయంకృషితో విద్య నార్జించుటయు, తన కన్నను మందులైన వారి సాహచర్యములో నుండుటయు ఆతనిని శుష్కవాదిగ, మొండి పట్టుదల గల వానిగ రూపొందించెనని కాల్డ్‌వెల్ భావించెను. బ్రౌను చపల చిత్తుడనియు, నిత్యశంకితుడనియు, వాగ్వాదప్రియుడనియు పేర్కొనెను.

బ్రౌను పట్ల చులకనభావముతో కాల్డ్‌వెల్ ఇట్లు చెప్పలేదు 15 "My restles[s] 'Pandit' Mr. Brown" అని బ్రౌనును పేర్కొనుటచే ఆతని యందు కాల్డ్‌వెల్‌కు గల గౌరవము, సానుభూతి వెల్లడి యగుచున్నది

---

13. L. A. B. of C. P. Brown. P: 86.

14. Ibid. PP: 90, 91.  15 Ibid. P: 94.

1. 6. రచనలు :

"బ్రౌను సాహిత్య జీవిత చరిత్ర"ను వెలువరచిన బ్రౌను ప్రాజెక్టు నిర్వాహకులు, అతని గురించిన సంపూర్ణ వివరణము లింకను అజ్ఞాతముగ నుండుటచే అతని రచనల నన్నింటిని సమగ్రముగ నిప్పటికి పేర్కొనుటకు సాధ్యపడదని ప్రకటించిరి[16] ఉపలబ్ధములగు ఆతని రచనలను ఈ క్రింది విధముగ విభజింపవచ్చును :

I ఛందో గ్రంథములు, II వ్యాకరణములు, III నిఘంటువులు, Iv వాచకములు, v తెలుగు కావ్యానువాదములు, vi చారిత్రకములు - తదితర వచన గ్రంథములు vii కథలు, viii పరిష్కృత ముద్రిత కావ్యములు, ix సంస్కృత రచనలు x క్రైస్తవ మత గ్రంథములు, xi స్వీయ చరిత్ర, xii వ్యాసములు.

I. ఛందోగ్రంథములు :

1. ఆంధ్ర గీర్వాణచ్ఛందము (మద్రాసు. 1827) : సంస్కృతాంధ్ర చ్ఛందములు వివరింప బడినవి.

దీనిని శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయమువారు, చారిత్రక నేపథ్యముతో, బ్రౌను జీవిత సంగ్రహముతో 1977 సం॥లో పునర్ముద్రించిరి.

2. **A Familiar Analysis of Sanscrit Prosody ,(London 1837)**

లండనులో ప్రకటింపబడు **Asiatic Journal (English)** లో రెండు సంచికలందిది ప్రప్రథమమున 1837 సం॥న ప్రకటితము. ఇదియే సవరింపబడి దేవ నాగర లిపిలో **"Sanscrit Prosody and Numerical Symbols Explained'** అను నామముతో లండను నందు 1869 సం॥లో పునర్ముద్రితమైనది.

II వ్యాకరణములు :

1. **A Grammar of the Telugu Language (Madras, 1840.)** ఇందు ఛందస్సునకు సంబంధించిన ఒక ప్రకరణమున్నది మదరాసు నందే 1857 సం॥లో ఇది పునర్ముద్రితము.

2. **A catalogue of Irregular verbs in the English language. (Madras, 1852 )**

16. Ibid : p : 153.

ఇది ఆంగ్ల వ్యాకరణమునకు తెలుగు వివరణము.[17]

3. **English and Hindustani phraseology, or Exercises in idioms English and Dakshini Hindustani, (Madras, 1855.)**

4. బ్రౌను రచనగా "రేఫఱకారవచ్ఛబ్ద జ్ఞాపక లోకోపకారము" అనునొక కాగితపు ప్రతి తిరుపతి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున నున్నది (R 591 R. 1209) మ ప్రా పు భాండాగారమునందును దీని ప్రతి యొకటి కలదు. (D 2154) దీనిని బ్రౌను ప్రాజెక్టువారును గుర్తింపలేదు. ఇది బ్రౌను రచనగ "తెలుగు భాషకు విదేశీయుల సేవ" అను వ్యాసమున గుర్తింపబడెను[18]. ఇది అముద్రితము. ఇందు తొమ్మిది పరిచ్ఛేదములున్నవి. సాధురేఫ, శకటరేఫ గల పదములకు వాని అర్థముల నొసగి, భారతాది ప్రామాణిక గ్రంథముల నుండి ప్రయోగములు ప్రదర్శింపబడెను.

5. ఆంధ్ర శబ్ద చింతామణి - ఆంగ్లానువాదము. [(క్రీ. శ. 1825) కర్త సి. పి. బ్రౌను.]

సంస్కృత భాషా నిబద్ధమైన ఆంధ్ర వ్యాకరణ గ్రంథములలో ఆంధ్ర శబ్ద చింతామణి ప్రథమ గణ్యమనుట దానికి గల ఆంగ్లానువాదము నిరూపించుచున్నది.

సి. పి. బ్రౌను చింతామణిని రెండు మాఱులు అనువదించినట్లు తెలిపెను. **"I have twice translated the Bhattiyam and Balasaraswatiyam, the first translation was finishea on 23rd July 1825. And the second on 25th Sep. 1827."** ఈ ప్రతి మ. ప్రా. పు. భాండాగారమున కలదు. **(D. 1237)** కష్టతరమైన యీ సంస్కృతము నందలి వ్యాకరణమును అవగత మొనర్చుకొని సరళముగ, సులలితముగ బ్రౌను ఆంగ్లమున అనువదించెను. చింతామణి యందలి అన్వయ క్లిష్టత ఆంగ్లానువాదమున లేదు.

6. బ్రౌను భట్టీయమునే కాక బాలసరస్వతీయమును, కవిశిరోభూషణమును, అప్పకవీయమును, కవిజనాశ్రయమును కూడ ఆంగ్లములోనికి పరివర్తించెను. ఆంధ్ర

---

17. ఈ ఆంగ్ల క్రియలకు తమిళ వివరమును కలదు.
18. జి. లలిత : తెలుగు వాణి, పుట : 301.

లాక్షణికులలో బ్రౌను దొరకు ప్రత్యేక పరిగణనీయ స్థానము కలదనుటలో సంశయము లేదు.

**III.** నిఘంటువులు :

1. బ్రౌణ్య తెలుగు - ఇంగ్లీషు నిఘంటువు, (మదరాసు, 1852.) తెలుగు పదములకు ఆంగ్లమున అర్థములు. ఇందు వ్యాపారాదులందుపయుక్తమగు వ్యావహారిక భాష కావ్యభాషయు గ్రహింపబడినది.

2. ఈ నిఘంటువునకు అనుబంధముగ "బౌణ్య మిశ్ర భాషా నిఘంటువు" కలదు. ఇందు తెలుగునందు గల అన్యదేశ్యములు గ్రహింపబడినవి తెలుగు వర్ణ సమామ్నాయము వివరింపబడెను. (మదరాసు, 1854.)

ఈ రెండు నిఘంటువులును విడివిడిగ ముద్రింపబడినను ఆదిలో నివి ఒక్క సంపుటముగ ముద్రించుట కుద్దేశింపబడినవి. ఈ రెంటిని కలిపి ఒక సంపుటముగ ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ, హైదరాబాదు, 1966 లో పునర్ముద్రించెను. అంతకు మునుపు యం. వేంకటరత్నము, **W. H. Campbell,** కందుకూరి వీరేశలింగముల సంపాదకత్వమున ఈ నిఘంటువు పరిష్కరింపబడి ముద్రింపబడెను. (మదరాసు, 1903)

3. బ్రౌణ్య ఇంగ్లీషు - తెలుగు నిఘంటువు: ఆంగ్ల పదములకు తెలుగు అర్థములు. ఇంగ్లీషు జాతీయములకు, సామెతలకు తెలుగు వివరణముతో, ఇంగ్లీషు పదోచ్చారణ కలదు. (మదరాసు, 1852.)

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి వారిచే యథాతథముగ 1974 సం॥లో పునర్ముద్రితము

1895 సం॥న మద్రాసు నందు యం. వేంకటరత్నమను నాతడు దీనిని పరిష్కరించి, మఱికొన్నింటితో విస్తృత మొనర్చిన ఒక నూతన ప్రతిని ముద్రించెను[19]

---

19. ఇందు బ్రౌను స్వీయచరిత్ర కలదు.

4 జిల్లా నిఘంటువు : ఇది మనదేశమున వ్యాపారస్థులుపయోగించు పదముల వివరణ రోమను లిపి యందున్నది (మదరాసు, 1852)

5. వాచకమున కనుబంధముగ సంతరించిన చిన్న నిఘంటువు. (చూ. IV-3)

6 పదనిధి అముద్రితము. తెలుగు పదములకు తెలుగర్థములు, సంస్కృత వివరణమును కలదు ప్రాంతీయ పండితులు ప్రార్థించగా బ్రౌను 1841 సం॥లో ఈ నిఘంటు నిర్మాణమునకు పూనుకొనెను ఇది 3 సంపుటములుగ నున్నది [20]

**IV వాచకములు :**

1. Vakyavali or Exercises in Idioms : English and Telugu, (Madras, 1852.)

జె డి పియర్సన్ (J. D. Pearson) గారి 'బాక్యబొలీ' Bakya Bolee) అను వంగాంగ్ల వాచక మాధారముగ ఇది రచితము. ఈ వాచకము హిందూస్థానీ తమిళములందును ప్రకటింపబడినది

2. Dialogues in Telugu and English for the use of learners with a grammatical analysis, (Madras, 1 st Edition : 1841; 2 nd edition : 1853)

ఈ వాచకము తమిళ, కన్నడ, హిందూస్థానీ భాషలందును ప్రకటితము.

3. The Telugu Reader : (Madras, 1852; 2 nd edition 1865 - 67)

ఈ వాచకమునకు అనుబంధముగ ఒక సంక్షిప్త నిఘంటువు మూడు భాగము లది కలదు రెవెన్యూ, పోలీసు విభాగ విషయములకు, వ్యాపారమునకు సంబంధించినవి, వ్యక్తిగతమైనవియునగు ఉత్తరముల సంకలనమిది ఇందు మొదటి అధ్యాయములోని పదములకు వ్యాకరణ వివరణ కలదు.

4 English Translations of the exercises and documents printed in the Telugu Reader; (Madras, 1852, 2 nd edition 1865)

**V తెలుగు కావ్యానువాదములు :**

1. ఎ. వేమన పద్యములు : 'The Verses of Vemana' : Moral Religious and Satirical, (మద్రాసు 1829) ఇవి 693 పద్యముల ఆంగ్ల

---

20. D 1385 మ. ప్రా. పు భాండాగారము.

వచనానువాదము మద్రాసులో 1939 లో యిది పునర్ముద్రితము. ఇందులో మొత్తము 1,163 పద్యములున్నవి. ఈ అనువాదము సంగ్రహవ్యాఖ్యగ పరిగణింపబడినవి నీతి, మతపరమైన అదనపు పద్యము లున్నవి. వావిళ్ళవారు, బ్రౌను (1829 లో) ప్రచురించిన వేమన పద్యములను యథా తథముగ బ్రౌను మున్నుడితో 1911 సం॥న, - ఆంధ్ర సాహిత్య అకాడమి ముద్రణము కన్నను ముందే - ముద్రించిరి.

(b) "Verses of Vemana in the Telugu originai with English renderings" అను మరొక పుస్తకమును ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు 1967 లోను, 1977 లోను ముద్రించిరి.

3 "Sumati Satakam in the Telugu original with English rendering by C. P. Brown." పరిష్కర్తలు : డా॥ సి. ఆర్. శర్మ, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, 1973.

4. పద్మపురాణములోని అహల్యా కథను, దశావతార చరిత్రలోని అహల్యా వృత్తాంతమును బ్రౌను ఆంగ్లములోనికి అనువదించెను.

5. ప్రభులింగలీల (ద్విపదకావ్యము) తృతీయాశ్వాసములోని యొక భాగమునకు బ్రౌను కృతమగు పద్యాత్మక ఆంగ్లేయానువాదము కలదు (చూ. అను II)

VI. చారిత్రకములు-తదితర వచన గ్రంథములు :

1 Memoirs of Hyder Ali and Tippo Sultan.

మరాఠి నుండి ఆంగ్లమునకు లఘు వివరణముతో అనువదింపబడెను (మదరాసు, 1849.)

మెకంజీసేకరణలో మహారాష్ట్ర రాజుల యొద్ద ఉద్యోగిగనుండిన పుంగనూరి రామచంద్రారావు రచించిన ఒక మరాఠీ ప్రతి దీనికాధారము.

2. హైదరు చరిత్ర : పై మరాఠీ గ్రంథమునకు తెనుగు అనువాదమును బ్రౌను చేయించెను.

డా. వేంకట రమణయ్యగారు దీనిని ఆంగ్లములోనికి అనువదించిరి. తెలుగు

4 జిల్లా నిఘంటువు : ఇది మనదేశమున వ్యాపారస్థులుపయోగించు పదముల వివరణ రోమను లిపి యందున్నది (మదరాసు, 1852)

5. వాచకమున కనుబంధముగ సంతరించిన చిన్న నిఘంటువు. (చూ. IV-3)

6 పదనిధి అముద్రితము. తెలుగు పదములకు తెలుగర్థములు, సంస్కృత వివరణమును కలదు. ప్రాంతీయ పండితులు ప్రార్థించగా బ్రౌను 1841 సం॥లో ఈ నిఘంటు నిర్మాణమునకు పూనుకొనెను ఇది 8 సంపుటములుగ నున్నది[20]

## IV వాచకములు :

1. Vakyavali or Exercises in Idioms : English and Telugu, (Madras, 1852.)

జె డి. పియర్సన్ (J. D. Pearson) గారి 'బాక్యబొలీ' Bakya Bolee) అను వంగాంగ్ల వాచక మాధారముగ ఇది రచితము. ఈ వాచకము హిందూస్థానీ తమిళములందును ప్రకటింపబడినది.

2. Dialogues in Telugu and English for the use of learners with a grammatical analysis, (Madras, 1 st Edition : 1841; 2 nd edition : 1853)

ఈ వాచకము తమిళ, కన్నడ, హిందూస్థానీ భాషలందును ప్రకటితము.

3. The Telugu Reader : (Madras, 1852; 2 nd edition 1865 - 67)

ఈ వాచకమునకు అనుబంధముగ ఒక సంక్షిప్త నిఘంటువు మూడు భాగములది కలదు రెవెన్యూ, పోలీసు విభాగ విషయములకు, వ్యాపారమునకు సంబంధించినవి, వ్యక్తిగతమైనవియునగు ఉత్తరముల సంకలనమిది ఇందు మొదటి అధ్యాయములోని పదములకు వ్యాకరణ వివరణ కలదు.

4. English Translations of the exercises and documents printed in the Telugu Reader; (Madras, 1852, 2 nd edition 1865)

## V తెలుగు కావ్యానువాదములు :

1. ఎ. వేమన పద్యములు : 'The Verses of Vemana' : Moral Religious and Satirical, (మద్రాసు 1829) ఇవి 693 పద్యముల ఆంగ్ల

---

20. D 1885 మ. ప్రా. పు భాండాగారము.

వచనానువాదము మద్రాసులో 1939 లో యిది పునర్ముద్రితము. ఇందులో మొత్తము 1,163 పద్యములున్నవి ఈ అనువాదము సంగ్రహవ్యాఖ్యగ పరిహరింపబడినవి నీతి, మతపరమైన అదనపు పద్యము లున్నవి. వావిళ్ళవారు, బ్రౌను (1829 లో) ప్రచురించిన వేమన పద్యములను యథా తథముగ బ్రౌను మున్నుడితో 1911 సంగన, - ఆంధ్ర సాహిత్య అకాడమీ ముద్రణము కన్నను ముందే ముద్రించిరి.

(b) "Verses of Vemana in the Telugu original with English renderings" అను మరొక పుస్తకమును ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు 1967 లోను, 1977 లోను ముద్రించిరి.

3 "Sumati Satakam in the Telugu original with English rendering by C. P. Brown." పరిష్కర్తలు : డా॥ సి. ఆర్. శర్మ, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, 1973.

4. పద్మపురాణములోని అహల్యా కథను, దశావతార చరిత్రలోని అహల్యా వృత్తాంతమును బ్రౌను ఆంగ్లములోనికి అనువదించెను.

5. ప్రభులింగలీల (ద్విపదకావ్యము) తృతీయాశ్వాసములోని యొక భాగమునకు బ్రౌను కృతమగు పద్యాత్మక ఆంగ్లేయానువాదము కలదు (చూ. అను II)

## VI. చారిత్రకములు-తదితర వచన గ్రంథములు :

1 Memoirs of Hyder Ali and Tippo Sultan.

మరాఠి నుండి ఆంగ్లమునకు లఘు వివరణముతో అనువదింపబడెను (మదరాసు, 1849.)

మెకంజీసేకరణలో మహారాష్ట్ర రాజుల యొద్ద ఉద్యోగిగనుండిన పుంగనూరి రామచంద్రారావు రచించిన ఒక మరాఠీ ప్రతి దీనికాధారము.

2. హైదరు చరిత్ర : పై మరాఠీ గ్రంథమునకు తెనుగు అనువాదమును బ్రౌను చేయించెను.

డా. వేంకట రమణయ్యగారు దీనిని ఆంగ్లములోనికి అనువదించిరి. తెలుగు

అనువాదమును వేటూరి ప్రభాకరశాస్త్రిగారు పరిష్కరించి, మొదట ఆంధ్రపత్రిక (దిన పత్రిక) లో వరుసగ 5-3-1944 నుండి ప్రకటించిరి.

**An Ephemeris** - ఇందు 1751 - 1850 వరకు ఇంగ్లీషు, హిందూ మహమ్మదీయ కాలెండరునందలి సమానములగు తేదీలు చూపబడెను (మదరాసు, 1850)

**4. CYCLE TABLES OF HINDU AND MAHOMEDAN CHRONOLOGY** - ఆంధ్ర కర్ణాట దేశములకు సంబంధించిన చరిత్రతోపాటు కొన్ని ప్రత్యేక హైందవకుటుంబ వంశావళులు చేర్పబడెను వివిధ విషయ సంబంధి, వ్యాసావళియు కలదు (మదరాసు, 1850.)

5. **Carnatic Chronology** - కాల పరిగణమున భారతీయ, మహమ్మదీయ విధానములు వివరింపబడెను. సంఖ్యల కుపయోగింపబడిన సంజ్ఞలను గూర్చిన వ్యాసములు, చారిత్రక నివేదకలు, కంఠస్థము చేయుట కనువగు నూతన విధానములు కలవు (లండన్, 1863) ఇది పైన పేర్కొనిన (3) **An Ephemeris** అనుదాని పరిష్కృత సమగ్రప్రతి

6. **A Titular memory** (లండన్, 1861).

ఈ గ్రంథమిప్పటికి అలభ్యము. దీనిని డా॥వీరభద్రరావుగారు పేర్కొనిరి [21]

7. **Three Treatises on Mirasi *R*ight by F,W. Ellis, Lt. Col. Blackburne and Sir Thomas Munro, with the remarks made by the Hon. Court of Directors 1822 and 1824 Edited) (Madras 1852.)**

8. మిరాసీవాదము - గ్రామ వ్యవహారముల వివాదములు తెలుగులో రచింపబడి, ఆంగ్లమున అనువదింపబడెను. (మదరాసు, 1855) 1750 - 77 వరకు కడప జిల్లాలోని, రామేశ్వరమను పల్లెలో కరణీకపు హక్కులను గూర్చిన వివాదముల చరిత్ర.

9. **The Wars of Rajas** - తెలుగునుండి ఆంగ్లములోనికి అనువదింపబడెను. మెకంజి ప్రతులాధారముగ అనంతపుర రాజుల చరిత్ర, (మదరాసు, 1853)

**"The Annals of Handeh Anantapuram"** అను పేరుతో గురజాడ వేంకట అప్పారావుగారి పరిష్కరణముతో దీని ద్వితీయ ముద్రణము వెలువడెను.

21. సి. పి. బ్రౌన్ పు : 260

(మదరాసు, 1920) ఈ చరిత్రయే డా॥ కట్టమంచి రామలింగారెడ్డిగారి 'ముసలమ్మ మరణము'ను కావ్యమునకు ఆధారము.

## VI కథలు :

1. తాతాచారి కథలు – తెలుగు. ఇంగ్లీషు అనువాదము.

**Popular Telugu tales by Tatachari** (మదరాసు, 1855.)

దీనిని పరిష్కరించి గురజాడ వేంకట అప్పారావుగారు రెండవమారు ముద్రించిరి (మదరాసు, 1926.)

ఇది 1951 సం॥లో పునర్ముద్రితమైనది.

మదరాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగార మండలి ప్రతులాధారముగ, చరిత్రాత్మక వ్యాఖ్యాన, పరిచయములతో 'బంగోరె' దీనిని మూడవమారు ప్రకటించిరి. (మదరాసు, 1974.)

ఇంగ్లీషు అనువాదము, మదరాసు 1909 తో పునర్ముద్రితము.

## VII పరిష్కృత, ముద్రిత, తెలుగు కావ్యములు :

1. నలచక్రవర్తి కథ – రాఘవాచారి కృత ద్విపద కావ్యము. (మదరాసు, 1841.)

2. కుచేలోపాఖ్యానము – ఘట్టు ప్రభుని 3 ఆశ్వాసముల కృతి. (మదరాసు, 1841)

3. హరిశ్చంద్ర కావ్యము – ద్విపద కావ్యము. కర్త గౌరన. నవనాథచరిత్ర నుండియు కొంతభాగము దీనితో కలిపి ముద్రింపబడినది. (మదరాసు, 1842).

4. ఆదిపర్వము – నన్నయకృత ఆంధ్రమహాభారతములోనిది. (మదరాసు, 1842).

5. వసుచరిత్ర – రామరాజ భూషణుని ప్రబంధము. జూలూరు అప్పయ్య వ్యాఖ్యాన సహితము. (మదరాసు, 1844),

6. వైజయంతీ విలాసము - సారంగు తమ్మయ కృతి. వ్యాఖ్యా సహితము. (1849.)

7. మనుచరిత్ర - అల్లసాని పెద్దన కృతి. జూలూరు అప్పయ్య కృత వ్యాఖ్యా సహితము. (మదరాసు, 1851.)

8. సీతాకల్యాణము, గరుడాచలము - యక్షగానములు, (మదరాసు, 1852.)

ఇవి కాక కలువాయి, భాస్కర, కాళహస్తి, కోదండరామ, భళిర కరివేల్పు' చౌడప్ప, లావణ్యసీమాది శతకములు; గజేంద్రమోక్షము, భాగవత సప్తమస్కంధము' భాస్కర రామాయణము మున్నగునవి బ్రౌను పర్యవేక్షణలో ముద్రింపబడినవి' 1830 - 1850 మధ్యకాలమందు ముద్రితమైన తెనుగు కావ్యము లన్నియు ఇంచు మించు బ్రౌను పరిష్కరించిన ప్రతులాధారముగ ముద్రితములు తాను ప్రకటించిన గ్రంథముల పట్టికలో ముద్రితమైన వానిని, కానివానిని కూడ పేర్కొనెను [22]

## VIII. పరిష్కృత, ముద్రిత సంస్కృత రచనలు :

1. కవితారత్నాకరము - తెలుగు లిపి, సంస్కృతేతిహాస కావ్యములనుండి' జనశ్రుతి నుండి గ్రహించిన నీతి వాక్యముల సంకలనము. (మదరాసు, 1850). ద్వితీయ ముద్రణము, 1865.

2. భగవద్గీత - తెలుగు లిపి. మదరాసు ముద్రిత కాలము తెలియదు.

3. అమరకోశము - తెలుగు వ్యాఖ్యాసహితము. మదరాసు, ముద్రిత కాలము తెలియదు.

## IX. క్రైస్తవ మత సంబంధి గ్రంథములు :

1. లూకా చేత వ్రాయబడిన శుభవర్తమానము - లూకా సువార్తకు తెలుగు అనువాదము. (మదరాసు, 1838.)

ఈ సువార్తనే పద్యరూపమున బ్రౌను పోషణలో నున్న ఒక జంగమ కవి రచించెను. దీనిని బ్రౌను 1854 వ సం॥న మదరాసున ముద్రింపించెను.

---

22. **Some Account of Literary Life of C. P. Brown : 1866.**

2. నిస్తర రత్నాకరము - **THE JEWEL MINE OF SALVATION** (మదరాసు, 1852).

ఒక అజ్ఞాతకవి రచించిన సువార్త సిద్ధాంతములు కల పద్యకావ్యము. పద్యములకు లఘు వివరణము కలదు [23]

**3. Common Prayer book, Madras.** ముద్రణకాలము తెలియదు.

4. కీర్తనలు **LXVII,** ఇది చంపూ కావ్యము, (మదరాసు, 1851.)[24]

1851 వ సం॥న లండనులో జరిగిన వస్తుప్రదర్శనము **(exhibition)** నిమిత్త మీ పుస్తకములు ప్రచురింపబడినవి.

5. సలోమోను లిఖిత హితోపదేశములు - సలోమోను రచించిన సామెతలు. ఇది సంస్కృతచ్ఛందమున కూర్చబడి తెలుగు లిపిలో ప్రకటితము. (మదరాసు, 1853)

6. పౌలు చరిత్ర - ఇదియు సంస్కృత పద్యకావ్యము. తెలుగు లిపి. అపోస్తలుడైన పౌలు చరిత్ర. ఇందు ఇంగ్లీషు అనువాదమును కలదు. బహుశః ఈ అనువాదమును కలకత్తా వాసియగు జాన్ ముయర్ **(John Muir)** చేసి యుండవచ్చును.

**7. The Experience of A Nicholas (edited in English verse) (London' 1859.)**

దీనిని డా. వీరభద్రరావుగారు గుర్తించిరి.[25]

## X స్వీయచరిత్ర :

**1. Some Account of the Literary Life of Charles Philip Brown. (Printed for Private Circulation) London, 1866.)**

**Revised edition, Literary Life .. ...Brown (also printed for private circulation) London, 1872 )** దీనిని శ్రీ నిడుదవోలు వేంకటరావు గారు తెలుగులోనికి అనువదించి 1963, మేనెల భారతి మాస పత్రికలో ప్రకటించిరి.

---

23. దీనినే కొంత మార్చి, కొంతచేర్చి తమిళమునకు ప్రకటించిరి.

24. కన్నడములో వచనముగ దీనిని ప్రకటించిరి.

25. 'సి. పి బ్రౌన్' పుట : 205.

XI వ్యాసములు :

1. **Hindu Sculpture** - శిల్పముల పరిమాణమును గూర్చిన వ్యాసము.

**Suttee prevented** - బహుశః కడపజిల్లాలో ఒక బ్రాహ్మణ కుటుంబమున సతీసహగమనమునకు దారితీసిన పరిస్థితులను, తన్నివారణమును ప్రతికావార్తగ రచించెనేమో ; 26

3. **Essay on the Language and Literature of the Telugus. (Madras, 1839 - 40)**

ఈవ్యాసము మొదట "**Madras Journal of Literature and Science** లో ప్రకటితము. ప్రధాన వ్యాసము రెండు భాగములుగ అకారాది సూచితో 1839, జూలై-అక్టోబరు సంచికలోను, తెలుగు కావ్యము లందలి మూల పద్య భాగములతో కూడిన అనుబంధము 1840, అక్టోబరు - డిసెంబరు సంచికలోను ముద్రింపబడెను.

ఇదియే తెలుగుకావ్య పద్యభాగములు సూచివినా 1841 సం॥ లో **Asiatic Journal** లో ప్రకటితము. ఇది తెనుగు వాఙ్మయమును గూర్చి చారిత్రక పద్ధతులపై వ్రాయబడిన మొదటి విమర్శక వ్యాసముగ ప్రశంసింప బడినది.[27]

5. **Essay on the Creed, Customs and Literature of Jangams, MJLS, (1840, January.)**

ఇదియే సంస్కరింపడి "**Essay on the Creed and Customs of Jangams**" అను పేరుతో **Journal of Royal Asiatic Society** లో 1871. సం॥న ప్రకటింపబడెను

6. **Notice regarding the sects of Hindu called Tengala and Vadagala. MJLS, (1840, April.)**

7. **Notices of some Roman Catholic Books existing in the Telugu Language. MJLS, (1840, July )**

---

26. పై రెండు వ్యాసములును మొదట 'మదరాసు గెజట్' లో అనామకముగ ప్రకటితము. తదుపరి **Asiatic Journal, London,** 1828, నవంబరు సంచికలో ప్రచురింపబడెను

27. పట్టాభిరామ పండితీయము. పీఠిక : 11

8. Account of the Basava Puran, the principal book used as a religious code by the Jangams. MJLS, (1840. October.)

9. Notice regarding Mss. in England. MJLS, (184", October.)

10 The Repository of Hindoo Literature: No, 2: The Manu Charitra. (Madras (?)[28] 1841 May). [28]

11. Account of the Tribes of Maharatta Bramins: Translation of Mahratta Document of the Mackenzie Mss. MJLS, (1844.

12. Notice regarding the names used in the Indian Zodiac( MJLS. (1827), No 33

13. Translation of the Telugu introduction to a catalo gu of Telugu and Sanscrit Mss. in the possession of C. P. Brown. MJLS, (1847), No: 33.

14. Telugu spells MJLS, (1864, July).

translation made from Telugu Documents in a criminal case at Cuddapah, (1839)

15. On Malabar, Coromandel, Quilon, etc, JRAS, (London, 1871)

16. On the Numerals of Balaam's name

Christian observer, (London, 184?, December. (a letter to editor in reply to an article published in a previous number )

17. A summary of and an explanatory note in English on Vanivilasa Vanamalika (a Telugu metrical encyclopaedia of Hindu literature) of Tekumalla Rangasayi.

పై గ్రంథముల పట్టికను బట్టి క్రింది అంశములను క్రోడీకరింపవచ్చును :

1. ఈ గ్రంథములలో కొన్ని బ్రౌను స్వీయరచనలు.

2. కొన్ని ఇతరులచే వ్రాయించి, ముద్రించినవి

3. తెనుగు కావ్యముల పరిష్కరణను బ్రౌను పండిత సహాయ్యముననే నిర్వహించెను.

---

28. ఈ వ్యాసము మద్రాసునందె ముద్రింపబడినట్లు నిశ్చయముగ తెలియ వచ్చుటలేద

4. బ్రౌను సంస్కృతాంధ్రాంగ్లములపై ప్రధానముగ రచనల నొనర్చెను.

5. పై పట్టికను బట్టి బ్రౌను తెలుగు భాషకు సంబంధించి 20 పుస్తకములను రచించెనని తెలియవచ్చుచున్నది.

1. ఆంధ్ర గీర్వాణచ్ఛందము, 2. వాక్యావళి, 3. **Dialogues in Telugu**, 4. తెలుగు వాచకము, 5. ఇంగ్లీషు క్రియలు, 6. రేఫఱకారవచ్ఛబ్ద జ్ఞాపకలోకోపకారము, 7. ఇంగ్లీషు - తెలుగు నిఘంటువు, 8. తెలుగు - ఇంగ్లీషు నిఘంటువు, 9. మిశ్రభాషా నిఘంటువు, 10. జిల్లా నిఘంటువు, 11. పదనిధి 12 హైదరు చరిత్ర, 13. మిరాసీ వాదము, 14. అనంతపుర రాజుల చరిత్ర 15. తాతాచారి కథలు, 16. లూకాచే వ్రాయబడిన శుభవర్తమానము, 17. నిస్తరరత్నాకరము, 18. కీర్తనలు, 19. వేమన పద్యముల ఆంగ్లానువాదము, 20. సుమతి శతక ఆంగ్లానువాదము.

6. ఛందోలంకార వ్యాకరణములను లక్షణమని వ్యవహరించుట భారతీయ లాక్షణిక సంప్రదాయము. ఈ లక్షణములలో బ్రౌను తెనుగు ఛందో వ్యాకరణము లందు పరిశ్రమ మొనర్చెను. ఏ. డి. క్యాంబెల్, ఏ హెచ్. ఆర్డన్, హెచ్. మారిస్ మున్నగు పాశ్చాత్యులు కు తెనుగు వ్యాకరణములను రచించిరి. కాని వీరెవ్వరు తెలుగు ఛందము జోలికి పోలేదు. కావున తెలుగు ఛందస్సును సాధించిన ఘనత పాశ్చాత్యులలో ఒక్క బ్రౌనుకే దక్కెను. తెలుగు కావ్య పరిష్కరణకు అత్యంతావశ్యకమైనది. ఛందః పరిజ్ఞానము. కనుకనే బ్రౌను తెలుగు కావ్యముల నుద్ధరించి, సంస్కరింపగలిగెను. మాతృభాష కాకున్నను, ఆంధ్రభాషయందు అపరిమితాభిమానమును కలిగి, ఆ భాషా సేవకే తన సర్వస్వమును సమర్పించిన సాహిత్యోపాసకుడు బ్రౌను. తాను చేసినంత మాత్రమున చాలదని, మాతృభాషాభిమానులైన ఆంధ్రులీ పనికి పూనుకొన వలయు నను నదియే అతని అభిమతము.

ఇట్లు తెలుగు సరస్వతికి చలువ పందిరులు నిర్మించి, మినుకు మినుకు మను చుండిన ఆమె ఉనికిని మహోజ్జ్వల మొనర్చి[29], నిండు జీవితము గడపిన బ్రౌను తన 87 వ ఏట 1884, డిసెంబరు 12 వ తేదీన కీర్తిశేషుడయ్యెను.

---

29. **Some Account of the Literary Life of C·P. Brown.**

## 2

# గ్రంథ సంపాదన - సమీక్షణ

2. 0. ప్రాచీనాంధ్ర సాహిత్యమంతయు తాళ పత్రములందు నిక్షిప్తము. ముద్రణాది సౌకర్యము లర్వాచీనములు. తాళ పత్రములు, గంటములే పూర్వపు వ్రాత సాధనములు. ఈ తాళ పత్రములు కాగితములవలెనే క్రిమిదష్టము లగును. వీని పరిరక్షణకై ప్రాచీను లంతగా పాటుపడినట్లు కానరాదు కనుక మన వాఙ్మయమున అనేక గ్రంథములు నామమాత్రావశిష్టములుగ నిలిచినవి పెక్కు గ్రంథములు నష్టములైనవి. బ్రౌను తెనుగు గడ్డపై కాలూనిన నాటి ప్రాచీన తెలుగు కావ్యముల స్థితి ఇది. అందువలననే "In 1825 I found Telugu dead"[1] అని బ్రౌను పేర్కొనెను నిర్జీవమై నశించుచున్న అట్టి ప్రాచీనాంధ్ర కావ్యములకు పునర్జన్మ నొసగిన భాషోద్ధారకుడు బ్రౌను. "In thirty years I raised it to Life"[2] అని బ్రౌను సగర్వముగ చెప్పుకొనెను.

2. 1. ప్రాచీన భారతీయ విద్యావిధానము శ్రుతిరూపమైనది. శిష్యులు గురుపాదములయొద్ద ఆసీనులై గురుముఖమున శాస్త్రాదులను నేర్చెడివారు.

"గురు శుశ్రూషయా విద్యా, పుష్కలేన ధనేనవా
అథవా విద్యయా విద్యా, చతుర్థానోపలభ్యతే" *

అనునది వారి విశ్వాసము. కాన వారికంతయు మస్తకములోనే ఉండెడిది పుస్తకముల ప్రమేయము లేదు. వారి ధారణాశక్తి అమోఘము తాళపత్రప్రతులు రాజాస్థానము

1. Plans for the Revival and Promotin of Telugu Language. (Micco film) p. 197.
2. Ibid. p. 197

* సంస్కృత విక్రమార్కచరిత్ర పు. 47

లందు, సంపన్నుల గృహములందు మాత్రమే ఉండెడివి. దేశమున యుద్ధాది ఉపద్రవములు చెలరేగినప్పుడు ఇవియు నశించిపోయెడివి. కాన ముఖస్థ వాఙ్మయమే అధికముగ నిలిచెను. ఈ ముఖస్థవిద్యను తాళపత్రములపై పెట్టునపుడు మూలమునకు భిన్నమైన పాఠభేదము లేర్పడెడివి. ఆయా గురువుల ప్రవచన భేదము చేతను పాఠాంతరము లేర్పడెడివి. మరికొన్ని లేఖక ప్రమాద జన్యములు. పూర్వ పూర్వ తాళపత్రములందలి శైథిల్యములు, గ్రంథపాతముల వలనను పాఠాంతరములు పుట్టును. తమ కావ్యములకిట్టి స్థితియేర్పడుటను ప్రాచీనులు గుర్తింపకపోలేదు.

ఉ॥ నన్నయ ముఖ్య సత్కవిజనంబుల కావ్యములందు లేఖకుల్
గొన్నియుఁ, బాఠకాధములు గొన్నియుఁబోకడఁబెట్టఁ, దక్కువై
యున్నెడఁగాంచి జానపము లోడకదిద్దిన తప్పుత్రోవలె
ల్లన్నిజమంచుఁగైకొనిన, లక్షణవేత్తలు సమ్మతింతురే?•

అని అప్పకవి హెచ్చరించెను. బ్రౌను సేకరించిన చాటుపద్యములలో

"తప్పు తాచూచి వ్రాయుట యుత్తమము, లేక
ప్రతి సమానముగ వ్రాయుట యతి మధ్యంబు
రెండు విడిచియు వ్రాసెడి లేఖకుండు
గలుగ కవిజేయు భాగ్యంబు కతనగాదె"

అను పద్యము కలదు[3] ఈ పద్యమెవరిదైనను, ప్రాచీనులు ఉత్తమ లేఖక ప్రాధాన్యమును గుర్తించిరనుట తెల్లమగుచున్నది. కావ్యములు ఏకకర్తృకములే అయ్యును, కాలాంతరమున వానికి ప్రత్యంతరము లేర్పడి దేశవ్యాప్తి నొందినపుడు, వ్రాయసగాండ్ర ప్రమత్తతవలన, అజ్ఞానము వలన, భాషాపరిణామ కారణములవలన మాతృకలలోలేని భాషాదోషములు, పాఠభేదములు, లేఖన దోషములు ప్రతికలలో వెలయుట పరిపాటి ఇట్టి భ్రమ ప్రమాదములకు తమ కావ్యములు గురియగునని గుర్తించిరేకాని, తప్పుల కుప్పలుగ నున్న వీనిని సవరించి, ఒక శుద్ధ ప్రతిని ప్రమాణముగ తయారు చేయవలయుననెడి తలంపు ప్రాచీనులకు కలుగలేదు. ముద్రణ సౌకర్యము లేని ఆ కాలమున అట్టి ఊహ పొడముటకును అవకాశము లేదు. తాళపత్రముల యథార్థ

---

• అప్పకవీయము 3 - 202

3. D 2884. మ ప్రా. పు భాండాగారము.

స్వరూపము తెలిసికొనిన గాని పరిష్కరణలోని ప్రయాస బోధపడదు. ప్రాచీన తెలుగు శాసనములను, తాళ పత్ర గ్రంథములను పరిశీలించిన తెలుగులేఖనములో ఒక నిర్దిష్టమైన పద్ధతి ఏ యుగమునందును కానరాదు. లేఖనదోషములు ప్రాఙ్నన్నయ కాలమునుండియే యున్నట్లు కాలపు శాసనముల పరిశీలనమున తెలియనగును.

ఉదా :—అయ్న - ఆఇన; ఐన - ఐయ్న; ఆచంద్రదర్కము -
ఆచంద్ర దరరార్కంబు [4]

నన్నయ తరువాతి శాసనములందు, తాళపత్రములందును పలు రకముల లేఖన దోషములుండుట శోచనీయము.

2. 2 గ్రంథ పరిష్కరణమున నెదుర్కొనవలసిన సమస్యలను, అవలంబింపవలసిన విధానములను వివరించు సమగ్రమైన గ్రంథములు గాని, వ్యాసములు గాని తెలుగున నిప్పటివరకు లేవు. తాళ పత్రములందు కానవచ్చు లేఖన విధానమును ప్రధానముగ నాలుగు విధములుగ వర్గీకరింపవచ్చును [5]

## I లేఖన దోషములు : (Lapsus Calami = Slip of the Pen)

ఇవి కేవలము లేఖకుని ప్రమత్తతవలన కలుగు దోషములు. లేఖకుడు తాను వ్రాసిన ప్రతిని పునః పరిశీలించి యున్నను, లేక పండిత సాహాయ్యమును కోరి యున్నను ఈ ప్రమాదములు దొరలవు.

ఉదా :

| ఉన్న రూపము | ఉండవలసిన రూపము |
|---|---|
| ఇ స్ృష్టి | ఈ సృష్టి |
| ఎశ్వర్య | ఐశ్వర్య |
| చప్పంబడు | చంపబడు |
| శయనికుల | సైనికుల |

నేటి ముద్రిత గ్రంథములందలి తప్పొప్పుల పట్టిక వంటివి యీ దోషములు.

4 రాధాకృష్ణ. బి : ప్రాచీనాంధ్ర శాసనములు. పు. 216, 252. 223.

5. తాళ్ళపాక పెద తిరుమలాచార్యులు : శ్రీమద్భగవద్గీతానువాదము. పీఠిక. పుట xxxix.

## II లేఖన సంప్రదాయద్యోతక రూపములు :

## (Scriptal tradition)

గుణితములో, పదలేఖనములో నేటి వ్రాత పద్ధతికిని, ఆనాటి తాళపత్రలేఖన పద్ధతికిని విభేదము కనిపించును :

| | | నాటిరూపము | | నేటిరూపము |
|---|---|---|---|---|
| 1. | వలపలగిలక | కీర్త్తిన్ | — | కీర్తి |
| 2. | పూర్ణబిందుపూర్వక ద్విత్వ హల్లు | కొంద్దరు | — | కొందరు |
| | | వుండ్డుదురు | — | వుండుదురు |
| 3. | పూర్ణబిందు పూర్వక - అను నాసిక ద్విత్వము లేదా అను నాసిక సంయుక్తము. | వాంన్ని | — | వానిని |
| | | పుంణ్యం | — | పుణ్యము |
| 4. | పూర్ణబిందు పూరక - అద్వి యుక్త హల్లు | యేరింగి | — | యేరిఁగి |
| | | వాండు | — | వాఁడు |
| | | ప్రాంత | — | ప్రాఁత |
| 5. | పదమధ్య - అజ్లోపము : | అడ్గితేను | — | అడిగితేను |
| | | నడ్మ | — | నడుమ |
| | | వాన్కి | — | వానికి |
| 6. | ఏత్వమునకు ఎత్వము : | నెను | — | నేను |
| | | చెశెటి | — | చేశేటి |
| 7. | పదమధ్యమున వ్యస్తముగా అచ్చు : | అఉను | — | అవును |
| | | అఇశ్వర్యమున్ను | — | అయిశ్వర్యమున్ను |

## III. ఉచ్చారణ విధేయ లేఖన విశేషములు :

## (Phonetic transcription)

తాళపత్ర గ్రంథములలో కొన్ని ధ్వనులను, పదములను ఆ నాటి ఉచ్చారణానుగుణముగ వ్రాసినట్లు కనిపించును. అవి పండితులకు, గ్రాంథిక భాషావాదులకు అక్షణ

విరుద్ధముగ తోపవచ్చును. తాళపత్ర లేఖనములో, ఉచ్చారణ ప్రధానముగ ఈ క్రింది వానిని గుర్తింపనగును :

1. పదాది యకార వకారములు : యెవడు, యైాశ్వతుడు వొక్కండను, వుపానసము
2. ఐ, ఔ లకు క్రమముగా 'అయి, అవు'లు : అయిరావతము అవుషధము.
3. ఋత్వమునకు 'రు' : మహారుషులు, రుతువు
4. హల్లుతో కూడిన ఋత్వమునకు 'రి' లేక 'రు' : క్రిష్ణవాక్యం, బ్రుహత్సామ
5. 'చ' వర్ణమునకు శ / సలు : చేయు - శేయు; చేత - సేత
6. 'శ' వర్ణమునకు స : వైస్యులు, సూద్రులు
7. 'స' వర్ణమునకు శ : శింహ్మము, శేవించు

## IV. క్రమభంగము (Disorder) :

వ్రాయస గాని ఏమరుపాటు లేక తొందరపాటు వలన గ్రంథభాగములు ముందువెనుకలగుట కనిపించును. ఒకవేళ పునఃపరిశీలనములో లేఖకులీదోషమును గుర్తించినను తాళపత్ర రచనలో అది సవరించుటకు సాధ్యపడదు. కొన్నిమారులు తాళపత్ర పత్రములను తప్పుగ కూర్చుటవలనను నీ క్రమభంగము కలుగును. కాన గ్రంథ పరిష్కర్త క్రమభంగములను కూడ గమనింపవలయును.

2. 3. ఇట్టి అపపాఠములతో, గ్రంథగ్రంథులతో, గ్రంథశైథిల్యములతో నున్న తాళపత్ర గ్రంథములను నేడు మన చేతులందున్న పరిష్కృత ముద్రిత రూపమున వెలువరించుటకు బ్రౌను పడిన పాటులను ఆతడొక వ్యాసమునందు వివరించెను.[6] శుద్ధ పతులను తయారుచేయు విషయములో గ్రంథసంపాదనము ప్రధానము, ప్రథమము. ఆ కాలమున గ్రంథసంపాదన మనునది వ్యయప్రయాసలతో కూడిన వ్యాసంగము. ప్రజలకు గల మూఢవిశ్వాసమును తాళపత్ర సేకరణమునకు ప్రతిబంధకముగ నుండెడిది. తాళపత్రప్రతుల సేకరణమున తానెదుర్కొనిన సమస్యలను బ్రౌను ఇట్లు తెలిపెను :

"Biassed at an early period to the study of Telugu it soon became an object of interest to me to collect as many of the more

6. C. P. Brown : Plans for the Revival and Promotion of of Telugu Literature.

admired works which it contained as the opportunities I enjoyed from being employed by Government in a Telugu country, and considerable application furnished me with.

In the pursuit however I met with many difficulties those doubtless to which the present paucity of the works alluded to in the College Library is to be mainly attributed : viz. the reluctance which the natives manifest to parting with their valuable manuscripts at any price, and the vigilance with which the copies of their principal works are guarded as indications of the learning possessed"[7]

బ్రౌను సొంత డబ్బును వెచ్చించి తాళపత్ర ప్రతులను సేకరించెను. 1830 వ సం॥ మచిలీపట్టణమందు కోటీ వెంకన్న యనుని సతీమణియొద్ద 870 రూ॥లకు వారి పుస్తక భాండాగారము నంతయు కొనెను. అందు ప్రధానముగ సంస్కృత గ్రంథములు, కొలదిపాటి తెలుగు గ్రంథము లుండినవి. 18 పురాణములు, 120 ఉపనిషత్తులు వేదాంత, పౌరాణిక, తాంత్రిక గ్రంథములుండినట్లు బ్రౌను తెలిపెను.[8]

1834 వ-సం॥ జనవరి నెలలో యానాము వాసియైన మాజేటి సర్వేశలింగము నకు చెందిన గ్రంథాలయమును రూ 150/- లకు కొనెను అందు తాంత్రిక, వైద్య వ్యాకరణ గ్రంథములేకాక కావ్యములును గలవు మొత్తము 613 గ్రంథములు. వానిలో 386 సంస్కృత గ్రంథములు. శేషించినవి తెలుగు.[9]

అదే సంవత్సరము ఏప్రిల్ నెలలో పెద్దాపురమున అవసరాల వేంకటరావు గ్రంథాలయమును రూ 796/- లకు కొనెను. సంస్కృతమందు ప్రధాన కావ్యము లును, కొన్ని తెలుగు కావ్యములును మొత్తము 98 ఉద్గ్రంథము లుండినట్లు బ్రౌను నుడివెను.[10]

రాజమహేంద్రవరమందలి ఒక న్యాయవాది గ్రంథాలయమును కూడ సొంత మొనర్చుకొనెను. అత్యుత్తమ తర్కశాస్త్ర గ్రంథముల నాతని యొద్దనుండి సంపా దించెనట. ఈ గ్రంథములకు తానిచ్చిన వెల అతిస్వల్పమనియు, ఆ గ్రంథము

7. Ibid, p, 25
8. Ibid. p. 165
9. Ibid p 165
10. Ibid P. 110

లన్నియు మిక్కిలి అమూల్యములైనవని బ్రౌను నుడువుట అతనికి గల జ్ఞానాన్వేషణాభిలాషను వ్యక్తమొనర్చును.

తన అనంతరము కావ్యములను పరిష్కరింప దలచినవారికి ఆతడు కొన్ని సూచనల నిచ్చెను. హిందువులు తమ తాళపత్ర గ్రంథములను చదివి, తిరిగి ఇచ్చుటకు అంగీకరింతురు కాని అమ్ముటకు ఎంతమాత్రమును సమ్మతింపరు. పుస్తకమును చదివి ఈయక, దానిని వెల యిచ్చి కొనచూచినచో వారు తమ గ్రంథాలయములలోని పుస్తకములను చూచుటకు కూడ అనుమతింపరు అట్లుగాక కావ్యమును చదివి, పాఠములను గుర్తించి తిరిగి ఇచ్చివేయుదమనిన వారు వెంటనే వానినుపయోగింప నిత్తురు. స్వదేశీయున కన్న ఒక విదేశీయునకు కావ్యము నిచ్చుటకు వారు వెనుకాడరు

'పుస్తకం, వనితా విత్తం, పరహస్తగతం గతమ్
అథవా పునరాయాతి జీర్ణం, భ్రష్టాచ, ఖండశః'

అని కదా ఆర్యోక్తి: అప్పుడప్పుడు బ్రౌను ఎవరి యొద్దనైనను తాళపత్ర ప్రతులున్నవని తెలిసిన, ఆ వ్యక్తితో స్నేహమును నెరపెడివాడట మిత్రభావముతో వానిని సంపాదింప ప్రయత్నించెడివాడట. వారితో వారి మాతృభాషయందు సంభాషించినచో వారికి నమ్మిక కలిగెడిదట. అప్పుడు వారు తమ ప్రతులను ఇచ్చుటకు సంశయించెడి వారు కారట. అట్టి సందర్భములలో బ్రౌను తన ఆంగ్ల పుస్తకములను వారికి చదువుట కిచ్చెడివాడట. ఇట్లు పరస్పర స్నేహభావముతో ప్రతులను సంపాదించెను 11.

బ్రౌను మత విషయమునను భావి పరిష్కర్తల నిట్లు హెచ్చరించెను. వైష్ణవులను శైవ, జైన గ్రంథములను అడుగరాదు అట్లడిగిన వారు విభ్రాంతులగుదురు కాని సహజ గంభీరులగు వారు తమ భావములను వ్యక్తపరుపక, తామెన్నడును అట్టి గ్రంథములను గూర్చి వినలేదని తప్పుకొందురట.

బ్రౌను తన అధికారమును ఉపయోగించియు ప్రతులను సేకరించెను.12 ఇట్లు సామదానాదులతో బ్రౌను తాళపత్ర ప్రతులను సమకూర్చి, తుదకు వాని నన్నింటిని మద్రాసు కాలేజికి సమర్పించుట అతని ఔదార్యమునకు నిదర్శనము 13.

11. Ibid PP. 193 - 194
12. Series of letters. M. 401 - P. 329.
13. Literary Life. P. XX.

2. 4 గ్రంథ సంపాదనానంతరము, పాఠాంతరములను గుర్తించుట గ్రంథ పరిష్కరణమున రెండవదశ. ఒక కావ్యమునకు దేశమునందుపలబ్ధములగు భిన్న ప్రతులను సేకరించిన పిమ్మట, వానిలో గ్రంథ శైథిల్యములు, లేఖక దోషములు అంతగాలేని ఒక ప్రతిని ప్రధాన ప్రతిగ స్వీకరించి, అందలి పాఠములను తదితర ప్రతుల పాఠములతో పోల్చి, సవరించి, శుద్ధ పాఠముల నిర్ణయింతురు. ఈ విధానమును బ్రౌను అతి విస్పష్టముగ వివరించెను "Mode of Transcription" (విలేఖన విన్యాసము) అని దీనిని తన వ్యాసమున ప్రస్తావించెను. క్రిమి దష్టమై శిథిలమై పోవుచున్న తాళ పత్రములందలి విషయములను కాగితపు ప్రతులలోని కెక్కించుట అను అపూర్వ సేవను చేసి బ్రౌను ఆంధ్రభాషకు మహోపకార మొనర్చెను. తాటాకు వ్రాతలందు గల ఛందో భంగములను, గణయతి ప్రాస దోషములను సవరింప గలిగిన ఛందః పరిజ్ఞానముగల లేఖకులనే అతడు నియమించెడి వాడు. కాగితములను సమభాగములుగ కత్తిరించి, వరుస తప్పకుండుటకై గీతలను గీసి లేఖకుల కిచ్చెడివాడు. కావ్యమంతయు పూర్తిఅయిన పిమ్మట; ఆ కాగితములను పుస్తకములుగ గుది కూర్చెడివాడు.

క్రొత్తగా లేఖకులను నియమించుటలో జాగరూకత వహింపవలయునని హెచ్చరించెను. ఏలయన, "they repeatedly alter the text as they see fit-and I take care to fine them everytime."

తాము వ్రాయుచున్న వ్రాతల అర్థము తెలియని, లేక గ్రహింపలేని లేఖకుడుండుట మేలు. అట్టివాడు మాతృకయందు మార్పు, చేర్పులను చేయక 'తూ చా' తప్పక ఎత్తి వ్రాయును. ఈ కారణము చేతనే విదేశీయ ముద్రాపకుడొకడు వ్రాత ప్రతులను సవరించుటకు స్త్రీలను నియమించెడి వాడట.

బెంగాలు, బెనారసులనుండి తెప్పించిన కొన్ని సంస్కృతగ్రంథముల తాళ పత్రప్రతులు బ్రాహ్మణస్త్రీలు వ్రాసినవనియు ఆ కారణముచే నవి మాతృకానుసారమై తప్పులు లేనివిగ పరిగణింపబడుచున్నవనియు బ్రౌను తెలిపెను. స్త్రీలు అర్థజ్ఞాన శూన్యులగుటవలన 'మక్కికి మక్కి' వ్రాసిరనునది ఆనాటివారి అభిప్రాయమైనను, మాతృకను మార్చకూడదను ఋజుభావముతో స్త్రీలట్లు చేసిరని ఎంచుట సమంజసము.

మాతృకను కాగితములపై వ్రాసిన తరువాత ప్రతి యొక లేఖకుడును పుత్రికను మాతృకతో పోల్చి సరిచూడనిదే వారికి వేతనముల నిచ్చెడివాడుకాడు బ్రౌను. ఎంతటి శ్రద్ధగల వ్రాయసకాడైనను పొరపాటులు చేయును పోల్చిచూచిన గాని ఆ దోషములు తెలియవు బ్రౌను జంట, జంటలుగ వ్రాయసకాండ్రను ఏర్పరచెడివాడు. వీరిరువురిలో ఒకరు మాతృకను చదువ, రెండవవారు పుత్రికను చూచి పొరపాటులున్న సవరించెడివారు. దీనినే 'మొకాబిలా' చేయుట యని ఆ కాలమువారు వ్యవహరించిరి. ఈ విధానమే నేటికిని అమలులో నుండుట బ్రౌను నిపుణతకు నిదర్శనము.

బ్రౌను అతి సూక్ష్మాంశము లందును క్రమత నవలంబించెడివాడు వ్రాయస కాండ్రెప్పుడును, తమ వ్రాత సాధనములగు కలము, చురకత్తి మున్నగువానిని కొనవలయునట లేనిచో ఈ వ్రాత పరికరములను చెడగొట్టుటయో, విరుగగొట్టుటయో పోగొట్టుటయో లేక తస్కరించుటయో జరుగుచుండెడిదట

ఈ విధముగ బ్రౌను మొదట కాగితపు ప్రతులను తయారు చేయించెను. ఆతడు తయారు చేయించిన ఈ కాగితపు ప్రతులనేకములు నేటికిని మద్రాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమున పదిలముగ నున్నవి ఇప్పటికిని అముద్రిత కావ్యముల కాగితపు ప్రతులు కొన్ని ముద్రణకు సిద్ధముగ నున్నవి.

2. 5. కాగితపు ప్రతి తయారు చేసికొనిన పిదప, తదితర ప్రతులలోని పాఠాంతరములను ఎక్కించుట మూడవదశ దీనిని కూడ బ్రౌను ఒక క్రమబద్ధమైన విధానమున నడపెను. ఒక కావ్యమునకు కాగితపుప్రతి సిద్ధమయిన వెంటనే, ఆ కావ్యము యొక్క ఇతర ప్రతులు ఎనిమిది లేక పదింటిని సేకరించి, సమర్థులగు ముగ్గురు లేక నలుగురు పండితులకు ఆ ప్రతుల నొసగెడివాడు. ఆ కావ్యమునకు సంస్కృత మాతృక ఉండినచో, దాని ప్రతులు రెండు మూడింటిని కూడ వారి కిచ్చెడివాడు శ్రద్ధగ వ్రాయు ఒక లేఖకుని చేతికి క్రొత్త కాగితపు ప్రతి నిచ్చెడివాడు. ఈ పండితులు వలయాకారముగ కూర్చుండి, ఒక్కొక్కరు వరుసగ తమ ప్రతులలోని పద్యములను చదువుచుండగా, కాగితపు ప్రతిలో లేఖకుడు ఆ యా ప్రతులలో నున్న పాఠాంతరములను వ్రాసెడివాడు. ఒక పద్యమునకు పాఠాంతరములను గుర్తించిన తరువాత లేఖకుడు పండితులను శుద్ధ పాఠము

నిర్ణయింపుడని కోరును. దినసావసానమున లేఖకుడు పాఠముల చదివి, పాఠనిర్ణయ మొనర్చిన పండితుల పేర్లను, పోల్చిన భిన్నప్రతుల నామములనుగాని, లేక ఆ ప్రతుల సొంతదారుల పేర్లనుగాని, ఏ పత్రములో ఏ భాగమున ఏ పద్యము నొద్ద నిలిపిరో ఆ పద్య వివరణములను గుర్తించెడివాడు ఈ వివరములన్నియు గుర్తింపవలయు నని బ్రౌను అనుశాసనము. ఈ ఏర్పాటునకు మునుపు ప్రతిరోజు రెండు మూడు గంటలు ఎక్కడ నిలిపినది వెదకుటకే వ్యర్థకాలక్షేప మయ్యేదిదని యు కాన తానీ పద్ధతిని ప్రవేశపెట్టినట్లును బ్రౌను పేర్కొనెను.

మొదట ఒక కావ్యమునకు సంపూర్ణముగ పాఠాంతరములను సరిపోల్చిన పిదపనే దానికి పుస్తకముగ (బైండు) కూర్చి కుట్టించెడి వాడు కాని అట్లు చేయుట వలన శుద్ధ ప్రతిని తిరిగి వ్రాయుటకు కాలాతీతమగుచున్నదని గుర్తించెను. కావ్యము లోని కొన్ని భాగముల విడికాగితముల సవరించిన వెంటనే ఆ కాగితములను శుద్ధ ప్రతిని వ్రాసెడి వాని కిచ్చెడివాడు. అట్లు చేయుటవలన సవరణలు, శుద్ధప్రతి వ్రాయుట అను రెండు కార్యములును ఏకకాలమున జరుగుచు, ఆలస్యమునకు అవకాశముండెడిది కాదు.

వ్రాయని తెల్లకాగితములను బైండు చేసి, ఆ పుస్తకములను మూలమును పాఠాంతరములను వ్రాయుట కుపయోగింపవలయునను బ్రౌను ఆద్య ప్రణాళిక. కాని ఆ విధానము అననుకూలమని అనుభవము వలన తెలిసికొనెను. విడికాగితములపై వ్రాసినపుడు తప్పులు దొరలినచో ఆ కాగితములను మాత్రము తీసివేసి, వేరు కాగిత ముల నుపయోగింపనగును. బైండు చేసిన పుస్తకములందిది సాధ్యపడదు.

పాఠములను పఠించువారందరును పండితులుగ నుండగూడదని బ్రౌను అభి ప్రాయము. వారిలో నొకడు విద్వాంసుడైన చాలును. అందరు పండితులయినచో శుద్ధపాఠనిర్ణయము గూర్చిన వాగ్వాదముల కంతమే ఉండెడిది కాదట. ఈ వివాద సంవాదములతోనే పుణ్యకాలము గడచిపోయెడిదట.

పాఠములలో ఏ మాత్రము భిన్నత యున్నను, దానిని గుర్తింపక పోయినచో బ్రౌను అర్ధరూపాయ లేక పావు రూపాయ జరిమానా విధించెడి వాడు. ఇది యాతని సునిశిత పరిశీలనకు తార్కాణము. ఇట్టి పరిష్కరణ కార్యములో అశ్రద్ధ క్షంతవ్యము గాదని బ్రౌను గట్టి నమ్మిక.

ఈ సవరణ కార్యమునకు ఉదయము 8-12, సాయంకాలము 3-7, వేసవిలో ఉదయము 7-11, సాయంకాలము 4-8 గంటలు నిర్ణీతకాలము ఇట్లు, ఉదయ సాయంకాలములు రెండుపూటలు వచ్చుట కిచ్చగింపని పండితులు ప్రభుత్వ కార్యాలయములందువలె 10-నుండి 6 గంటలవరకు పనిచేయుదుమని కోరిరట. కాని నిర్విరామముగ ఏకకాలికముగ అన్ని గంటలు ఏకాగ్రత కుదరదని బ్రౌను గ్రహించి ఆరు గంటలను రెండుగ విభజించుటయే సుకరమని తెలిసికొనెను. నిర్ణీతకాలము ఉన్నప్పటికిని, కొంచెము ముందు వెనుకగ పండితులు వచ్చినను బ్రౌను కల్పించు కొనెడివాడుకాడు ఆయావ్యక్తుల సిజాయితీని అనుసరించి నడుచుకొనెడివాడు. వారికి స్వేచ్ఛా స్వాతంత్ర్యముల నిచ్చుట వలననే వారి నుండి ఎక్కువ ఫలమును పొందనగునని బ్రౌను అభిప్రాయము.

ఒకరిద్దరు పండితులు సవరించిన ప్రతిని పునః పరిశీలనకు తగిన వ్యక్తులు కానివారికి ఈ కూడదనునది బ్రౌను సిద్ధాంతము. అట్లొసగిన, సవరించిన శుద్ధప్రతిని సంపూర్ణముగ మార్తురని అతని అనుభవము. తమ పాండిత్య ప్రదర్శనార్థము. మొదట నిర్ణయించిన పాఠములను అకారణముగనే మార్చుట జరిగినట్లు ఆతడు తెలిపెను హంసవింశతి, కాశీఖండ ప్రతులకిట్టి దురవస్థ ప్రాప్తించెనట. ఇట్టి సంభవములు ప్రథమమున పాఠాంతరములను సరిపోల్చి సవరించిన పండితులకు మనః క్లేశము కలిగింపక తప్పదుగాన దాని కవకాశమొసంగ కుండుటయే క్షేమమని ఆతడు భావించుట ఆతని సహృదయతను వెల్లడించెను. బోద్ధారో మత్సరగ్రస్తాః" అను సుభాషితము నాతడు అవగతము చేసికొనెను.

శుద్ధప్రతులను సిద్ధపరచినవారే మరికొంత కాలమునకు స్వానుభవముతోగాని, లేక నూతన ప్రతులతోగాని, పోల్చిసవరించుట సముచితమని, అట్టి సవరణ ఆవశ్యకమని అతని విశ్వాసము ఏ గ్రంథమందైనను అపపాఠములు ప్రథమ పరిష్కరణలోనే తొలగిపోవు. ప్రతులతో తిరిగి పోల్చిచూచుట అత్యంతావశ్యకమని బ్రౌను గుర్తించెను. ఆంధ్రమహాభారత కర్ణపర్వ ద్వితీయాశ్వాసమున 235-వ పద్యమున ప్రాసభంగము ఎనిమిది ప్రతులందుండెనట ఎనిమిది ప్రతులతో తృప్తి నందక, తొమ్మిదవ ప్రతిని సంపాదించి దానితో పోల్చినపుడు ఆప్రాసభంగములేని పాదము లభించినదట. సరియైన పాఠము లభింపకున్న ఈ పరిష్కరణ మింకెంత కష్టముగ నుండునో ఊహింపవలసినదే.

ప్రతుల సేకరణ, కాగితపు ప్రతుల తయారింపు పాఠముల సవరణ, పరిష్కరణ శుద్ధ ప్రతుల సమకూర్చు విధానము ఇత్యాదులను బ్రౌను ఇటలీ, జర్మనీ దేశస్థుల నుండి గ్రహించినట్లు తెలిపెను. కావ్యపరిష్కరణము లందు నేటికిని బ్రౌను ప్రవేశ పెట్టిన ఈ పద్ధతులే అవలంబింప బడుచున్నవి.

## 2. 6. బ్రౌను అనుసరించిన పాఠనిర్ణయ విధానములు :

బ్రౌను పురాణేతిహాసములను, శృంగార ప్రబంధములను, కథాకావ్యములను, ద్విపద కావ్యములను, శతకములను, అనేకములను సేకరించి, పరిశీలించి పరిష్కరించెను. ఈ వివిధ వాఙ్మయ ప్రక్రియలకు చెందిన గ్రంథముల పరిష్కరించుటకు ఆతడు ఒక్క విధానమునే అనుసరించెను. ముందు ప్రకరణములలో బ్రౌను పరిష్కరించిన వివిధ కావ్యముల విషయములు ప్రస్తావింపబడును. పాఠనిర్ణయమున బ్రౌను పాటించిన పద్ధతులు కొన్ని స్థూలముగ క్రింద క్రోడీకరింపబడినవి.

1. ఒక కావ్యమునకు సేకరించిన ప్రతులకు **'A, B, C'** అని అక్షరములతో కాని, సంఖ్యలతోకాని, ఆ తాళపత్రముల సొంతదారుల పేరులతో కాని, లభించిన ఊళ్ల పేళ్లతోగాని గుర్తించెడివారు.

2. అనేక ప్రతులందున్న సమాన పాఠమునే గ్రహించి, అది నిర్దుష్టము గానున్న ఉచితరీతి సవరించెడివారు

ఉదా; 1] **The three copies read** విరికిరుసున **...This being a term unknown to the pandits Buchia. proposed** బిరుసున **but they decide to retain the reading of the manuscript. (D. 818.** శంకాకవిజయము సంపు. 1. 2ఆ 85 ప.)

**(ii "ABC read** త్రాక్క **but the true reading must be** త్రిక్క**"** (అందే. 2 ఆ 121 ప.)

3. లభించిన ప్రతులలో పెక్కింటి లేక కొన్నింటి యందు మాత్రమే అధికముగా ఉన్న గద్యపద్య భాగములను ఉపేక్షింపక స్వీకరించెడివారు.

ఉదా: యీవచనం కృష్ణరెడ్డి పుంగనూరు నాయ నగ్గనాథిన్న (?) యీ ముగ్గురి ప్రతుల్లోవి -కొదవ ప్రతుల్లో యీవచనం లేదు. అయినా యీ వచనం వుండవలశ్నది గన్క- వుంచినాను.

(D. 165 భారతము 1 ఆ. 301 వచనము)

4. లభించిన ప్రతులలోనెల్ల అపపాఠసే యుండిన ఆ విషయమును పేర్కొనెడివారు.

ఉదా : "This passage is defective in both mss".

(D. 862. సత్యభామా సాంత్వనము. 1 ఆ 176 ప.)

5. పాఠపరిష్కరణ కాలములో శుద్ధపాఠము లభింపక, ఆ తరువాత కొంత కాలమునకు మరొక ప్రతిలో లభించినచో దానిని గుర్తించెడివారు

ఉదా : (i) "యీపద్యం అంత్యచరణం యిక్కడ వ్రాశినది పిఠాపురం ప్రతిలో దొరికినది".

(D. 862 సత్యభామాసాంత్వనము 4 ఆ. 29-30 సీ. ప)

(ii) "ఇక్కడ తప్పు తీర్పు ఖమ్మం ప్రతిచేత తెలిసినది."

(D 912. హంసవింశతి. సంపు 1 2 ఆ. 187 సీ ప)

6. గుర్తించిన పాఠభేదములు ఏయే ప్రతులలోనివో సూచించెడివారు.

ఉదా : "The variations herein marked are found in a ms. in the Mackentie collection" (D. 313. విష్ణుపురాణము. సంపు - 2. పత్రము 2.)

7. సందిగ్ధ పాఠములను ప్రత్యంతరము లభించినపుడు పరిశీలింపవలయునని గుర్తించెడివారు.

ఉదా : (i) "This line cannot be corrected out with consulting other copies."

(D. 312. విష్ణుపురాణము. సంపు 1. 1 అధ్యాయము, 15 ప.)

(ii) "ప్రత్యంతరం చూడవలశ్ని సంశయ స్థలములు :

దశావతార ౧ ఆశ్వాసం—

౧ - ౩౩౭ పద్యం ౧

- ౩౩౮ పద్యం ౧
- ౪౦౩ పద్యం ౧
౧౦ - ౧౭౨ పద్యం ౧
- ౧౬౦ పద్యం ౧

(D. 520. దశావతార చరిత్ర, సంపు 5. పత్రము 141)

(iii) "యిక్కడ ఆంధ్ర గీర్వాణ ప్రత్యంతరములు యింకా చూడవలెను- యీ సీసపద్యం సంశయగ్రస్తమైనందునను"

(D. 36, భాగవతము 2 ఆ. 269 ప.)

8. తెలుగు కావ్యములందు పాఠనిర్ణయము ఛందో వ్యాకరణములపై ఆధార పడి యుండును. యతి స్థానమునుబట్టి, ప్రాసమైత్రిని పురస్కరించుకొని, గణముల ననుసరించి, నిర్ధారక పాఠముల నిర్ణయింతురు. అట్లే వ్యాకరణమును పాఠనిర్ణయమున తోడ్పడును. ఈ విషయమును బ్రౌను విస్మరింపలేదు. బ్రౌను పండిత మండలి వీనినే ప్రధానముగా దృష్టియందుంచుకొని కావ్యముల పరిష్కరించిరి.

ఉదా : (i) "వెంకట శబ్దము సమాస మధ్యగతమౌట వేంకట అని సంస్కృతాను సారముగా వ్రాయడమైనది.

"... వేంకట నగాధ్యక్షుండు రక్షించుగొ, బ్బూరీ"

(D. 715. రామాభ్యుదయము, 1 ఆ. 1 ప.)

(ii) "వత్తురుం దిరుగంగ నీగతి । వానరోత్త + ల త్తరిన్" (మ inserted above +)

"This ము I inserted on re-examining the passage in the Mc. ms - the editor had passed over the error in scanning unnoticed" (D. 715. రామాభ్యుదయము. 6 ఆ. 79 ప. మత్తకోకిల)

(iii) 'దేవత వీక్షించి తిరుగుడు పడగ'

"అర్థ భంగంగా తిరుగుడు పడుచు అని వుంటె

తిరుగుడు పడగా అని వ్రాయడమైనది"

(D. 942. ఉత్తర రామాయణము. పత్రము 56.)

(iv) 'బ్రతికెడు బ్రతుకు దాపదటికే యనుడు
మతినల్గి సూర్యుడా మందరాచలము'

"ఇచ్చట । మరి । మది । అని ప్రాసభంగముగా నుండగా మతి యని వ్రాయడ మైనది." (D. 1086. పండితారాధ్య చరిత్ర)

×

(v) 'వారి వారి కొలంది వసుధ జరించు
నీచు కొలది నుండు నీరజంబట్ల'

"X గణ భేదముగా జరియించు అని వుంటె జరియించు అని వ్రాయడమయినది."
(D. 951 ప్రభులింగలీల. 2 ఆ. 66 ద్వి.)

×

(vi) "యెందు జొచ్చిన జొరనీక వెనుతగిలి
చిందర వందర జేతుడెందంబు"

"× యతి భంగంగా యందు అని వుంటె యెందు అని వ్రాయడమైనది. యీచరణమందు నాలుగు యింద్రగణములు వచ్చినవి".

(అందే. 2 ఆ. 74 ద్వి)

vii) "యని యిట్లు దూరంగ యల్లమ ప్రభువు

×

వనితా వయస్యల వలను పీడించి"

"× శబ్దభంగంగా వనిత వయస్యల అని వుంటె వనితావయస్యల అని వ్రాయడ మైనది. (అందే 7 ఆ. 62 ద్వి)

9 సంస్కృత మూలముండిన, దాని ననుసరించి పాఠములను సవరించెడివారు.

ఉదా: "యేడ్చుకు అన్నప్పుడు గీర్వాణ తీర్పు
క్వచిద్రుదతి గోవింద చింతాబల (కులిత) చేతనః
క్వచిద్ధసతి తచ్చిందాహ్లాద ఉద్గాయతీక్వచిత్॥"

(D. 36. భాగవతము 9 స్కం 150 ప.)

10. ప్రధానముగా గ్రహించిన ప్రతిని ఇతర ప్రతులతో ఎంతవరకు పోల్చిరను విషయమును, ఇతరప్రతులు సమగ్రములా, అసమగ్రములా అను విషయమును కూడా గుర్తించెడివారు.

ఉదా: i) "Note – The 2nd ms. stopped here".
(*D* 1106 పరమయోగివిలాసము. పు. 172)

ii) "౧౦౪ పద్యము మొదలుకొని ౧౩౩ పద్యము వరకు ౨౯ పద్యములు రాజమహేంద్రవరము ప్రతిలో లేనందున రుజువు పడ్డవికావు".
(*D*. 581 బలరామచరిత్ర 3 ఆ 133 ప)

11. గ్రంథపాతములను, తత్కారణమున కథానుపూర్వికి భంగకరములగు పట్టులను తెలిపెడివారు

ఉదా : (i) "యిక్కడి పాతం రెండు గ్రంథములందు వక తీరుగానే ఉన్నది.
(D. 456. కవిరాజ మనోరంజనము. 1 ఆ. 132 ప.)

(ii) "+ యిక్కడ పెరపద్యం వుండవలెనని జూలూరు అప్పయ్య చెప్పుతున్నారు."
(*D*. 2678. పంచతంత్రము. సంధి విగ్రహము) 113 పద్యం 289.)

(iii) "యిక్కడ లేక పోయిన గ్రంథము ౪౩౭ డో సైడులో వున్నది."
(*D*, 1121. పల్నాటి వీర చరిత్ర).

12. బ్రౌను స్వయముగ తాను చేసిన సవరణలను, ఇతరులు చేసిన సవరణలను పేర్కొనెడివాడు.

ఉదా : (i) This reading is suggested by me and applauded. (*D*. 461 కుచేలోపాఖ్యానము. 1 ఆ 86 ప.)

(ii) ' This is an amendation of my own is much applauded'
(*D*. 1104. పతివ్రతా చరిత్ర పు. 32)

(iii) Tatachari thinks it should be బొరుగులు & renders
v
orugulu, pillows"
(*D*. 1130 పల్నాటి వీరచరిత్ర. P. 80.)

(iv) "Buch. says it is మోడి - Pata chandra says perhaps మిడెతింగడు. and then I perceive that this is confirmed by one mss - The other three pandits were puzzled. but all own that this solves the doubt."

(*D.* 818 శశాంకవిజయము 2 ఆ 88 ప)

తెలుగుకావ్యముల నీ విధముగ పరిష్కరించుటకు ఆద్యుడు బ్రౌను.

2. 7 వ్రాయస కాండ్రకు బ్రౌను దివసమునకు నిర్ణయించిన కూలి కుతూహలమును కలిగించును. తగిన కూలిని నిర్ణయించుటకు మొదట కొందరు లేఖకులచేత వ్రాయించి, వారు దినమున కెన్ని పద్యములను వ్రాయుచున్నారను లెక్కను తేల్చుకొనెను. రోజుకు 40 పద్యములు. 40×4=160 పాదములు. ఒక నెలకు 40×30=1200 పద్యములు. నెలకు 6 రూపాయలు వేతనమైన, ఒక రూపాయకు 200 పద్యములు అనగా 800 పాదములు. భారత భాగవతములను, మరికొన్ని కావ్యములను ఈ లెక్క చొప్పుననే వ్రాయించెను. ఈ కూలి తక్కువ అనియే బ్రౌను భావించెను. ఒక నెలకు 10-12 రూపాయల నీయవచ్చునని అభిప్రాయ పడెను. ఏమైనను నెల జీతముగాక, దినసరి లెక్క చూచుటయే మేలనెను. నెల జీతగానిగ కుదుర్చుకొనిన. వారిలో అశ్రద్ధ, అజాగ్రత్త ఏర్పడుటను గమనించెను.

కేవలము తాళ పత్రములనుండి కాగితములపై వ్రాయు వారికి ఒక విధమగు వేతనమును, పాఠములను చదువువారికి కొంత తక్కువకూలిని బ్రౌను నిర్ణయించెను. వ్రాయుట కొంత శ్రమతో కూడినపని చదువుట సుకరము. శాస్త్రులకు, పండితు లకు నెలకు రూ 15/- జీతము నిచ్చెడివాడు. స్వగ్రామములందుండి పనిచేయు వారికి ఈ వేతనములు సరిపోవును. అట్లుగాక వారు తమ కుటుంబములను విడిచి మదిరాసునకో లేక మరొక గ్రామమునకో పోయి పని చేయవలసి యుండిన, వారికి మరికొంత అదనపు వేతనము నిచ్చెడివాడు. కూలిని గ్రహించుటకు పూర్వము వారు వ్రాసిన వ్రాతలు సరియని మరొకరు పోల్చి సంతకము చేయవలయును.

తెలుగు కావ్యములకన్న సంస్కృత కావ్యముల వ్రాతకు అధికముగ ఈ నక్కరలేదని బ్రౌను అభిప్రాయ పడెను. సంస్కృత లిపి వ్రాయుట సులభము సంస్కృత తాళపత్రములందు సామాన్యముగ లేఖనదోషములు అధికముగ నుండవు.

తర్క వ్యాకరణాది శాస్త్ర గ్రంథముల వ్రాతలకు బ్రౌను అధికముగ కూలి నిచ్చుచుండెడివాడు. ఒక గ్రంథము గద్యమైనను, పద్యమైనను, చంపువైనను అన్నింటికి ఒకే పద్ధతిలో కూలి నిచ్చెడివాడు.

వ్రాతకాండ్రు తనను మోసపుచ్చకుండ బ్రౌను తగు జాగ్రత్తలు తీసికొనెడివాడు. స్వదేశీయులిచ్చెడి వేతనములు తానిచ్చువానికన్న అధికము కావని బ్రౌను అభిప్రాయపడెను. పైగా వారు ఉచితముగ లభించు తాళపత్రములపై వ్రాయించుచుండిరి బ్రౌను కాగితములను కొనవలసి యుండెను. స్వదేశీయులు నైషధ, వసుచరిత్రాది కావ్యములకు హెచ్చు కూలి నిచ్చెడివారు. తాను ఇంచుమించు అన్నింటికి సమవేతనములనే ఇచ్చెడివాడు. ఉద్గ్రంథమైనను, లఘుకావ్యమైనను-ఉభయమును-నిర్దుష్టముగ నుండవలయు ననుటయే బ్రౌను అభిమతము. కాని స్వదేశీయులు లేఖకులకు బట్టలనుపెట్టి సత్కరింతురనియు, వారి ఇండ్లయందు భోజనాది వసతులను కూడ కల్పింతురనియు, అందువలన తానిచ్చు కూలికన్న అది ఒక విధముగ రెండింతలధికమేనని పేర్కొనెను. గంటములతో తాళపత్రములపై వ్రాయుటకన్న కాగితములపై కలముతో వ్రాయుట యెంతయో సులభముకాన తానిచ్చుకూలి గిట్టుబాటగునని సమర్థించుకొనెను. వెయ్యి తెలుగు పద్యములకు రూ 5/- చొప్పున, వెయ్యి సంస్కృతశ్లోకములకు రూ 6/- చొప్పున ఇచ్చెడివాడు. కాశిలో లేఖకుల వేతనము లిట్టివేయని కనుగొని ఆ పద్ధతినే బ్రౌను అనుసరించెను. అధిక జీతము అశ్రద్ధకు దారి తీయునని, తక్కువ జీతమొసంగిన సమారాధనలకు, విందులకు వారు వెడలిపోవుదురని అతడు పేర్కొనెను.[14]

## ౨. 8. తెనుగు ముద్రణలో బ్రౌను ముద్రలు :

భారతీయ భాషలలో ముద్రణ మొదట రోమన్ లిపితో ప్రారంభమాయెను. ఈ విధానమును రోమన్ కథోలిక్ మతబోధకులు మతప్రచారము నిమిత్తము భారతదేశమున ప్రవేశపెట్టిరి. భారతీయభాషల వివిధ లేఖనములను ఐరోపీయులకు దేశాంతరములందు సంచరించిన ప్రయాణికులు పరిచయమొసర్చిరి. విదేశీయులకు

14. "If the pay is too high it leads to carelessness - and if too low the bramins perpetually absent themselves when any man in the town will invite them a dinner"— **P. R. I. T. L. P. 48.**

తెలుగు లేఖనమును పరిచయమొనర్చినవాడు జాన్ ఫ్రైయర్ (John Fryer). అతడు తొమ్మిదేండ్లు ప్రాగ్దేశములందు పయనించి, తన అనుభవములను "A NEW ACCOUNT OF EAST INDIA AND PERSIA" అను గ్రంథరూపమున ప్రచురించెను. ఆ పుస్తకమున తెలుగులిపిని ప్రదర్శించెను.[15] ఇందలి లేఖనము శాసనములందలి లేఖనమును పోలియున్నది.

1747 వ సం॥న రెవ. బెన్జమిన్ షూల్ట్జె (Rev. Benjamin Schultze జర్మను దేశమందలి హాలె పట్టణమున "Conspectus Literature Telugicae" అను పుస్తకమును రోమన్‌లిపిలో ముద్రించెను. గుణితభాగమున రోమన్‌లిపి క్రింద తెలుగు అక్షరములును గలవు. అవి పెద్దబాలశిక్షలోని గుణిత భాగమందలి అక్షరములను పోలియున్నవి. 1750వ సం॥న షూల్ట్జె మఱొక తెలుగు పుస్తకమును "Thirty Familiar dialogues" అను దానిని రోమన్‌లిపి యందే హాలె పట్టణమున ముద్రించి ప్రకటించెను. ఇందు ఇంగ్లీషువారి వశమందుండిన సుప్రసిద్ధమగు ఫోర్ట్. సెంట్ జార్జికి చెందిన మద్రాసు పట్టణ నివాసులగు వారి ఆచార వ్యవహారములు, సంభాషణలు వివరింపబడినవి. ఈ వివరణములు సంభాషణ రూపమున 30 పాఠములుగ విభజింపబడినవి.

భారతీయ భాషాలిపులకు రోమన్ లిపిని, ఉపయోగించి అనేక నిఘంటువులను ముద్రించిరి. బ్రౌను సంతరించిన The Dictionary of the District and Revenue terms" అనునదియు నీ పద్ధతియందే ముద్రింపబడెను. కాని తమ మాతృభాషల నెఱిగిన స్వదేశీయులకు ఈ రోమన్‌లిపి విధానము అంతగా సాహాయ్యకారి కాకుండెను. రోమన్‌లిపియందు భారతీయ భాషల వాచకములు, వ్యాకరణములు నిఘంటువులు పదబంధములు విదేశీయులకు మిక్కిలి ఉపకరించుచుండెను. భారతీయ భాషల రోమన్‌లిపి ముద్రణము ఆదిలో విదేశీయులందే జరుగుచుండెను.

భారత దేశమునందలి ముద్రణ పరిశ్రమను గూర్చి పరిశోధించిన డా॥ ప్రియోల్కర్ (Dr. Priolker) 1556 వ సం॥న ముద్రణ యంత్రము ప్రప్రథమమున భారతదేశమున నెలకొల్పబడినట్లు పేర్కొనెను.[16] 1578 వ సం॥నకే తిరునెల్

---

15. Book Printing in India P. 7
16. Ibid. P. 17

వేలీ జిల్లాకు చెందిన తూత్తుకుడియందు తమిళ ముద్రాక్షరశాల స్థాపింపబడినట్లు తెలియుచున్నది [17]

"క్రైస్తవ పురాణము" అను వానిని మొదట పోర్చుగీసు భాషలందు రచించి పిదప దాక్షిణాత్య భాషలలోనికి అనువదించిరి. దీని మలయాళానువాద ప్రథమ ముద్రణము 1616 వ సం॥న, ద్వితీయ ముద్రణము 1649లో, తృతీయ ముద్రణము 1654 లో జరిగెను. మెకంజీ వ్రాత ప్రతులలో దీని తెలుగు అనువాదము కూడ ప్రస్తావింపబడెను.

మిషనరీలు కన్నడభాష నేర్చుకొని, కన్నడవ్యాకరణము నొకదానిని 1640వ సం॥న ముద్రించిరి. ఆ వ్యాకరణము 1857 లో పునర్ముద్రితమయ్యెను.

17 వ శతాబ్దాంతము వరకు తెలుగు ముద్రణమును గురించిన ప్రస్తావనయే కానరాదు. రాబర్ట్ డి నొబిలి అనునతడు తెలుగు భాష నభ్యసించి, పుస్తకముల రచించినట్లు జనశ్రుతి. కాని తెలుగు భాషలో పుస్తకమును రచింపగలిగినంతటి భాషాపరిజ్ఞానమును సముపార్జించిన తొలి విదేశీయుడు బెన్జమిన్ షూల్జ్. అతడించు మించు ఒకటిన్నర దశాబ్దము మదరాసులో పనిచేసి, 1742 వ సం॥న జర్మనీ దేశమునకు తిరిగి వెడలెను. తెలుగులో అప్పటికి ఎటువంటి ముద్రిత గ్రంథములు లేవని ఆతనికి తెలియును. అతడు భారతదేశమును విడిచి వెడలిన పిదపకూడ, తెలుగు చదువు మొదలిడువారి కుపయుక్తములగు వాచకములవంటి వానిని ముద్రింప సంకల్పించెను.

అతడు స్వదేశమగు జర్మనీకి వెడలిన నాలుగేండ్ల తరువాత హాలే పట్టణమున ఆఱు తెలుగు పుస్తకములు ముద్రింపబడినవి. ఈ పుస్తకములు మతపరములైనవి. ఇందలి ముద్రాక్షరములు అపరిణతముగ నున్నను, స్పష్టముగ నున్నవి. తాళపత్రము లందు కాననగు 1. పూర్ణబిందుపూర్వక ద్విత్వహల్లు - కొంచ్చు; 2. పదమధ్యముల వ్యస్తముగా అచ్చు-అఇదు; 3, పదాది యకార వకారములు-వక గురువు, ఖు యేజూస్ను క్రిస్తుస్సు [18] ఉచ్చారణ విధేయ లేఖన విశేషములీ ముద్రణమున కనిపించు చున్నవి. 'క' కారము కన్నడ క కారమునవలె నున్నది - మో షానికి ; కన్యెల,

17. Ibid. P. 18

18. Ibid. P. 35

ఈ ఆఱు పుస్తకములలో మూడు 1746 వ సం॥న, మఱి మూడు 1747 వ సం॥న ముద్రింపబడినవి  ఈ ముద్రణమున కర్ణాటాంధ్రములకు సమమైన కొన్ని లిపులు ఉపయోగింపబడినవి.

మద్రాసునందు 1746 వ సం॥నకు పూర్వమే ఒక ముద్రాక్షరశాల నెలకొల్పబడినది. అందు తమిళ ప్రైపు మాత్రమే జరుగుచుండెడిది. తెలుగు అక్షరములను అప్పటి కింకను పోతపోయలేదు శ్రీరామపురములో విలియంకేరి స్థాపించిన ముద్రాక్షరశాల యందే మొదట తెలుగు అక్షరముల సీసపు మూసలు తయారయినట్లు ఎన్నవచ్చును.[19] 1806 వ సం॥ నుండి భారతదేశమున తెలుగు ముద్రణ ప్రారంభమాయెను [20] శ్రీరామపురము, విశాఖపట్టణములందు మిషనరీలు మతప్రచారము నిమిత్తము బైబిలు గ్రంథభాగములను, కరపత్రములను ముద్రించి ప్రకటించిరి. 1819 వ సం॥న మదరాసులో తెలుగు క్రొత్త నిబంధన బైబులు ముద్రితమాయెను. ఇదియే మదరాసున ముద్రితమయిన తొలి తెలుగు గ్రంథము [21] 1821 వ సం॥ నుండి తెలుగు ముద్రణ మద్రాసులో చురుకుగ కొనసాగెను.

శ్రీరామ పురమునందలి కేరి ముద్రణాలయమున ముద్రింపబడిన వానిలో వలపలగిలక కానవచ్చుచున్నది— "ఇదె ధమన్ పుస్తకము"[22] మద్రాసునందలి ముద్రణమునను ఈ చిహ్నమును చూడనగును— సన్మార్గన్ ము॰ శుభవతన్ మానము.[23] బ్రౌను తెలుగురంగ ప్రవేశ మొనర్చునాటికి తెలుగు ముద్రణస్థితియిట్టిది. క్రైస్తవ మతగ్రంథములు, వ్యాకరణములు, నిఘంటువులు, వాచకములు ముద్రింపబడినవి. తెలుగు కావ్యముల ముద్రణ మప్పటి కింకను ప్రారంభము కాలేదు

---

19. Ibid P. 46

20. Printing has been used among the Tamils for more than a century. Among the Telugus it commenced about the year 1806 but made little progress untill 1830" —
C. P. BROWN : Telugu English Dictionary. P. X

21. B. P. in India. P. 62

22. Ibid. P. 66

23. Ibid. P. 71

1829వ సం॥న బ్రౌను ముద్రించిన వేమన పద్యములే, తెలుగున ముద్రితమైన తొలిపద్యకావ్యము[24] 1842 లో బ్రౌనుచే ముద్రింపబడిన హరిశ్చంద్రోపాఖ్యానమున అప్పటికి ముద్రింపబడిన తెలుగు గ్రంథముల పట్టిక కలదు. టీసుచరిత్ర - టీకా సహితముగ మనుచరిత్ర, కుచేలోపాఖ్యానము, ఆంధ్రభాగవత సప్తమస్కంధము, హరిశ్చంద్ర ద్విపద, నలద్విపద, సుమతి, భాస్కర కాళహస్తి, కోదండరామ శతకములు. సారంగధర - ద్విపద, ప్రభులింగ - ద్విపద, నెల్లూరి శంకరకవి, కంచి వీరశరభయ్యల హరిశ్చంద్ర-ద్విపదలు, ఆదిపర్వములు ముద్రణకు సిద్ధమగుచున్నట్లు తెలిపెను.

ఆ సంవత్సరమందలి వర్తమాన తరంగిణిలో హంసవింశతి, వేణుగోపాల శతకము, వసుచరిత్ర, ఆంధ్రశబ్ద రత్నాకరము, ఆంధ్రనామ సంగ్రహము, హరిశ్చంద్రోపాఖ్యానము (యక్షగానము) రుక్మిణీకళ్యాణము, ప్రహ్లాదచరిత్ర (భాగవతము), కవిజనరంజనము మున్నగునవి ముద్రింపబడినట్లు ప్రకటింపబడెను.

బ్రౌను ఈ ముద్రితకావ్యముల పరిశీలించి, తెలుగు కావ్యములను సుకరముగ, స్పష్టముగ ముద్రించు విధానములను సూచించెను. ఒక పుటను సమభాగములు చేసి రెండు వరుసలుగ పద్యములను ముద్రించి, ఆయా పద్యములందలి వివరణములను, టీకలను, వ్యాఖ్యలను పుటక్రిందభాగమున నొసగుట సముచితమనియు, పాఠాంతరములను అనుబంధముగ సమకూర్చుట మేలనియు ఆతడభిప్రాయపడెను. టీకాభాగ మధికముగ నున్నయెడల పద్యములను పుటలో అడ్డముగ సగమువరకు ముద్రించి, శేషించిన అర్ధభాగములో టీకను ముద్రింపవచ్చును. సంస్కృత మూలమున్నచో తద్వివరణములను గూడ తెలుగు అనువాదమున చూపవలెను. ప్రతి కావ్యమునకు పదసూచికలను (Verbal Indexes) సమకూర్చుట అవసరమనెను. కావ్యమునందలి పదముల నన్నిటిని సేకరించుట శ్రమయని భావించిన ఎడల నిఘంటువులలో నున్నవానిని పరిహరించి తదితరములను అనుసంధించుట సముచితమనెను.[25]

ఒక పుటను రెండర్ధములుగ విభాగించి ముద్రించుటకన్న, పద్య పాదములను

---

24. No Poem or classical composition in Telugu has hitherto been printed". –"VERSES OF VEMANA" Preface. p. ii

25. P. R. T. L. P. 45

పుటకడ్డముగ ముద్రించుట సుకరమని బ్రౌను కనుగొనెను. అట్లు ముద్రించిన సీసపాదములు నాలుగు వరుసలుగ, తేటగీతి, ఆటవెలది, కందము రెండువరుసలుగ వచ్చును కాశీఖండమును తానీ పద్ధతిలో వ్రాయించినట్లు పేర్కొనెను 26 ఈ క్రమమే నేటి ముద్రణములందు అమలున నున్నది.

నేటి ముద్రిత కావ్యములందు కానవచ్చు పీఠికలు, అవతారికలు, కథా భాగములు అను విభజనము నొనర్చినవాడు బ్రౌను. Telugu poets usually compose a long preface and dedication, which they put into the first chapter. All this should be printed, and numbered seperately, under the titles of అవతారిక preface and అంకితం Dedication"27 అని బ్రౌను నుడివెను. తాను సేకరించిన అనేక తాళపత్ర ప్రతులందు ఈ అవతారికా భాగములు విడువబడినట్లును, అట్లు విడుచుట తగదనియు బ్రౌను అభిప్రాయ పడెను. ఈఅవతారికా భాగములను విడిచినచో ఎందరోకవుల, కృతిభర్తల చారిత్ర కాంశములు లోపించెడివే: ఆంధ్రులు ఇందు నిమిత్తమై బ్రౌనుకు ఎంతయో ఋణపడి యున్నారు.

ముద్రాక్షరములను గురించియు బ్రౌను అధిక పరిశ్రమ మొనర్చెను. మూడు రకములగు ముద్రాక్షరములను.—సామాన్యాక్షరములు, స్థూలాక్షరములు వక్రాక్ష రములు (Italics) తమిళమునందువలె తెలుగునను ప్రవేశపెట్టవచ్చునని తెలిపెను. శీర్షికలను స్థూలాక్షరములతో ముద్రింపవచ్చుననియు, ముఖ్య విషయములను పాఠకుని గుర్తునకు తెచ్చుటకై ఎట్టి విధానములు ముద్రణలో ఉపయోగింపనగునో అన్న విషయములను గూర్చియు వివరించెను

కొన్ని తెలుగు ముద్రాక్షరములు అచ్చుకూర్పరులకు విసుగు పుట్టించుచు తెనుగునందు అచ్చుకూర్చుట చాల శ్రమ యనిపించుకొనుచుండెను. అందు ముఖ్య ముగ రేఫముయొక్క రూపాంతరమగు అర్ధచంద్రాకారపు [U] ఱకారవడి మిక్కిలి శ్రమను కల్గించుచుండినది. దీనిని బ్రౌను సంస్కరించి "L, ౹" వంటి లిపి రూప మును తెనుగు అచ్చునందు ప్రవేశపెట్టెను. ఇట్టి రూపనిర్మాణము కూర్పరులకు

---

26. Ibid. P. 22

27. Ibid. P. 22

శ్రమను కొంత తగ్గించి, అచ్చు కూర్పు పనులు కొంత వేగముగ సాగుటకు తోడ్పడెను. నాటినుండి యీ క్రొత్తరకపు రేఫ రూపాంతరములకు "బ్రౌను రేఫ"మను ప్రసిద్ధికల్గెను.

ముద్రణమున సంధిస్థలములను నిర్దేశింపవలయునను రావిపాటి గురుమూర్తి శాస్త్రి ఆశయము ననుసరించి బ్రౌనుసంధిగల తావుల నిట్లు ముద్రింపనగునని తెలిపెను:
ఉదా :-"ఇచ్చట' నున్న నే' మనునొ; యీముని' యేమ'ని శాపమిచ్చునో ..." బ్రౌను ముద్రించిన వేమన పద్యము లిట్లేయున్నవి. తెలుగుసంఖ్య నాలుగును-'౪' ముద్రించినచో 'ర' అను అక్షరమునకు, దానికి భేదము తెలిసికొననగునని వివరించెను. ఒత్తక్షరములను స్పష్టముగ తెలిసికొనుటకై వానికి ప్రత్యేక ముద్రాక్షరములను వాడవలెననెను **"I therefore propose that the shapes should be slightly altered; making all the aspirate letters rather oblong - thus ప ఫ ద ధ ర ఠ"**[28]

తెలుగు ముద్రణలో చేయవలసిన సవరణల నన్నిటిని వివరించి, తానొక ముద్రాక్షరశాలను స్థాపింప అనుమతింపవలయునని కాలేజి సెక్రటరి సముఖమునకు బ్రౌను ఒక విజ్ఞప్తి పత్రమును 29 నవంబరు 1828 సం॥ సమర్పించెను పై అధికారులు బ్రౌను విన్నపమును మన్నింపరైరి. కాని రెండేళ్ళ తర్వాత ఆ కాలేజి యందే బ్రౌను సూచించినట్లు చిన్న తెలుగుచెపులుకల ముద్రాక్షరశాల స్థాపింపబడెను. తెలుగు ముద్రణ పురోభివృద్ధి విషయమున తాను కావించిన మార్పులు తాను ప్రచురించిన గ్రంథములందు, - అందును ప్రత్యేకించి - తన నిఘంటువులందు స్పష్టముగ కాననగుననియు, కాల కమమున ఈ ముద్రాపరిణామములకు ప్రాచుర్యము కలిగినదనియు బ్రౌను వ్రాకుచ్చెను.[29]

కాలక్రమమున తెలుగు ముద్రణమునందు గ్రంథములకు పుట సంఖ్యలు వేయుట, పుటల ఉపరి భాగములందు వరుస క్రమమున గ్రంథ నామాదులుంచుట; వాక్యాంశబిందువు ( , ), బిందువు ( . ), అర్ధబిందువు ( ; )· న్యూనబిందువు ( : ) ప్రశ్నార్థక చిహ్నము ( ? ), రాగచిహ్నము ( ! ) మున్నగు విరామ చిహ్నములను; గ్రంథపృష్ఠాధో భాగమందలి వివరణముల అధస్సూచికల (Foot notes) ను

---

**28. Ibid P. 126** **29. Ibid. P. 112**

తారకను ( * ), బాకు ( + ) మున్నగు చిహ్నముల నుపయోగించుట; గ్రంథాధ్యాయ విభాగము చేయుట, పదమధ్యమాలందు ఎడము వదలుట యను నవీనపద్ధతులు ప్రవేశ పెట్టబడి నానాటికవి విశేషముగ వాడుకలోనికి వచ్చుచుండినటుల క్రీ. శ 1860 - 1870 సం॥ లందు ముద్రింపబడిన తెలుగు గ్రంథములనుబట్టి తెలియుచున్నదని బ్రౌను దొరయే పేర్కొనెను.30

తెలుగున ముద్రణ కళను పెంపొందించి తెలుగు ముద్రాక్షర నిర్మాణ పద్ధతిలో గల లోపములను సవరించి, లిపిని సంస్కరించి ఆంధ్రభాష సర్వతో ముఖముగ నభివృద్ధిగాంచుటకు బాటను నిర్మించిన వైతాళికుడు బ్రౌను.

ప్రకరణసారాంశము :

1. బ్రౌను ఆంధ్రదేశమున అడుగిడినప్పుడు ఆంధ్రకావ్యసంచయము చెల్లా చెదరుగ నుండుటయేగాక క్రిమిదష్టమై శిథిలావస్థలో నుండెను. రాజకీయ సుస్థిరత లేనందువలన ఈ కావ్యసముద్ధరణకు పూనుకొనిన ప్రభువు లేకపోయెను. అట్టి పరిస్థితులలో బ్రౌను ఆంధ్రదేశము నలుచెరగుల నుండియేగాక ఇతర రాష్ట్రముల నుండి, విదేశముల నుండియు ఆంధ్రకావ్యములకు సంబంధించిన తాళపత్రగ్రంథము లను సముపార్జించెను.

2. ఈ తాళపత్రములను సంపాదించుటకు ఆతడెన్నియో ఇబ్బందుల నెదుర్కొనవలసి వచ్చెను. తన అధికారమును ప్రదర్శించి కొందరినుండి, ధనాశను చూపించి మరికొందరినుండి, పుస్తకములకు ప్రతిపుస్తకముల నొసగి మరికొందరి నుండి, మిత్రత్వమును నెఱపి మరికొందరి నుండి - ఇట్లనేకరీతుల- తాళపత్రములను సేకరించెను.

3. గ్రంథపాతములతో విభిన్నపాఠభేదములతో నున్న తాళపత్రములను పరిష్కరించి, సంశోధిత ప్రతులను సంతరించుటకు ఆద్యుడు బ్రౌను. అందువలననే "ఆంధ్రభాషావన పునరుస్మీలన మధుమాస వసంతుడు - చార్లెస్ ఫిలిప్ బ్రౌను". అను ప్రశంసలను బడసెను.31

---

30. Ibid P. 112

31. మరుపూరు కోదండరామిరెడ్డి : "ఆంధ్రవాఙ్మయము: వావిళ్ళ" - పు 27

4. తాళ పత్రములందు జీర్ణించి పోవుచున్న అనేక కావ్యములకు కాగితపు ప్రతులను తయారు చేయించెను.

5. కాగితపు ప్రతులను తయారు చేయునపుడు పద్యములకు పాద విభజనముచేయుట, యతి స్థానములను గుర్తించుట, పద్యములకు, వచనములకు సంఖ్యలకు నిర్దేశించుట ద్విపద పాదములను ఒకదానిక్రింద నొకటి వ్రాయుట మున్నగు పద్ధతులను ప్రవేశపెట్టినవాడు బ్రౌను

6. కావ్యముల పరిష్కరించు వైఖరిని తెలుపుటయేగాక, బ్రౌను తన ఆంధ్ర గీర్వాణచ్ఛందమున ఆ పద్ధతిలో ముద్రించి మార్గదర్శకుడయ్యెను. ఆంధ్ర పద్య కృతులలో బ్రౌను ముద్రించిన వేమన పద్యములే ప్రప్రథమ ముద్రితగ్రంథము.

7. అయా పద్యములకు వలసిన వివరణముల. టీకల సమకూర్చుటయు పాఠాంతరముల ప్రదర్శించుటయు, పదసూచికల సంతరించుటయు బ్రౌను ప్రవేశ పెట్టిన పరిష్కరణ పద్ధతులు.

8 నేటి ముద్రిత కావ్యములందు కానవచ్చు పీఠికలు, అవతారికలు, కథా భాగములు, అను విభజనమునకు మార్గదర్శకుడు బ్రౌను.

9. ముద్రణ సౌలభ్యము కొరకు అర్ధచంద్రాకారపు ఱకారవకిని (ౘ) బ్రౌను సంస్కరించి '[, ౚ' ఇట్టి రూపమును తెలుగు అచ్చునందు ప్రవేశ పెట్టెను.

10, ఈ గ్రంథ సంపాదనమునకు, పరిష్కరణమునకు, ముద్రణమునకు బ్రౌను స్వీయధనమును వెచ్చించెను. కనుక భారతీయులకు గ్రంథ పరిష్కరణ పాశ్చాత్యులు గరపిన విద్య; అది తెలుగువారికి బ్రౌను పెట్టిన భిక్ష.

ఆంధ్ర పురాణేతిహాసముల నాతడు సముద్ధరించిన విధానము తరువాతి ప్రకరణమున పరిశీలింపబడును.

---

# 3

# పురాణేతిహాసముల పునరుద్ధరణ

3. 0 పూర్వప్రకరణమున బ్రౌను మహాశయుని కావ్యసంపాదనము, పరిష్కరణమున అతడవలంబించిన పద్ధతులు కొంతవఱకు సమీప్తిగ పరామృష్టములు. ఈ ప్రకరణమున భారతాది - ఇతిహాసములను, భాగవతాది పురాణములను గూర్చి ప్రత్యేకముగ పరిశీలింపబడును.

మ. ప్రా. పు. భాండాగారమున 45 పురాణేతిహాసములకు తాళపత్రప్రతులు, కాగితపుప్రతులున్నవి ఈ తాళపత్రప్రతులను సేకరించినవారు ఎవరనునది ఇదమిత్థముగ తెలియదు. కాన తాళపత్రప్రతులిట గ్రహింపలేదు. శేషించిన కాగితపు ప్రతులలో బ్రౌను 26 పురాణేతిహాసములను సేకరించినట్లు తెలియుచున్నది. వీనిలో 25 కావ్యములకు (కేవలము) కాగితపుప్రతులను యథామాత్రకముగ వ్రాయించెను. వానికి పాఠాంతరములను గుర్తింపలేదు. 7 కావ్యములకు (కాశీఖండము, పద్మపురాణము, భాగవతము, భారతము, భాస్కరరామాయణము, విష్ణుపురాణము, శ్రీకాళహస్తిమాహాత్మ్యము.) పాఠనిర్ణయములను చేయించి, శుద్ధప్రతులను వ్రాయించెను 4 కావ్యములకు (ఉత్తరరామాయణము (తిక్కన, ఉత్తరరామాయణము (కంకంటి పాపరాజు), స్కాందపురాణము, హరివంశము) పాఠభేదములను గుర్తించెను. ఈ 11 గ్రంథములలో ఒక్క స్కాందపురాణము తప్ప తక్కినవి ఈ ప్రకరణమున ప్రస్తావితములు. తదితరముల వివరములు అనుబంధమున అనుసంధింపబడినవి.

ఈ పురాణేతిహాసములు కొన్నింటికి పరిష్కరణ కాలములు తెలియవు కాన కాలము తెలిసినవి మొదట అజ్ఞాత కాలికములు ఆయా కృతికర్తల కాలాదిక్రమమునను గ్రహింపబడినవి.

## 3. 1. విష్ణు పురాణము :

3. 1. 0. బ్రౌను దొరను ఆకర్షించిన ఆంధ్రగ్రంథములలో వెన్నెలకంటి సూరన విరచితమగు విష్ణుపురాణమొకటి. పురాణములు ప్రబంధములవలెకాక భాషా ప్రారంభకులగు విదేశీయులకు సులభగ్రాహ్యమగు సరళశైలిలో నున్నవని బ్రౌను అభిప్రాయము.[1]

---

1. "First the easy books that require no scholicism such as the Puranas & Bhagavata," — D. 312. విష్ణుపురాణము సంపు. 1

3. 1. 1 మ. ప్రా. పు భాండాగారమున విష్ణుపురాణ - కాగితపు - ప్రతులు 4 కలవు. (D. 311-314) D. 311 కాగితపు ప్రతిలో, Canotes 1, 2, 3, 4, 5, 7 & 8. The 6 th is missing. All in a confusion". అని బ్రౌను వ్రాసెను. ఇది అప్పటి విష్ణుపురాణస్థితిని తెలుపుచున్నది చెంచయ్య, బుచ్చయ్య అను నిరువురు పండితులీ పరిష్కరణమున బ్రౌనుకు తోడ్పడిరి. వీరేకాక కృష్ణయ్య అనునతడును ఈ పరిష్కరణములో సహకరించెను. జూలూరి అప్పయ్య పండితుడుకూడ ఈ పరిష్కరణ కార్యమున సంప్రతింపబడినట్లు తోచును

బ్రౌను మద్రాసు కాలేజి లైబ్రరిలో నున్న తాళపత్ర ప్రతిని కాగితములపై వ్రాయించి, ఆ కాగితపు ప్రతిని పరిశీలించెను. దానిని ఇతరప్రతులతో పోల్చుట అత్యంతావశ్యకమనియు, ముగ్గురు పండితులు పాఠముల సవరించియున్నను కొన్ని ఘట్టములు సందిగ్ధముగ నున్నవనియు బ్రౌను పేర్కొనెను.[2]

ఒక రూపాయకు 200 పద్యముల చొప్పున ఇందలి 3217 పద్యములను రూ 32 -కి వ్రాయించెను. ఈ ప్రతిని వ్రాయించుటకు వలసిన కాగితములవెల, బైండింగు ఖర్చులు, సవరించిన పండితుల జీతము మున్నగునవి భరించుటేకాక బ్రౌను స్వయముగ పాటుపడవలసి వచ్చెను.[3]

3 1. 2. క్రీ. శ 1825వ సం॥న అతడు విష్ణుపురాణ పరిశీలనకుపక్రమించెను [4] తన విష్ణుపురాణప్రతి నెవరో అపహరించుటచే తాను మరొకప్రతిని

---

2. "The Vishnu Purana in Telugu. Transcribed from a manuscript in the Telugu Library of the Madras college a comparison with other mss. is absolutely necessary: but I have perused whole and obtained the corrections of three learned pandits. Few passages now remain in doubt". (D. 312 I Vol.)

3. I had this copy made at the rate of two hundred verses for a rupee - but when the cost of stationary, binding, the salary of a correcting pandit, and other charges are considered, the cost proves at least double that sum. To all which was added my own labour.

   This purana consists of 3217 verses and the cost has been (if thus calculated) only about 32 Rs!" [Ibid]

4. "I perused the vishnupuranam in Telugu very carefully in 1825" — D 313 సంపు. 2

సంపాదించి, తన అధ్యయనమును కొనసాగించినట్లు బ్రౌను తెలిపెను[5] 1826 వ సం॥ మే 15 వ తేది నాటికి ఈ పురాణాధ్యయనములో మూడవ అశ్వాసమును పూర్తి చేసెను.[6] విదేశీయులకు తెలియునట్లు పురాణమననేమో బ్రౌను నిర్వచించెను[7] విష్ణు పురాణమందలి విషయమును వివరించెను[8]

ఈ విష్ణుపురాణాధ్యయనమును బ్రౌను అతిశ్రద్ధతో నొనర్చినట్లు వ్యక్తమగును. విష్ణు పురాణము మనోజ్ఞమైన శైలిలో రచింపబడినదనియు, అందలి కొన్ని భాగములు భాషా ప్రారంభకుల కనువుగా నుండుననియు ఆతడు తెలిపెను.[9] అభ్యాసకుల కుపయోగకరముగ నుండునట్లందలి అనేక పద్యముల భావమును ఆంగ్లములోని కనువదించెను. ఉదా :-

వేద విక్రయులును వేదదూషకులు న
గమ్యగాములైన కష్టమతులు

---

5. "But my own copy of this volume was stolen from me – and I therefore had the present copy prepared from the best manuscripts I could get. The numbering of the verses is erraneous – and I have in the margin supplied the better numeration : adjusting if according to the citations which I had already made in my *D*ictionary". (Ibid)

6 D. 312 పు. 59

7. Puranam or chronicle denotes a fable, or poem like Ovid's Metamorphoses : describing the four ages of the world, called Crita, Treta, Dwapara and Cali; or gold, silver, brazen, and iron. — Brown C. P.
Es' on Tel Lit. Para. 27 F. N.

8. Vishnupooranum – or, This contains several Histories of the prince of the soorya and chandra races and an ancient Hindoo Geographical treatise as well as several other tracts relating to the History and revolutions of former ages, it is one of the Voopah or subordinate Pooranums of Vyasah translated from Sanscrit into Tellinga". — D. 311

9. *D*. 312 సంపు 1.

బోయి లవణనరకమున గూలియుండుదు
ర
లధిక పాపకములైలై మునీంద్ర
— బ్రా ప్ర 3-132 ము. ప్ర 3-117

"Those who sell the vedas, or who revile the vedas, and incestuous wretches shall fall into the saline hell being the greatest of offenders." కొన్ని పద్యములను బ్రౌను ఆంగ్లములోనికి పద్య రూపముగ అనువదించెను. (చూ అనుబంధము) బ్రౌను విష్ణుపురాణము నించు మించుగ ఆంగ్లీకరించెననియే చెప్పనగును.
కొన్ని పద్యములకు తెలుగు తాత్పర్యమును సంతరించెను. **ఉదా :**

ఉ॥ "ఆగ్రహ మాత్మలో బొడమునట్లుగ తండ్రినవారణంబ య
త్యుగ్రనిశాచరప్రతతు లుగ్గడించుట జెప్పి నిగ్రహా
నుగ్రహశక్తి గల్గిన ఘనుండవు నీవు జనించి రాక్షసో
ద్రగబలంబు మాన్పమి వృథాయని పల్కెయనేక భంగులన్"
బ్రా. ప్ర. 1-16 ము ప్ర 1-13

"నా మనసులో కోపం వచ్చేటట్టుగా, నా తల్లి నాతో చెప్పిందిగదా, నీ తండ్రిని నిర్నిమిత్తంగా మిక్కిలి వుగ్రులయ్ను రాక్షసుల సమోహాల చంపినవి! నీవు వారిని చంపేవాడవే! నీవున్ను కాపాడి వాడవై పుట్టి, రాక్షసులయొక్క ఆధికమైన బలంబును మాన్పించకపోయినా వ్యర్థమగును నీపుట్టుక ......... యిట్లాపలికి అనేకమాళ్ళు చెప్పెను". **(D. 312. I. Vol.)**

బ్రౌను పండితుల సంప్రతించి, తనకు కలిగిన సందేహముల నివృత్తియొనర్చుకొనెడివాడు. **ఉదా:—**

తే॥ నీవు చెప్పిన వన్నియు నిశ్చయాదన్
యుక్తులగు సోహమను మాట యొక్కటియును
... ... ... ... ..."
బ్రా. ప్ర. 3-385 ము ప్ర. 3-307

అను పద్యమునకు ఎదురుగా బ్రౌను **Explain me this 'Soham'** అని గుర్తించుకొనెను.

కొన్ని పద్యములకు బ్రౌను తెలుగులో వివరణము వ్రాసెను.

౧ ౨ ౩ ౪ ౫ ౬ ౭
ఉదా : "రావణ కుంభకర్ణుల శిరంబులు ఘోర నిశాతతీవ్ర బా
౮ ౯ ౧౦
ణావలి పాలుచేసి యనలాచున్ల బావనియైన జానకీ
౧౧ ౧౨ ౧౩ ౧౪ ౧౫
దేవి నశేష దేవగణ దివ్యముని స్తవనీయ్య శీలి స
౧౬ ౧౭ ౧౮
ద్భావ మెలపన్గైకొని యపారకృపామహిమాబ్ధి రాముడై"

వ్రా. ప్ర. 5-228 ము. ప్ర. 3-326

"౧ పేరు ౨ పేరు ౩ తలలను ౪ భయంకర ౫ వాడియైన ౬ వేగమయ్ని ౭ బాణాలకు యప్పగించి ౮ అగ్నిచేత ౯ పవిత్రమైన ౧౦ సీతాదేవిని ౧౧ సమస్త దేవతా సమోహము ౧౨ గొప్పమునుల ౧౩ స్తుతియోగ్యమైన ౧౪ ఆచారముకల్గినదై ౧౫ మంచిమనసుతో ౧౬ వొప్పంగ పుచ్చుకొని ౧౭ అంతంలేని దయచేత ౧౮ వొప్పెవాడై"

3. 1. 3 హైందవ సంప్రదాయముల సాకల్యముగ నెఱుంగుటకు బ్రౌను ప్రయత్నించెను "లఘువుచ్చరించుకాలము నిమిషము" (వ్రా. ప్ర. 1-60 ము. (ప్ర. 1-63) అను పద్యమునకు వివరణము వ్రాసికొనెను.

ఈ పురాణమున ఆతడు మెచ్చిన పద్యములీ క్రిందివి :-

"యేనుగ చిట్టకంబులకు నెంతయు మెచ్చె సురాధి నాథుడొ" (వ్రా. ప్ర. 1-139. ము. ప్ర 1-140) అనుపద్యమును "Beautiful Telugu style" అని కొడుకు కన్నుల బాష్పముల్ దుడిచితల్లి" (వ్రా ప్ర. 2-16 ము. ప్ర. 2-17) అను పద్యమును "a beautiful verse" అని "జుంన్నులు గల యదవుల మహి" (వ్రా. ప్ర. 2-156 ము. ప్ర. 2-146) అను పద్యమును "a beautiful verse" అని ప్రశంసించెను.

3. 1. 4. ఏ కావ్యమును పఠించినను బ్రౌను తన నిఘంటు నిర్మాణమునకు ఆవశ్యకమగు పదములను గుర్తించుకొనుట పరిపాటి. ఈ విష్ణుపురాణమునందును

అట్లే గుర్తించుకొనెను ఉదా :- ముయ్యంచు, భ్రమరములికి, వపు, సుమాళించు. కలక మొ॥

ఈ పురాణమును బ్రౌను చక్షురక్షర సంయోగముగ చదివినట్లు ఆతడు ప్రతి పద్య భావమును గూర్చి చేసిన విమర్శవలన తెలియును. దీనిని ఇతర పురాణములతో పోల్చియు, సంస్కృత విష్ణు పురాణముతో సంప్రతించియు పరిష్కరించెను. ఉదా :-

తే॥ త్వష్ట చనుదెంచి లోకబాంధవుఁ గాంచి
దేవి సౌంజ్ఞ విధంబెల్ల తెలియ జెప్పి
యతని తీవ్ర మయూఖ సహస్రకమున,
నెనిమిదవ పాలు కరసాన దునియ బట్టి

—వ్రా. ప్ర. 4-40. ము ప్ర 4-39.

అను పద్యమునకు బ్రౌను

**"Viswakarma (Twashta) came and seeing surya and told surya (his son-in-law) the grief his wife had suffered - and a punishment deprived him of one eighth part of his beams which he ground down into weapony and restored the wife to her husband"** అని ఆంగ్లములో భావము వ్రాసి, క్రింద **N. B : I observe the Marcandeya Purna book 5 verse 329 says 1/16 not 1/8 of his beams."** అని గుర్తించుకొనెను.

పాఠ పరిష్కరణమున బ్రౌను పండితుల సాహాయ్యమును గ్రహించినను, ఆతడే స్వయముగ నెంతటి శ్రద్ధ వహించెననుటను ఈ క్రింది యుదాహరణములు తెలుపును :

1. క॥ "అంభోరుహ గర్భున్డు పటు
గాంభీర్య ప్రాభవంబును గలిగిన వానిన్"

వ్రా. ప్ర 1-112. ము. ప్ర 1-113

పై కంద పద్యము 2-వ పాదమున ఒక అక్షర మధికము దీనిని "గాంభీర్య ప్రాభవంబు గలిగిన వానిన్" అని సవరించి బ్రౌను, **"This is my correction and Chensia lauds it."** అని వ్రాసెను.

2. హిమగిరికిని మేనకకును
క్రమదంబున బుట్టినట్టి పరమేశ్వరియా
విమలశక్తి గౌరి పతి యై
యమరెను భూమి యష్టమూర్తియగు రుద్రునకున్.

ప్రా ప్ర. 1-122 ము ప్ర 1-123.

'Read సతి' అని బ్రౌను హెచ్చరిక. వావిళ్ళవారి ముద్రిత ప్రతి యందును 'సతి' యనియే యున్నది

3. సీ॥ చారు సహస్ర మ సక విభూషణమణి ఛాయలు దిక్కులసందడింప
దివ్యహాలామదోద్రేక ఘూర్ణన్నేత్ర తారకాచయములు దారలీల
నానాకిరీట విన్యస్త ప్రసూన సౌరభము లొంటొంటితోరాయడింప
శరదభ్ర శుభ్రసిత్పలదేహవిస్ఫుర ద్ధాళధళ్యములు చిత్తరములాడ

తే॥ నిబిడ కటితటి ఘటిత వినీలి మాంశ్స
కంబు దిక్కుల జిమ్మ జీకట్లు గ్రమ్మ
శేషు డత్యంత భాషా విశేషు డగుచు,
భూరిభూమండలంబెల్ల బూని యుంతు

ప్రా. ప్ర 3-113, 114 ము. ప్ర. 3-100

"read హాలా for హారా" అని బ్రౌను సవరణ.

'హాలా' అనగా మద్యము. సందర్భమును బట్టి మద్యము అను అర్థమే అర్థవంతము. కావున బ్రౌను సవరణమెంతయు ప్రశంశనీయము. ఇట్టి పాఠమె వావిళ్ళ ముద్రిత ప్రతియందును కలదు.

4. చ॥ "అమరగురుండు దేవపతి యాగము సాంగ్గముగా నొనచిన్సం
భ్రమమున నెల్లవారు బహుమానము శేయగవెడ్కతో నిజా
శ్రమమున కేగుదెంచి వ్యభిచారితనంబున జెంద్రువెంట మా
వోవుటకు మోసి నిరంతర దుఃఖ యురోయుచు
రు మసువు దారబోవుట గ్రమంబున నెంతయు దుఃఖితాత్మడై"

ప్రా. ప్ర. 6-33 ము. ప్ర. 6-34

ఇట నాల్గవ పాదమున యతిభంగమును సవరించుటకు చెంచయ్య 'యురోయుచు' అను పాఠమును గ్రహింపదగుననెను.

'మా/రు మనువు దారబోవుటయు రోయుచు సంతయు దుఃఖితాత్ముడై'

కాని బుచ్చయ్య 'హా/ర్ మనువుకు దారబోవుట గ్రమంబున నెంతయు దుఃఖితాత్ముడై' అను పాఠమును సూచించెను.

ఈ పాఠమును గ్రహించిన ప్రాసభంగము కలుగును. ఇట ఈ పండితు లిరువురకు ఈ విషయమున వాగ్వాదము జరిగినట్లు బ్రౌను వ్రాతవలన తెలియు చున్నది. 'మ' కారమునకు 'న'కారముతోడి ప్రాసకవి స్వాతంత్ర్యముగ (Poetical license) బుచ్చయ్య వాదించెనట 10

నేటి ముద్రిత పాఠము :

"మా/రు మనువు తార వోవుటయు రోసి నిరంతర దుఃఖితాత్ముడై"

5. క॥ చనుదెంచు చున్న సమయం
బున నొక రజకుండు మణుగు బుట్టంబులు గం
గుని నగరికి గొనిపోవగ
కనుగొని వస్త్రములు దమకు గట్టగ నడిగెన్
(గ / స)

(వ్రా. ప్ర. 7-437. ము. ప్ర 7-377)

"మడుగు "seems a more probable reading" అని బ్రౌను సవరణ.
'మడుగు' నకు 'మణుగు' అనునది రూపాంతరము.

కాని 'మడుగు పుట్టములు' అనునదియే ప్రచురముగ వ్యవహారమున నున్నది కావున బ్రౌను స్పష్టప్రతిపత్తి కొరకు 'మడుగు' పాఠమును గ్రహించుట సముచిత మని అభిప్రాయపడెను.

6. క॥ "అందందు గ్రీష్మపక్షము
నందు గళాశేషమా సుధాంశుములగు న
య్యుందు కళలు పదియేనును
బృందారకకోటిచేత బీతయగు జుమీ."

వ్రా ప్ర 3 251 ము॰ ప్ర 3-220

10. *D.* 313 సంపు. 1. పు. 80.

"Here the meter is out - Buchaia was at a loss-it occured to me that 'అందందు గ్రీష్మపక్షము' is the true text - and he applauds the correction - any other". అని బ్రౌను సవరణ. 'అందంద గ్రీష్మపక్షము', 'అందందు గ్రీష్మపక్షము' అను ఈ యుభయ పాఠములలోను నెట్టి గణభంగమును కానరాదు. మరి బ్రౌను అభిప్రాయమేమో? బ్రౌను పేర్కొనలేదు. కాని ఇందు ప్రథమపాదము నందుండవలసినది 'గ్రీష్మపక్షము' కాదు. కృష్ణపక్షము.

పండితుల పర్యవేక్షణకే వదలి, పట్టించుకొనకుండుట బ్రౌను స్వభావము కాదు. కంటవత్తికొని, పరిష్కరణ కార్యమును అంతర్వీక్షచేయుట అతని శ్రద్ధాసక్తులకు నిదర్శనము. ఉదా :

1. వ. "కాలకేయ పౌలోములన నసువదేవురు బుట్టిరి

విప్రజిత్తికి × శకియు" బ్రా ప్ర 2-256 ము ప్ర 2-336

అను వచనమున కెదురుగా బ్రౌను

"× యను వానికి సింహికయందు శల్యుండును నాభుండును వాతాపియు యిల్వలుండును ఘస్మమస్తకుండును నందకుండును, నరకుండును వక్రయోధియు ననంబుట్టిరి మరియు తారయనుదానికి శకియును all this the copyist has by a blunder omitted" అని వ్రాసి తన శ్రద్ధాసక్తులను వ్యక్తము చేసెను.

2 "విమల కర్మ గోచరములైన ఫలములు
బుద్బుదముల వోలె బుట్టునణఁగు
దేశకాలముల కధీనంబులైనవి
తత్వమనుచు జెప్పదగుటయెట్లు"

బ్రా. ప్ర. 3-364. ము. ప్ర. 3-335

"Here the metre shews some blunder- The rhyme is gone-Buchaia, who did not perceive the error till I suggested it thinks the poet himself comitted it" అని బ్రౌను వివరణ ఇందు ఛందోభంగ మేమాత్రము లేదు. అర్థభంగము కలదు 'బుద్బుద' మనుటకు 'బుష్పద' మనుట లేఖకుని పొరపాటు కానోపును.

ప్రతి కావ్యమును చదువునపుడు తన భాషాజ్ఞానమును సంవర్ధిత మొనర్చుకొనుటయేకాక, వ్యాకరణాంశములను కూడ గుర్తించెడివాడు. ఉదా:

ఉ॥ కొందరు పుణ్యవంతులును గొందరు కేవల పాపకర్ములున్
కొందరు రాజులుంభటులు కొందఱు కొందరు మాననీయులున్
కొందరు సంపదున్నతులు కొందరు పేదలనైన యట్లుగా
నందర నన్ని చందముల నబ్జభవుండు సృజించు మర్త్యులన్
బ్రా. ప్ర 1-97 ము ప్ర 1-99

అను పద్యమున చివరి పాదమున కెదురుగా "a good specimen of the accusative form" అని నిర్దేశించెను.

2 క॥ ఉత్తాన పాదు డెక్కిన
యుత్తమ శింహాసనమున నుండ ఁగిన వా
డుత్తము డు వీని కంటెను
నుత్తము డగుదేసి నీవు నుండుము వేడ్కన్.
బ్రా. ప్ర. 2-13. ము. ప్ర. 2-14.

అను పద్యము నొద్ద "Observe the comparative" అని సూచనము.

3. మొదలన్ బీజము గల్గియుండగ గదా మోసెత్తి మూలంబుతో
విదిత స్కంధము మించి కొమ్మల గడున్ విస్తారమై పత్ర సం
పద నేపారు సుమంబులన్ ఫలములన్ భాసిల్లు వృక్షంబునం
దుదయంబంగి మహిన్ దరుల్వనముల యొప్పారు చందంబునన్"
బ్రా. ప్ర. 3-172, ము ప్ర. 3-152

"Perhaps ఏపార (not రు) is the best reading" అని బ్రౌను సవరణ.

'ఏపారు' అను పాఠము సుమంబులకు విశేషణమై అర్థానుగుణము కాకపోవు చున్నది. కావున బ్రౌను గ్రహించిన 'ఏపార' అను అన్వంత పాఠమే గ్రహణీయము.

4. తే॥ ఇంతసేసిన దుష్టాత్ముని పుడ పట్టి
సంహరించి శమంతక చారు రత్న
మపహరించినఁ బగయెల్ల నణఁగిపోవు
ననిన శతధన్వుఁడగుఁగాక యనుచు నుండె
బ్రా. ప్ర 6-289. ము. ప్ర. 6-277

అను పద్యమున నొద్ద "Note యిపుడ for యిపుడు" అని నవరించి, ఎదుటిపుటలో ipuda for ippudu – The U is changed into A to denote emphasis– యిపుడు is Now, యిపుడ is immediately" అని వివరించెను.

5 చ॥ అదె ధరణీ పరాగము భయంకరమై వినువీథి బర్వుచు
న్నది పరికించి చూడు డి యనాథజనంబుల దీనగాథముల్
మొదలి వినంగ వచ్చె మునిపుంగవు లందరువచ్చి యిట్టి యా
పద లుడిగింపరే యనుచు ప్రార్థనఁజేసి రనేక భంగులన్

ప్రా. ప. 2-140 ము. ప్ర. 2-131.

అను పద్యమున కెపకగా "A fine verse for Imperatives" అనియు బ్రౌను గుర్తించుకొనెను

ఆయాపట్టులందుగల విశేషవృత్తముల లక్షణములను అపరిచితుల కుపయోగకరముగ వివరించెను. ఉదా :

I U I I I U I U I+I I U I U U I U yati 12

పృథ్వీ॥ అమంద గుణరాజితా హరి పదాబ్జ సంపూజితా
\+
సమస్త శుభలక్షణా సకల బంధ సంరక్షణా
\+
సమగ్ర విభవాకరా సమద శత్రురాడ్భీకరా
\+
అమానుష పరాక్రమా అఖిల దుష్క్రియాపక్రమా

ప్రా. ప్ర. 1-225 ము ప్ర. 1

అను పద్యముకడ "This is the Prithvi metre - in which Bhima fixes the yati on the 12 th syll : but herein it is on the 9th." అని పృథ్వీ వృత్తలక్షణమును వివరించెను [11]

---

11. పృథ్వీకి సంస్కృతములో 9 వ అక్షరము యతి భీమనాది తెలుగు ఛందః కర్తలందరు దీనికి 12 వ అక్షరము యతిగ నియమించిరి తెలుగు ప్రబంధములలో ఉభయమతములు కలవు.

బ్రౌను విష్ణుపురాణ పఠనము కాపించు సమయమున ఛందోవ్యతిక్రమములను స్వయముగ గుర్తించెను. ఉదా :-

సీ॥ వెలమితో దుగాన్ ధ్వజతు లొండురుల తోడ
బోరాడి తమలోన బొలిశి చనిరి.

బ్రా ప్ర. 2-131. ము. ప్ర. 2-123

"NB :- The rhyme is wrong - వెలమి I suppose is an error for బలము - యతి భంగం" అని బ్రౌను సవరణ. 'బలిమి' అను ముద్రిత పాఠము రమ్యము.

పాఠకులకు విషయావబోధమగునట్లు ద్వితీయాశ్వాసమునకు మాత్రము విషసూచిక నొసగెను.[12]

ఇట్లు వ్యయ ప్రయాసముల కోర్చి సవరించిన ప్రతియు బ్రౌనునకు సంతృప్తిని కలిగింపలేదు 15 - ఏండ్ల తర్వాత 'మెకంజీ దొర సేకరణము' లోని ప్రతితో దీనిని మరలా పోల్చి పాఠాంతరముల గుర్తించి యుండుట అతని నిర్విరామ పరిశ్రమకు తార్కాణము.[13]

**3. 2. భాగవతము :**

భారత, భాగవత, రామాయణములు భారతీయ సంస్కృతికి పట్టుగొమ్మలు. బ్రౌను ఈ మూటి సముద్ధరణమున నెంతో శ్రద్ధవహించెను.

మ. ప్రా పు భాండాగారమున భాగవత కాగితపు ప్రతులు 30 తాళపత్ర ప్రతులు 72 కలవు. ఇవన్నియు సంపూర్ణ భాగవత ప్రతులుకావు. ఆయా ప్రతులందు కొన్ని స్కంధములు మాత్రమున్నవి. వీనిలో కొన్ని క్రిమిదష్టములై శిథిలావస్థలోనున్నవి. ఈ ముప్పది కాగితపు ప్రతులును బ్రౌనుదొరచే వ్రాయింపబడినవి.

---

12. D. 312. సంపు. I పు. 133.

13. I have collated this copy and recorded all those deviations which occured in the two last book - The rest are of less conseguence. They are sadly imperfect. C. P BROWN. 1840" (D. 311)

D 36, 45, 47, 48, 49 ... ప్రథమస్కంధము
D 36, 50 ... ... ...ద్వితీయ స్కంధము
D 45, 54, 55 ... ... తృతీయ స్కంధము
D 57, 58 ... ... చతుర్థస్కంధము
D 37, 50, 65 ... ... పంచమము
D 37, 65, 66 ... ... షష్ఠము
D 36, 77, 117 ... ... సప్తమము
D 79, 80 81 ... ... అష్టమము
D 87 88, 90 ... ... నవమము
D 93, 96, 100, 103 ... దశమస్కంధ పూర్వభాగము
D 107, 108, 110, 113... దశమస్కంధ – ఉత్తరభాగము
D 36, 45, 93 ... ... ఏకాదశము
D 36, 66, 93 ... ... ద్వాదశస్కంధములు కలవు.

వీనిలో కొన్ని చిత్తుప్రతులు, కొన్ని సాపు ప్రతులు

D 36, 47, 48 – ప్రథమ స్కంధము పాఠాంతరములు గుర్తించిన ప్రతులు.

D 36 – ద్వితీయ స్కంధము పాఠాంతరములు గుర్తించిన ప్రతి. D 54, 55 తృతీయ స్కంధమునకు; D 57 చతుర్థ స్కంధమునకు; 37, 63 పంచమ స్కంధమునకు; 37, 65 – షష్ఠస్కంధమునకు; 36, 77, 113 సప్తమము; 79, 81 అష్టమము; 87, 88 నవమము; 90, 108 దశమస్కంధ పూర్వోత్తర భాగములు; 36, 93 ఏకాదశ; 36, 93 ద్వాదశ స్కంధములకు పాఠాంతరములు గుర్తించిన ప్రతులు.

D 45 ప్రథమ, తృతీయ ఏకాదశ స్కంధము, 96 దశమస్కంధ పూర్వ భాగమునకు తయారు చేయించిన సాపు ప్రతులు.

D 45 కాగితపు ప్రతి ప్రతిపుట పై భాగమున "బ్రౌన్ దొరగారు దిద్దించిన గ్రంథము" అని వ్రాయబడెను. ప్రథమ స్కంధమును శిద్దవటం అచ్చిమొకాబిలా చూచెను. చెంచ్చయ "రుజువు" చేసెను. పంచమ స్కంధమును బోయిన్నపల్లె చంచ్చయ్య అల్లుడు కోనప్ప "మొకాబిలా" చూచి చేవ్రాలు చేసెను. భాగవత

పరిష్కరణకు 11 తా ప్రతులను పోగు చేసినట్లు బ్రౌను తన తెలుగు సాహిత్యమును గూర్చిన వ్యాసమందు పేర్కొనెను.[1]

భాగవత నిర్దుష్ట పాఠ నిర్ణయములో బ్రౌనునకు తోడ్పడిన పండితు లెవ్వరనునది తెలియవచ్చుట లేదు. తెలుగు భాగవత భాగములకు సరియైన సంస్కృత భాగవత - అధ్యాయములు గుర్తింపబడినవి. "The fifth book was written by Ganganna" అని బ్రౌను వివరీకరించెను.

3. 2. 1 భాగవత స్కంధములలో బ్రౌను సప్తమ స్కంధమును ప్రప్రథమముగ పరిష్కరించి 1840 వ సం॥లో ముద్రింపించెను. సప్తమ స్కంధమున ప్రహ్లాద చరిత్ర ప్రధానము. ఆ కాలమందు బాలురకిది పాఠ్యభాగముగ నుండి విశేష ప్రచారమున నుండియుండును. కనుక బ్రౌను మొట్టమొదట ఆ స్కంధమును చేపట్టియుండును "This is a very poor manuscript of the seventh book of the Bhagavat - which has been printed at Madras, 1840 - C. P BROWN" అని తెలిపెను. (D 117) బ్రౌను 1843 సం॥లో ముద్రించి ప్రకటించిన ద్విపద హరిశ్చంద్ర గ్రంథాదిలో ఆతడు ప్రకటించిన తెలుగు గ్రంథముల పట్టికలో భాగవత సప్తమ స్కంధము పేర్కొనబడెను బ్రౌను స్వీయచరిత్ర (1866) యందును తాను భాగవతమును ముద్రించినట్లు తెలిపెను. కాన శ్రీ మదాంధ్ర మహాభాగవతమున నొక భాగమైన సప్తమ స్కంధమును తొట్టతొలుత ముద్రించిన కీర్తి బ్రౌను దొరకే చెందును.

క్రీ. శ. 1827-వ సం॥న బ్రౌను స్వీయ ధనమును వెచ్చించి భాగవతమును సంపూర్ణముగ పరిష్కరించెను. "A corrected edition was prepared of my expense in the year 1827"[2]

బ్రౌను పరిష్కరింపజేసిన ఈ భాగవతమునే హయ గీవశాస్త్రి కీలకనామ సంవత్సరము 1770 అనగా క్రీ శ. 1848-వ సం॥న ముద్రించినట్లాధారములు కలవు "The Telugu *B*hagavat was printed in quarto at Madras in the year kilaca 1770 that is A, *D*. 1848".[3]

---

1. Es. on Tel Lit. Para 67.
2. Telugu English Dictionary - C. P. BROWN. 1852. p. viii.
3. Ibid

హయగ్రీవశాస్త్రి 1860 -వ సం॥న ఏప్రిల్ 10 వ తేదిన బ్రౌను దొరకు వ్రాసిన లేఖలో "ఈ నెల 20 తారీఖున ఆఫీసు యేర్పరచేలాగున నిశ్చయిస్తిని గనుక తమ్ము వేడడమేమంటే ఈ క్రింది వ్రాశే పుస్తకములను దయచేసి నాకు అచ్చువేశాలాగున యిప్పించి సహాయము శేయవలెను

ప్రకృతమందు కావలసిన పుస్తకాలు తారాశశాంకము కుచేలోపాఖ్యానము సారంగధరచరిత్ర - మైరావణచరిత్ర - సుభద్రాపరిణయము - రాధికాసాంత్వనము - రాఘవపాండవీయ్యము సవ్యాఖ్యానము - మనుచరిత్ర సవ్యాఖ్యానము తెలుగు పద్యములో కూడా వుండే ఇంగ్లీషు వృత్తములు శతకములున్ను కొద్దిరోజులకు పిమ్మట కావలసిన పుస్తకములు భారతము యుద్ధపంచకము రంగనాథరామాయణము - తెలుగు భాగవతము హరిశ్చంద్రనలోపాఖ్యానము సవ్యాఖ్యానము[4] అని ఉండుటచే బ్రౌను పరిష్కరింపజేసిన భాగవతమును హయగ్రీవశాస్త్రి తీసికొని ముద్రించి యుండునను విషయము స్పష్టము.

3. 2. 2. భాగవత సంస్కరణ సందర్భములో బ్రౌను కొన్ని తెనుగు పదములకు అర్థములను, పద్యములకు భావములను, ప్రధాన విషయసూచనలను ఆంగ్లములో వ్రాసెను.

1. తెలుగు పదముల కర్థములు :

ఉదా : చారు = fairly, గొబ్బున = quickly, కందువొందని చందురున్ = like the moon free from stain.

2. పద్య భావాంగ్లీకరణము :

మింట్టన్ మ్రోశిన మ్రోత రాలిమిసిలో మెట్టింప మేద్రింప మున్నీవు నా
యిట్టంన్ బుట్టెదవంచు కంసుడు దొడిన్ హింశింసె నీయన్నలన్
గంట్టన్ కూరుకుదేన్నడు; నీ యుదయ మీకారాజనుల్ చెప్పగా
బంట్టింపన్ యెదురేగుదెంచు వడినీపైనేడు సన్నద్ధుడై

వ్రా. ప్ర. ద. స్క. పూ. బా. 177 ము.ప్ర 123

4. Sr of Lts. M. 401. Lt. No. 155. PP. 297-299.

"The voice that sounded on heaven shakes stead - fastness of Camsa, with dread that thou shouldst born in my house, and suddenly he slew thy brothers. He gave no sleep to his eye when the men of this dungeon reported thy birth; he will come against thee to slay thee this day arming with speed"

3. పద్యములకు ప్రధాన విషయసూచన :

"నీకుం దేవకికిన్ జనించిన సుతానీకంబు దోర్దోదము"

ప్రా. ప్ర ద స్క. పూ.భా. 201 ము. ప్ర. 207

అను పద్యమున కెదురుగా "exchange of infants to Nandu and warned him of coming evil" అనియు, "కరకోమలారుణ కాంతి" (ప్రా. ప్ర. ద. స్క. పూ. భా. 342. ము. ప్ర. 354) అను పద్యమునకు ప్రక్కన 'Picture of Yasodha while churning" అనియు బ్రౌను వ్రాసెను

తన నిఘంటు నిర్మాణమున కుపయుక్తములగు పదములను 'n' (Noun) 'v' (verb) అను సంకేతములతో గుర్తించెను. కొన్ని పదములకు ఎదురుగా "Insert in *D*ict" అని సూచించెను.

ఉదా :- 'మా బిడ్డ బు (జ) లక (V) మాడగ' (ప్రా. ప్ర. ద. పూ. భా. 309 ము. ప్ర 315)

దీనిని బట్టి అతడాది నుండి తెలుగు నిఘంటు నిర్మాణమున దృష్టి కలిగి యున్నట్లు తెల్లమగును.

5. పద్యములందు యతి ప్రాస భంగమున్న చోటులను పేర్కొనెను :

ఉదా : తె॥ కౌను నులియంగ కంకిణ క్వణన మెసగ
రంగ
× [తురుము వీ+డగ కనిన్ కాద్యుతులు మెరయ]
బాలు నంక్కించి పాడుచు బాటవాడ
దరువు లిగురొత్త పెరుగింతి దరువ బొచ్చె.

ద. స్క. పూ. భా. ప్రా. ప్ర. 343-ము ప్ర. 354

ఈ పద్యమున్న పుటక్రింద "३४३ line 2 in D is
'మరుడు బిగిలిడ కర్ని కాద్యుతులు నెరయ'

In this the yati is lost'' అను బ్రౌను సూచన కలదు. కాని బ్రౌను నిఘంటువులో ఈ ప్రయోగము కానరాదు.

6 భాగవతాధ్యయన సందర్భమున బ్రౌను మెచ్చిన పద్యము లనేకములు కలవు. మచ్చున కొకటి :

ఆ॥ అలశితివి గదన్న యాకొంటివి గదన్న
మంచియన్న యేడ్పు మానుమన్న
చన్ను గుడువు మన్న సంతస పడుమన్న
యనుచు చన్ను గుడిపె నర్భకునకూ
ద. స్క. పూ భా వ్రా. ప్ర 253 ము. ప్ర. 258

అను పద్యము నందలి అక్షరరమ్యత బ్రౌను దొరను ఆకట్టు కొన్నది. "Lovely language'' అని కొనియాడెను.

బ్రౌను భారత భాగవతాంధ్రీకరణములను గూర్చి చర్చించెను. ఈ రెంటిలో భాగవతము మూలవిధేయమనునది యాతని అభిప్రాయము కాని భాగవతశైలి లక్షణవంతము కాకపోవుటచే నది జనాదరణ పాత్రము కాక 'జబ్బు' కావ్యముగ పరిగణింపబడుచున్నదని అతడు పేర్కొనెను.5 భాగవతమునందలి రేఫఱకారసంకరమును నూతగగొని ముద్దరాజు రామన్న, కాకునూరి అప్పకవి, అహోబలపతి పోతవ భాగవతమును నిరసించిరి.

ఉ॥ "బమ్మెర పోతరాజకృత భాగవతంబు సలక్షణంబుగా
కిమ్మహినేమిటం గొదువ యెంతయు నారసి చూడనందురే
ఫమ్ములు ఱాలు నుం గదిసి ప్రాసములైన కతంబునం గదా :
యిమ్మగ నాడి లాక్షణికులెల్లను మాని రుదాహరింపఁగన్."
(అప్పకవీయము 2-234)

---

5. Es. on Tel Lit. Para 23.

అని అప్పకవి స్పష్టముగ నుగ్గడించెను ఈ అభిప్రాయమునే బ్రౌను కడనున్న పండితులాతనికి తెలిపియుందురు. అయినను భాగవత ప్రసిద్ధి ప్రచారములను బ్రౌను గుర్తించినట్లీ క్రింది వాక్యముల వలన వ్యక్తమగును.

"Next in popularity is the Telugu version of the Bhagavat : of which the tenth oook (Dasamam) describing the life of krishna, is eagerly perused; yet even in this their knowledge is very slight Two or three favourite legends (as the Rucmini Calyanam and Gajendra Moxam) with the (jalacrida or Krishna Lila), sports of Krishna with the naiads, are in general use - other parts of the Bhagavat that teach a mysterious and incomprehensible sort of philosophy are likewise popular; but we rarely find any Telugu who pretends to understand. What he so devoutly reads."[6]

ఆంధ్రులకభిమాన పాత్రమైన - ప్రహ్లాద చరిత్రాది ఘట్టములున్న - భాగవత సప్తమ స్కంధమునకు ప్రప్రథమముగ ముద్రణ రూపము నొసగి, ఆంధ్రుల కందించిన ధన్యుడు బ్రౌను.

### 3. 3. పద్మపురాణము (ఉత్తరభాగము)

మడికి సింగన కృత పద్మ పురాణము లేఖక దోషములచే అనేకస్థలములందు అపపాఠములతో గూడి దోషభూయిష్ఠముగ నున్నట్లు బ్రౌను తన అధ్యయన కాలమున గుర్తించి దానికొక శుద్ధప్రతిని సిద్ధపరుప సంకల్పించెను. పద్మపురాణ ప్రతులను సేకరించి, సంస్కృతమూలముతో సంప్రతించి తెలుగు పద్యములకు సరియగు సంస్కృతాధ్యాయ సంఖ్యలను గుర్తించి, విషయ విభజన మొనర్చి, శీర్షికలను గూర్చి నిర్దుష్టమగు ప్రతిని రూపొందింపవలసినదిగ జూలూరి అప్పయ్యను అనుశాసించినట్లు అప్పయ్య రచించిన ఉపోద్ఘాతము వలన తెలియుచున్నది. "యీ తెలుగు పద్మపురాణమునకు అయిదు ప్రతులు తెప్పించి వ్యత్యాసములు యెక్కించి నిర్దోషముగా నియమించు కోవడమయినది. యిదిగాక గీర్వాణమందు అధ్యాయములు బయలుదేరిన స్థలములందు వాటి లేఖ కూడా తగిలించినాము యీ తెలుగుకు గీర్వాణ గ్రంథం కొంతమట్టుకు బాగా తెనిగించుకుని తరువాత వేరే భాగమునందు

6. Ibid. para. 25

కొన్ని అధ్యాయములు తెచ్చి గ్రంథశుద్ధ్యముగా పెట్టి వున్నాడు........." అని మొదటి ప్రకరణ ప్రారంభమునను మరియు రెండవ ప్రకరణమున "పద్మపురాణోత్తర ఖండమునకు సింగనకవి చెన్నుగా తెనుగు చేసియుండగా కాలాంతరమందు లేఖక దోషములచేత ననేక స్థలములయందు చెడిపోయి శుద్ధప్రతి లేకయుండుట చేతను 1 అనేక పతులు తెప్పించి గీర్వాణమునకు సరిగా అధ్యాయ సంఖ్య యేర్పడేటట్టున్ను నిర్దోషముగా నుండేటట్టున్ను పార్శ్వములయందు ఆయా కథా భాగముల యందలి వర్ణనాంశములు మొదలైన వాటియొక్క సూచనలు వ్రాయ బడి యుండేటట్టున్ను ఈ ప్రకారము తీర్పు చెయ్యవలసినదని మచిలీపట్టణ న్యాయ కర్తలైన మహారాజశ్రీ చా. పి. బ్రౌన్ దొరగారు అనుజ్ఞ ఇచ్చినందున శాలివాహన శక వర్షంబులు ౧౭౩౪ అగునేటి నందననామ సంవత్సరమునకు సమానమైన యింగిలిషుయొగ ౧౮౧౨ సంవత్సరమందు బందరులో జూలూరి అప్పయ్య సంపూర్ణ ముగా పదకొండు అశ్వాసములున్ను' తీర్పుచేసి గీర్వాణమునకున్ను తెలుగునకున్ను కొన్ని స్థలములయందు భేదములు వచ్చియుండగాను అధ్యాయక్రమ వ్యత్యయములు ఆయా స్థలములయందు విశదపరచడమైనది. ఈ పద్మ పురాణమందు ఉత్తర ఖండము మాత్రము తెనుగు అయినట్టు తెలియబడుచున్నది. గాని కడమ ఖండము లకు తెనుగు చేసినట్టుగా యెక్కడనున్ను మాకు కనుపడలేదు—" (D 18) అని అప్పయ వివరించెను.

3 3. 1. మ. ప్రా పు. భాండాగారమున పద్మపురాణోత్తరభాగ తాళపత్ర ప్రతులు 6 (D 20-25) కాగితపు ప్రతులు 3 D 18, 19, 26 కలవు. D 19 శిథిలావస్థలో నున్నది ఇది జూలూరి అప్పయ పండితుడు బ్రౌను అనుజ్ఞ చొప్పున అతని సూచనల మేరకు సంస్కరించిన తీర్పు ప్రతి. ఈ పురాణమును గూర్చి బ్రౌను వాక్యము లిట్లున్నవి: The Padma Purana; Part second· Translated into Telugu by Ayyala Kavi Singanna. This is a very popular work among the Telugus, and manuscripts are very common in the northern districts. The Purva Bhagam, or first part of this Purana, does not seem to have been translated into Telugu. A Zamindar in Rajahmundry told me that he had in vain tried to discover copy of it and believed that it never has been translated.

The present copy has been collated with four manuscripts and is perfect. The language used in this translation is easy and very beautiful". (D. 19.)

D 19 ప్రతికి ప్రతిక D 18. (D 26, ప్రతి ముద్రణకు తయారుచేసిన శుద్ధప్రతిగ తోచును. గ్రంథాదిలో : "Half Calf and Calico. Padma Purana. Telugu New Edition " అని గుర్తింపబడినది.

3. 3. 2. వెన్నెలకంటి సూరనకృత పద్మపురాణమొకటి యున్నట్లు బ్రౌను పొరబడెను.[1] కవి జీవిత విశేషముల పరిశోధించి, వాఙ్మయ చరిత్రలు వెలువడిన ఈ కాలమునందే ముద్దరాజు సోదరుల విషయమున పొరపడుచుండ,[2] ఆ కాలమున బ్రౌను తడబడుట అసంగతముగ తోపదు.

పద్మ పురాణ తృతీయాశ్వాసమందలి అహల్యా చరిత్ర బ్రౌనును అత్యంత మాకట్టుకొనినది. ఇందలి 65 పద్యములను 'అహల్యా చరిత్రము' 'The story of Ahalya' అను పేర, ఆంగ్లీకరించెను. అందు రెండు పద్యములను ఛందోబద్ధ మొనర్చెను. (చూ. అనుబంధము - 2) ఈ అనువాదమును ఒక వారము దినములలో పూర్తియొనర్చెను.[3]

బ్రౌను అనువాదపు సొబగులకు ఒండు రెండు దాహరణములు :

"ఎప్పుడొగాని వేగనొక యూనిసి నేడును నీ మునీశ్వరుం
డెప్పుడు వోవునో వెడలి యూనది దిక్కున నీ మృగాక్షి నే

1. "The Padma Puran has been translated into beautifull Telugu verse by Vennela Canti Surapa Raz; he also translated the Vishnu Puran......" (Es. on Lit. para. 27)
2. సమగ్ర ఆంధ్ర సాహిత్యం : ఆరుద్ర సం. 9. పుట. 204.
3. "Started 18 May 1 25. Finished 25 May 1825."
(D 333. అహల్యా చరిత. మ. ప్రా. పు. భాండాగారము.)

> నెప్పుడు గౌఁగిలించి సుఖియింతునొకో యని ప్రొద్దుఁజూచుచున్
> నిప్పులఁబడ్డ చందమున నిర్జర నాయకుఁడుండె నంతటన్"
>
> D 383. ప. 29

Indra exclaimed alas when will it dawn tonight, and when, today will this muniswara depart, going to the bank of this stream, ah when shall I embrace this stage eyed fair one in enjoyment - Thus musing he watched the hours - like one fallen into fires was Indra."

> గీ॥ "రాజులేని యట్టి రాష్ట్రంబు గావున
> నమర లోక మిట్టు లట్టు వడియె
> నపుడు లోకపాలు రాదిగాఁగల దేవ
> గణ మురింద్రువెదకి కానలేఁక" D 383. ప. 47

"The army being without its prince, the deathless region was disordered (fell this way & that). Then the rulers of paints and other tribes of gods sought Indra and perceived him not, Then".

దశావతార చరిత్రము నందలి అహల్యా కథను కూడ బ్రౌను ఆంగ్లమునకు పరివర్తించెను. ఈ అనువాద ద్వయమందలి భేదసాదృశ్యములు దశావతార చరిత్ర సందర్భమున చర్చింపబడును.

అష్టాదశపురాణము లందు పద్మ, విష్ణు, కూర్మ, మార్కండేయ, స్కాంద, భాగవతపురాణములు మాత్రము ఆంధ్రీకరింపబడినట్లును, తదితరములు తెలుగున లేనట్లును బ్రౌను పేర్కొనెను.[4] బ్రౌను కాలమున బ్రహ్మ, అగ్ని, బ్రహ్మవైవర్త, లింగపురాణములు మాత్రమే తెనుగున లేవు తదితరములు తెనుగున అనువదింపబడి యుండినవి. కాని ఆ ప్రతులు బ్రౌనుకు లభింపమిచే అతడు అట్లభిప్రాయపడి యుండవచ్చును. అంతియకాక పైన పేర్కొనిన పురాణములకే విశేష ప్రసిద్ధి ప్రచారములు. కాన తదితరములను గూర్చి బ్రౌను విని యుండకపోవచ్చును. అష్టాదశ పురాణములలో నిప్పటికిని అనువదింపబడనిది యొక్క అగ్నిపురాణము మాత్రమే.[5]

4. Es on Tel Lit. paras. 28, 29.
5. ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము. సంపుటము- 6.

## 3. 4. ఆంధ్రమహాభారతము :

3. 4. 0. బ్రౌనుకు ఆంధ్రకావ్యపఠనము నిత్యవ్యాసంగము. 1817 -వ సం॥లో ఆంధ్రాక్షరముల నభ్యసింప నారంభించిన యాతడు ఎనిమిదేండ్ల లోనే (1825) ఆంధ్రమహాభారత పఠనమునకు వలసిన పాండిత్యమును, భాషాపాటవమును సముపార్జించెను. అతడు కడపజిల్లా రిజిస్ట్రారుగ నున్నపుడు ఆంధ్ర మహాభారతమును పఠింప ప్రారంభించెను. లేఖన ప్రమాదములకు గురియైన తాళపత్రములందనేక పాఠభేదములుండుటచే భారతమునకు ప్రామాణిక పాఠ నిర్ణయావశ్యకము నాతడు గుర్తించి, శుద్ధప్రతి నిర్మాణమునకు సంకల్పించి వివిధ ప్రాంతములనుండి ప్రతులను సేకరించెను[1] భారత ప్రతులను పంపినవారికి పారితోషికము లొసగబడునను ప్రకటనలాయా కచేరీలలో ప్రదర్శింప కచేరి అధికారుల కుత్తరువులు జారీ చేసెను.[2] మద్రాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమున ప్రస్తుతము 89 తాళపత్ర భారత ప్రతులు కలవు అందు బ్రౌను సేకరించినవి ఎన్ని అనునది తెలియదు.

---

1. మహారాజశ్రీ సీ॥ పీ॥ బ్రౌను యిస్కాయరు జడిజీ దొరగారి సముఖానకు— ఆచంట లింగరాజు అనేక సలాములు చేశి వ్రాసుకున్న అర్జీ దాస్తు ది ౩ యేప్రెయల్ ఆన. ౧౮౩౪ సం॥ తారీఖున తమరు వ్రాయించిన ఉత్తరం రాత్రి యేడు ఘంటలకు అందినది. చదువుకోగా చాలా సంతోషమయ్యినవి. మాదగ్గిర ఉన్న పుస్తకములు తెనుగు భారత పర్వములు యిత్యాదులు జాబితా వ్రాయించి యిందులో పంపించడమైనది. జాబితా ప్రకారం పుస్తకములు వుండ చూపించి దాఖలయ్యిన సమాచారం వ్రాయించవలెనని కోరుతూ వున్నాను. మొన్నటి రోజ్ను తమరు పట్టించుకుని వెళ్ళిన అరణ్యపర్వం స్త్రీ పర్వముకు మాతృకలు పంపించటమునకు స్త్రీ పర్వమునకు మాతృక దొరికినందున్ను పంపించటమైనది. అరణ్య పర్వమునకు మాతృక ప్రస్తుతం సంభవించనందున్ను పంపించలేదు కొదువ పుస్తకములు తెప్పించి వెనకనుంచి పంపిస్తున్నాను. (Sr. of Lt M. 401. Lt. No : 178 p. 329)
2. భారతం ౧౮ పర్వాలున్ను రంగనాథ రామాయణం భాస్కర రామాయణం దశావతార చరిత్ర సత్యభామా సాంత్వనం భల్లాణ చరిత్ర బహులాశ్వ చరిత్రను గురించిన్ని ఆ పుస్తకములు వున్నవారు ఖరీదుకు యిచ్చినా సరే లేక బహుమానం కావలసి వుంటే ఆ వయ్నం తెలియచేస్కుంటె ఆ చొప్పున చేయిస్తున్నామని వ్రాయించి నావద్దికి పంపించిన ప్రకటన కాగిదం నా కచ్చేరిలో కట్టించడమే కాకుండా యవరెవరి తోటి పైగా నేనున్న తెలియచేస్తూ వుండడమయ్యినది. ఆ వయ్నం వెనక నుంచి వ్రాసుకుంటున్నాను. Ibid. Lt. No. : 188. p. 341.

కాని ఆదిపర్వమాదిగ స్వర్గారోహణపర్వము వఱకుగల 18 పర్వముల సంస్కరణములో, ప్రొను సంప్రతించిన తాళపత్ర ప్రతుల వివరములు ఈ క్రింది పట్టికలో చూడనగును :

| | ఆది | సభా | అరణ్య | విరాట | ఉద్యోగ | భీష్మ | ద్రోణ | కర్ణ | శల్య | సౌప్తిక | స్త్రీ | శాంతి | అనుశాసనిక | అశ్వమేధ | ఆశ్రమవాస | మౌసల | మహాప్రస్థానిక | స్వర్గారోహణ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| బ్రహ్మశ్రీ<br>1. రా॥ బ్రం॥ పంతులుగారి ప్రతి. | | | * | * | | | | | | | * | * | | * | | | * | * |
| 2. యానాం ప్రతి | | | * | | * | | | | | | | | | | | | | |
| 3. రాచల్లన్ గోపన్న ప్రతి శు॥ కొండ్డు బ్రాయడు గు॥ వా॥ కొండ్డున్న ప్రతి | | | * | | | | * | | | | * | * | | * | * | * | | |
| 4. వద్దిపర్తి వెంకయ్య ప్రతి సా॥ చామలన్ కోట తా॥ ప్రతి | | | * | * | * | | | | | | | | | | | | * | |
| 5. మన్నెం కనకయ్య సా॥ యానాం ప్రతి తా॥ ప్రతి | | | * | * | * | | * | | * | * | * | | | * | * | * | * | |
| 6. అచంట లింగరాజు ప్రతి | | | | | | | * | | * | * | * | * | | | * | | | |

| | ఆది | సభా | ఆరణ్య | విరాట | ఉద్యోగ | భీష్మ | ద్రోణ | కర్ణ | శల్య | సౌప్తిక | స్త్రీ | శాంతి | అనుశాసనికము | అశ్వమేధ | ఆశ్రమవాస | మౌసల | మహాప్రస్థానిక | స్వర్గారోహణ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 7. తాడిగడప వీరేశలింగ్గము, సా॥ పెనుగొండ... | | | * | * | * | BROWN : "The various readings in the Bhishma Parvam are copied from seven mss found in the Rajahmandry Distsict." | * | * | * | * | BROWN · "The stri parvam or Eleventh Book of the Mahabharat with the various readings furnished by twelve mss. ★ | * | | * | * | * | * | * |
| 8 పేమూరి సుబ్బారావు ప్రతి. | | | | * | * | | | | | | | | | | | | | |
| 9. గుడిమెట్ల పల్లయ్య ప్రతి - జగన్నాథపురం (సుబ్బిన్నశాస్త్రి తెచ్చినది) | | | | * | * | | | | | * | | | | * | | * | * | * |
| 10. వత్సవాయి బుచ్చిసీతయ్యగారి ప్రతి సా॥ పెద్దాపురం | | | | * | | | | | | | | * | | | | | | |
| 11. పెద్దపూడిలో వుండే అయ్యగారి ప్రతి. సా॥ పెద్దపూడి. వ్రాదేవు వీరేశలింగము పరిముఖంగా వచ్చినది **D.** 170 | | | | * | * | | * | | * | * | | | | | | | | |
| 12. మాజేటి సర్వేశలింగం సా॥ యానాం॥ | | | | * | | | | | * | * | | | | | | * | * | |

| | ఆది | సభా | ఆరణ్య | విరాట | ఉద్యోగ | భీష్మ | ద్రోణ | కర్ణ | శల్య | సౌప్తిక | స్త్రీ | శాంతి | అనుశాసనికము | అశ్వమేధ | ఆశ్రమవాస | మౌసల | మహాప్రస్థానిక | స్వర్గారోహణ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 13. మొగలితుర్తిపూర్వపు గ్రామ మునసపు | | | | * | | | | | | | | గుడ్లూరి రాజుగారి ప్రతి, భానుగోవా రంగారావుగారి ప్రతి, వేడ్డు రంగారావు, నెల్లూరి రామస్వామి ప్రతుల ప్రస్తావన ఉన్నది. | | | | | | |
| 14. తా॥ (లూకు) ప్రతి | | | | | | | | | | | | | | | | | | |
| 15. దామెర్ల వేంకటరాయని ప్రతి సా॥ కలేగాడుం కోర్మాండ (Catalogue) | | | | | | | | | | | | | | | | | | |
| 16. ధొరగారు కొనుకొన్న తాట్యాకుల ప్రతి | | | | | | | | | * | | | | | | | | | |
| 17. తెసుగుకావ్యపురాణ పట్టిలో నెం ४३३ | | | | | | | | | | | * | | | | | * | | * |
| 18 రా॥ ఆలమూరి బాపన్న ప్రతి | | | | | | | | | | | | | | | | | | |

10)

| | ఆది | సభా | ఆరణ్య | విరాట | ఉద్యోగ | భీష్మ | ద్రోణ | కర్ణ | శల్య | సౌప్తిక | స్త్రీ | శాంతి | ఆనుశాసనికము | అశ్వమేధ | ఆశ్రమవాస | మౌసల | మహాప్రస్థానిక | స్వర్గారోహణ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 16 దామెర వెంకట - యనింగారి ప్రతి దఫా. కాకినాడ. | | | | | | | | | | | | * | | | | | | |
| 20. వాడ్రేవు చంద్రమౌళి (మొదటిఆశ్వాసంమాత్రం) కొండగుంటూరు (గుంటూరు Catalogue) | | | | | | | | | | | | * | * | | | | | |
| 21. రాచర్ల గోపన్న సా॥ కోప్పూరు | | | | | | | | | | | | | | | | | * | * |
| 22. నండివాడ వీర్రాజు | | | | | | | | | | | | | | | | | | |
| 23. దొరగారి దగ్గరఉన్నవి. | | | 6 | 10 | 7 | 7 | 7 | 2 | 6 | 7 | 8 | 9 | 2 | 5 | 4 | 6 | 8 | 6 |

పైపట్టికవలన మన్రోం కనకయ్య, తాడిగడప పీరేశలింగమను నిరువురు భారత ప్రతుల సేకరణలో బ్రౌనున కత్యంతము తోడ్పడినట్లు తెలియును. భారత పరిష్కరణార్థము ఇంచుమించు 50 సమ గ్రాసమగ్ర ప్రతులను పరిశీలించినట్లు వ్యక్తమగును. వీంలో తాడిగడప పీరేశలింగము 15 పర్వముల తాళపత్ర ప్రతులను సేకరించి పెట్టెను ఒక్కొక్క పర్వపరిష్కరణలో ఏడెనిమిది ప్రతులకు తక్కువలేక సంప్రతించుటయాతని శ్రద్ధకు తార్కాణము.

ఆది పర్వపు శుద్ధప్రతి తయారుచేయుటకు ఏడు ప్రతులను సంప్రదించినట్లు బ్రౌను పేర్కొనెను.[3] కాని వాని వివరములు తెలియరాకున్నవి.

విరాటపర్వము నందచటచట గురుమూర్తి శాస్త్రి సేకరించి పంపిన ప్రతి ప్రస్తావన యుండుటచే ఆ పర్వ పరిష్కరణములో శాస్త్రిగారి ప్రతియు నుపయుక్తమైనదెన్ననగును.

భీష్మపర్వము తూర్పుగోదావరి జిల్లాకు చెందిన రాజమహేంద్రవరములో లభించిన ఏడు ప్రతులతో సరిపోల్పబడెను.[4]

శాంతిపర్వ పాఠసవరణమున తోడ్పడిన ప్రతుల వివరములను తెల్పుటయేకాక అందు కో. రెడ్డి ప్రతి (*D.* 180). గుడ్లూరి రాజాగారి ప్రతి (**D.** 181), తాటిపర్తి ప్రతులు ప్రస్తావితములు.

3. 4 1. భారతగ్రంథమును పరిష్కరించి శుద్ధప్రతిని తయారుచేయుటకు బ్రౌను 12 సమగ్ర తాళపత్ర ప్రతులను సేకరించి సంప్రతించినట్లు తెలుగు సాహిత్యమును గూర్చిన తన వ్యాసములో పేర్కొనెను.[5] బ్రౌను తాను సేకరించిన తాళపత్ర ప్రతులకు కాగితపు ప్రతులను వ్రాయించెను. భారతమునకు సంబంధించిన 48 కాగితపు ప్రతులు మ. ప్రా. పు. భాండాగారమున కలవు. ఇవి నేడు క్రిమిదష్టములై శిధిలావస్థలో నున్నవి. వీనిలో 23 (*D* 163 - 185) భారతపు 18

3. "The alterations made in this copy show the various readings found in seven copies compared by me" (D. 163.)
4. "The various readings in the Bhishma Parvam are copied from seven manuscripts found in the Rajahmandry District."—*D.* 173.
5. Es. on. Tel, Lit. Para. 67.

పర్వములకు పాఠభేదములను గుర్తించి, తీర్పుపాఠములను నిర్ణయించిన చిత్తుప్రతులు. 8 ప్రతులు ఆది సభారణ్య విరాటోద్యోగ ద్రోణ కర్ణ, శల్య శాంతి పర్వముల ముద్రణకు సిద్ధమొనర్చిన శుద్ధప్రతులు. శేషములు ఆయాపర్వముల అసమగ్ర ప్రతులు కొన్ని, తాళపత్ర ప్రతులకు ప్రతికలు కొన్ని. చిత్తుప్రతులందు ఎడమవైపు పుటయందు సంప్రతించిన ప్రతులలోని పాఠాంతరములు ఆయా పద్యముల పంక్తుల నడుమను, ఎదుటనుండు కుడివైపు పుటయందు తీర్పు పాఠములును గుర్తింపబడినవి

ప్రతి పర్వ పరిష్కరణారంభకాలమునో, లేక పూర్తి యొనర్చిన కాలమునో చిత్తుప్రతులందు లేదా శుద్ధప్రతులందు బ్రౌను సూచించెను. ఆరణ్యపర్వపు చిత్తు ప్రతిలో ప్రత్యాశ్వాస పరిష్కరణ సమాప్తికాలము సూచితము. ఆరణ్యపర్వ ప్రథమాశ్వాస పరిష్కరణ క్రీ. శ. 1838 సం. డిసెంబరు 1-వ తేదిన ప్రారంభించి, మేనెల 27-వ తేదిని, 7- ఆశ్వాసపర్వముల పర్కిరణమును పూర్తి యొనర్చినట్లు కలదు. అనగా నీ పర్వమునందలి 2891 పద్యముల సవరణను ఆఱు నెలల కాలములో పరిసమాప్తియొనర్చిరి. ఇది నిర్విరామ కృషివలన గాని సాధ్యముకాదు.

విరాటపర్వపు సాపుప్రతి 18-7-1840 నాటికి సిద్ధమయ్యెను. కొర్రపాటి చన్నప్ప 1832-వ సం॥ అక్టోబరు 13 తేది వఱకు విరాటపర్వ పాఠాంతరముల నెక్కించినట్లుండుటచే, ఈ పర్వ పరిష్కరణము నా సంవత్సరమున ప్రారంభించి ఎనిమిదేండ్లకాలములో పూర్తిచేసినట్లు గ్రహింపనగును.

అట్లే ఉద్యోగపర్వ పరిశీలనము 4-4-1834 - వ సం॥న ప్రారంభమై 23-7-1840-వ సం॥న పరిసమాప్తియాయెను.

ద్రోణపర్వ పరిష్కరణము 1832 వ సం॥న ప్రారంభమై 25-1-1843లో పూర్తియాయెను. ద్రోణ కర్ణ పర్వములు రెండును నొకే కాగితపు సంపుటమున నుండుటచే నీ రెండు పర్వముల పరిష్కరణ ఏకకాలమున సంపూర్ణమయినట్లూహింపనగును.

స్త్రీ పర్వము చిన్నదే అయినను దానిని 12 ప్రతులతో పోల్చి పాఠములను సవరించినట్లు బ్రౌను స్వహస్త లిఖితము వలన తెలియుచున్నది.

బ్రౌనునకు తెనుగుపై నెంతట అభిమానమున్నను, అది తనకు మాతృభాష కాదను విషయము నాతడు విస్మరించలేదు. అందుచే నిర్దుష్ట పాఠ నిర్ణయమున తన పాండిత్యమును ప్రమాణముగ పరిగణింపక, శుద్ధప్రతిని తయారుచేయుటలో దేశీయు లగు పలువురు పండితుల సాహాయ్యమును స్వీకరించుటాతని శాస్త్రీయ దృష్టిని చాటును ఆది పర్వ పరిష్కరణమున బ్రౌనునకు తోడ్పడిన పండితులెవరో తెలియరాకున్నది. గరిమెళ్ళ వెంకయ్య ఆరణ్యపర్వమును పరిష్కరించుటయేకాక, విరాటపర్వ పరిష్కరణయందును సహకరించెను. ఉద్యోగపర్వ పాఠములను వేమూరి సుబ్బారాయునితో పాటు ఎక్కించినట్లు తెలియుచున్నది[6] వారణాసి రామస్వామి, నందివాడ సుబ్బయ్యలు ద్రోణపర్వము నందలి మొదటి 2 ఆశ్వాసములకు పాఠాంతరములను గుర్తించిరి[7] 3, 4, 5 ఆశ్వాసములను మన్నెం కనకయ్య 'మోకాబిలా' చేసెను.

బ్రౌన్‌చే నియుక్తులైన పండితులు మొదట నొక తాళపత్ర ప్రతిని కాగితముపై వ్రాసికొని తక్కిన ప్రతులలోని పాఠముల నెక్కించెడివారు. ఈ పాఠములలోనేది కవి ప్రయుక్తము, ఏదిశుద్ధమైనది యని నిర్ణయించి తీర్పు తీర్చెడివారు. నిర్దుష్టమైన పాఠ నిర్ణయమునకు ఛందోవ్యాకరణములు ప్రమాణములు. కొన్ని పట్టుల ఛందోవ్యాకరణ ములును నిర్ణయమునకు తోడ్పడవు అనేక పాఠములలో 2, 3 పాఠములు సరియగు పాఠములుగ నుండును. మఱియు భిన్నప్రతులలో పెక్కు పాఠభేదము లుండును. ఇట్టి సందిగ్ధస్థలములందీ పండితులు సంస్కృత మాతృక ననుసరించి తీర్పుచేసిరి.[8]

6. "౧౮౩౪ న యేప్రిల్ తేది ౪ వరకు రాజమహేంద్రవరములో యానాం ప్రతులు రెంటితో గరిమెళ్ళ వెంకయ్య వేమూరి సుబ్బారాయుడు సరిచూచి విభేదాలు యెక్కించడమైనవి." D 172.

7. "ది ౨౭ నవంబరు ఆన ౧౮౩౭ సంవత్సరం విభేదములు యెక్కించడ మైనది వారణాసి రామస్వామి వ్రాలు. నందివాడ సుబ్బయ్యవ్రాలు." —D. 174.

8. "అనేక ప్రతి భేదములు సంభవించుటచే చిక్కుగా వున్న తావుల సంస్కృతానుసారముగా తీర్చిన తీర్పు వయనము.

| | ఆ | ప |
|---|---|---|
| శతయోజన విస్తీర్ణం............... | ౧ | ౧౬౮ |
| అగ్ని బృహస్పతి సంవాదంసోమ...... | ౧ | ౧౭౬ |

... ... ... ... ... ... ... "—D. 232.

మఱికొన్ని సందర్భములలో బ్రౌను దొరగారితో సంప్రతించి తీర్పును చేసిరి. తాము ఒక పాఠమును ప్రమాణముగ గ్రహించుటకు హేతువులను చూపిరి[9] బ్రౌను ప్రేరణచే పరిష్కృతమైన యీ ప్రతులందు అరసున్నలు, శకటరేఫములు కానరావు. ఈ విషయమును సంశోధిత భారత పరిష్కర్తలును పేర్కొనిరి[10] బ్రౌను కాలమునకు తాళపత్ర లేఖన పద్ధతులు, నియమములు పరిశీలింపబడలేదు ప్రాచీన తాళపత్ర శాసన లిపియందు అర్ధానుస్వారమును పూర్ణబిందువుగను (వాండు), పూర్ణానుస్వారమును పూర్ణబిందు పూర్వక వ్యంజన ద్విత్వముగను (కాంత్త) వ్రాయుట సంప్రదాయము. కాన "తోంక" అను రీతి తాళపత్రములందుండ అది సరికాదని బ్రౌను ఆ పూర్ణములను తొలగించి యుండును. అట్లే తాళపత్రములందు లక్షణకర్తలే రేఫశకటరేఫ ప్రకరణములందు మాత్రమే శకటరేఫలను వాడిరి. తదితర స్థలములందు శకటరేఫలు కానరావు. ఉచ్చరణ యందు వినిపించని అరసున్న, వ్రాతలో లోపించిన శకటరేఫ వర్ణసమామ్నాయమున అనవసరమని బ్రౌను సిద్ధాంతము.

ఆయా శుద్ధప్రతులలో బ్రౌను తనకు నచ్చిన పద్యముల సారాంశమును ఆంగ్లములోనికి అనువదించెను.

ఉదా : తె॥ యెల్లవారును జూడగ నిట్టి బయల<br>
నెట్లగు సమాగమంబని యింతియన్న<br>
నమ్మునీంద్రుండు గావించె నప్పుడఖిల<br>
దృష్టి పథరోధ నీహార తిమిరమంత

వ్రా. ప్ర. 1-3-52. ము. ప్ర. 1-3. 42.

---

9. "యిక్కడ నాలుగు ప్రతులయందు పట్టుకొనియెం అని వున్నది అలాగున చెప్పిన పక్షమందు భూతార్థమందు అంత్యయకారము యేత్వము గనుక అని మిషనాథు అని యున్న చరణాదిని అత్వము గన్క యతిభంగమవును. వక్రపతి యందు మాత్రము పట్టుకొని యప్పుడు అని వున్నది. కాబట్టి యిదె గ్రహించ తగినది యిదిన్నిగాక పట్టుకొనియె గ్రమింగె అని క్రియాద్వయిమున్న అప్రశస్తము "—D. 171. ఆ. 1. 122. పద్యము.

10. సంశోధిత ఆంధ్రమహాభారతము. పీఠిక. పు. 100.

"53 So they landed – she objected to the publicity of the place - where on he cast a mist around."

కొన్ని పద్యములకు లఘు వివరణను లొసగెను. ఆరణ్య పర్వమునందే లఘు వివరణములు పలుతావులందు కానవచ్చును.

**ఉదా :-** 1) ఆ॥ 'నెంత శాంతులయు నెంక జితేంద్రియు'

(వ్రా. ప్ర. 1-3-48. ము. ప్ర 1-3-39) అను పద్యమునకు ఎదురుగ "Turely Love and solitude are irresistable" అని బ్రౌను గురించెను.

2) ఆ॥ 'యెరిగి యెరిగి వారినెల్ల వారింపక'

(వ్రా. ప్ర 1-3-6. ము. ప్ర. 1-3-5.) అను పద్యమునొద్ద "They asked how Vyasa was born" అని బ్రౌను వ్రాసెను.

ఆరణ్యపర్వ పరిష్కర్త తనకు గలిగిన సందేహములనెల్ల ఆ కాగితపు సంపుటము చివర నొకపుటలో గుర్తించెను. సామాన్యవృత్తములగు చంపకమాలాదులు కాక విశేషవృత్తములగు లయగ్రాహి మున్నగువాని నామములు ఆయావృత్తముల ప్రారంభమున పాఠకుల సౌలభ్యార్థము వ్రాయబడెను.

కావ్యపరిష్కరణ కార్యమును పండితులకు వదలి ఊరకుండెడివాడు కాడు బ్రౌను. ఆ పరిష్కృత కావ్యములను స్వయముగ పరిశీలించి అందలి తప్పొప్పులను గుర్తించెడివాడు ఇది యాతని కార్యదీక్షకు నిదర్శనము.

**ఉదా :**

"మత్తకోకిల॥ దేవమాతుకాలు పాండుపుత్రులు ధీరచిత్తులు వారిపెం
పీవెరుంగని వాడవే ధరణీశ వాయుసుతుండు గాం
డీవియుం భుజవిక్రమ ప్రకటీకృతుల్ వివిధాస్త్ర వి
ద్యా విశేషులు వైరిపీరుల దక్కనిత్తురె పోరులన్."

వ్రా. ప్ర 3-1-54. ము. ప్ర 3-1-46

"రెండు పుస్తకాలలో ప్రాసపోయింది– This correction I made- It is obvious enough but Euchaia overlooked it." అని బ్రౌను సవరణ.

విరాటపర్వ "తిర్పుసాపుప్రతి" ప్రతిపుట పైభాగమున "సిర్దోషముగా నియమించిన గ్రంథం" అని లిఖితమై యున్నది. ఇట్లు మొదట చిత్తుప్రతులను తయారుచేసి, తదుపరి శ్రమించి సాపు ప్రతిని సిద్ధపరచెడివారని తెలియుచున్నది.

సంశోధిత భారత ముద్రణ పరిష్కర్తలు బ్రౌను సవరించిన మహాప్రస్థాన స్వర్గారోహణపర్వములు లభింపనట్లు పేర్కొనిరి "11 కాని ఆ పర్వముల సవరణలతోడి చిత్తుప్రతి మ ప్రా. పు భాండాగారమున కలదు. (*D.* 185).

బ్రౌను పరిష్కరణలో ప్రధానముగ పేర్కొనదగినది యాతని సంఖ్యానిర్దేశము ఆంధ్రమహాభారతము నందలి పద్యములను పాదములుగ విభజించి, పద్యసంఖ్యను నిర్ణయించి, అగిమ్మేమిగనున్న గద్యపద్యములకు క్రమతనేర్పరచిన ప్రథముడు బ్రౌను. ఈ విషయము నాతడే పేర్కొనెను : The Mahabharata now first rendered to numerical arrangement, and copied in seperate verses and lines by the direction of Charles Philip Brown." (D. 163.) బ్రౌనునకు పూర్వము ప్రమాణ పాఠములతోడి కాగితపు ప్రతులులేవు. "సి. పి. బ్రౌనుగారి యాదేశమున సిద్ధము చేయబడిన దానికన్న ముందు వ్రాయబడిన కాగితపు లిఖితప్రతి మాకెంతవరకు గనబడలేదు."12 ఆంధ్ర మహాభారత శుద్ధ ప్రతులను రూపొందించుటకు 2714 రూపాయలు వ్యయమయినట్లు బ్రౌను తెలిపెను.

ఆంధ్ర కావ్యాను వాదములను గూర్చి బ్రౌనునకు ఒక నిర్దిష్టాభిప్రాయమున్నది.

"The Bharata, if printed in the same manner, would extend to nearly the size of Shakespeare's plays : being about twice as long as either the Bhagavat or Ramayan. It is considerably abridged from the Sanscrit original; many hundred verses being often condensed into a paragraph, written in prose; indeed prose is interspersed in all the Telugu legends and poems, but no where so profusely as in the Bharata " 13

---

11. అందే. పీఠిక. పు. 100.

12. అందే. పు 89.

13. Es on Tel. Lit. Para 23.

We may here remark that the Telugu translators take liberties (more than poetical) with their originals, for they consider a general outline quite sufficient to form a copy : thus they omit, transpose and insert, whatever they please."

"Besides (possibly wishing to conceal these deviations), the Telugu translation in all books set aside the numerical order of the Sanscrit, melting down ten or twelve (adhyaya) chapters into one (asvasa) book or canto. Thus it is not easy to trace in the original any passage regarding which comparison may be required " 14 కావున భారతానువాదము యథానూత్నకము కాదని, అయ్యది స్వేచ్ఛానువాదమని బ్రౌను పేర్కొనెను.

వ్యాసభారత మందలి భగవద్గీత, విష్ణుసహస్రనామము, భీష్మస్తవరాజము, అనుస్మృతి అను భాగములను తిక్కన తెనుగులోనికి అనువదింపడయ్యెను. అందులకు కారణమును బ్రౌనిట్లు తెలిపెను : "In this ancient version of the Mahabhart some episodes are omitted : being too sacred to be translated. These are, the Bhagavat gita (a portion of the Bhishma Parva or sixth book), the Vishnu Sahasranama, the Bhishma Stava Rajam, and the Anusmriti." 15

3. 4. 2. ఉపలబ్ధములగు ఆధారములను బట్టి ఆంధ్ర మహాభారతము నందలి ఆదిపర్వమును ముద్రించిన ప్రథముడు బ్రౌను. 1832వ సం॥న ప్రకటించిన ఒక వ్యాసమందు బ్రాసిట్లు వివరించెను :

' The text of the Mahabharat has unaviodably been much corrupted in the course of years; and the Adi Parvam or first book, being a common school book, has suffered more than the rest The whole has now been revised and the devicus readings found in different manuscripts have been recorded : on this foundations a new edition is now in progress, and the first book is in the press." 16

---

14. Ibid Para. 26
15. Ibid. Para. 24.
16. Es. on Tel. Lit. Para. 24.

10-4-1840లో హయగ్రీవశాస్త్రి బ్రౌనుదొరకు వ్రాసిన లేఖపై ఉపరి తమును ధృవపరచుచున్నది. శాస్త్రిగారు అచ్చాఫీసును స్థాపించుటకు నిశ్చయించి నట్లును అందుకై తెలుగు అక్షరములు సిద్ధపరచినట్లును తెలుపుచు "ఆ అక్షరములు తమరు ప్రకృతమందు వేయించే ఆది పర్వములో అక్షరములవంటివి ఆయి వాటికంటే కుదిరికెగా నున్నవి" అని వ్రాసిరి.17

1842వ సం॥న బ్రౌను సవరించి వ్రాసిన "Essay on Telugu Literature" అను వ్యాసమునందు ఆదిపర్వము ముద్రితమైనట్లు పేర్కొనెను. The Adi Parvam or First canto is much demand as a school book and accordingly has now been carefully edited and printed...... " ఆ వ్యాసమునందే మరొక సందర్భమున "The first book lately printed) of the Mahabharat called Adi Parvam." అని ఆదిపర్వ ముద్రణ మిటీవల పూర్తియయినట్లు పునరుద్ఘాటించెను.

1842 వ సంవత్సరమునందే బ్రౌనుచే ముద్రింపబడిన గౌరన హరిశ్చంద్ర, నవనాథచరిత్రల ముఖపత్ర మందు ముద్రితమగుచున్న పుస్తకముల పట్టికలో 'ఆది పర్వము'ను కలదు పై ఆకరములన్నియు ఆదిపర్వముద్రణము 1842 వ సం న జరిగినట్లు తెలుపుచున్నవి. బ్రౌను ఆదిపర్వమును ముద్రింపించెననుటలో విప్రతిపత్తి లేదు బ్రౌను స్వీయచరిత్ర (1866) యందు అతని పర్యవేక్షణలో ముద్రితములైన గ్రంథముల జాబితాలో మహాభారతము కూడ ఉన్నది.

పూంబావై - శృంగార మొదలారి, వేయిగై - అప్పాస్వామి మొదలారి అను నిరువురు సైదాపురమందలి ఉమాపతి మొదలారి కల్వికళంజమనె ముద్రాక్షరశాలలో 1843 సం॥ ముద్రించి ప్రకటించిన ఆదిపర్వప్రతి యొకటి లభించుచున్నది ఉపలబ్దము లగు ముద్రితభారతప్రతులలో ఇప్పటి కిదియే మొదటిది. ఇదియే బ్రౌనుదొరచే ముద్రింపబడిన ఆదిపర్వప్రతియని శ్రీ బంగోరె అభిప్రాయము.18 ఇది స్వవచో వ్యాఘాతము. వారు సంకలించి ప్రచురించిన "బ్రౌన్ జాబులు తెలుగు జర్నలిజం చరిత్ర 1832 నుండి 1857 దాక" (1973) అను గ్రంథములో వర్తమాన తరంగిణి పత్రిక

17. Sr. of. Lts. M. 4C1. Lt. No. 155 pp. 297 - 299.
18. Literary Autobiography of C. P. BROWN. P. 15‸.

1842 ఆగస్టు 4, 18 తేదీ సంచికలో ముద్రింపబడిన ప్రకటనను ప్రచురించి "1842 ఆగస్టు 4-వ తేదీ నాటికి తెలుగు మహాభారతం ఆదిపర్వం అచ్చు అయింది నేండుకు ఇంతకంటే మరో దాఖలా ఎందుకు?" అని ప్రశ్నించిరి (పుట. 43-44) బ్రౌను ఆదిపర్వ ముద్రణ కాలమును అంత ఖచ్చితముగ తేదీలతో సహా నిర్ణయించిన వారే ఆంధ్ర జ్యోతిలో ప్రకటించిన వ్యాసమునందు "1842. 43 లో బ్రౌను అచ్చు వేయించిన మహాభారతం ఆదిపర్వం గ్రంథంలోని లోపలిపేజీ ఫోటో" అని వ్రాసిరి[19] వారు 1842 - 1843 వరకని ఆదిపర్వ ముద్రణ కాలమును పొడిగించుటకు గల కారణములు తెలపలేదు. ఈ కాలసూచన నిరాధారము. ఈ పెద్దలియారులు అచ్చు వేయించిన యీ ప్రతియందలి పద్య సంఖ్యాక్రమము, అర్ధానుస్వార శకట రేఫల రాహిత్యము వారి యీ నిర్ణయమున కాధారములు కానోపును కాని దీనినే ప్రబలాధారముగ పరిగణింపరాదు. బ్రౌను పరిష్కృత కావ్యములందు పద్యములకు సంఖ్యను నిర్ణయించుటే కాక వచనమునకును నాలుగేసి పంక్తులకు ఒక సంఖ్యను, నాలుగు సీసపాదముల కొక సంఖ్యను, అందలి ఎత్తుగీతికి మఱియొక సంఖ్యను నిర్ణయించుట కానవగును ఈ ఉపలబ్ధ - ఆదిపర్వమందలి సంఖ్యాక్రమమును ఇట్లే యున్నది కాని బ్రౌను ముద్రింపించిన కావ్యము లన్నిటి లోపలి ముఖ పత్రములలో

## *"At the Desire of*
## CHARLES *P*HILIP *B*ROWN"

అని ప్రాలుమాలక సందేహమున కెడమీయని రీతి స్పష్టముగ ముద్రితము' అట్లుండ 1843 వ సం॥న ముద్రితమైన ఆదపర్వము నందు

"పూంబావై - శృంగార మొదలారి
పౌయిగై - అప్పాస్వామి మొదలారి
పీరియపురి చేతను

సైదాపురం - ఉమాపతి మొదలారి కల్వికృక్షశం జమసె
ముద్రాక్షరశాలలో అచ్చువెయించి ప్రచురము చేయబడెను"

19. "నన్నయ భారతంలో వెలుగు చూడని రెండు కందపద్యాలు" - శ్రీ బంగోరె ఆం. ధజ్యోతి దినపత్రిక, 1978 అక్టోబరు 11, బుధవారం పుట 11.

అని బ్రౌను ప్రస్తావనయే లేక, వారే ముద్రాపకులనట విస్పష్టముగ తెలపబడెను; కాన ఈ ఆదిపర్వప్రతి బ్రౌను ముద్రింపించినది కాదని స్పష్టము బ్రౌను ప్రతి ఆధారముగ నిది ముద్రితమైయుండనగును. బ్రౌను ప్రతి ఇంకను అన్వేషణీయము

1842వ సంనకు పూర్వమే 1827వ సంIIన ప్రచురింపబడిన తన "ఆంధ్ర గీర్వాణచ్ఛందము"న బ్రౌను ఆంధ్రమహాభారతము నందలి ఆయాపర్వములలోని కొన్ని పద్యములను తన ఛందోలక్షణములకు లక్ష్యములుగ ప్రకటించెను మఱియు ఆ గ్రంథమునందే అనుబంధముగ **"The State of Telugu Books (Maha Bharata)"** అని సభాపర్వ ద్వితీయాశ్వాసమునందలి 14 పద్యములను వివిధ తాళపత్రము లందలి పాఠభేదములతో ప్రదర్శించి, పాఠ నిర్ణయమొనర్చి, సవరించిన పద్యములను అచ్చువేయించెను.

ఇట్లు దేశమంతట చెల్లాచెదరై అపపాఠములతో, పాఠాంతరములతో, గ్రంథ పాతములతో అస్తవ్యస్తముగ నున్న ఆంధ్రమహాభారతమును సముద్ధరించి, ప్రామాణిక మనదగు శుద్ధప్రతిని రూపొందించుటయేకాక తన్ముద్రణమునకును పూనుకొని ఆంధ్రసాహిత్యమునకు మహోపకార మొనర్చిన మనీషి బ్రౌను

## 3. 5. శ్రీకాళహస్తి మహాత్మ్యము :

3. 5. 0 ధూర్జటి కాళహస్తి మహాత్మ్యమునకు బ్రౌను మూడు కాగితపు ప్రతులను వ్రాయించెను. (D 356, 357, 358)

3. 5. 1 మ. ప్రా. పు భాండాగారమున నున్న మూడు కాగితపు ప్రతులలో D 356 సమగ్రము; D 358 అసమగ్రము. ప్రథమాశ్వాసములో 167 పద్యములు మాత్రమే యున్నవి. ఇయ్యది మాతృక యందలి 4 వ పత్రము వరకు పోల్చి సవరించిన ప్రతి ఇందు "కాళహస్తి మాహాత్మ్యం. దిద్దిన ప్రతి" అని యున్నది. D 357 మెకంజీప్రతితోను దదితర ప్రతులతోను పోల్చి పాఠములు గుర్తించిన ప్రతి ఈ ప్రతి అంతమున "Contents - copied from the Mackenzie Ms" అని యున్నది పద్యపంక్తుల నడుమ వివిధ పాఠాంతరములు గుర్తింపబడినవి. పాఠభేదములధికముగ నున్నపుడు ప్రత్యేకమైన కాగితములపై వ్రాసి, అతికింపబడెను. ఈ ప్రతి ముఖపత్రమున ఇందలి పాఠ భేదముల కాధార

మరు ప్రతులలో నొకటి మెకంజీ సేకరణములోనిదనియు, నది 1840 వ సంవత్సరమున లభించినట్లును, మూలప్రతి 1832 వ సం॥ అతి ప్రయాసతో గద్వాలలో సంపాదింపబడినట్లును బ్రౌను వివరించెను.[1]

పై నాలుగు ప్రతులను సంప్రతించి నూతన పరిష్కృత ప్రతిని 1840 వ సం॥లో బ్రౌను సిద్ధము చేయించెను [2]

ఈ నూతన శుద్ధప్రతిలో ప్రతిపుట పైభాగమున బ్రౌను **'New Edition'** అని పేర్కొనెను. ఈ కావ్యమున కాతడు 1840 సం॥ జనవరి 7వ తేది ఆంగ్లములో కథాసంగ్రహమును సంతరించెను [3] శ్రీకాళహస్తిమాహాత్మ్యమునకు 'యాదవరాయ చరిత్ర' మను నామాంతరమున్నట్లు బ్రౌను సూచించెను [4]

1832 వ సం॥ నుండి 1840వ స ॥ వరకు ఈ కావ్యపరిష్కరణకు బ్రౌను పాటుపడెను. కావ్యపరిష్కరణ కొక ప్రతియున్న చాలదు. ఉన్నదానిని సవరించిన, నది కవిరచనకు సన్నిహితముగ నుండదు అందువలననే బ్రౌను ఏండ్లు పూండ్లు పట్టినను దేశమంతయు గాలించి. ప్రతులను సేకరించి, ధూర్జటికృత కాళహస్తిమాహాత్మ్యమును యథాతథముగ నాంధ్రుల కందించెను.

---

1. "Of this rare poem until 1833 I never was able to obtain but one manuscript, and that is imperfect and incorrect. I at last traced it at Gadwal in the Hyderabad Government, whence with some difficulty I obtained this copy 1832. Subsequently I collated it with the copy in the Mackenzie library.

   In this copy I have entered the various readings found in the Ms in the Mackenzie library - 1840 and likewise those of two other manuscripts recently obtained."

2 The Calahasti Mahatmyam - New Edition, 1840. Founded on comparison of four Mss. And an English summary of the story D. 356.

3. LITERARY COLLECTIONS BY C P. BROWN P. 160.

4. "Also called Yadavaraya Charitra a Telugu poem written by Dhurjati and newly edited by the aid of various manuscripts in 1840' under the directions of C. P. Brown, Ibid. P. 145.

### 3. 6. ఉత్తరరామాయణము (తిక్కన)

3. 6. 0. ఆంధ్రులు ప్రసిద్ధాంధ్రకవులలో తిక్కనకే అగ్రతాంబూలము నిచ్చినట్లు బ్రౌను అభిప్రాయపడెను.*

తిక్కన పూర్వరామాయణమును వదలిపెట్టి ఉత్తరరామాయణమును మాత్రము తెలిగించుటకు కారణము అంతకు పూర్వమే పూర్వరామాయణమును భాస్కరుడాంధ్రీకరించియుండునను అభిప్రాయమునే బ్రౌను కలిగియున్నట్లు అతని వాక్యముల వలన విదితమగుచున్నది[1] భాస్కరద్వైతాద్వైతవాద మప్పటికి తెలుగు వాఙ్మయరంగమున పొడమినట్లు కానరాదు.

చారిత్రక దృక్పథము తెలుగువారికి తక్కువయని బ్రౌను చక్కగ నెత్తి చూపెను : "Yet regarding so popular an author we have no biographical accounts,..."[2] ఆంధ్ర వాఙ్మయ చరిత్ర రచన కుపకరించు కవుల జీవిత విశేషములను సేకరించిన ఆద్యులలో బ్రౌను దొరయు నొకడు తెలుగు సాహిత్యమును ఆంధ్రేతరులకు పరిచయము చేసినవారిలో ఆద్యుడు కావలి రామస్వామియైనను అతని గ్రంథము కేవలము కవి జీవిత విశేషములనే చాటుచున్నది. కాని బ్రౌను వ్యాసములు విమర్శయుక్తములై తెలుగు సాహిత్య విశిష్టతను నిరూపించుచున్నవి.

---

* "But whatever popularity has been attained by these poets philologists with one voice declare Ticcanna to be the unrivalled model of style in the Telugu language His first work seems to have been the seventh book, or supplement (Uttara Canda) of the Ramayan which bears the name of Bhascara. Ayyala Bhatta and Mallic Arjana were Bhascara's coadjutors: the former completed the sixth book and the latter wrote the fourth and fifth After the seventh was completed by Ticcanna, he gained the epithet Somayagi or Auspex for he bears this name in the Mahabharat".

1. Es. on Tel. Lit. Para. 79.
2. Ibid.

3.6.1. మ. ప్రా. పు. భాండాగారమున నిర్వచనోత్తర రామాయణపు కాగితపు ప్రతి యొకటి మాత్రమె యున్నది. (D 3) ఇది సమగ్రము. పుటకు ఒక వైపుననే వ్రాయబడెను. పద్య పంక్తుల నడుమ పాఠాంతరములు గుర్తింపబడినవి.

ఈ నిర్వచనోత్తర రామాయణ ప్రతులు దేశమున మిక్కిలి అరుదనియు లభించిన ఒండు రెండింటిలోను పాఠభేదము లనేకములనియు బ్రౌను పేర్కొనెను:
"Manuscripts of this poem are very rare but deviate greatly in the readings as will be seen in every page of the poem" [3]

పాఠాంతరములు గుర్తించిన ప్రతి మాత్రమె కన్పించుచున్నది; శుద్ధప్రతి కానరాకున్నది. బ్రౌను 'స్వీయచరిత్ర' (1866)లో తన పర్యవేక్షణలో ముద్రితమైన గ్రంథముల పట్టికలో ఉత్తరరామాయణమును కూడా పేర్కొనెను. దీని కర్తృత్వమును తెలుపలేదు. కాన ఆతడు ముద్రించినది తిక్కన కృతియో లేక కంకంటి పాపరాజ కృతియో తెలియరాదు. బ్రౌను ముద్రించిన ప్రతియు అలభ్యము.

### 3. 7. హరివంశము :

ఇది ఎఱ్ఱన కృతి. బ్రౌను వ్రాయించిన ఈ హరివంశపు కాగితపు ప్రతి ఒక్కటి మాత్రమె లభించుచున్నది. (D 325) హరివంశపు పూర్వోత్తరభాగములు రెండును నిందు సమగ్రముగ నున్నవి.

3.7.1. గ్రంథారంభమున విష్ణుపురాణమునందలి హరివంశమును గూర్చి విల్సన్ దొర పేర్కొనిన విశేషముల నట్లే బ్రౌను ఉద్ధరించెను.[1] దీనిని తన

---

3. D. 3

1. "A Telugu version of the Hari Vamsam
In his Preface to the Vishnu Puran, page I viii
WILSON says—
The Hari Vamsam professes to be part of the Mahabharat it may more accurately be ranked with the Pauranik compilations of least authenticity and latest origin, It is chiefly occupied with the adventures of Krishna, but as introductory to his Ora, it recards particulars of the creation of the world, and of the patriarchal and regal dynasties"
D. 325.

కొసగబడిన మరొక ప్రతితో పోల్చవలెనను సూచన కలదు కాని ఆ ప్రతి నెవరు, ఎప్పుడిచ్చిరి అను వివరములు లేవు [2]

ఇందు పాఠభేదములు పంక్తుల నడుమ గుర్తింపబడినవి. కథావిషయక - ఉపశీర్షికలు పొందుపరుపబడినవి. ఇందలి పూర్వభాగపు తొమ్మిది ఆశ్వాసములను, ఉత్తర భాగములోని అయిదాశ్వాసములను ఎవరు 'మొకాబిలా' చేసినదియు తెలియ వచ్చుటలేదు ఉత్తర భాగములోని ఆరవ ఆశ్వాసము మొదలు పదియవ ఆశ్వాసము వరకు వారణాసి రామస్వామి, కొర్రపాటి చెన్నప్ప 1832 వ సం॥ ఆగస్టు 22 వ తేదీ నాటికి ('మొకాబిలా') పూర్తి యొనర్చిరి (D. 325) ఈ హరివంశమునకు తీర్పు పాఠములను నిర్ణయించిన ప్రతి లభించుటలేదు ఈ కృతి పరిష్కరణమున కెవరిని నియోగించినదియు తెలియుట లేదు ప్రతులను సేకరించి పాఠాంతరములను బ్రౌను గుర్తించెననుటలో సందియము లేదు.

3. 8. భాస్కర రామాయణము :

3 8 0. భాస్కరరామాయణ కృతి పరిష్కరణమున బ్రౌను దొరకు తోడ్పడిన పండితులెవరో తెలియుటలేదు. దీనికి మాతృక కడప ప్రాంతమునందు లభించినదట మఱియొక ప్రతి రాజమహేంద్రవరము జిల్లాలోని రాజానగర వాస్తవ్యులగు కంకటాల రాయప్పగారి యొద్ద దొరకెను. మ ప్రా. పు భాండాగారమందలి D 143, 154 కాగితపు ప్రతులు నాలుగు సంపుటములుగ విభక్తము. D 143 సంపుటములలో సుందరకాండవరకు గల భాగమున్నది. D 154 లో యుద్ధకాండము సంపూర్ణముగ కలదు

3. 8 1. పరిష్కరణ కుపయుక్తమైన ప్రతుల వివరణ మిట్లున్నది :

"యిందుకు మాతృక గ్రంథం కడపదేశమందు కలిగింది
యీ పొస్తకం విభేదాలు యెక్కించిన ప్రతు వైనం —
౧ రాజానగరం ప్రతి .........జిల్లా రాజమహేంద్రవరం
౧ స్వయమైన ప్రతి .........నె ౪౫౫ గల ప్రతి " (D 143)

---

2. "THE HARI VAMSAM
Translated into Telugu by......
N. *B.* : This is to be collated with ms lent to me– No. 26" (Ibid )

'స్వయమైన ప్రతి' బ్రౌను స్వయముగ కడపజిల్లాయందు సేకరించినది కానోపును. కడపప్రతిని ప్రధానముగగొని, రాజానగరము ప్రతితో పోల్చిరి. ఈ ప్రతిలో లేక రాజానగరము ప్రతిలోనున్న పద్యముల గుర్తించిరి అట్లే ఇందుండి అందు లోపించిన వానిని కూడ సూచించిరి (D 143) ఈ పరిష్కరణమున బ్రౌనుచే నియుక్తులైన పండితులు వాల్మీకి రామాయణమును, తెలుగు ద్విపద రామాయణమును సంప్రతించిరి ఉదా : యుద్ధానంతరము రాముడు పుష్పకాధిరూఢుడై పూర్వవృత్తాంతములు చెప్పుసందర్భమున "సేతువు చూచితె యబల సింధువు మీద మవియ్య సన్మశో" యుద్ధకాండ (వా ప్ర 706 ము. ప్ర 2483) అను పద్యమునకు ఎదురుగా "యీ స్థలమందు-ద్విపద రామాయణమున కున్న - వాల్మీకరామాయణమునకున్న భేదము గా వున్నది-

వాల్మీకీయ యుద్ధకాండ - ౧౨౫ సర్గః పేజి ౧౯౫ ౨౧. శ్లోకము - ద్విపద యందు పేజి - ౨౪౧౮ లో ...

ద్విపద రామాయణమందు సైడు ౯౩౭౪ చూచుకోవలశ్చిది." అని ఉన్నది

దీనిని బట్టి ద్విపదరామాయణ మప్పటికి పరిష్కరింపబడి పుటల సంఖ్యతో సిద్ధముగనున్నట్లు తెలియుచున్నది తన పర్యవేక్షణలో ముద్రితమైన గ్రంథములలో భాస్కరరామాయణ మొకటియని బ్రౌను తన స్వీయచరిత్రలో (1866) పేర్కొనెను

"యథారాజా తథా ప్రజా" యని కదా ఆర్యోక్తి బ్రౌను మహాశయునికి ప్రతుల సేకరణమున గల ఆసక్తిని అతని క్రింది అధికారులును గుర్తించి, అతనితో సహకరించినట్లొక లేఖ తెలుపుచున్నది.*

---

* "మహారాజశ్రీ సీ॥ పీ॥ బ్రౌన్ యిస్కొయరు ధొరగారి సముఖానకు-గజవెల్లి కొండయ్య వ్రాసుకొన్న అర్జీన్ విన్నపములు ది ౧౦ మాచిన్ తారీఖున దయ చేసి పంపించిన వుత్తరం ది ౧౨ తారీఖున అందినది-
..... ... భారతం ౧౮ పర్వములున్ను, రంగానాథరామాయణం, భాస్కర రామాయణం, దశావతార చరిత్ర, సత్యభామాసాంత్వనం, భల్లాణ చరిత్ర బహులాశ్వచరిత్రను గురించిన్ని ఆ పుస్తకములు వున్నవారు ఖరీదుకు యిచ్చినా సరే లేక బహుమానం కానలసివుంటే ఆ వయ్నాం తెలియచేస్కుంటే ఆ చొప్పున చేయిస్తున్నామని వ్రాయించి నా వద్దకి పంపించిన ప్రకటన కాగిదం - నా కచేరీలో కట్టించడమే కాకుండ యవరెవరితోటి పైగా నేనున్ను తెలియజేస్తూ వుండడ మయ్నింది : ఆ వయ్నాం వెనకనుంచి వ్రాసుకుంటున్నాను.. ....
ది ౨౦ మార్చి ౧౮౩౪ సం॥ గజవెల్లి కొండయ్యవ్రాలు.
యర్రనగూడెం.

చంపూకావ్యమైన భాస్కర రామాయణము భాస్కరుని పేరుతో నున్నదనియు భాస్కరుడు ఇతర కవుల సాహాయ్యముతో దీనిని రచించెననియు, ఇందలి శైలి ఆంధ్ర మహాభారత శైలివలె, తత్సమపద భూయిష్ఠమగుటచే సామాన్య ప్రజానీకమునకు అందుబాటులో లేదనియు బ్రౌను అభిప్రాయపడెను. 1

## 3. 9. కాశీఖండము :

తెనుగు సాహిత్యమును గూర్చిన పరిచయ వ్యాసములో, బ్రౌను పురాణములు ఒక వాఙ్మయ ప్రక్రియని పేర్కొనెను. అందు పద్మ, విష్ణు పురాణములు బహుళ ప్రచారమున నున్నవనియు, కూర్మ, మార్కండేయ, స్కాంద పురాణములను పాఠకులు అంతగ అభిమానింపరనియు. స్కాందపురాణాంతర్గతమగు కాశీఖండమును శ్రీనాధుడు స్వేచ్ఛానువాద మొనర్చెననియు తెలిపెను సంస్కృత - అష్టాదశ పురాణము లన్నియు తెనుగులోనికి అనువదింపబడలేద యు, విష్ణు సంబంధగాథలుగల పురాణములనే కవులాదరించిరనియు, శివసంబంధి పురాణముల ననాదరించిరనియు నుడివెను.1

3. 9. 1. మ. ప్రా. పు భాండాగారమున కాశీఖండము కాగితపు ప్రతులు నాలుగు కలవు (*D* 330, 331, 332, 334) వీనిలో *D* 332 మెకంజీవారు సేకరించిన ప్రతి 2 ఇందు కాశీఖండ ప్రథమాశ్వాసముతోపాటు దశావతారచరిత్ర, సాముద్రిక శాస్త్రము, రెట్టమత శాస్త్రము, భోగినీదండకమును కలవు.

*D* 331-వ ప్రతియందును కాశీఖండ ప్రథమాశ్వాసము మాత్రమే కలదు D 330, D 334 ప్రతులందు కాశీఖండపు 7 ఆశ్వాసములు సంపూర్ణముగ కలవు. వీనిలో D 334 చిత్తుప్రతిగ తోచును. ఇందు పత్రమున కొకవైపుననే మూలమును వ్రాసి పంక్తులనడుమ పాఠభేదములు గుర్తింపబడినవి. వానికి నెదుటిపుటలో నిర్దుష్టములని ఎన్నుకొనిన పాఠములు గుర్తింపబడెను D 330 పరిష్కృత శుద్ధప్రతి. ఇందు పత్రమునకు రెండువైపుల పద్యములు వ్రాయబడి యున్నవి.

---

1. Es on Tel. Lit. Para. 20.

1. Ibid. Paras : 27, 28, 29.
2. "Cat :- This M. S. belongs to the Mackenzie collection & the work under notice is described on Page 309 of Wilsons catalogue." Descriptive catalogue. Vcl. I. P.

"మహారాజశ్రీ సీ పీ బ్రౌను దొరగారి సముఖానకు ఓత్తూరి టప్పాలా ఫీసులో వాలంటీరుగా వ్రాస్తువున్న హరిప్రసాదు మిక్కిలి వినయముగా సలాంచేశి వ్రాసుకొన్న మ-వి యేమంటే॥ ౧౮౪౩ సం॥ సురూపుసింగు మూలంగా మీయొక్క ఆఫీసులో సూరా రామస్వామి నాయుడి కాశీఖండం వ్రాస్తూ వుంటిని అప్పుడు మీరు అశ్వమేధయాగము వ్రాయమని ఆజ్ఞాపించగా ఆ అశ్వమేధయాగము వ్రాసి తమకు యిచ్చి మళ్ళీ ముందు వ్రాస్తూవున్న కాశీఖండం వ్రాసి ముగించి సూరా రామస్వామి నాయుడికి యిచ్చినంతట మళ్ళీ నాకు అప్పట్లో యేమిన్ని......"[3] ఈ లేఖనుబట్టి హరిప్రసాదను యువకుడు 1843 వ సం॥ కాశీఖండమును బ్రౌనునకు వ్రాసిఇచ్చినట్లు తెలియుచున్నది

3. 9. 2. కవిసార్వభౌముడు శ్రీనాథమహాకవి 'ప్రాయమింతకు మిగులఁగై వ్రాలకుండ' రచించిన ప్రౌఢకావ్యము కాశీఖండము. ఇది సంస్కృత స్కాంద పురాణమునందలి యేబది ఖండములలోగల కాశీ ఖండమునకు అనువాదము. మహాపురాణైక దేశమగు సంస్కృత కాశీఖండము సులభగ్రాహ్యమై పురాణ రీతిలోనుండగా, తెనుగున శ్రీనాథుడు ప్రౌఢతరమగు కావ్యశైలిలో దీనిని రచించెను. కావుననే "కాశీ ఖండమయః పిండమ్" అను ఆభాణకము తెలుగు కాశీఖండమును బట్టియే ఏర్పడినదని కొందరు ప్రజ్ఞుల అభిప్రాయము.* సంస్కృత మూలమున ద్వాదశ సహస్రగంథ పరిమితిగలకాశీఖండము తెలుగున నేడాశ్వాసములు (1777 గద్యపద్యములు)గల కావ్యమైనది. కాశీఖండమునకు బ్రౌను రచించిన పీఠికలో తెనుగు కాశీఖండ సంక్షిప్తతను గూర్చి పేర్కొనెను. స్కాంద పురణాంతర్గత కాశీఖండ పూర్వభాగము తెలుగున లభించుట లేదనియు, ఉత్తరభాగమును నైషధాంధ్రీకర్తయగు శ్రీనాథుడనువదించెననియు తెలిపెను. బ్రౌను పోషితవర్గ పండితులలో నొకడగు నరసింహాచారి దీనిని పరిష్కరించెను. లభించిన నాలుగు తెలుగు ప్రతులందలి పాఠములను పోల్చుటయే కాక, సంస్కృత మూలమును కూడ సంప్రతించి పాఠనిర్ణయమొనర్చెను. అయినను ఈ పరిష్కృత ప్రతి తన కంత సంతృప్తికరముగ లేదనియు, తెలుగు ప్రతులలో పెక్కు పాఠభేదములున్నట్లును, అందును గద్యభాగములందు శ్రీనాథుడు వాస్తవముగ

---

3. **Sr. Lts. N. 425. P. 441.**

*కాశీఖండము. పీఠిక. శ్రీ నిడుదవోలు వేంకటరావు. వావిళ్ళ. 1969.

ప్రయోగించిన ప్రయోగములేవో తెలియరాకున్నవని బ్రౌను తన ఉపోద్ఘాతమున సూచించెను.[4]

పద్యరచనలలో యతిప్రాసల సాహాయ్యముచే నిర్దుష్ట పాఠ నిర్ణయము నిర్దేశింప నగును కాని గద్యరచనలలో అట్లు వీలు కాదు కావున గ్రంథపరిష్కరణమున యతిప్రాసల ఆవశ్యకత వ్యక్తమగుచున్నది.

## 3. 10. ఉత్తర రామాయణము (కంకంటిపాపరాజు)

3-10-0 నిర్వచనోత్తర రామాయణమునకు వలెనే కంకంటి పాపరాజు విరచితోత్తర రామాయణమునకు కాగితపు ప్రతి యొక్కటి మాత్రమే D 4 | మ ప్రా.పు. భాండాగారమున కలదు. ఇది రెండు సంపుటములుగ విభక్తము. ఒక్కొక్క సంపుటి యందు 4 ఆశ్వాసములు కలవు. రెండవ సంపుటము మరల 'Vol II. A, Vol. II, B' అని రెండు విభాగములుగ నున్నది.

3. 10. 1 కంకంటి పాపరాజునకు పూర్వము తిక్కన ఉత్తర రామాయణమును తెనిగించినట్లు బ్రౌను పీఠికలో పేర్కొని యున్నాడు.[1] బ్రౌను వ్రాయించిన కం. పా. ఉ. రామాయణపు ప్రతియందు కాగితమున కొకవైపున మూలగ్రంథము కలదు ఖాళీగనున్న ఎదుటి పుటలలో బ్రౌను ఆంగ్లమున వ్రాసిన సూచికలు, అర్థ వివరణలు, పద్యానువాదములున్నవి.

---

4. The present is a corrected edition, having been prepared at my request by Narasimha Chari, a pandit in my employ who consulted four manuscripts of the Telugu and one of the Sanscrit text. The result however is not satisfactory as the Telugu copies varied from each other so greatly that it is often hard to determine, in prose passages, what were the words really used by Sri Natha." (D. 330).

1. "In former days Ticcana translated the Uttara Ramayana into Telugu" (D. 4. Vol. I)

ఉదా : సీ॥ హిమ దామకరకుంద సుమదామ శరబృంద

సమధామమై జన్నిదము బౌసంగ'

(వ్రా ప్ర 1-114, 115. ము ప్ర 1-99)

అను పద్యమున కెమరుగ బ్రౌను "Description of Hanuman's appearance (in the Aranya Kanda)" అని వ్రాసెను. పదముల కర్థములు : ఉదా :

'రసాలల్' అనగా వృక్షము.

ఈ రామాయణాధ్యయనమువ కొన్ని పద్యముల కాతడొనర్చిన ఆంగ్లాను వాదములు :

ఉదా :

అంతటిలోన సీతడు దయాద్రిపయిన్ పొటొడతెంచు పద్మినీ
కాంతుజపావ ప్రసూన రుచికాంతుగనుంగొని పండటంచు వి
భ్రాంతి వహించి యాకవి తోరన్ రవి పైకెగసెన్ సమీర నా
గాంతక బాణవేగ పరిహాసి సమిద్ధ మహాజవోద్ధతిన్.

వ్రా. ప్ర 5-109. ము. ప్ర. 5-99.

"His mother went to get him an apple to eat- Mean while he saw the sunrise - took it, for an apple and flew at it"

3 10 2. ఇందుగల అవాల్మీక విషయములను మరియు తెనుగు ద్విపద-ఉత్తరరామాయణమున లేని విశేషములను బ్రౌను గుర్తింపచేసెను.

ఉదా :

1) హేతి ప్రహేతుల వృత్తాంత సందర్భమున శివుడు విజయం చేయుట.

"సీ॥ బలుకెం జెడలతోడ దెలిగన్నెరల వెన్నె

గల క్రొన్నెల వతంసకంబు తోడ"

వ్రా. ప్ర. 1-301, 302 ము. ప్ర. 1-260.

అను పద్యమున వర్ణితము.

ఈ పద్యమునకు ఎదురుగా "యీవర్ణనాంశ సంస్కృత ద్విపదలయందులేదు. ముఖ్యకథాంశ మాత్రము యున్నది" అని గుర్తింపబడెను.

3. 10. 3. ఉత్తర రామాయణమును పుష్పగిరి తిమ్మన రచించి, కంకంటి పాపరాజునకు 6000 నాణ్యములు ఋణపడియుండుటచే, తన ఉత్తర రామాయణ కర్తృత్వమును పాపరాజున కర్పించి ఋణ విముక్తుడయ్యెనను కింవదంతిని బ్రౌను (యథార్థగాథగ) ఉగ్గడించినాడు. అప్పటి కింతను ఆంధ్ర వాఙ్మయ చరిత్ర పరిశోధనకు పూనుకొనిన వారు లేరు ప్రచారములోనున్న జనశ్రుతులను, పుక్కిటి పురాణములను వాస్తవ కథనములని విశ్వసించిన కాలమది.[2]

"కంకంటి పాపరాజు ప్రళయ కావేరి పట్టణములో నమీనుగా లౌక్యాధికారము నందుండినవాడు. ఆ కాలమునందే ఈయనవద్దఁ బుష్పగిరి తిమ్మన్న కొంత ఋణము చేసి యాయప్పు తీర్పలేక యీ పుస్తకమును దాని క్రిందఁజేసి యివ్వగా, ౧౭౯౦ వ- సంవత్సర ప్రాంతమున నుత్తర రామాయణమును పాపరాజు తన పేరితోఁ బ్రచురించెనని చెప్పుచున్నారు"[3] అని వీరేశలింగము పంతులుగారు పేర్కొనుటకు బ్రౌను వ్రాతలే కారణమై యుండవచ్చును. కాని బ్రౌను పాపయ్య మరణకాలముగ తెలిపిన దానిని పంతులుగారు కావ్యప్రచురణ కాలముగ నిర్దేశించిరి. ఈఉభయుల నిర్ణయమునకు ఆధారములేవియో తెలియరాకున్నవి పాపరాజు సమకాలికుడగు ధరణిదేవుల రామమంత్రి కాలమును బట్టి, ఇతరాధారములను బట్టి పాపరాజు కాలము క్రీ. శ 1660 అని శ్రీ S. V. జోగారావుగారు యక్షగాన వాఙ్మయ చరిత్రలో నిర్ణయించిరి.[4]

పాపరాజ కాల నిర్దేశ విషయమున పొరపడినను, తెనుగునాట ప్రశస్తి, ప్రచారము లందిన కంకంటివారి ఉత్తరరామాయణము కాలగర్భమున లీనము కాకుండ ఉద్ధరించి ఆంధ్రుల కందించి మహోపకార మొనర్చిన మనీషి బ్రౌను.

---

2. "This poem is asserted to be the composition of Pushpagiri Timmanna; who being in debt. 6000 pagodas to Cancanti Paparaz has in payment relinquished the authorship to him. He died about **A. D.** 1790 at pulicat where he was an Ameen." (D. 4. Vol II B).

3. ఆంధ్ర కవుల చరిత్ర. తృ. భా. పుట. 103.

4. యక్షగాన వాఙ్మయము ద్వి. భా. పుట 15

ప్రకరణసారాంశము :

1. బ్రౌను మొత్తము 8 పురాణేతిహాసములను పరిష్కరించెను. అయిదింటికి పాఠాంతరములను గుర్తించెను. ఇంచుమించు 28 పురాణేతిహాస కావ్యములకు తాళ పత్ర ప్రతులను సేకరించి, కాగితములపై కెక్కించెను.

2. బ్రౌను పూనుకొనిన ఆంధ్రకావ్య సముద్ధరణ కార్యములో అతడు మొదట చేపట్టిన గ్రంథములు భాగవత, భారత, రామాయణ, విష్ణుపురాణాదులు.

3. వీనిలో బ్రౌను భాగవతము, భారతము, భాస్కర రామాయణము, ఉత్తర రామాయణములను ముద్రించెను. వీనిని ముద్రించినవారిలో బ్రౌను దొరయే ఆద్యుడు.

4. ఈ పురాణ పరిష్కరణమున బ్రౌను విదేశీయులకు బోధపడునట్లు పురాణములను గూర్చి సాకల్యముగ వివరించెను. ఇది ఆతని జిజ్ఞాసకు నిదర్శనము

5. ఈ పురాణేతిహాసముల అధ్యయన సమయమందును, పరిష్కరణ సందర్భమునను బ్రౌను ఆంధ్ర కవులను గ్రీకు కవులతో, ఆంగ్ల కవులతొ పోల్చి తారతమ్యముల చూపుట పరిపాటి. నచ్చిన పద్యముల నాఙ్గీకరించుట అతని రసికతకు నిదర్శనము.

6. బ్రౌను ప్రబంధములకన్న పురాణములను మొదట చేపట్టుటకు వాని శైలీ సారళ్యమే కాక ప్రజాభిమానమును కారణమై యుండవచ్చును. ప్రబంధములు పండితమండలి సమాదరణీయములు. పురాణేతిహాసములు ప్రజాభిమాన పాత్రములు. బ్రౌను సాహిత్యము ప్రజాసామాన్యమునకు అందుబాటులో నుండవలయునని కోరెడివాడు కాన ఆతని దృష్టిని మొదట పురాణేతిహాసములు ఆకర్షించి యుండనగును.

7. ఈ పురాణేతిహాస పరిష్కరణలో బ్రౌనునకు తోడ్పడిన పండితులు – వెంచయ్య (విష్ణుపురాణము), బుచ్చయ్య (విష్ణు పురాణము), కృష్ణయ్య (విష్ణు పురాణము), జూలూరి అప్పయ్య (విష్ణు పురాణము, పద్మపురాణము) గరిమెళ్ళ వెంకయ్య (భారతము – ఆరణ్యపర్వము), నరసింహాచారి (కాశీఖండము).

8. బ్రౌను హిందూమత గ్రంథములను పరిష్కరించెనే కాని వానిని ముద్రింప లేదు అను మరువూరు కోదండరామిరెడ్డిగారి అభిప్రాయము పొరపాటు 1

9 ధూర్జటి శ్రీ కాళహస్తి మహాత్మ్యమునకు బ్రౌను ఆంగ్లమున కథాసంగ్రహమును సమకూర్చెను.

---

1. "సి. పి. బ్రౌను తెనుగు పురాణాలు ప్రబంధాలు సేకరించి, శోధించి వ్యాఖ్యానాలు వ్రాయించి కాగితాలు మీదకు ఎక్కించి భద్రపరచినారు గాని, మత సంబంధమైన వాటిని ఎత్తుకొనక, తక్కినవాటిలో కొన్నింటిని మాత్రమే ప్రచురించినారు హిందువుకాని ఒకరు మతగ్రంథాలను అచ్చువేయుటను పూర్వాచార పరాయణులు ఇచ్చగింపరేమో ! అప్పుడే మతమిషతో శిపాయి తిరుగుబాటు జరిగి ఉండినది బెంగాలులోవలె ఏదైనా ఒక ఆంక్షఉండి, అది ఈ దొరచెవిన బడినదేమో. కాబట్టి మన మత గ్రంథాల పొంతకు ఈయన అంతగా పోరైరి." – 'ఆంధ్రవాఙ్మయము : వావిళ్ళ' పు 137.

# 4

# శృంగార ప్రబంధముల సముద్ధరణ

4 0 మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమున శృంగార ప్రబంధముల పట్టికలో మొత్తము 147 గ్రంథముల వివరణకలదు. వీనిలో భోజరాజీయాదులు కొన్ని మాత్రము కథాకావ్యములు; తక్కినవి 140 శృంగార ప్రబంధములు. వీనిలో 25 తాళపత్ర ప్రతులు. ఈ తాళపత్ర ప్రతులలో కిరాతార్జునీయము, కృష్ణార్జున సంవాదము, మూర్ఖచరిత్ర అనునవి బ్రౌను సేకరించినవి (చూ అను. 1. ii) శేషించిన 115 కాగితపు ప్రతులలో 17 బ్రౌను వ్రాయించినవను నిర్ధారకముగ చెప్ప నాధారములు లేవు మిగిలిన 98 ప్రబంధములను బ్రౌను సేకరించినట్లు నిశ్చయముగ తెలియుచున్నది. వీనిలో బ్రౌను 24 ప్రబంధములను పరిష్కరింపజేసి, శుద్ధ ప్రతులను వ్రాయించి, కొన్నింటికి వ్యాఖ్యలను సంతరింపజేసెను కుచెలోపాఖ్యానమును, వైజయంతీ విలాసమును, వ్యాఖ్యాసహిత వసు, మను చరిత్రలను ముద్రించెను. ఈ ప్రకరణమున బ్రౌను పరిష్కరించిన వానిలో ప్రధానమైన 18 ప్రబంధములను గూర్చి ప్రస్తావింపబడును. మిగిలిన 6 ప్రబంధముల వివరములు, కేవలము కాగితపు ప్రతులు తయారు చేయించి, పాఠాంతరములను మాత్రము గుర్తించిన 74 ప్రబంధముల గూర్చిన విశేషములు అనుబంధమున (1. ii) కానవగును.

## 4. 1. దశావతార చరిత్ర :

4. 1 0 ప్రాచీనాంధ్ర కావ్యములలో భాస్కర రామాయణము 16 లేక 18 వేల పద్యముల సరళ రచన యనియు, 80 లేక 90 వేల పద్యములుకల కవిత్రయ భారతము నాతి కఠినమనియు, ఇంచుమించు పదివేల పద్యములతో వేదాంత విషయ సంభరితమైన పోతరాజు భాగవతము రామాయణ భారతములకన్న క్లిష్టతర మనియు, వీనియన్నిటికన్న దశావతార చరిత్ర ప్రౌఢతర ప్రబంధమని బ్రౌను తెలిపెను.[1]
**"The Dasavatara Charitra or Metamorphoses of Vishnu – This is an original Telugu poem composed about A. D. 1760 – It is**

1. **D** 524. దశావతార చరిత్ర

remarkable for beauty of language - and for preserving a uniformity of excellence''2 అని బ్రౌను ఈ ప్రబంధమును ప్రశంసించెను ఇప్పటి పరిశోధన వలన వాఙ్మయ చరిత్రకారులు ఈ కావ్యము క్రీ. శ 1620-30 నడుమ, రచింపబడి యుండునని నిర్ణయించిరి 3

4. 1. 1. దశావతార చరిత్రకు 2 తాళపత్ర ప్రతులు (D 521, 522) 11 కాగితపు ప్రతులున్నవి. ఈ కాగితపు ప్రతులన్నియు బ్రౌను వ్రాయించినవే.

D 520. + ఇది అయిదు సంపుటములుగ విభక్తము. ప్రథమ సంపుటములో ప్రథమాశ్వాసము, ద్వితీయమున ద్వితీయ తృతీయాశ్వాసములు, తృతీయమున చతుర్థ పంచమ, షష్ఠాశ్వాసములు చతుర్థమున సప్తమాష్టమములు, పంచమమున నవమ దశాశ్వాసములున్నవి.

తృతీయ సంపుటములోని ఆఱవ ఆశ్వాసాంతమున "౧౮౨౭ సం॥ అకటోబరు నెల ౨ తేదికి" గరుడయ్యగారు కొండలయ్య అను నిరువురు దశావతార చరిత్రను మొకాబిలా చేసినట్లున్నది.

చతుర్థసంపుటాంతములో "౧౮౨౭ సం॥ ఆ కటంబరు ౪ తేదికి" రాయసం గరుడయ్య. కొండలయ్య మొకాబిలా చూచినట్లున్నది. కాని అహల్యకథను మాత్రము శేషయ్య, రా. గరుడప్ప మొకాబిలా చేసిరి.

పంచమసంపుటములో "౧౮౨౭ సంవత్సరం ఆగడంబరునెల ౭ తేదీవరకు" రాయసం గరుడప్ప, కిచ్చయ్య లిరువురు మోకాబిలా చూచినట్లున్నది. కనుక బ్రౌను దశావతార చరిత్ర పరిష్కరణకు 1829-వ సం॥ ప్రాంతముల పూనుకొనెను.

ఈ సంపుటములలో పుటకు ఒక ప్రక్కన మూలమును యథాతథముగ వ్రాసి పద్యపంక్తుల నడుమ పాఠభేదములు గుర్తించి. ఎదుటి పుటలో పరిష్కర్తలు గ్రహించిన పాఠముతొసగబడెను.

---

2. D 520. Vol I. దశావతార చరిత్ర.
3. ఆంధ్ర కవి తరంగిణీ - సంపు. 12 పు. 52.

**D** 523 – అవతారికా భాగములేదు. దశమాశ్వాసమున 162-వ పద్యము వరకే కలదు. శేషించిన భాగము శిథిలమైయుండవచ్చును ఇందు పత్రమున కిరు వైపుల వ్రాయబడెను. పద్యపాద విభజనము, పద్యసంఖ్య, బ్రౌను ఆంగ్లమున గుర్తించిన విషయ సూచనలు, లఘుటిప్పణులు విరివిగ నున్నవి. ఇది సాపు ప్రతియై యుండవచ్చును

**D.** 524 – ఇది దశావతార చరిత్ర పూర్తి గ్రంథముకాదు. ఇందు దశావతార చరిత్రలోని సప్తమాశ్వాసమందలి అహల్యా వృత్తాంతమును 'అహల్యాసంక్రందన విలాస' మను పేరతో బ్రౌను ఆంగ్లములోనికి అనువదించిన 49 పద్యము లున్నవి ఈ అనువాదమును బ్రౌను 25-5-1824న ప్రారంభించెను. ఈ ప్రతిలో బ్రౌను చేసిన అప్పకవీయాంగ్లాను వాదమును కొంత ఉన్నది.

**D.** 525 – ప్రథమాశ్వాసము, ద్వితీయాశ్వాసములో కొంత భాగమున్నది పత్రమున కిరువైపుల వ్రాయబడెను.

**D. 526 & *D* 527** — రెండింటి యందును ప్రథమాశ్వాసము మాత్రమే కలదు. పుటకు రెండువైపుల వ్రాతకలదు.

***D.*** 528 – మూడు సంపుటములు. ఇది బ్రౌను దశావతార చరిత్రకు తయారు చేయించిన సవ్యాఖ్యాన ప్రతి. మొదటి సంపుటములో మొదటి రెండాశ్వాసములు, రెండవదానిలో మూడు, నాలుగు, అయిదాశ్వాసములు, మూడవ సంపుటములో ఆఱు, ఏడు ఎనిమిదాశ్వాసములు టీకా సహితముగ నున్నవి.

***D*** 529–అవతారికా భాగము లేదు. ఒకటి, రెండాశ్వాసములు నాలుగవ ఆశ్వాసములో కొంతభాగమున్నది. పత్రమున కిరువైపుల వ్రాయబడెను. ఇది నాలుగు సంపుటముల ప్రతి ఇందు **D** 528 ప్రతిలోని టీక మాత్రము ఎత్తి వ్రాయబడెను. తుది మూడు పుటలలో నీ భాగమునకు సంబంధించిన విషయసూచిక సమకూర్పబడెను.

**D** 530– ఇర్వ్యాదియు సటీక ప్రతి అయిదు నుండి ఎనిమిది ఆశ్వాసములు క్రమముగ, రెండవ ఆశ్వాసము 410-వ పద్యము నుండి 500 వరకు, నాలుగవ ఆశ్వాసము 276 వ పద్యమునుండి పూర్తిగ పుటకు రెండువైపుల వ్రాయబడి

యున్నవి. మొదటి నుండి 152-వ పుట వరకు మూలము చేర్పబడియున్నది. తదుపరి టీకమాత్రమే ప్రత్యేకముగ కలదు వ్యాఖ్యానింపబడిన పద్యములు లేవు.

D 531- ఇది దశావతార చరిత్రకు బ్రౌను సమకూర్చిన పదసూచి 'అంక' నుండి. 'చరువు' వరకు ప్రథమ సంపుటము, 'చర్చ' నుండి 'మరాళికా' వరకు ద్వితీయ సంపుటము, 'మరి' నుండి 'హ్మావిభుండు' వరకు తృతీయ సంపుటము

D 2915- ఇందు తొమ్మిది పది ఆశ్వాసములకు టీక కలదు. D 528 ప్రతి, ఈ ప్రతియు కలిపిన దశావతార చరిత్ర వ్యాఖ్య సంపూర్ణమగును.

4. 1. 2. మ ప్రా. పు. భాండాగారమున నున్న రెండు తాళపత్ర ప్రతులను సమగ్రమైనవి. అవి బ్రౌను సంపాదితములవునో కాదో నిశ్చయముగ తెలియుటలేదు. తిరుచునాపల్లి అప్పీల్ కోర్టు శిరస్తాదారుడైన నరసింగరాయని యొద్ద నుండి బ్రౌను ఒక ప్రతిని సంపాదించెను. అందు ఏడవ ఆశ్వాసములో 54-వ పద్యము మొదలు 203-వ పద్యమువరకు ఉండవలసిన అహల్యాకథ లేదట [4] చెన్న పట్టణములో మరొక ప్రతిని బ్రౌను సేకరించెను.[5] "ధారవారి పెద్ద పతి"ని ప్రధానముగ గొని, పైరెండు ప్రతులలోని పాఠములను పోల్చి ఈ ప్రబంధమును పరిష్కరించినట్లూహింపనగును [6] "This is all that the Wantimetta MS supplies" అను బ్రౌను వ్రాతను బట్టి ఒంటిమెట్టనుండి యొక ప్రతిని సంపాదించినట్లు తెలియుచున్నది [7] కనుక దశావతార చరిత్ర ప్రతులు తమిళనాడులోను, ఆంధ్రప్రదేశమునను బ్రౌనునకు లభించెను

ఒక కావ్యమును గ్రహించి దానిని పరిష్కరించుచునే మరల దానికి ప్రతులు దొరకునేమోనని అన్వేషించుట బ్రౌను అలవాటు. క్రొత్తపాఠముల కొఱకు నిరంతరము పరిశోధించుచునే యుండును. గజవెల్లి కొండయ్య బ్రౌనునకు 1834-వ సం॥ ఫిబ్రవరి 27, మార్చి 20-వ తేదీలలో వ్రాసిన జాబులను బట్టి ఆతనిని దశావతార చరిత్ర ప్రతుల సంపాదన నిమిత్తము బ్రౌను కోరినట్లును, అతడు తదన్వేష

4. D. 520. సంపు. 4. పత్రము. 1

5. అందే. పు. 94.

6. D. 520. సంపు. సంపు. 1. పత్రము. 60.

7. D. 520. సంపు. 5. పత్రము. 282.

ణలో నుండినట్లును తెలియుచున్నది[8] బ్రౌను ప్రతులు అన్వేషణకు అంతుగాని, అలుపుగాని యున్నట్లు కనిపించదు.

4 1. 3 దశావతార చరిత్ర ప్రబంధ పరిష్కరణకు బ్రౌను పెక్కురు పండితులను నియమించెను గరిమెళ్ళ వెంకయ్య, ములుపాక బుచ్చయ్యశాస్త్రి, చెంచయ్యలు దీనిని పరిష్కరించిరి. అటనట అద్వైత బ్రహ్మయ్య, జూలూరి అప్పయ్యలు కూడ సవరించినట్లు కాననగును.

పరవస్తు చిన్నయసూరి తనయొద్ద ఉద్యోగము చేసినట్లును, అతడు దశావతార చరిత్రను పరిష్కరించినట్లును బ్రౌను స్వహస్తలిఖిత లేఖనము లభించుచున్నది.[9] కాని ఆ పరిష్కృత ప్రతి నేడు కానవచ్చుటలేదు. (చూ. 9 వ. ప్రకరణము)

ఈ పరిష్కర్తలలో నెవరో మొదట పాఠములను తీర్పుచేసి వ్రాయగా తదుపరి ఆ పాఠములను గరిమెళ్ళ వెంకయ్య, చెంచయ్యలు పునః పరిశీలించి వారికి తోచిన నిర్దుష్ట పాఠములను నిర్ణయించిరి :

i. 59 సీ॥ సంగీత పుంభావ శారద సాహిత్య
తత్త్వాద్యతన కాళిదాసుడతుల
వితరణ ఖైదం యుగీన తపన తనయుండు
భూసురత్రాకృత భూమి తలుడు
భక్తి ప్రహృష్టనాభౌ సమోఘుడు శాశ్వ
తైశ్వర్య పాణౌ కృతాద్రిసుతుడు
జ
దిక్కూల ముద్రబి దేదీప్యదృవసకీతిన్
జాగ్రద్విషం ప శౌర్యశాలి

అం. తే॥ వీరవెంకటపతిరాయ విభువతంస
లావితోభయ చామర భద్రదంతి

8 Sr. of. Lt. M. 401. P. 339.

9. Entire Grammar of Telugu. D. 1330.
G. O. M. L. PP. 481 – 483.

దంత పర్యంకిక ది సన్మాన ఘనుడు
ధీమయన్మంత్రి మగవల తిమ్మమంత్రి
బ్రా. ప్ర. 1-59, 60. ము ప్ర. 1-35

"ఈ పద్యమున కెదురుగా" బు। శాస్త్రి। చెంచయ్య...తీర్పు...ముద్రుజ। ముద్రుబి యీరెండు శబ్దాలు అపశబ్దాలు అన్నిన్ని ముద్రిత అనె శబ్దము సుశబ్దము అని వ్రాయడమయ్యినది.

చో॥ చెంచయ - వెంకయ్యగారి తీర్పు॥

ముద్రిత శబ్దము యే ప్రతిలో లేనందున నున్న ముద్రుజ శబ్దమే సార్థక్య మైనందున తీర్పు ముద్రుజ శబ్దమే" అని యున్నది కూల ముద్రుజ అను పదమే లక్షణవంతము కూలమ్ ఉద్రుజతీతి కూల ముద్రుజః అని పదచ్ఛేదము. ఉత్ + రుజ = ఉద్రుజ = Destroying, undermining (as a bank; as in కూల ముద్రుజ[10] ఈ ఆధారములను బట్టి 'ఉద్రుజ' అనునదియే పదము. 'ముద్రుజ' అనునది కాదు. 'ముద్రిత' అని అనుకొనుటకు ఆస్కారమే లేదు. సంస్కృత వ్యాకరణ విశిష్ట లక్షణ లక్షితమైన ఈ 'కూలముద్రుజ' పదము పారిజాతాపహరణ మున తొలుత ప్రయోగింపబడి యున్నది." ...................... . ......

సామజ హయ కూలముద్రుజ క్షత జధునీ" (1-28)

ii) "వ॥ పద్మాప్తరుచిర పద్మాచ్ఛద్మ పద్మరాగ సరాగపిటంకానురాగ పారా వారా పార దృశ్యాపార పారావతారావ కూటంబగు కొలువు కూటంబునం బొడవు కెంపుసొంపు నింపు వినుకెంపు నుడికింపు విడికెంపు రవచెక్కడంపు కడవన్నె పసిడి గద్దియ నధివసించి, కరివెల్ప ముద్దియయాటపట్టు విరి ముద్దియపై పెద్ద కొలువుండు తెరగంటి పెద్దతో"

(బ్రా. ప ౧ - 25. ము ప్ర. 1-14)

ఈ వచనమున కెదురుగా "యాటపట్టు విరిముద్ది...... తెరగంటి పెద్దతో" అని యున్నది. దీని ప్రక్కన చెలంగు ముద్దియ వుండవలెను. అని - గ॥ వె॥ చో॥ చె

10. Apte's Sanskrit Dictionary.

తీర్పు" అని కలదు 11

పాఠములను నిర్ణయించిన తరువాత ఆ సవరించిన పద్యమును ఎదుటి పుటలో ఎత్తి వ్రాయుటయను విధానమును సుబ్బన్నయను నతడు ప్రవేశ పెట్టెనట.
"This arrangment is made by Subbanna"12

4. 1. 4. బ్రౌను తన వాడుక చొప్పున క్రొత్తపదములకు ఇతర కావ్యములనుండి ఆ కరములను చూపెట్టెడివాడు.

ఉదా : (i) "టీకలో ఉదుటు అనే శబ్దమును గురించి నా వద్దవుండె అయిదు ఉదాహరణములను యిక్కడ యెక్కించ వలసినది."13

(ii) "కెలసం, యిది తెలుగుకాదు డిక్సనరిలో వుండే తీర్పు చూచుకొవలశ్నది "14

సీ॥ కలికి యీ పొదరింటకాదె నీ వూరక
 కినిసి నాచేత మ్రొక్కించు కొనుట
తెరవ యీ ద్రాక్ష పందిటగాదె నడికిరే
 యిని వచ్చి నీవు నన్నేలి కొనుట
మెలత యీ గుజ్జుమామిడి నీడగాదె చి
 ల్కలు బల్క చెలులంచు నులికిపడుట
వనిత యీ కదళికావని గాదె దళవీజ
 నముచే రతాంతర శ్రమముడుపుట

తే॥ తలచుకొందువె యీసైకతమున గాదె
 నా
గాన బైకొనకున్న నోచాన మంచి
దత్తతో చెప్పి కొట్టింతుననిన జడిసి
నీవు నాకోక్కైకాదీచుటాట నీలవేణి.

(వ్రా ప్ర. 9-146, 147. ము. ప్ర 8-124.)

---

11. D 520. సంపు. 1. పత్రిము 8
12. D 520 సంపు. 3. పత్రిము. 74
13 D. 520. సంపు. 4. పత్రము. 28.
14. అందే. పత్రము. 40.

'కాన' తీర్పుచేయుటకు పండితులకు అర్ధగంట పట్టినదని బ్రౌను పేర్కొ నెను.15 చివరకు 'నాన' అను పాఠమునే గ్రహించిరి

అక్కట నన్నుబాసి క్షణమైన సహింపగలేరు గోపికల్
చక్కెర బొమ్మ లేకరణిసైచిరొయిన్నిదినంబులందులో
మిక్కిలి రాధ యియ్యెడను మేను ధరించుటదుర్లభంబునీ
వక్కడికేగి కృష్ణుదిదె వచ్చెనటంచు వచించుముద్ధవా.

(ప్రా. ప్ర. 9-438. ము. ప్ర 8-192)

ఈ పద్యము నాల్గవపాదముకడ బ్రౌను 'అఖండయతి' అని పేర్కొని "This is poetical license" అని నుడివెను. అఖండవళిని భీమనాది ప్రాచీన లాక్షణికులు పేర్కొనిరి. అప్పకవి దీనిని నిషేధించెను. కాని అఖండవళి ప్రయోగములు కవిత్రయ భారతమందును కాన వచ్చెడి. అప్పకవి వానికి అఖండవడిలేని పాఠాంతరములను కల్పించెను. అఖండవడికి భారతేతర గ్రంథములందు ప్రయోగములు అసంఖ్యాతములుగ నున్నవి. బ్రౌను దీనిని గుర్తించుట అతని సునిశిత పరిశీలనా దృష్టికి నిదర్శనము.

ప్రబోధ చంద్రోదయ నాటకములోని శిఖరిణీ వృత్తమునకు Dr Taylor చేసిన ఆంగ్లానువాదమును బ్రౌను గుర్తించి, అచట యతి పొరపాటుగ గుర్తింపబడి నట్లు చెప్పెను. మఱియు ప్రబోధ చంద్రోదయము ఆంధ్రాంగ్లములలో ననువదింపబడి నట్లు అదొక ఆధ్యాత్మిక వ్యంగ్యరచన యని వివరించి, అచట అనంగుడు రతీదేవికి తన శక్తి సామర్థ్యములను తెలుపుచు, ఇంద్రుని అహల్యాసంగమమునకు ప్రేరేపించిన వాడు తానేయని, చెప్పిన శ్లోకమును నాగరలిపిలో రోమనులిపిలో రచించెను 16 ప్రబోధ చంద్రోదయము నందలి అహల్య చరిత్ర నిట ప్రస్తావించుట వలన బ్రౌను ఈ కథనెన్ని గ్రంథములలో నెన్ని భాషలలో పరిశీలించెనో వ్యక్తమగును.

గ్రంథాదిలో బ్రౌను దశావతారములను దెలుపు శ్లోకమును రోమను లిపిలో వ్రాసెను :

---

15. D. 520. సంపు 5. పత్రము. 36

16. D. 520. సంపు 5 పత్రము. 123. b, 124

"Matsya kurma varaha cha
Narasimha cha va' mana
Ra'ma ramacha ra'macha
Krishna kalkijanardna" (*D* 523)

దశావతార చరిత్ర అచ్చతెనుగు కావ్యముకాదు కాని రామమంత్రి కాలము నకు అచ్చ తెనుగు కావ్యములు ప్రచారము లోనికి వచ్చినవి. రామయ్యాయు తన ప్రబంధమున ఒండు రెండు పద్యములను అచ్చ తెనుగున వ్రాసెను. బ్రౌను అచ్చికపద బాహుళ్యము, సంస్కృతపద బాహుళ్యముగల పద్యములను గుర్తించుట ఆతని భాషా పాటవమునకు నిదర్శనము.

సీ॥ లిబ్బిసిబ్బెర వుబ్బుగబ్బి గుబ్బెత మిన్న
కలిగి గొబ్బున నాథు కౌంగిలించె
బిట్టులిక్కి గట్టు రాపట్టి దొట్టిన భీతి
జెవుల జుట్టిన వ్రేళ్ళు జేర్చుకొనియె
నుదువుల ననబోడి జడియకుమని వెన్ను
సరచు ప్రాణే శురిచ్చ వడి చూచె
దిగు లొంది మూర్ఛ నొందిన శచీదేవికి
శైత్యోపచారముల్ సలిపె వజ్రి
గరుడ కిన్నర గంధర్వ ఖచర సిద్ధ
సాధ్య విద్యాధరాంగనల్ చకితలగుచు
నేమియైరొకొ తెలియదుద్దామ భీమ
రణ రణద్భేరి ధణ ధణం ధ్ధణ అనపుడు
వ్రా. ప్ర. 2–65, 66, ము. ప్ర. 2–55.

"A stanza in pure Telugu" అని బ్రౌను గుర్తించెను.

సీ॥ ప్రతి సాగరంబులై భద్రేభకర్ణ ప్రస
వన్మదాంబువులు భువనము లాన
ఘాటీ నిరాఘాట ఘోటీ ఖురాగ్ర భ
గ్న పరాగములు పరాగముల బోల

చక్ర పదావక్ర చక్ర మార్గంబుల
భోగ వత్యాప గాంబువులు వెడల
సైనికాస్యాన్యోన్య సంఘర్షణ స్ఫులిం
గంబు లంగార వర్షంబు గురియ
భూరి జయభేరి ఘాంకార ఘోరరావ
పూరితాపార గహ్వరోదార మేచ
ధారుణీధ్రంబు మొరవెట్ట దారుణముగ
దండు వీడిసె బలీంద్రుడు దక్కొండ దండ
ప్రా. ప్ర. 2 - 67, 68. ము. ప్ర 256.

**"A stanza in pure sanscrit"** అని బ్రౌను సూచన[17] పై పాదములు సాక్ల్యముగ అచ్చ తెనుగు పద్యముకాని, సంస్కృత పద్యముకాని కాజాలవు.

4. 1. 5. దశవతార చరిత్రకు గరిమెళ్ల వెంకయ్య దశలు దశలుగ వ్యాఖ్య రచించెను. ప్రథమాశ్వాసమునకు 28-6-1831 తేది, ద్వితీయాశ్వాసమునకు 2-8-1831 తేది, తృతీయమునకు 20-8-1831 తేది, చతుర్థమునకు 24-11-1831 తేది, పంచమమునకు 14-9-1831 తేది, షష్ఠమునకు 6-10-1831 తేది, సప్తమమునకు 28-12-1831 తేది, అష్టమమునకు 26-1-1832 తేది వెంకయ్య టీక వ్రాయుటను పూర్తిచేసెను. (**D.** 528) ఇంచుమించు ఏడు మాసములలో ఈ యెనిమిది ఆశ్వాసములకు టీకను రచించిన పిదప టీకారచన ఎందువలననో కుంటువడినది. నవమాశ్వాసమునకు 28-2-1834 తేది, దశమాశ్వాసమునకు 14-3-1834-వ తేది టీక పూర్తియయినది. (**D.** 2915).

టీకాసహితమగు ఈ ప్రబంధపు పది యాశ్వాసములు 4 సంపుటములుగ (7 పుస్తకములు) సమకూర్చబడెను. ఈ టీకను సమకూర్చ గరిమెళ్ల వెంకయ్య ఎంతో ప్రయాసపడినట్లు అతని లేఖ వలన తెలియుచున్నది :

"మహారాజశ్రీ సీ॥ పీ॥ బ్రౌన్ యిస్కొయరు ధొరకారి సముఖానకు—

17. **D** 523, పత్రము. 35.

తమ పండితుడు గరిమెళ్ల వెంకయ్య అనేక సమాములు చేసి వ్రాసుకున్న విజ్ఞాపనము యేమంటే ......... దశావతార చరిత్ర బహు ప్రబల గ్రంథమున్ను దానికి బహు కష్టపడి నేను టీక వ్రాసివున్నాను గనుక. తమరు ఆ గ్రంథము అచ్చువేయించిన పక్షమందు వొక ప్రతి నాకు దయచెయ్యవలెనని కోరుతున్నాను. అచ్చువేయించని పక్షమందు మూలమందలి టీకతో కూడవున్న ప్రతి ౧ నాకు దయ చేశి నట్టయితె నా దగ్గర వుంచుకొని తమను చేయించినందుకు తమ కీర్తిని ప్రసిద్ధి చేస్తూ వున్నాను చిత్తగించవలెను.

౧౮౩౮ సం॥ జూన్ నెల ౧ తేది.[18]

గరిమెళ్ల వెంకయ్య టీకను రచించినను, బ్రౌను అద్వైత బ్రహ్మయ్య, నృసింహాచారి, జూలూరి అప్పలయ్యలను ఆ టీకను పరిశీలింప నియమించినట్లున్నది [19] పండితులు సవరించిన టీకను బ్రౌను అంధప్రాయముగ గ్రహించెడివాడు కాడు. అతనికి సంతృప్తికరముగ నుండనపుడు స్వయముగ టీకను సవరించెడివాడు.

ఉదా : క॥ అనవుడు నేటికి భ్రమసెదు
విను వృద్ధశ్రవుడ కాట వినవోయేలా
వినవైతి కోడికూసె
దనరపమైమరుని ధర్మదారయనంగన్॥

వ్రా. ప్ర. 7. 164. ము. ప్ర 7-142.

ఈ పద్యము క్రింద "వృద్ధశ్రవుడనగా యింద్రుడు *" అని వ్రాసి దీనికి ఎదుటి పుటలో

"* యెందుకంటే: వృద్ధేభ్యః శృణోతి। పెద్దలవల్లను అనగా బృహస్పతి మొదలైన వారి వల్లను న్యాయమును వినేవాడు : అనగా తెలుసుకొనేవాడు ॥౧॥ వృద్దే శ్రవసీయస్య। అనగా గొప్ప చెవులు గలవాడు అని దీక్షితీయము। బాగా వినేవాడు

18. Sr. of. Lts. M. 401. Lt. No. 160. P. 306.

19. i) D. 528 Vol. I. Book. 1. Fol. 169.
ii) Ibid. Vol. I. Book. 2. Fol. 372.
iii) Ibid. Vol. II. Book. 1. Fol, 180.
iv) Ibid. Vol. III. Book. 1. Fol. 163, 164

అని లింగాభట్టీయము ॥2॥ వృద్ధం శ్రవః కీర్తిర్యస్య । అనగా గొప్ప కీర్తికలవాడు ॥3॥ అని ఈమూడు విధములుగా అర్థము ॥ కట్లా ఉండగా ఈపద్యములో ముదిసిన చెవులు గలవాడవైనందున, అనగా వినరాని చెవులు గలవాడవైనందున వినలేదా యేమి అని అహల్య యింద్రుణ్ణి అపహాస్యం చేసి పలుకుట ॥ ఈ వృద్ధశ్రవ శ్శబ్దమునకు ।శ్రీ ।సి। బ్రౌన్ దొరగారు విలక్షణముగా వివరము యోచించి యేర్పరచిన విధం యేమంటే । వృద్ధ శ్రవుడనగా విశాలమైన చెవులు గలవాడు"20 అని ఉన్నది.

వృద్ధము = గొప్పది, పిరివియైనది సూ. ని. పుట : 431

వృద్ధనాభి = పెద్ద బొజ్జవాఁడు సూ. ని. పుట : 431

టీకా కారుడు "ముదిసిన చెవులు వినరాని చెవులు" అని చెప్పిన అర్థము బ్రౌనుకు సంతృప్తికరముగ నుండక పోవుటచే 'విశాలమైన చెవులు' అను అర్థము ను నిర్ణయించి యుండును. 'Wide ears" అనుట ఆంగ్ల నుడికారము. ముదిసిన చెవులనుటకన్న ఇంత పెద్దచెవులుండియు వినిపించలేదా అని అహల్య ఇంద్రుని పరిహాసము చేయుట సరసము.

బ్రౌను దశావతార చరిత్రకు 1850 సం॥ ఏప్రిల్ 3-వ తేదిని పదసూచిని తయారు చేయించెను. (చూ. ప్రక. 8)

4. 1. 6. దశావతార చరిత్రలో బ్రౌనును అత్యంత మాకర్షించిన వృత్తాంతము అహల్యా చరిత్ర. 7-వ ఆశ్వాసము (45-71; 134-155; 166 వ పద్యము వరకుగల అహల్యా వృత్తాంతమును ప్రత్యేకముగనెత్తి వ్రాయించి, ఆ భాగమునకు "అహల్యా సంక్రందన విలాస"మని నామమిడి, ఈ పద్యములను ఆంగ్లములోనికి బ్రౌను అనువదించెను ఈ అనువాద కాలము క్రీ. శ. 1824-వ సం॥ మే 25. (*D*. 524). దీనికి **"The Loves of Ahalya And Indra"** అని ఆంగ్లమున నామకరణ మొనర్చెను. బ్రౌను సముఖము వేంకట కృష్ణప్పనాయక విరచిత అహల్యా సంక్రందనమును ఆదిలో చూచినట్లు లేదు. దానిని గురించిన ప్రస్తావన లేఖలలో గాని, అతని వ్యాసములలో గాని కానరాదు

**"Ahalya Sancrandana Vilasa-The poem usually produced with this title is in fact an extract from the seventh book of the Das Avatara.**

---

**20. D. 528. Vol. III. Book. i Fol. 163.**

But there is a separate modern Telugu poem bearing this name, 5 books, by Mulugu Papaya of Amaravati in the Guntoor District "[21] అను బ్రౌను వాక్యములు దీనికి నిదర్శనములు.

అనంతరమాతడు సముఖమువారి అహల్యా సంక్రందన ప్రతినికూడ సేకరించెను ( . 386). 1831-వ. సంవత్సరాంతములో కృష్ణారెడ్డి తూములూరు కొండయ్య వ్రాసిన "అహల్యా సంక్రందన విలాస" ప్రతి నొక దానిని బ్రౌనుకు పంపెను [22] అది ములుగు పాపయారాధ్యుల ప్రతి కావచ్చును.

మఱికి సింగన పద్మపురాణోత్తరఖండ తృతీయాశ్వాసములో అహల్యకథకల 65 పద్యములను 'అహల్యాచరిత్ర' మనుపేర 1825. మే 18 నుండి 25-వ తేది వరకు ఆంగ్లములోనికి బ్రౌను అనువదించెను. (D 383; ఇట్లు శృంగార రస భూయిష్ఠమైన అహల్యచరిత్రను బ్రౌను పురాణ ప్రబంధముల నుండి ఏర్చికూర్చి అనువాదముల సమకూర్చెను.

బ్రౌను చేసిన యీరెండు అనువాదములు ఆయా మూలానుసరణములుగ నుండుటయేకాక, మూలము నందలి భావ సౌందర్యమును, పదగుంఫనమును అనువాదమున చూపప్రయత్నించెను. ఉదా: పద్మపురాణము ఉత్తరఖండము.

ఉ॥ "చూడదు కన్నువిచ్చి మరి చూచిన నవ్వదు నవ్వెనేని మా
టాడదు మాట చొప్పడిన నందదు డెందము కాదు దీనిపై
వేడుకయేల పుట్టెఁగడువేదురుఁ గొల్పెమరుండు నన్ను నీ
చేడియ నెన్ని చందములఁ జెందక యూరడఁ జావవచ్చునే"

(D 383. ప. 19)

ఈ పద్యమున వ్యవహిత ముక్తపద గ్రస్తమను శబ్దాలంకారము కలదు. బ్రౌను అనువాదమునను నీ రచనా పద్ధతిని వాడుట విశేషము. 'She will not open her eyes to see me – if she see me she smiles not– though she smile she will not reply Though she fall into talk, her heart is not gained at any time - No ! how do I do at on her, ah, Love drives me mad - I must some way or other get this piece, or die of the scandal of failure !"

21. P. R. T. L. P. 72.
22. Sr. of. Lts. M. 417. Lt No. 101. PP. 315-318

దశావతార చరిత్ర నుండి :—

సీ॥ జలజ వికాసంబు చంద్రరమ్యత్వంబు। ముకురంబుతేటనెమ్మొగము చేసి
కలికి బేడిస బెళ్కు కలవరేకందంబు। ఖంజన దీప్తి కన్గవరచించి
తలిరు పల్పదనంబు తళుకు కెంపుమెఱుంగు నమృతంబురుతి నధరము ఘటించి
కనకకుంభచ్ఛాయగట్టు గట్టితనంబు బంతిసోయగము గుబ్బలనమర్చి

తె॥ మించు మించును సంపఁగి మించు తావి
తరుణ శైరీషకుసుమ మార్దవము బాసు
రాంగకము చేసి సృజించె నఖిల లోక
మోహనమున నహల్యయ న్మోహనాంగి

"He took the blowing of the lotus, the beauty of the moon, and the splendour of the mirror, with these he formed her lovely face – of the brilliancy of the fair carp and the beauty of the petals of the water lily, and the brilliancy of the wagtail he formed her twin eyes - of the tenderness of a bud (or sprout) and of the flashing ruby's lustre, and of the taste of nectar he composed her lower lip : He moulded her breasts of the hue of golden globes (cumbha) and the hardness of the hills, and the beauty of balls of flowers. Of the flash of lighting and the choicest champaca fragrance, and the softness of the flowers of the tender sirisha, he formed bright body - Thus did he create Ahalya that body of love, the delight of the whole world" D. 524 ప 5.

4. 1. 7. ఈ దశావతార చరిత్ర 1849లో తొలిసారి ముద్రింపబడినట్లు శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు పేర్కొనిరి.[1] 1859 సం॥న నాగరాజు వేంకట శేషగిరిరావుచే పరిష్కరింపబడి M. కృష్ణంరాజుగారిచే 'లక్ష్మీవిలాస' ముద్రాక్షరశాల, చెన్నపురి, యందు ముద్రితము. 1907–వ సం॥న పండితులచే పరిష్కరింపబడి పమ్మి త్యాగరాయశెట్టి గారిచే స్వకీయ శ్రీ రాజరాజేశ్వరీ నికేతన ముద్రాక్షరశాల యందు ముద్రించి ప్రకటింపబడెను (చెన్నపురి). 1926–వ సం॥న వావిళ్లవారు

1. భారతి. మార్చి, 1976 పు. 62. సంపు 53. సంచి. 3.

దశావతార చరిత్రను ముద్రించిరి. అందలి మున్నుడిలో " ఓరియంటల్ లైబ్రరీలోగల టీకాలు గొన్ని మూల మాత్రములను గలవు. అందును రెండు తాళపత్ర ప్రతులు పూర్తిగా నున్నవి. తక్కినవి యసంపూర్ణప్రతులు. టీకలలో మూడు నాలుగాశ్వాసములకు టీకలులేవు. పంచమాశ్వాసములోని ప్రాకృత సీసము వ్రాయకుండా విడిచిపెట్టబడియెను. ఒక కాగితము మూలములోనే యీ పద్యము విడిచి స్థలము మాత్రము వదలినారు. పూర్ణగ్రంథములలో పాఠభేదములు ననర్థములు వ్రాత తప్పులు మెండగా నున్నవి " అని యున్నది. మూడునాలుగాశ్వాసములకు టీకలేదనుట పొరపాటు. మూడవ ఆశ్వాసము తుదలో "ఖర సంవత్సర శ్రావణ శుద్ధ ౧౨ లకు సరియైన ౧౮౩౧ ఆగష్టు ౨౦ తేది వర్కు గరిమెళ్ల వెంకయ్య చేసిన దశావతార చరిత్ర ౩ ఆశ్వాసము టీక సంపూర్ణము" అను వ్రాత కల ప్రతి (D 528. Vol. II Book I), నాలుగవ ఆశ్వాసాంతమున "౧౮౩౧ సంవత్సర నవంబరు నెల ౨౪ తేదికి సరియైన ఖర సం॥ కార్తీక బ ౧౦ ల వరకు గరిమెళ్ల వెంకయ్య చేసిన దశావతార చరిత్ర యిందు నరసింహావతార కథ గలిగిన నాలుగో ఆశ్వాసము" అని వ్రాయబడిన ప్రతి (Vol. II Book 2) ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున నున్నవి. ప్రాకృత సీసమును ఉన్నది. (D 520. Volz Fol. 836 ప. 54.)

ఇట్లు బ్రౌను చేసిన సాహిత్య పరిశ్రమ అనంతరికులకు ఆధారభూతమగుటయే కాక తెలుగు సాహిత్యమును సుసంపన్న మొనర్చినది.

4. 2. శశాంక విజయము :

4. 2. 0. మధురనాయక రాజుల సాహిత్య వ్యవసాయములో పండిన మధురాతి మధుర ఫలము శేషము వెంకటపతి "శశాంక విజయము." వాఙ్మయ పరిశోధకులు బ్రౌనును శృంగార ప్రియుడుగ, రసిక హృదయుడుగ పరిగణింతురు. శృంగార రసబంధురమైన యిట్టి కావ్యముల నాదరించుటలో అతనికిగల ఉత్సుకతయే దీనికి కారణము కావచ్చును.

4. 2 1 మ. ప్రా. లి పు. భాండాగారమున ఈ కావ్యమునకు 12 కాగితపు ప్రతులు 6 తాళపత్ర ప్రతులున్నవి.

D 807 + ఇది సాపు ప్రతి యగుటయు నిందు పాఠాంతరములు గుర్తింపబడిన వనియు బ్రౌను గ్రంథాదిని పేర్కొనెను.

*D* 809—తొలి మూడాశ్వాసములు కలవు. దీనిని "అసలు ప్రతిప్రకారం" కృష్ణయ చదువుగా సుబ్బన్న "దిద్దెను".

*D* 810—4, 5 ఆశ్వాసములు కలవు

D 814 + అవతారిక తప్ప మిగిలిన భాగమంతయు కలదు.

*D* 816 + పాఠాంతరములు పంక్తుల నడుమ గుర్తింపబడినవి. తీర్పు పాఠములు భాశీగనున్న ఎదుటి పుటలో గుర్తింపబడినవి.

D 818 + రెండు సంపుటములలో నున్నది. ఇదియు పాఠాంతరములను గుర్తించిన ప్రతియే 1827

D 819 + చకోరీయ వ్యాఖ్యాసహితము. మూడు సంపుటములలో నున్నది. వ్యాఖ్య సంస్కరింపబడియున్నది.

D 820—చకోరీయ వ్యాఖ్యాసహితము. తృతీయాశ్వాసమున 47-వ పద్యము వరకు కలదు. టీక సంస్కరింపబడినది.

D 821 + చకోరీయ వ్యాఖ్యాసహితము. అవతారిక తప్ప శేషించిన కావ్యభాగమునకు వ్యాఖ్యకలదు.

D 819 ప్రతికిది శుద్ధప్రతి కావచ్చును.

*D* 822 + తారక వాఖ్యాన సహితము. సంస్కరించిన నూతన వ్యాఖ్యాసమన్వితము

D 823 + శబ్దసూచి. సమకూర్చిన చిత్తుప్రతి

*D* 824 + శబ్దసూచికా సహితము.

D 823 ప్రతికిది శుద్ధప్రతి.

ఈ కావ్య పరిష్కరణకు బ్రౌనునకు ప్రథమమున 3 ప్రతులు లభించినవి. అవి :—

(1) అతని యొద్దనున్న పెద్దకాగితపు ప్రతినుండి ఎత్తి వ్రాయించినది.

(2) కాలేజి ఉద్యోగులలో నొకడగు వెంకటరామయ్య తాళపత్ర ప్రతి.

(3) చిన్న కాగితపు ప్రతి.[1]

---

.1 D. 818. సంపు. 1. పీఠిక గ్రంథాది మరియు గ్రంథాంతము.

ఈ మూడు ప్రతులతో బ్రౌను కావ్య పరిష్కరణకుపక్రమించి 1827-వ సంవత్సరము ఫిబ్రవరి 7-వ తేదీ నాటికి మూడాశ్వాసములను, జూలై 30-వ తేదీ నాటికి నాలుగాశ్వాసములను సవరింపజేసెను.[2] ఈ పరిష్కరణ కార్యమున నిమగ్నుడై యున్నపుడాతనికి 1829-వ. సం॥న మరి నాలుగు ప్రతులు లభించినవి.[3] ఆ ప్రతుల వివరణములు :—

"౧. బందరు కాకితం జిల్దు కట్టిన ప్రతి యావత్తు అయింది.
౧. చన్నపట్నం కాలిజిచి తాట్యాకు ప్రతి అయిపోయింది.
౧. బందరు కాకితం ప్రతి అసమగ్రం
౧. బోయనపల్లె వెంకటరాయని ప్రతి తాట్యాకది—
౧ మూడో, నాలుగో ఆశ్వాసములు మట్టుకుగల ప్రతి "[4]

4. 2 2. అస్తవ్యస్తముగనున్న పత్రములను విద్వన్మిత్రుడు అద్వైత బ్రహ్మయ్య ఒక క్రమములో సంతరించినట్లు, అతడు పొందుపరచిన క్రమముననే శుద్ధప్రతిని తయారుచేయించినట్లు బ్రౌను తెలిపెను. విభిన్న ప్రతులందున్న పాఠభేదములు పాదమధ్యములందు గుర్తింపబడి, 'మొకాపిలా' చేయబడెను.

శా. శకము 1647 అనగా క్రీ శ. 1725-వ సం॥న మధురను పాలించిన విజయరంగ చొక్కనాథుని (రంగకృష్ణ ముద్దు వీరప్పనాయని పుత్రుడు) ఆశ్రితుడగు సీనయామాత్యునకీ కావ్యమంకిత మీయబడినట్లు బ్రౌను పేర్కొనెను.[5] దక్షిణదేశీయాంధ్ర వాఙ్మయ కర్తలగు శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు విజయరంగ చొక్కనాథుని కాలము 1706-1732 అని నిర్ణయించిరి.[6] కాన బ్రౌను నిర్ణయించిన కాలము ఈ కాలముతో సరిపోచున్నది.

తాళపత్ర ప్రతులందు కాన వచ్చునొక లేఖన సంప్రదాయమును బ్రౌను

---

2. D. 818. సంపు. 2 పత్రములు 11,93.
3. D. 818. సంపు 1. గ్రంథాది
4. D. 818. సంపు 1. గ్రంథాంతము.
5. అందే. పత్రము. 7.
6. దక్షిణదేశీయాంధ్ర వాఙ్మయము. పు. 311.

సూచించెను-కొన్ని ప్రతులందు అవతారికా భాగములను లేఖకులు వ్రాయక విడుచు చుందురట.

"Memorandum - Most Mss. begin at this place, omitting all the preface."[7] ఆ లుప్త అవతారికా భాగమును మరియొక ప్రతిని జూచి బ్రౌను పూరింపజేసెను.

శశాంకవిజయము పంచపండిత పరిష్కృతము. బుచ్చయ్య, చెంచయ్య,[8] పటచంద్రయ్య, బ్రహ్మయ్య, మామిడి వెంకయ్యలను[9] పరిష్కరింప బ్రౌను నియోగించెను. జూలూరి అప్పయ్య, గురుమూర్తి శాస్త్రిలును నీ పరిష్కరణమున తోడ్పడిరి[10]

4. 2. 3. బ్రౌను పండితవర్గము పరిష్కరణమున మూల ప్రతియందలి పదములు దురవగాహముగ నున్నను సాధ్యమైనంతవరకు యథాతథముగనె నిలుపు చుండెడి వారు.

ఉదా : క॥ పరిపరి విధముల నిట్లా
సరసుని వెనుకుచును, నిల్వజాలని ప్రేమన్
మరుడురవడి విరి కిరుసున
మెరమెర భావంబు లోనమెరవఁగ మరియున్.

వ్రా. ప్ర. 2-85 ము. ప్ర. 2-76

'విరికిరుసున' అను పదమున కర్థము పండితులకు బోధపడలేదు. బుచ్చయ్య దానిని 'బిరుసున' అని సవరింపవచ్చునని చెప్పినను తుదకువారు మాతృకలందలి 'కిరుసున' అను పదమునే నిలుప నిర్ణయించినట్లు బ్రౌను పేర్కొనెను.[11]

కిరుసు = ఇరుప్రక్కల వాయి గలిగి వాటమగునొక విధమైన కత్తి.

చెంగల్వమరిది కిరుసు కువల. 4. 31. (సూ.ని)

---

7. D. 818. సంపు. 1. పత్రము. 26.
8. అందే. పత్రము 76.
9. అందే. పత్రము 126
10. అందే. పత్రము 250
11. అందే. పత్రము 76

పై 'మరుతురువడి విరికిరుసున=మన్మథుని పూర్తి విజృంభణమునకు' అని అర్థము చెప్పికొనవచ్చును కదా!

4. 2. 4. సందియమున కెడమిచ్చు పాఠములను తర్కించి, మాతృకలను గాలించి బ్రౌను పాఠనిర్ణయ మొనర్చెడివాడు. ఉదా:

చ॥ గడెతడవాత దొక్కపనిగా జని, యింటికి రాకయుండినన్
తడబడు మీదెఋంగదు. వితాననునుండును, చిన్నబోవుదా
బుడుతల చేత బిల్వ బనుపున్, మరి వచ్చిన, నింత చెపు నె
క్కడ నని మోడిగా బిలుక, గ్రక్కున నవ్వును, నాకడల్గినన్
వా ప్ర 2-88. ము. ప్ర. 2-78

ఇందు 'మోదెఋంగుట' అను పదమున కర్థమేమను సందేహము బ్రౌనకు కలిగెను బుచ్చయ్య ఆ పదము 'మోడి'గ నుండనగుననెను. కాని పట చంద్రయ్య 'మీదెఋం గదు' అని ఉండవచ్చునేమో యని యూహించెను ఆ మీదట బ్రౌను కాగితపు ప్రతులను, తాళపత్రములను శోధింపగా నొక ప్రతిపాఠము 'మీదెఋంగదు' అని యుండినట్లును, ఈ పాఠముచే సందేహనివృత్తి యయినట్లును బ్రౌను పేర్కొనెను.[12] 'మీదెఋంగదు' అనునదే నేటి ముద్రిత పాఠము.

'వితాకు' పద ప్రయోగమునకు రాధామాధవ సంవాదపు నందలి (1-14) ప్రయోగమును జూపి 'విభ్రాంతి, విస్మయము' అనునర్థము లావ్యాఖ్యానమున నున్నట్లు బ్రౌను వివరించెను [13]

4 2. 5. అతిస్వల్ప లేఖక దోషములను సవరించినను, భావి పరిశోధకులకు ప్రయోజనకారిగ ఆ మార్పులు మూలప్రతులలో లేవని బ్రౌను గుర్తించెడివాడు. ఉదా

[స]
ఉ॥ చెంత్త దనంత్త నింతికుడు చేరికశేయగ సంత్తతంబునన్
కంతుడు రంతొనప్పగా, పరకాంతయటంచు, నధర్మమంచు, లో

12. అందే పత్రము : 76

13. D 819. సంపు : 1. పత్రము : 247

నెంతయు చింతనొందు మన సిట్టటు కొట్టుకనాడ, సాహసం
చింత్ర, భయం బొకింత, రుచియింత, యసంమ్మతి యింతగన్పడ న్,
బ్రా. ప్ర 2-103. ము. ప్ర. 2-90.

'సంతతంబునన్' అనునది తాళపత్రములందలి పాఠము. ఇచట 'సంత సంబునన్' అనునది సరియైన పాఠమనియు, అట్టి పాఠము ఏ ప్రతి యందును లేద నియు బ్రౌను తెలిపెను.[14]

4. 2. 6 ప్రతి పద్యమునకు ప్రతిపదార్థమును తెలిసికొనినగాని బ్రౌనుకు సంతృప్తి కలుగదు.

ఉదా : వాలుగ డాలు వాని దళవాయి వసంతుడు చైత్ర యాత్రకై
సాలములందు జీర్ణ దళసంఘము చీళితబెట్టి, క్రొత్తగా
మేలిదళంబులన్నిలిపి, మీరి యయుక్త జనామిత క్షమా
మగు
పాళిగ్రహించి నూత్నముగ పైకములన్ సవరించె నెల్లడన్.
బ్రా. ప్ర. 2-128 ము. ప్ర. 2-112.

తమ కుప లబ్ధ ప్రతుల యందన్నింటను నీపద్యమిట్లే యున్నట్లును, ఇందలి ద్వితీయ పాదమునందలి 'చీళితపెట్టు' అను పదమున కర్థమును తన పండితులు వివరింపలేక పోయినట్లును బ్రౌను తెలిపెను.[15] పరిష్కరించిన పండితులకగమ్యమైన యాపదమును బ్రౌను విడువలేదు. ఈ ప్రబంధమునకు వ్యాఖ్యను సమకూర్చునాటికి దీనిని గూర్చి పరిశ్రమ చేసి "చీళితశబ్దం। కన్నడభాష। చీళితమాడిదరు। అంటే కొలువులో నుంచి కొట్టివెయడం।" అని వివరించెను.[16] ఈ విషయమునే మరొకప్రతిలో "The comment, construes చీళితపెట్టి thus - పోకొట్టి. The word is canarese and means dismissal from service"[17] అని ఆంగ్లములో విశదీకరించెను. బ్రౌను మిశ్రభాషా నిఘంటువునందు "చీళితబెట్టుట=To get rid of

14. D. 818. సంపు : 1. పత్రము : 80.
15. D 818. సంపు : 1 పత్రము : 88.
16. D 819. సంపు : 2. పత్రము : 19.
17. D 818. సంపు : 1. పత్రము : 88.

పోగొట్టుట " అని వివరించి, ప్రయోగమునకు ఈ పద్యమునే ఉదాహరించెను. ఈ అన్యదేశ్య పదము శబ్దరత్నాకరమున గ్రహింపబడలేదు సూర్యారాయాంధ్ర నిఘంటువున 'తొలఁగించు, తీసివేయు' అను అర్థములతో ఈ పదము ప్రదర్శింప బడి అందులకు బ్రౌన్ మిశ్రభాషా నిఘంటువు ఆకరముగా ఈ పద్య ప్రయోగమే యుదాహరింపబడి యున్నది

4. 2. 7 పండితుల పాఠములను అంధప్రాయముగ బ్రౌను గ్రహించెడివాఁడు కాడనుట విదితము.

ఉదా :

ఉ॥ ఇంత్తిరో పాల వంట్టికుల మీవు జనించిన దేరనెన్న గా
నెంతయు నెన్నె వాసిగను నింటను జొచ్చెనదెమి జెప్ప కం
చంతటి కాపురంబు సతులౌనఁజేసెదు, జాతినీతి యొ
క్కింత దలంప కప్పునికి నేటికి నేటికి క్రొత్తగాఁజొరన్.

ప్రా॥ ప్ర॥ 3-90. ము॥ద॥ 3-66.

4-వ పాదము నందలి 'ఇప్పనికి' అను పదస్థానమున 'ఇవ్వనికి' అనునది సరియైన పాఠముగ బుచ్చయ్య సూచించెనట. "I think decidedly not so" అని బ్రౌను 'ఇప్పనికి' అను పాఠమునే గ్రహించెను.[18] పాలవంటి కులమున బుట్టిన తార కంచంతటి కాపురమును కాలరాచి, జాతి నీతి లేక ఇట్టి నీచకార్యమునకు పూనుట తగవుకాదని చంద్రుడు తారకుహితోపదేశ మొనర్చెడు ఘట్టమిది కాన నిచట 'ఇప్పనికి' అను పాఠమే అర్థవంతము.

కావ్యపరిష్కరణమున పండితుల పరిశ్రమను బ్రౌను చక్కగా అవగాహన మొనర్చుకొనెను. "పాటొక యింతలేని ఘనపత్ర సహస్రము రాజమాన్యమా" (2-8) అను పద్యము గ్రంధపాఠములతో, లేఖన దోషముల వలన బుచ్చయ్య, చెంచయ్యలకు పోల్చుకొన నలవి కాలేదని బ్రౌను తెలిపెను.[19]

4. 2. 8 బ్రౌనున కాదినుండి కావ్యప్రయోగ దృష్టి ఒక పదమేయే కావ్యములందు ప్రయుక్తమైనదని గుర్తించుటాతనికి పారిపాటి. 'అలవోక' శబ్దము

18. D. 818. సంపు: 1. పత్రము : 126.
19. అందే. పత్రము : 28.

మునకు తారాశశాంకం॥ (ఆ॥ ౨॥ ౧౦౭ ; దశావతార చరిత్ర (7-87, 9-149); విష్ణుపురాణము (7-85); ఉత్తరదశమము (434, 1257); విక్రమార్క చరిత్రము (3-41); కాశీఖండము (7-106)ల నుండి ప్రయోగములను చూపెను.[20]

ఈ ప్రబంధమునందలి ఆది పద్యమునగల 'విన్నాణ' పదమునకు పండితులొసగిన వివరణముగాక, బ్రౌను స్వయముగ "ఇది తురకిభాషలో దొరంగి అని అంటున్నారు. అనగా రెండు వర్ణములు గలది - యిందుకు వుదాహరణం చంద్రహాస విలాసం తెలుగు కావ్యం ఆరంభంకడ Here enter the citation- వ్యాఖ్యం" అని బ్రౌను సూచనను వ్రాసెను. "విన్నాణ మనె బబ్దముకు యిక్కడ తీర్పు బాగా కాలేదు. ధొరగారుచే ఆంధ్ర నిఘంట్టులో పరిష్కారచేసి వున్నారు" అను మరొక గమనికయు నిందు కలదు. 'విన్నాణము' తద్భవమా అను సందియము ఇట వితర్కింపబడెను.[21]

ఇట్లే 'కొసరు' అను పద ప్రయోగమునకు ప్రాచీన కావ్య ప్రమాణములను బ్రౌను చూపెట్టెను.

శశాంక విజయము. ఆ ౨ ౭౮.

గీ॥ మురిపెమున మెను జఱచుఁ, గెమ్మోవిఁ దేఱచు,
గుబ్బెల విదుర్చుఁ, బయ్యెద కొంగుజార్చుఁ,
గొసరు వగ నవ్వుఁ, గొనగోటఁ గొప్పుదువ్వు,
నొంటి నరికట్టు, నిలుమంచునొట్టుఁబెట్టు.

దశావతార చరిత్ర ౭।౧౫౨ - on కొసరు

తే॥ కొదమ గుబ్బల తావి కుంకుమపు పూత
విభుడు చెంగావిరైకంచు విడువబోవ
కొసరు చూపుల తప్పించు కొనుచునొక్క
కలికి వెన్నెలగాయగాగప్పికొనియె.

---

20. *D.* 818. సంపు : 2. పత్రము : 156

21. *D.* 819. సంపు : 1. పత్రము :2.

కవికర్ణరసాయనం ౧।౨౫।

సీ॥ గోరిన నొసగెడు కొసరు పువ్వుల కంటె
మొలకనవ్వుల డెందములు గరంప

తిరిగి ౪।౧౭౭

తే॥ తరుణదతి నిర్దయత్వంబు నెరపునపుడు
కొసరునట యంతయైన గైకొనక యింక

ఆళా సేవీయ్యమందు ।౩।౧౬౭ బహూవచనముగా నున్నది.

సీ॥ కొసగోటి మీటలు గోరింపులు జకులు
కొసరులు బొమముళ్ళు + ... । ఇత్యాది"[22]

శశాంకవిజయము నందలి "గీ॥ జాళు వాకోట కొమ్మలుచాలు దీప ... " "చ॥ కళుకు కడాని చాయ ......(2, 10, 11) అను పద్యములు విష్ణుచిత్తీయము నుండి సంగ్రహింపబడినట్లు బ్రౌను తెలిపెను[23] కాని యీరెండు పద్యములు ఆముక్త మాల్యదలో మృగ్యములు.

4. 2. 9. ఈ ప్రబంధమునందలి కొన్ని పద్యములకు బ్రౌను తెలుగు తాత్పర్యములను స్వయముగ సమకూర్చెను.

గీ॥ కాన నీవును మారాక మానసమున
గోరి యీరీతి సత్ప్రభాచార గరిమ
మీర నుండుము చారు చకోరనేత్రి!
నీవెరుంగని నీతి, సిర్నీతి గలదె?

బ్రౌ. ప్ర 2-159. ము. ప్ర 2-127

"గనుక నీవు కూడ నీమనసులో మా రావడంకోరి యీ రీతిగా పెద్ద మనిషిగా స్థిర బుద్ధి కలిగి వుండుకో వలసినది। వో సౌందర్యమైన చకోరపక్షియొక్క కన్నులు గలదానా నీవు యెరగలేని మంచి నీతి అయినా చెడ్డనడక అయినా కద్దా। నీవు అన్ని తెలిశినవానవు గనుక పెద్దమనిషిగా నడవవలశినది॥

---

22. అందే. పత్రము : 258
23. 818 సంపు : 1. పత్రము : 47

4. 2. 10. ఈ కావ్యమున కించుమించు అన్ని పద్యములకు బ్రౌను ఆంగ్ల తాత్పర్యములను సంతరించెను. ఉదా :

క॥ చెరుకునకు పండు, పసిడికి
పరిమళమును చిత్రమునకు ప్రాణంబును, దా
నరుదుగ గలిగిన రీతిని
నరపతులకు విద్యగలిగిన న్నలు వెసగున్.

బ్రా. ప్ర 2-42 ము. ప్ర. 2-37

"Were the sugarcane to bear fruit, were gold to be fragrant, were an image to live, marvellous as this would be, so marvellously admirable in princes is learning."

కొన్నింటికి ఆంగ్లప్రతి పదార్థముల నొసగెను.

1 2
"శ్రీ విన్నాణవు గుబ్బచన్నుల నయారీశంబురా గుప్పి మౌ

3 4 5
క్తా వల్లుల్ ఘటియించె దేమి శశికిన్ దారా ప్రయుక్తంబనే

6 7 8
బావంబోయను పల్కు కల్మి చెలి సంభావించు కాంచీపురీ

9 10 11 12
దేవుండీవ్రత సీన యార్యమణికిన్ దీర్ఘాయు రారోగ్యమున్ "

బ్రా. ప్ర. అవ. 1. ము. ప్ర. అవ. 1

"1. Superb, gorgeous 2. Comphor 3 The Morn - & Camphor 4. A pearl, a star & Tara. 5. determined appointed as an object or aim 6. intent 7. Lacshmi, Venus 8. Varda Raz. the chief god of Canchipuram 9; ఈవ్రత Let him give, May he bestow 10. Name of the patron 11. length of days 12. and health.

కొన్నింటి నాంగ్లభాషలో ఛందో బద్ధ మొనర్చెను (చూ అను.)

4. 2. 11. బ్రౌను పరిష్కరింపబడిన ప్రతి కావ్యమునందును పదములను నిఘంటు నిర్మాణము కొరకు గుర్తించుటకు ప్రాలు మాలెడు వాడు కాడు. ఉదా:

(i) "గురుదు - యిది ఫారిసీ శబ్దం, గురుజ అంటె గద అనె ఆయుధం"[24]

(ii) 'శశాంకరేఖ' అను పదవ్యుత్పత్తిని తెలుప పండితులను కోరి బ్రౌను ఇట్లు వ్రాసెను : Sasanca rekha - here settle the etymology of this word & also that of జాబిల్లి which no where occurs in this poem."[25]

(iii) "నవరములచ్చమైన ఘనసారము కస్తురియున్ జవాది వే
ఱువుల జనించు ముత్యముల నూనతనిచ్చుటి చంచుముద్దియల్
హవణుగ కల్పవృక్ష సురకై సురమోకపు పువ్వు బోండ్ల కా
ర్ణవమున నిత్తురో చకిత చంచల చారు చమూరు లోచనా"

వ్రా ప్ర 1-16 ము ప్ర 1-14

ఈ పద్యమున కెదురుగా బ్రౌను "యీ చంచు అనే శబ్దం అజ్ఞానంగా చెంచు వ్రాసు కొంటారు గాని చంచు న్యాయమే" అని వ్రాసెను.

దీని క్రింద "యిది అప్పకవి మతము. చంచః పామర జాతీయ్యః అని యున్నట్టు ఉదాహరించినాడు. అనగా కిరాతకుడు - కాని ఆ తీరు వ్రాత అయినా ఆ అర్థమైనా బహు అపూర్వం - లోకరూఢియైనది చెంచు ముఖ్యమైనదని మాకు తోస్తుంది..." అను జూలూరి అప్పయ్య లేఖన మున్నది.[26] 'చంచః' అనునది సంస్కృత శబ్దము. దీనికి 'చెంచు' తద్భవము. కాన నీరెండు శబ్దములు గ్రాహ్యములు. 'చెంచు' అను తెనుగు శబ్దమునకు నిర్ధారక ప్రయోగములు ఈ క్రిందివి కలవు :

1. గీ॥ 'బోయనాఁగఁ గిరాతుఁడౌఁగోయచెంచు' (ఆం శా 2. 289)
2. 'గీ॥ చెంచునింటికిఁ బోయి చెంచెతకుఁబ్రియము' (కాశీ. 5. 71)
3. 'చెంచువేల్పుల మూకల సేదదేర్చి' (నృసింహ పురాణము (1-54)
4. 'చెంచుఁబూఁబోఁడులను దానుఁ జెలిమిచేసి' (శృంగార నైషధము 5-134)

దీనిని బట్టి 'చెంచు' శబ్దము లేదనుట భ్రమ ప్రమాద జనితము.

---

24. మ. 819. సంపు. 1. పత్రము. 8.

25. అందే పత్రము. 92

26. అందే పత్రము. 95

(iv) "సిబ్బెం తెలుగు పదం. మకరిక అనె గీర్వాణపదంకు సమె సము న్నది."27

(v) "అన్నెం అనగా అన్యం। తద్భవ శబ్దం" 8

(vi) గీష్పతి అనె శబ్దధాతువు వివరించవలసినది. జోహారు అనె శబ్దమును గురించి నేను దాచిపెట్టిన పద్యములను ఉదాహరించుకో వలసినది."29

బ్రౌను ఒక సందేహమును వెలిబుచ్చెను. "Here give a note on Sasa'nca" అని ఆంగ్లములో వ్రాసి అంతటితో ఊరుకొనక తెలుగులో "శశాంకుడు అంటె చంద్రుడు - యీ దేవునికి శశ అనగా కుందేలు సంజ్ఞయెందుకు సంభవించినదో ప్రమాణ గ్రంథము లందు యెక్కడ చెప్పలేదు।" అని చింతించెను.30

చంద్రుని యందుండు మచ్చను కుందేలుగానో, జింకగానో ఊహించుకొని కొందరు చంద్రునికి శశాంకుడని, హరిణాంకుడని పేరుపెట్టిరి.

బ్రౌను తన కర్థముకాని వాని నన్నింటిని అడిగి తెలిసికొనెడివాడు. ఈ ప్రబంధమున అటనట "define పయిట", "Explain viraha" explain the force of పసిగా"31 అను బ్రౌను వ్రాతలున్నవి.

ఈ ప్రబంధమందలి ప్రతి పదమునకు అర్థమును తెలిసికొన బ్రౌను ప్రయత్నించెను.

క॥ అరువది నాలుగు విద్యలు
నరువది, యరువది మొగంబులయ్యె నుతింపన్
సురగురుని కరుణ చిర భా
సుర గురునియతిన్, సుబుద్ధి సోముడునేచెజా. జా.

వ్రా॥ వ్ర॥ 2-62॥ ము॥ ప్ర। 2-56

27. అందే. పత్రము. 247.
28. అందే. పత్రము. 274
29. D. 819. సంపు. 2 పత్రము. 40.
30. D. 819. సంపు. 1. పత్రము. 242.
31. D. 809. సంపు. 1. పత్రములు. 91, 92, 60.

ఈ పద్యమునందలి ప్రాస బ్రౌనును తికమక పెట్టెను. This is a puzzling verse''[32] అనియు "ఈ పద్యమందు కవి యేదివర అన్యాయమైన శ్లేష కల్పించినందున అర్థం బాగ వెలదేరలేదు" అనియు తెలిపెను.[33] ఇందలి అన్యప్రాసలోని ప్రౌఢోక్తికి అర్థము : 'చంద్రుఁడు దేవగురువు సన్నిధిలో చతుష్షష్టి కళలలోఁ బారంగ తుఁడాయెను. అఱువది నాలుగు విద్యల + అఱువు + అద=ఆ యఱువది నాలుగు కళల సారము; అఱ + పది మొగంబుల అయ్య = అయిదు మోముల దేవరయగు శివుఁడు (శివుఁడు పంచాస్యుఁడని ప్రసిద్ధి). 'సర్వజ్ఞుఁ' డగు శివుఁడు కూడ నభినందించు తీరున శశి సకల కళాపూర్ణుఁడై వెలసిల్లెనని భావము ఇందు 'అఱువు' తమిళపదము దీనికి తెలుఁగు 'హరువు' తుల్యపద మన నగును."[34] తెలుగు 'హరువు' నకు మనోజ్ఞము, మనోజ్ఞత, నాణమైన పని, నాణెము అను అర్థము లున్నవి గాని జ్ఞానమను అర్థము లేదు. కాన ఈ రెండు తుల్యములు కావు.

చ॥ మునుమును వింత్తగా చిలుక ముక్కు జిగిఁ జెగు సుక్కుఁగోటిచే
నసువుగ గీరు నామము నొయారముగా నిడనేర్చెఁ పెన్నెరుల్
వెసకకు నొత్తి జారు శిగవేయగ నెచెఁ కడాని తమ్మి పూ
ంబు
పసి నను పచ్చడమ్ము వలెవాటు వహింపగనేర్చెఁ నీటునన్

[వా॥ ప్ర॥ 2-71॥ ము॥ ప్ర॥ 2-64]

"వేయ గనేర్చె. Here గ is a నిరర్థక శబ్దం" అని బ్రౌను అభిప్రాయపడెను[35] 'వేయగన్' అన్నంతక్రియ. తుమున్నర్థకము. క్రియా విశేషణము. బ్రౌను సూచించినట్లు 'వేయనేర్చెను' అనుపదమును గ్రహించిన అర్థభంగము కాదు కాని గణభంగ మగును.

ఉ॥ ఎందరి జూడ మిద్దరణి నిందుని భాస్యల వారి కెల్లనీ
యందము చందమున్ గలదె యక్కట మిక్కుటమైన కోర్కెఁ జే

32 D. 818. సంపు. 1. పత్రము. 64
33. D. 819. సంపు. 1. పత్రము. 215.
34. శశాంక విజయము. యం. శేషాచలం అండ్ కో పీఠిక పు LX - LXI.
35. D 818. సంపు 1 పత్రము. 71

నందగ రాని మాని ఫల మాస యొన చిన చంద మాయనే
మందు మనోజ దేగతిని యారడిబెట్ట దలంచినాడకో

(బ్రా॥ ప్ర॥ 2-109, ము॥ ప్ర॥ 2-95)

ఇట బ్రౌను "observe ఆయ for ఆయె" అని గుర్తించెను.[36] నేటి ముద్రిత ప్రతి యందు 'చంద మారాయె నేమందు' అను పరిష్కర్తలు దిద్దిన పాఠ మున్నది.

అగు వోవుల యెను వర్ణకంబు ఎత్వంబున కత్వంబు బహుళంబుగా నిల్చుట కవి ప్రయోగ దృష్టమగు చున్నది.[37]

ఉదా : 'అయ్యో ! సీసుతు గ్రద్ధలన్నుకొని పోయన్' (వేంకటకవి : పంచతంత్రము. 1-780). వావిళ్ల ముద్రిత ప్రతిలో (1924) 'పోయెన్' అను సవరణచే యతి భంగము. శశాంక విజయమునందే మఱొక ప్రయోగమున్నది :

"సీ॥ ఎత్తుగీతి.......................

తల్లడింపఁగ నాయ హా ! దైవ మాయ !
యేదిగతిచేర ? విరహాబ్ధికేది మెర ?

(బ్రా॥ ప్ర॥ 4॥ 66॥ ము॥ ప్ర॥ 4-57॥)

ఈ సీసమున ఉభయ పాదార్ధములన్నియు అంత్యాను ప్రాసబద్ధములు. కాన నిట పరిష్కర్తలు సవరింపలేదు. పూర్వ పద్యమునందును కవి బుద్ధిపూర్వకముగనే 'ఆయ' అను క్రియను ప్రయోగించియుండును. కవి హృదయమును బ్రౌను గ్రహించినట్లాధునికులు గ్రహింపలేరి.

(iii) క॥ క్షితిలో స్త్రీ వ్యసనంబే
యతిగర్హితము, మందుపై పరాంగన, యాపై
నుతశీలురైన గురుసతి,
పతివ్రత, నిట్లాచరింప పాడియె నీకున్.

(బ్రా॥ ప్ర॥ 4॥ 209॥ ము॥ ప్ర॥ 4-176॥)

36. అందే. పత్రము. 82

37. ముక్తలక్షణ కౌముది. క్రియ. సూ. 2.

చరమ పాదమందలి ఛందోవిశేషమును, పండితుల వివాదమును బ్రౌనిట్లు వివరించెను:

**I I I I**
**Pativrata is నలం !! not IUII**

**I U I I**
**Buchaya declares pativrata is utterly inadmissable but Chenchaia swears per contra"**[38] సంయుక్త పూర్వాక్షరము గురువేయగును కాన 'జల' మగు పతివ్రత పదమును గ్రహింపరాదని బుచ్చయ్య వాదము. చెంచయ్య చెప్పినట్టిది 'నల'మే కావలయును. ఇది 'నల'మే యెట్లగునని చెంచయ్య వివరింపలేదు. అప్పకవియే చెప్పని విషయమును చెంచయ్య ఎట్లు పేర్కొనగలడు?

ఏక పదమందు ననాద్యంబయిన సంయుక్తాక్షరమునకు పూర్వాక్షరము గురువే కావలయును. సాంస్కృతిక సమాసములందు సాధారణముగ సంయుక్త పూర్వాక్షరము గురువే అగును. కాని అందును రేఫసంయుక్త పూర్వాక్షర గురుత్వ లఘుత్వములలో నీ నియమము అంతట వర్తించుటలేదు. రేఫసంయుక్తమునకు ముందున్న యక్షరము వికల్పముగ గురువగుటను శ్రీ రావూరి దొరస్వామిశర్మగారు గుర్తించిరి.[39]
లక్ష్యము :

క॥ అవనిజము వలన నమ్మని,

ప్రవరు వృథూత్సంగ తలముపైవడిఁ బడియెన్. (భార॥ సభా॥ 1॥ 148)

ఉ॥ కావునఁగాము క్రోధములఁ గ్రాచుచు. (భార॥ శాంతి॥ )

చ॥ కృపకృత వర్మలం గడిమిఁగిట్టి శిఖండి ప్రభదిక్కుఁ్ల్. (భార శల్య.

(iv) చ॥ బలిమి వియోగ వర్గముల బాధలఁబెట్టెదు నిర్దయాత్మ ! నీ

.......................................

(ప్రా॥ ప్ర॥ 4-108॥ ము॥ ప॥ 4-89)

"బలిమి here is the 3rd case, says Buch." అని యిందలి కారక వైచిత్రిని బ్రౌను గుర్తించెను.

38. D. 818. సంపు. 2. పత్రము. 80.

39. ఛందోరీతులు. పు. 34.

4. 2 13 బ్రౌను శశాంకవిజయ కథామూలమును గూర్చి కొంత పరిశోధన చేసి, గ్రీక్ పౌరాణిక గాథలతోడి సామ్యమును గుర్తించుట విశేషము. బ్రౌను మాటలనే ఇట ఉద్ధరించుట సముచితము :

**The origin of this Tale long puzzled me, and at last, in Feb 1833 I discovered its source by considering whether it had not an analogy to the names of the weekly days – observe Chandra, the moon, is the regent of soma vara Monday. Vrihaspati the. Tutor of Gods governs Thursday. Tara is Venus wife of Vrih governs Friday. Buddha wedy.**

**In Homer, Venus, wife to Vulcan the Teacher of Gods, has an amus with Mars (the regent of Tuesday - named angaraca & c from him) The armour is betrayed by Apollo (the god of Sunday)- and ultimately she is reconciled to her husband-**

**The coincidence regarding the heroine is most singular, though the name (Tara) is not accounted for - For Friday (dies Veneris) is named after Friga the horwegian Venus-and Friday is called Bhriga Varam after Bhriga the genius who governs Friday. Hence it may be collected that the sanscrit Norwegian and Greek names of the regents of weekly days Who are actors in the tale, answer thus**

| | | |
|---|---|---|
| **SUNDAY** | | **apollo** |
| **MOND** | **... Soma** | **)** |
| | | **) the seducer, Mars.** |
| **TUES** | **Tuisco or Mars, Cuja )** | |
| **WEDY** | **Woden** | **Buddha the child born. Mercury.** |
| **THURS** | **Thos** | **Vrih the husband. Vulcan** |
| **FRIDAY** | **Friga** | **Bhriga or Tara the wife Venus.** |
| **SATURDAY** | | |

**I very – does the Norwegian Mythology contain any traces of this fable?"**[40]

4. 2 14. గ్రంథపరిష్కరణారంభ కాలమున, 1827వ సం॥నందు పండితు

---

40. **D** 819. సంపు. 1 పత్రము 78

లకు తక్క సామాన్యపాఠకులకి ప్రబంధము వ్యాఖ్యావిరహితముగ దురవగాహమని బ్రౌను అభిప్రాయపడెను[41] కావున ఈ ప్రబంధమునకు వ్యాఖ్య వ్రాయించెను. ఈ వ్యాఖ్యకు ఏనామము సార్థకముగ నుండునమటను బ్రౌను వితర్కించెను. 'తారాప్రకాశిక' 'తారాభావదీపిక' అను నీరెండు నామములలో నేయది యుక్తిసహమని పండితులను సంప్రతించెను. 'తారాభావదీపిక' కవి హృదయమును వ్యక్తపరచునని వారభిప్రాయపడిరి బ్రౌనునకది సంతృప్తికరముగ నుండకపోవుటచే 'చకోరీయము' అను నామమును కల్పించెను. వ్యాఖ్య కిట్టిపేరు అపూర్వమగుయు, ప్రబంధనామములోని శశాంకుడు లేక చంద్రునకది పొందికగ నుండునని బ్రౌను భావించెను[42]

నరసింహాచార్యులను నతడు బ్రౌను ఆదేశము ప్రకారము ఈ వ్యాఖ్యను సమకూర్చెను.[43] ఈ వ్యాఖ్యాకాలము 1827 సం॥ అని D. 822 ప్రతిలోను, 1828 సం॥ అని D. 821 ప్రతిలోను బ్రౌనుచే గుర్తింపబడియున్నది. సవ్యాఖ్యాన శశాంక విజయ ప్రబంధపు మూడు సంపుటములను (D. 819) జూలూరి అప్పయ్య 1830 సం॥లో పునఃపరిశీలించి, కొన్ని సవరణలను చేసెను. ఆ సవరణలు అప్పయ్యశాస్త్రి, వ్రాతలో లేదా స్వహస్తలిఖితములో నున్నట్లు బ్రౌను వచించెను. అప్పయ్యశాస్త్రి, బ్రౌను ఇరువురు కలసి యా వ్యాఖ్యలో అనవసరములైన అధిక ప్రసంగములను, పునరుక్తులను తొలగించి సంక్షిప్తపరచిరి.[44] ఈ సవరించిన సవ్యాఖ్యానమునకు 1843-వ సం॥లో శుద్ధప్రతిని వ్రాయించెను. (D. 819). ఈ వ్యాఖ్యకు చకోరీయమని పేరిడెను. శిల్పి శిల్పమును చెక్కినట్లు బ్రౌను వ్రాయించిన ప్రతులనే పదింబదిగ పరిశీలించు స్వభావము కలవాడు. కాన ఈ చకోరీయ వ్యాఖ్యను 1853-వ సం॥న జూలూరి అప్పయచే తిరుగ సవరింపజేసె దానికి 'తారకం' అని నామకరణ మొనర్చెను. (D 822)

4. 2 15. ఈ ప్రబంధమునకు బ్రౌను పదసూచికను తయారుచేయించెను. "యీ ప్రతి సూచిక పుట్టించేటందుకై వ్రాయడమైనది. సూచికలో యెక్కిన శబ్దము

41. అందే. పత్రము. 1
42 *D.* 809. సంపు. 1. పత్రము. 1.
43. D. 821. పీఠిక.
44. **D.** 819. సంపు. 1. ఉపోద్ఘాతము.

లన్నిటికి గుర్తు తగిలించి వున్నవి" అని D 814 ప్రతి ప్రారంభములోను "అస్సలు ప్రతిప్రకారం అవుధాండ్ల అప్పయ్య సరిచూడడం కొత్రపాటి చన్నప్ప చదవడము అయ్యినది" అని గ్రంథాంతములోను ఉన్నది. పైప్రతి ఆధారముగ నలుగురు వ్యక్తులు ఈ కావ్యమునకు సూచికను తయారుచేసిరి. "ఈ తారా శశాంకమును గురించ్చిన సూచిక మహారాజశ్రీ బ్రౌను దొరగారి హుకుం ప్రకారం మచిలీపట్న మందు ఆ ౧౮౩౦ సంవత్సరంలో యిది కుదిరించెటందుక్కాను నలుగురి మనుష్యులకు నాలుగు మాసములు తగిలి వున్నది "45

ఇట్లు బ్రౌను శశాంకవిజయ పరిష్కరణమున నెంతయో శ్రద్ధాసక్తులను కనబరచుట కాననగును. దీనికి వ్యాఖ్యానమును, పదసూచిని సంతరింపజేయుటాతనికి ప్రబంధము పట్ల గల మక్కువను సూచించును

**4. 3. రాధమాధవ సంవాదము :-**

4. 3. 0 బ్రౌను రాధాకృష్ణుల ప్రణయగాథయే రాధామాధవ సంవాద కావ్యేతివృత్తమనియు, నీ శృంగార ప్రబంధమును క్రీ. శ. 1700 ప్రాంతమున వెలు దండి తిరువెంగళయ (**Veludandi Tiru Vengalaya**) రచించెనని చెప్పెను దీనికి కాలక్రమమున ప్రతిక లేర్పడి, లేఖన దోషభూయిష్ఠముగ నుండుటచే, తాను పండితులచే పరిష్కరింపజేసి సవ్యాఖ్యాన శుద్ధప్రతిని సంసిద్ధపరచినట్లును తన ఆంధ్రసాహిత్య పునరుద్ధరణమను వ్యాసమున పేర్కొనెను.

ఇందు కథానాయికయగు రాధ అప్సరసయనియు, మూలభాగవతమున రాధ వృత్తాంతము లేదనియు, తెలుగు సాహిత్యమున రాధ అవతరించుటకు గీతగోవింద కర్తయగు జయదేవుని ప్రభావము కారణమని బ్రౌను అభిప్రాయపడెను 1

4. 3. 1. మ. ప్రా. పు. భాండాగారమున ఈ ప్రబంధమునకు 4 కాగితపు ప్రతులు లభించుచున్నవి.

D 705- అవతారికా భాగము, తృతీయాశ్వాసాదియులేదు. పద్యవిభజన మున్నను పాద విభజనము వ్యతిక్రమముగ నున్నది. "యీదస్త్రుం మాజేటి సర్వేశలింగం భాసాది" అని యుండుటచే దీనిని తాళపత్రము నుండి చూచి వ్రాసిన వాదతదని తెలియుచున్నది.

---

45.

1. **Es. on. Tel. Lit. Para. 77.**

704.- అవతారికా భాగము తప్ప తక్కిన భాగమంతయు కలదు. సక్రమ మగు పద్యపాదముల విభజనముతో, పద్య సంఖ్యతో పత్రమున కిరువైపుల క్రమముగ వ్రాయబడి యున్నది.

D.699- ఇందును అవతారికా భాగము లుప్తము. ఇది పాఠాంతరములతో, తీర్పు పాఠములతో పరిష్కరింపబడిన ప్రతి. పత్రమున కొకవైపున వ్రాయ బడినది. గ్రహింపబడిన శుద్ధపాఠము లెదుటిపుటలో గుర్తింపబడినవి. ఈ ప్రతి లేఖకుడు 'చితంబరం' అని తెలియుచున్నది. శుద్ధప్రతిని సమకూర్చుటకు మూడు ప్రతులను సంప్రతించిరి.

ఉదా :-"ముదాంబురాశి అనె శబ్దము ॥3॥ ప్రతులలో వున్నది. । అట్లా కాదని। తోచిన తీర్పు ముదంబురాశి." (ఆ 1. ప. 2) ఇందలి పూర్వ శబ్దము 'ముత్' అనుహలంత శబ్దమేకాని 'ముద' అను 'అజంత' శబ్దము కాదు. ముత్ + అంబు = 'ముదంబు' అగును కాని 'ముదాంబు' కానేరదు.

*D* 706- ఇందును అవతారికా భాగము కానరాదు. ఇది టీకాసహితమైన ప్రతి.

4. 3. 2. బ్రౌను ఆదేశానుసారము 1829 సం॥ పైడిపాటి వేంకటనరసయ్య దీనికి టీకను సంతరించెను. ఈ ప్రతియందును వెలిదిండ్ల వేంకటపతి అను పేరును ఆంధ్రాంగ్లములందు 'వెలు దండి తిరువెంగళయ్య' అనియే బ్రౌను పేర్కొనెను. ఇది సంశోధిత ప్రతి (critical Edition) అని బ్రౌను తెలిపెను.

**4. 4. వసుచరిత్ర :**

4. 4. 0. ఆంధ్రవాఙ్మయ చరిత్రయందు మూడు యుగములు మహోజ్జ్వల ములైనవి. మొదటిది నన్నయ భీమనలతోపాటు శివకవులు వెలసిన యుగము. రెండవది తిక్కన సోమయాజి కాలము. ఆ పిదప సాహిత్యాకాశమున మాధ్యందిన మార్తాండుని వలె వెలిగిన వాడు భట్టుమూర్తి. అతనితోపాటు రాయల ఆస్థానకవు లందరును రత్నముల వంటివారని బ్రౌను పేర్కొనెను.[1]

1. Es. onTel. lit Para 14.

4 4 1. భట్టుమూర్తిని బ్రౌను మిల్టన్ కవితో పోల్చెను రామరాజు అనునది అతని నామధేయమనియు, భట్టుమూర్తి అనునది (Mirror of Minstrelsy) బిరుదనామ మనియు తెలిపెను.[2] ఈ బిరుదమును కృష్ణదేవరాయలు రామరాజ భూష ణున కొసగెననియు అతడు వివరించెను.[3] కాని భట్టుమూర్తి అనునదియే నామధేయ మనియు, అళియ రామరాయల ఆస్థానమునకు భూషణమువంటి వాడగుటచే రామరాజ భూషణుడను బిరుదనామముచే వ్యవహరింప బడితాడని ఆంధ్రవాఙ్మయ చరిత్రకారుల నిర్ణయము. నరసభూపాలీయమునను 'మూర్తికవి' అను పేరు యున్నది భట్టు మూర్తి నరసభూపాలీయము, వసుచరిత్ర, హరిశ్చంద్రనలోపాఖ్యానములకు కృతికర్త.

4. 4. 2. రాయల ఆస్థానమున అష్టదిగ్గజములు మాత్రమే యున్నట్లు ప్రసిద్ధి. కాని బ్రౌను కృష్ణరాయల ఆస్థానము నలంకరించిన తొమ్మండుగురు (?) కవి ప్రకాండులలో నొకడగు భట్టుమూర్తి శూద్రుడనియు, ఈతడు రామరాజశిరో భూషణీయ మను నామాంతరముగల వసుచరిత్రను రచించెననియు బ్రౌను వివరిం చెను [4] వ్యాసమహర్షి మాతామహుడగు వసురాజు గిరికను పరిణయమాడుట ఇందలి యితివృత్తమనియు తెలిపెను [5] తన వ్యాసములందు, భట్టుమూర్తి ప్రస్తావన వచ్చిన పట్టులందాతడు శూద్రుడని బ్రౌను ప్రత్యేకముగ పేర్కొనుట, ఆనాటి వర్ణ విభేద తీవ్రతను తెలుపుచున్నది

4. 4. 3. బ్రౌను మహాశయునకు, అతని పోషితవర్గము వారికి, అతని పం డితులకు జరిగిన ఉత్తరప్రత్యుత్తరముల పరిశీలించిన వసుచరిత్ర ప్రతుల సంపాదన, పరిష్కరణ; వ్యాఖ్యన సమకూర్చుట, ముద్రణ అను దశల క్రమ పరిణామము తెలి యనగు చున్నది.

1827 -వసం॥న బ్రౌను తిరుచునాపల్లిలో రిజిస్ట్రారుగ నుండెను. ఉద్యోగి వశమున తమిళనాడులో నుండు నిర్బంధమేర్పడినను బ్రౌను ఆంధ్రకావ్యసంపాదనకు పరిష్కరణకు ప్రాలుమాల లేదు. అటనుండి తన కాశ్రితుడగు కృష్ణారెడ్డికి వసు చరిత్ర 'తీర్పు' చేయింపుమని ఆజ్ఞ జారీచేసెను. వసుచరిత్ర ప్రతులు అప్పుడు

2. **Ibid. Para 68.** 3. **Ibid Para 70.**

4. వసుచరిత్రకు రామరాజ శిరోభూషణీయ మను నామధేయము మృగ్యము.

5. **P. R. T. L. P. 63.**

కంఠంలో నున్నందున, వానిని తెప్పించి 'కాలేజికచేరీ వారిచేత' తీర్పు చేయించెదనని బ్రౌను సముఖమునకు కృష్ణారెడ్డి విన్నపమును వ్రాసికొనెను.[6]

'కాలేజికచేరివారు' బ్రౌను ఆదేశము మేరకు వసుచరిత్ర వ్యాఖ్యాన సహితముగా మొకాబిలా చేసి, తీర్పు చేయు చున్నట్లును: చతుర్థాశ్వాసము రెండు రోజులలో ముగియుననియూ వసుచరిత్ర గ్రంథమంతయు పదునేను రోజులలో పరిసమాప్తి యగునట్లు తోచుచున్నదని కృష్ణారెడ్డియే మరల బ్రౌనునకు నివేదించెను.[7]

'కాలేజి కచేరివారు' సవరించిన వసుచరిత్రను బ్రౌను పరిశీలనార్థము కృష్ణారెడ్డి పంపినట్లు తెలియుచున్నది. ఆతడు దానిని తన సవరణలతో, సూచనలతో తిరగ బంపి, దానికి ములుపాక బుచ్చన్న శాస్త్రులను టీక వ్రాయ నాజ్ఞాపించెను. బుచ్చన్న శాస్త్రుల వారి టీకలోని పొరపాట్లను మరొక పండితుడు సవరించినట్లు కృష్ణారెడ్డి 20-3-1830 లో బ్రౌనుకు వ్రాసిన లేఖవలన తెలియుచున్నది.[8]

బ్రౌను, ఉద్యోగనిమిత్తమొకచోట, ఆతని పండితులు మరొకచోట నుండి కావ్య పరిష్కరణ కార్యమును కొనసాగించుటచే, ప్రయాణవసతులు, తపాలా సౌకర్యములు అంతగాలేని ఆ కాలమున కాలయాపనము జరుగుటలో అబ్బురములేదు. 1831 సం॥ డిశెంబరు నెలలో మరల కృష్ణారెడ్డి "బుచ్చయ్య శాస్త్రుల్లు వారు చేశ్ని వసుచరిత్ర టీక ప్రతిన్ని, వసుచరిత్ర విభేదాల ప్రతిన్ని, సవ్యాఖ్యానం ప్రతిన్ని, వసుచరిత్ర సాపు విభేదాలది కొరవలగా వుండే ప్రతిన్ని..." బందరులో జిల్లాజడ్జిగ నున్న బ్రౌను సముఖమునకు పంపెను.[9] దీనిని బట్టి బ్రౌను తనకు సంతృప్తికరముగ నుండని యెడల పరిష్కరణకార్యమున ముందుకు పోయెడువాడు కాదని వ్యక్తమగు చున్నది. కాలపరిమితి పరిగణింపక స్వయముగ పరిశీలించెడి వాడు. బుచ్చయశాస్త్రి వ్యాఖ్య బ్రౌనునకు సంతృప్తికరముగ నున్నట్లు తోపదు. అతడు 1833 లో జూలూరి అప్పయ్యను దీనికి వ్యాఖ్య వ్రాయ నియమించెను. బ్రౌను ముద్రాక్షరశాలయందు 'ఛాపాఖానా' పనివాడైన మంగు నాగలింగం జూలూరి అప్పయ్య పంతులుగారిని అడిగి వసుచరిత్ర మొదటి పద్యములు టీకతోకూడా అడిగి పుచ్చుకొని

6. Sr of Lt. M. 411. P 15.
7. Ibid. M. 411. PP. 22-24.
8. Ibid. M 417 pp. 428 - 435
9. Ibid. M. 401 pp. 197 - 200.

నాల్గుసైడ్లు కట్టి అచ్చువేశినాను" అని 14-5-1833-న బ్రౌనుకు నివేదించెను 10 అప్పయశాస్త్రి యీ టీకను ఒక ఏడాదిలో పూర్తిచేసినట్లు తెలియుచున్నది "ప్రకృత మందు జూలూరి అప్పయ్య పంతులుగారు చేశే వసుచరిత్ర టీక ౬ ఆశ్వాసములకు సమగ్రంగా అయినది" అని కాలేజి పండితులలో నొకడైన కంభం నరసింహా చార్యులు 7-4-1834న బ్రౌను దొరకు విశదపరచెను 11 ఈ ఉత్తర ప్రత్యుత్తర ములను బట్టి ప్రతుల సంపాదన, సంస్కరణ, ముద్రణమును బ్రౌను ఏకకాలముననే కొనసాగించెడివాడివాడని, ఒక కార్యము పూర్తియగు వరకు వేచియుండెడివాడు కాదని విదితమగుచున్నది.

4. 4. 4. మ. ప్రా. పు. భాండాగారమున వసుచరిత్రకు 19. తా. ప్రతులు 6. కా. ప్రతులున్నవి.

*D* 757:- తాళపత్ర ప్రతినుండి సవ్యాఖ్యాన వసుచరిత్ర మూలము ఉద్ధరింపబడి నది. ౫, ౬ ఆశ్వాసములు సమగ్రములుగా కలవు. పద్యవిభజన మున్నను, పాద విభజనములేదు.

D 738: + . శుద్ధప్రతి. ఇందలి వ్రాత జూలూరి అప్పయ్యదిగ తోచును. పద్య పాద విభజనముతో, సంఖ్యాక్రమముతో పత్రమున కొకవైపుననే వ్రాయ బడినది. ఈ ప్రతియందులేని రెండు పద్యములు గుర్తింపబడినవి.

*D*. 749- 6 ఆ. 123 ప. వరకు కలదు. విద్వజ్జన రంజినీ వ్యాఖ్యాసహిత పరి ష్కృత ప్రతి దీని వ్యాఖ్యాత ఎవ్వరనునది బ్రౌను తెలుపకున్నను, ఇది ప్రాచీన వ్యాఖ్య అనియు 1750 ప్రాంతముల వ్రాయబడి యుండుననియు అభిప్రాయపడెను. (This is the older commentary composed about 1750 A. D.) ఈ ప్రతిని జూలూరి అప్పయ్య పరిష్కరించెను. దీని మాతృక జూలూరి అప్పయ్య పంతులు తీర్పుచేశి స్వంతముగా వ్రాశిన ప్రతిగనుక అది చూచి వ్రాయడమయినది" అని లేఖకుని సూచన.

D. 760. ములుపాక బుచ్చయ టీకాసహిత శుద్ధప్రతి. ఇందు మొదటి మూడాశ్వా సములకు టీక లేదు.

---

10. Ibid. M. 401. pp. 322-323.

11. Ibid M. 401. pp. 309-310.

D 761- చివరి మూడాశ్వాసములకు టీక కలదు. ఈ ప్రతియు పూర్వ వర్ణిత ప్రతియు కలసి సమగ్ర ప్రతి యగును. బుచ్చయ దీనిని బ్రౌను ఆదేశానుసారము రచించెను. ఇందలి అశ్వాసాంతగద్య :

ఇది శ్రీ మన్నవఖండ మండిత ధరామండలాఖండల కుంపినీ సార్వభౌమ సమర్పిత సామ్రాజ్య రాజాధిరాజపూజ్య ఇంగిలీషువంశ పయః పయోధి రాకాసుధాకర వినయాది సుగుణరత్నాకర దేశోద్ధు వసుంధరారమణ హృదయకమల దివాకర సకల భాషా విశేషాభి భాషణ విద్యా వినయ నయ వితరణాభరణ పోషణ సకల కళాసనాథ చార్లీసు పిలిపు బ్రౌన్విభుబాది నాథ కరుణాకటాక్ష లబ్ధ సమస్త విభవాతిశయ విద్వజ్జన విధేయ ములుపాక బుచ్చయ నామధేయ ప్రణీతంబైన వసుచరిత్ర ప్రతిపదార్థ ప్రకాశిక యను టీక యందు ద్వితీయాశ్వాసము." ప్రథమ తృతీయాశ్వాసములందు ఆశ్వాసాంతగద్య కానరాదు. పై గద్య వలన ఈ టీకకు 'ప్రతిపదార్థ ప్రకాశిక' అను పేరును వ్యాఖ్యాత యొసగినట్లు తెలియుచున్నది సోమనాథుని వ్యాఖ్య విద్వజ్జన రంజనమే గాని సామాన్య జన రంజకము గాకపోవుటచే బుచ్చయ్య శాస్త్రిచే బ్రౌను ప్రతిపదార్థ ప్రకాశికా వ్యాఖ్యను వ్రాయించినట్లున్నది.

D 759. + సటీకము టీకా కర్త జూలూరి అప్పయ్యశాస్త్రి. ఈటీకకు స్వప్రతిపదటీక మని పేరు ఇది రెండు సంపుటములు. ఈ ప్రతిలోని మూలమును జూలూరి అప్పయ్య శాస్త్రి పుత్రుడు వ్రాసినట్లు, టీకమాత్రము అప్పయ్య శాస్త్రి స్వహస్త లిఖితమైనట్లు బ్రౌను తెలిపెను. ఈ టీకను రచించి నందులకు శాస్త్రిగారికి బ్రౌను ధనమొసగినట్లును నిందు పేర్కొనబడినది.

"స్వప్రతి పదటీక ఛార్లిసు ఫిలిప్ బ్రౌను దొరవారి అనుమతిని జూలూరి అప్పయపంతులుగారిచేత 1844వ-వ సం॥న వ్రాయబడ్డది" అని శ్రీ నిడుదవోలు గారు పేర్కొనిరి. (వసుచరిత్ర. చతుర్థపీఠిక. వావిళ్ళ. 1962) ఈ వ్యాఖ్యను అప్పయ పండితులు క్రీ శ. 1834 సం॥ ఏప్రిల్ 6 వతేదీకి ముగించి నట్లిందుకలదు.

"ఆన ౧౮౩౪ సం॥ యేప్రిల్‌నెల ౬వ తేది వఱకు మహారాజశ్రీ చా॥పి॥ బ్రౌన్ దొరవారి సెలవుప్రకారం ఈ వసుచరిత్ర ఆరు ఆశ్వాసములకున్ను జూలూరి

అప్పయ్య ప్రతిపదటీక చెయ్యబడమైనది." ఈ కాలమును కంభం నరసింహాచార్యుల లేఖయు బలపరచుచున్నది. ఇది 1844-వ సం॥న ముద్రితమై యుండవచ్చును కాని టీక పూర్తియయినది మాత్రము 1834-వ సం॥న అనుటలో విప్రతిపత్తి లేదు

4. 4. 5. ఈ ప్రతియందు కొన్ని పద్యముల భావములను బ్రౌను ఆంగ్లీకరించెను. ఉదా :

గిరిరాజ తనయకై వడి
సిరి రాజిల వెలయు నీ సుశీలయనుచు నా
గిరి కన్య కచటి మౌనులు
గిరికా శుభనామ మిడి రకిల్పిష ఫణితిన్॥

బ్రా॥ ప్ర॥ 3॥ 33॥ ము॥ ప్ర॥ 3-28

"33. In blazing loveliness she rivals the daughter (Parvati) of the king of Hllls. (Himavat) and hence the hermits who dwelt there gave her unimpeachable epithet 'Collina' – (Giri canyaca)" కొన్నింటిని పద్యరూపమున పెట్టెను. (చూ. అను.)

బ్రౌను అప్పయ్య టీకను కొన్ని తావులందు సవరించెను.

సీ॥ హరిహయ వాహనాహంకారము హరించి ... ఆ 4॥ ప॥ 14॥ 15
(4 : 12 ముద్రితప్రతి)

ఈ పద్యమున "The commentator has omitted" to explain the last two lines టీక సమగ్రం కాదు" అని బ్రౌను స్మరించెను టీకలో తరచు 'అనగా అయినటువంటి' అను పదములను పునరుక్త మొనర్చక "× అనగా, అటువంటి అనె అక్షరాల వ్రాయకుండ యీ సంజ్ఞ వ్రాసుకొనేది-" అని బ్రౌను సంక్షిప్తతను సూచించెను.

గ్రంథాంతములో "గ్రంథం చాపో అయిన తరువాత అర్ధబిందువును గురించి శకటరేఫను గురించి మా అభిప్రాయం వ్రాసుకొని తగిలించ వలశించి-" అని లిఖితమై యున్నది. ఈ వ్రాత బ్రౌను దొరది కానోపును

**4. 4. 6. వసుచరిత్ర ముద్రణము :**

మంగు నాగలింగం లేఖవలన 1833-వ సంవత్సరమందే బ్రౌను వసుచరిత్ర ముద్రణ కుపక్రమించినట్లు తెలియుచున్నది. కాని ముద్రాక్షరములు సరిగలేనందు వలన ఆ ముద్రణము నిలిచిపోయినట్లున్నది. సవ్యాఖ్యాన వసుచరిత్ర ప్రతి 1834-వ సం॥న సంసిద్ధమయినను, అది వెంటనే ముద్రణ భాగ్యమునకు నోచుకొనలేదు. ఇది ముచ్చటైన అచ్చులో వెలుగు చూచుటకు ఇంచుమించొక పుష్కరకాలము పట్టినది.

ఈ ముద్రణకార్య మాగిపోవుటకు ఆ ఏడాది బ్రౌను జీవితములో సంఘటిల్లిన విపత్కరసంభవములే ప్రధాన కారణముగ పరిగణింపవచ్చును 1834-వ. సం॥ న ఉద్యోగ నిర్వహణలో దొరలిన కొన్ని పొరపాటుల కారణముగ ప్రభుత్వము బ్రౌనును పదవి నుండి తొలగించెను. ఆ మానసికాందోళనలో; ప్రభుత్వమునకు న్యాయాన్యాయ పునఃపరిశీలన నిమిత్తము విన్నప పత్రమును సమర్పించి, మూడేండ్ల సెలవుపై లండనుకు పోయిన బ్రౌను తిరిగి 1838వ సం॥న గాని మదరాసును చేరు కొనలేదు. ఏదేశమేగినా, ఎందుకాలిడినా ఆంధ్రభాషోద్ధరణమునే కొనసాగించిన బ్రౌను ఈ గడ్డపై కాలు మోపిన వెంటనే మరల తెలుగు కావ్యముద్రణకు పూను కొనెను.

D 759. ప్రతిలో బ్రౌను "In 1839. I printed the work verbatim from this volume; but in a few places filled up an omission" అని పేర్కొనెను. ఈ ప్రతి యందలి ఆయాపుటలలో ఆయాశ్వాసములోని విష యము ముద్రించిన తేదీలను బ్రౌను గుర్తించెను. ఇందలి బ్రౌను వ్రాతను బట్టి మొదటి మూడాశ్వాసముల ముద్రణము నిర్విఘ్నముగ 1839-వ సం॥న ముగిసినట్లు తెలియు చున్నది. బ్రౌను వట్యం అద్వైతబ్రహ్మయ్యశాస్త్రిలవారికి వ్రాసిన లేఖనుబట్టి (1840 జనవరి 31) ఈ అశ్వాసత్రయమును స్వీయ ముద్రాక్షర శాలయందు సొంతఖర్చుతో బ్రహ్మయశాస్త్రి పర్యవేక్షణలో ముద్రించినట్లు వ్యక్తమగును[12] అచ్చు పరిశ్రమ పరి ణతి నొందని కాలమిది. కావ్యము నిర్దుష్టముగ ముద్రణ నొందవలయునన్న సమ ర్థులైన పండితుల ఆధ్వర్యవమున జరుగుటవసరమని బ్రౌను గుర్తించెను.

---

12. Sr. of. Lt. M. 401. pp. 175-176.

ఈ లేఖయందు సూచితమైనట్లు అస్వస్థుడైన బ్రహ్మయ్యశాస్త్రి కోలుకొనలేదు. అతడు మే. 1840 సం॥న పరమపదించినట్లు అధికారిక ప్రకటనము 13 ఈద్వితీయ విఘ్నమువలన వసుచరిత్ర ముద్రణము మరల కుంటువడెను. బ్రహ్మయ్యశాస్త్రి వంటి వ్యక్తుల సహకారములేనిదే ఈ కార్యమును నిర్వహింపలేననుకొని కాబోలు బ్రౌను ఈ ముద్రణమును పరుల కప్పగింప సంకల్పించినట్లున్నది ఈ ప్రతి యందే (D 759) అమెరికన్ మిషన్ ప్రెస్ వారు వసుచరిత్ర ముద్రణకగు వ్యయ మును తెలుపుచు బ్రౌనుకు వ్రాసిన లేఖ యున్నది అమెరికన్ మిషన్ ప్రెస్ వారికి బ్రౌను ఈ ముద్రణము నప్పగించెనా లేదాయని ఇదమిత్థముగ చెప్పనాధారములు లభించుటలేదు 1842 ఆగస్టు 4 వ తేదీ 'వర్తమాన తరంగిణి' పత్రికలో "వసు చరిత్ర - టీకతో 4 అశ్వాసము పర్యంతము తయారుగా వున్నవి. మిగిలిన రెండు అశ్వాసములున్నూ పూర్తికాగానే యిప్పించడమవును రు. 10." అను వ్యాపార ప్రకటన మున్నది. దీనిని బట్టి అమెరికన్ మిషన్ ప్రెస్ వారు 4-వ అశ్వాసమును ముద్రించియుండవచ్చును ఆ ప్రెస్సునందే వసుచరిత్ర ముద్రణమేల పూర్తికాలేదను ప్రశ్నకు సంతృప్తి కరమగు సమాధానము మృగ్యము 1839-వ సం॥న ముద్రిత మైన మూడాశ్వాసముల ప్రతిగాని, 1842 సం॥ నందలి 4 అశ్వాసముల ప్రతిగాని అలభ్యములు. ఉపలబ్ధమగు 1844 వ సం॥ పు ప్రతి క్రిస్టియన్ వర్నాకులర్ నాలెడ్జ్ సొసైటీ ప్రెస్సునందు **(Christian Vernacular Knowledge Society Press)** ముద్రితము.

4. 4. 7 వసుచరిత్రవంటి శ్లేషకావ్యములందలి శైలివిదేశీయ విమర్శకుల కభిమతము కాకున్నను, దేశీయులకది అత్యంతప్రీతి పాత్ర మసుటను విస్మరింపరాదని బ్రౌను నుడివెను. **Thomas Hood** అను ఆంగ్లకవియు శబ్దచిత్ర కవితను రచిం చెనట ఆతని కవితను భారతీయులభినందించి యుందురనెను. సంస్కృతాంధ్ర పదములతో శ్లేషార్థములను, ద్వంద్వార్థములను సాధించుట యొకగారడి వంటిది. ఇట్టి నానార్థముల సాధించు విధానము ఫ్రెంచి భాషయందును కలదు. అట్టిదానిని వారు "Charades" అని వ్యవహరింతురు. ఈ పదముల గారడీని గూర్చి జాన్సన్‌కవి "అర్థముకాని యీ కవిత అసాధ్యమైన బాగుండెడిది." అని అభిప్రాయపడినట్లు తెలి

---

13. బ్రౌను లేఖలు. పు. 54.

పెను.[14] ఇట్టి శ్లేషకావ్యములలో క్లిష్టతరమైన పద్యములను పాఠశాలలలో వాటిని కంఠస్థము చేయింతురుగాని, వాని అర్థమును మాత్రము బోధింపరని బ్రౌను నేరారోపణ చేసెను. అర్థరహితముగ పద్యములను ధారణచేయుట వ్యర్థమని యాతని భావము. విదేశీయులకు పండితులు సహితము వివరింపలేని యిట్టి పద్యములు నిష్ప్రయోజనమని మొగమోడక వెల్లడించెను[15]

**4.** 4. 8. బ్రౌను కింవదంతులను ప్రమాణముగ పరిగణింపకున్నను, వానిని పేర్కొనక విడువలేదు భట్టుమూర్తిని పాంచాలీ పరిణయ కర్తగ పేర్కొందురనియు, కాని తనకా పేరితోడి కావ్య మేదియు లభింపలేదని తెలిపెను.[16] 'పాంచాలీ పరిణయము' ముద్రితము (1-5-1937). ఇది కాకమాని మూర్తికవి ప్రణీతము భట్టుమూర్తి కాకమాని మూర్తి భిన్నులు. మూర్తినామ సాదృశ్యము ఈ భ్రాంతికి కారణమై యుండును.

ప్రౌఢ ప్రబంధమగు వసుచరిత్ర శ్లేష నిర్బంధముచే విదేశీయులకు కొరకరాని కొయ్యయైనను, దానికి వ్యావహారిక భాషలో సరళ వ్యాఖ్యను సమకూర్చి సామాన్య ప్రజానీకపుటందుబాటులోనికి కొనిరా ప్రయత్నించిన బ్రౌను నిష్కామకర్ముడు. నిస్స్వార్థపరుడు.

**4. 5.** కవికర్ణరసాయనము :

4. 5. 0. సంకుసాల నృసింహకవి విరచిత 'కవికర్ణరసాయనము' రసవంతమైన ప్రబంధముగ ప్రసిద్ధినందినట్లు బ్రౌను పేర్కొనెను.[1] ఈ ప్రబంధమున కాతడు తయారు చేయించిన కా. ప్రతులు - 4 తా. ప్రతులు - 3.

**D** 448 +

---

**14. Performing innumerable feats of perverted ingenuity which as Dr. Johnson says "are so difficult that we are inclined to wish they had been impossible." Es. on Tel. Lit Para. 69**

**15. Ibid. Para. 69.**

**16. Ibid – Para 70**

**1. Es. on Tel. Lit. Para. 78.**

D 449 + పాఠభేదములు పంక్తుల నడుమను. తీర్పుపాఠములు వ్రాయని ఎదుటి వైపున గుర్తింపబడినవి

D 453. మొదటి మూడాశ్వాసములకు వ్యాఖ్య కలదు

D 454. 4–వ ఆశ్వాసము నుండి చివరివరకు వ్యాఖ్యఉన్నది. D 453, 454 రెండు కలిపిన సమగ్రమైన వ్యాఖ్య అగును.

4. 5. 1. ఈ కావ్యమునకు చట్టు రామాచార్యులు, మయిలవర్పు శేషయ్య అనువారు 1831-వ సం॥ అగస్టు 4-వ తేది ప్రతిభేదములు గుర్తించుటను పూర్తి చేసిరి.[2] 1831 సం॥ సెప్టెంబరు 23-వ తేది జూలూరి అప్పయ్యశాస్త్రి తీర్పు చేయుటను పూర్తిగావించెను. ప్రత్యంతరములు చూచి తీర్పు చేయవలసిన పద్యములు గుర్తింపబడినవి :

"ప్రథమాశ్వాసములోను............
అవతారికలోను..................
౧ ...............పద్యం ౮
౧ ...............పద్యం ౧౨
౧ ...............పద్యం ౧౩
౧ ...............పద్యం ౧౦౮
కథా ప్రారంభములో
౧ ...............పద్యం ౨౬
..................." (D. 449)

4. 5. 2. కవికర్ణ రసాయనమునకు 'మాంధాత చరిత్ర' అను నామాంతరము కలదనియు, ఇదియే ఒప్పిదముగా నున్నదనియు ఈ మాంధాతకథ విష్ణుపురాణము (తెలుగు) V. 107, భాగవతమ నవమస్కంధము 6, 7 భాగములలో కలదని బ్రౌన్ తెలిపెను. ప్రస్తుత ప్రతిలో నాలుగు ప్రతులనుండి పాఠభేదములు గుర్తింపబడినవని, కాని అయ్యవి కొంత అన్వయ రహితముగ నుండుటచే మరికొన్ని ప్రతులను సంప్రతించు ఆవశ్యకత యేర్పడినదని బ్రౌను నుడివెను. పంచమాశ్వాస

2. D.

ములో అధిక భాగము ఒకే ప్రతిమీద ఆధారపడినట్లును కడీవల లభించిన గుంటూరు ప్రతి పై లోపములను పూరించుటకు తోడ్పడినదని బ్రౌను ఈ ప్రబంధమునకు వ్రాసిన ఉపోద్ఘాతములో వ్యక్తము చేసెను.[3]

4. 5. 3. ఈ ప్రబంధములోని కొన్ని పద్యములను బ్రౌను ఆంగ్లములోనికి అనువదించెను మచ్చున కొకటి :

క॥ ఎల్లరు మెచ్చఁగ మత్కృతి
నుల్లంబున మెచ్చుగాక యొకదుష్టకులం
బొల్లని పల్లవి తామ్రము
కొల్లలుగా బొగడ నొక్క కోయిల లేదే'

వ్రా॥ ప్ర॥ 1-19 ము॥ ప్ర॥ 1

**"The praise of one good critic is enough - is not the praise of one cokila enough to the mango blossom tho' the camel prefers brambles."**

4. 5. 4. ఈ ప్రబంధమునకు బ్రౌను దొర ఆనతిని ఆతని పండితుడైన జూలూరి అప్పయ్య నందన నామ సం॥ మార్గశిర శు॥ 7-వ తేదిన సంపూర్ణముగ టీక రచించెను. ఈ విషయమును జూలూరి అప్పయ్య స్వయముగ గ్రంథాంతమున తెలిపెను." నందననామ సంవత్సర మార్గశిర శు॥ శుక్రవారం వరకు బందరు పట్టణములో న్యాయాధికారిగా నున్నటువంటి మహారాజశ్రీ చార్లెసు ఫిలఫీ బ్రౌను దొరగారి సెలవు ప్రకారము జూలూరి అప్పయ్యకవి కర్ణరసాయన ప్రబంధమునకు సంపూర్ణముగా టీక రచించడమైనది." (D. 454).

**4. 6.** మనుచరిత్రము :

4. 6. 0. బ్రౌను టీకా శబ్ద సూచులను వ్రాయించిన తెనుగు కావ్యములలో మనుచరిత్ర యొకటి. అల్లసాని పెద్దన్నను ప్రథమ శ్రేణి కవిగనే బ్రౌను గుర్తించెను. పెద్దన్నయే విష్ణుచిత్తీయకర్తయనియు నాతని ప్రగాఢ విశ్వాసము. విష్ణుచిత్తీయ పీఠికయందు తన యితర గ్రంథములను కవి తెలిపినట్లు, ఆప్రతులకై తాను

3. D. 449.

వెదకి కనుగొనలేక పోయినట్లు బ్రౌను పేర్కొనుటయే కాక, అప్పకవీయమందైనను నవి ఉద్ధరింపబడలేదని పేర్కొనుట విశేషము.[1]

భట్టుమూర్తి శూద్రుడగుటచే ఆతనికి ఆంధ్రకవితాపితామహ బిరుదము నొసగక, పెద్దన కొసగినట్లున్న జనశ్రుతిని కూడా బ్రౌను ఉటంకించెను.[2]

4. 6. 1. మద్రాసు భాండాగారమున ఈ ప్రబంధపు తాళపత్ర ప్రతులు 19, కాగితపు ప్రతులు 2 ఉన్నవి.

కాగితపు ప్రతుల వివరములు :

D 621 + పాఠాంతరములు పంక్తుల నడుమ గుర్తింపబడినవి. తీర్పుచేసిన పాఠములు ఎదుటి పుటలో నొసగబడెను.

D 641 + ఇది టీకాసహితముగ రెండు సంపుటములలో నున్నది. మొదటి మూడాశ్వాసములు ప్రథమ సంపుటము. 4 నుండి 6 ఆశ్వాసములు ద్వితీయ సంపుటము.

ప్రథమ సంపుటారంభమున బ్రౌను తన ఆదేశము మేరకు మహాపండితుడైన జూలూరి అప్పయశాస్త్రి మనుచరిత్రకు స్వహస్తముతో టీక సమకూర్చినట్లు పేర్కొనెను.

ద్వితీయ సంపుటారంభముననూ, అతిక్లిష్టము, ముఖ్యమునైన వ్యాఖ్యను సమకూర్చు బాధ్యతను విద్వాంసుడైన జూలూరి అప్పయ నిర్వహించినట్లును, ఇందు ప్రతిపదమునకు అర్థమును వివరించినట్లును బ్రౌను పునరుద్ఘాటించెను.

వ్యాఖ్యాన ప్రతి అంతములో "ఖరనామ సంవత్సర మార్గశిర బ ౧౦ గురువారం అ ౧౮౩౧ సం॥ డిశంబరు నెల ది ౨౯ తేదివరకు మహారాజశ్రీ చార్లీసు ఫిలిఫీ బ్రౌన్ దొరగారి సెలవు ప్రకారము జూలూరి అప్పయ్య - యీ స్వారోచిషమను సంభవమునకు అనగా మనుచరిత్రకు టీక చెయ్యడమయినది." (*D* 641) అను జూలూరి అప్పయ్య లేఖనము కలదు.

4. 6. 2. పాఠనిర్ణయమున బ్రౌను, అతని పండితవర్గము వహించిన శ్రద్ధకు ఈ క్రింది ఉదాహరణములు చూపబడుచున్నవి :

---

1. Es. on Tel. Lit. Para. 71· 2. Ibid.

(i) సీ॥ తీర్థసంవాసు లేతెంచినారని విన్న
నెదురుగా నేఁగు దవ్వైనఁ తయైన
నేగి తత్పదముల కెఱఁగి యింటికి దెచ్చు
దెచ్చి సద్భక్తి నాతిథ్యమిచ్చు
నిచ్చి యిష్టాన్న సంతృప్తులుగా జేయు..." (ఆ॥ 1॥ ప॥ 63)

ఈ పద్యములో 'ఇష్టాన్న' అను పాఠమునకు 'మృష్టాన్న' అను పాఠాంతరము కలదు. 'మృష్ట' అనగా 'పక్వముచేయబడిన' అని అర్థము. పక్వము చేయబడిన అన్నమునే పెట్టుదురుగాని పక్వము చేయని అన్నము ఉండదు కదా! 'ఇష్టాన్న సంతృప్తులంగాజేసి' అనగా ఆ తీర్థవాసులకు ఇష్టమైన అన్నముపెట్టి తృప్తులుగా జేసి అనుటయే సరియైనది.

(2) "అతడట్లౌషధ హీనుడై నిజపురీ యాత్రామిళత్కౌతుకో
... ... ... ... ...
... యీ ఘోరవన ప్రదేశమునకున్ సిద్ధాపదేశంబునన్".
(ఆ॥ 2॥ ప॥ 14)

ఈ పద్యము నాల్గవపాదమున 'సిద్ధాపదేశంబునన్' అను దానికి 'సిద్ధోపదేశంబునన్' అను పాఠాంతరము కలదు.

సిద్ధ + అపదేశంబునన్ - సిద్ధాపదేశంబునన్ = సిద్ధుడను నెపము చేత అని అర్థము.

సిద్ధ + ఉపదేశంబునన్ - సిద్ధోపదేశంబునన్ = సిద్ధుని ఉపదేశముచేత అని అర్థము.

'సిద్ధాపదేశంబునన్' అను పాఠమే సరసము. సిద్ధుడు ప్రవరుని పాదమునకు పాదలేపము పూసి హిమవత్పర్వతమునకు వెడలుమని ఉపదేశించలేదు. ప్రవరుడే తన చిరకాలవాంఛను తీర్చుకొనుటకు సిద్ధుని ప్రార్థించి యతని యనుగ్రహముచే హిమవత్పర్వతమునకు వచ్చెను. కావున 'సిద్ధాపదేశంబునన్' అనునదియే యీ సందర్భమునకు సరియైన పాఠము.

3) "అనుకూల గతి నాదు మనసులో వర్తించు
కులకాంత మదినెంత కుందునొక్కొ" (ద్వి. ఆ. ప. 17)

పైపద్యములోని 'అనుకూలగతి' అను పాఠమునకు 'అనుకూలవతి' అను పాఠాంతరముకలదు. 'అనుకూలము', 'అనుకూల్యావతి' యగనే కాని 'అనుకూలవతి' కాదు. 'అనుకూలగతి' అనగా 'అనుకూలమైన వర్తనముతో' అని అర్థము. ఇదియే సరియైన పాఠము.

"మనసు గ్రక్కుయెడు రీతిని............" (3.160)

ఈ పద్యము తాము సరిపోల్చిచూచిన అయిదు ప్రతులందు లేనట్లును, ఒక్క కృష్ణమూర్తిగారి ప్రతియందు మాత్రమె ఉన్నట్లు పరిష్కర్తలు తెలిపిరి. ఇది యచట కథకు అసందర్భముగను, అనన్వయముగను నుండుటవలనను, ప్రక్షిప్తమేమో అను సందియము వలనను, దానికి తీర్పుగాని, టీకకాని చేయనట్లు సూచించిరి.

"అత్తెరంగున దరి పాటొర జంపు......"

ఈ పద్యమందలి 'రవళి' అను శబ్దవిమర్శను బ్రౌను ఒనర్చెను. ఈ సందర్భమున 'రవళి' అను పదము ధ్వన్యను కరణముగను, అర్థవంతముగను నున్నదని అతడు భానుమతీ పరిణయము (4-134), తారాశశాంకము (5-138), విష్ణుపురాణము (6-13), ఇళాదేవీయము (3-143) అను కావ్యములనుండి ప్రయోగములను ప్రదర్శించెను.

వ అది యట్లుండె... కందళ। వ్రాత। జాతా। లాత। శంకా।......"
(1-30. ము. ప్రతి. 72).

'లాత శబ్దము సందేహం. యిది అలాత శబ్దమనె అర్థము చెయ్యడమైనది." అని గమనిక. ఇచట అలాత=కొఱవి అను అర్థమే సరిపడును. లాత శబ్దము పొసగదు.

4. 6. 3. గ్రంథ పరిష్కరణము బహుప్రయాసతో కూడినది. అప పాఠములతో నున్న అసమగ్రమైన ప్రతులతో పాఠనిర్ణయమునకు పూనుకొనుట సులభసాధ్యముకాదు. మనుచరిత్రకు టీకను పూర్తిచేసి, తనకు కలిగిన సందేహములను నొక కాగితముపై గుర్తించిరి: "మనుచరిత్ర టీక చెయ్యడములో వచ్చిన అర్థసందేహములు-౩-మూడో ఆశ్వాసమందు - రగడలో.

౧......౧౦౮ పద్యములోను వైశికము కైశికము అని రెండు పాఠములుగా
వుండిన్ని అర్థము కానిది-
౧......౧౧౨ పద్యములో, బుక్కాము, బక్కాము అని వున్నది.
౧......౧౧౩పద్యములో పరవాడి అని వున్నది.

3
౧......నాలుగో ఆశ్వాసములో ౨౫౦లో పరిశనములు అని వున్నది.
౧...... అయిదో ఆశ్వాసములో ౧౩౩ పద్యములో భోగాస్మి ప్రతిత
స్పూర్త్యా భావ అన్నచోటను.
౧...... ఆరో ఆశ్వాసము ౧౧౩ " " "

౬

4. 6 4. D 642. మనుచరిత్ర శబ్దసూచి. బ్రౌను మచిలీ పట్టణమున, 1832-వ సం॥ ఈ శబ్దసూచిని తయారుచేయించినట్లు తెలిపెను. అకారాదిగ నీ పద సూచి వ్రాయబడెను. పండితులెవరో యీ శబ్దసూచిని తయారుచేసినను, బ్రౌను దానిని సుపరీక్షితముగ పరిశీలించి, అందలి దోషములను గుర్తించెను. "నెగడినాడు. గౌలున, భోదియ" అను పదములు ఏ ఆశ్వాసమునవే పద్యమున నున్నవో సూచీకర్త విడిచెను. ఆ పదములు ద్వి. ఆ 33-వ పద్యము (ముద్రితప్రతిసంఖ్యన నున్నట్లు సవరించెను.

'పాడు' అను పదము ద్వి ౨౩ వ పద్యమునగాని, 5 ఆ. 38 వ పద్యమున గాని లేనట్లు తెలిపెను.

4. 6. 5. మను చరిత్రము ప్రప్రథమమున 1842 వ సం॥ ముద్రింపబడినట్లు వర్తమానతరంగిణి ప్రకటన వలన తెలియుచున్నది[3] ఈ ముద్రాపకుడు బ్రౌను దొరగారా, లేక ఇతరులా అను విషయము ఆ ముద్రణను చూచిన కాని తెలియదు, కాని వ్యాఖ్యాసహిత మనుచరిత్రను ముద్రించిన ఆద్యుడు మాత్రము బ్రౌను అనుటలో విప్రతిపత్తి లేదు. ఇది 1851-వ సం॥న ముద్రితము.

3. వర్తమాన తరంగిణి పత్రిక. 1842. ఆగస్టు 4,-18.

లేఖకుల స్వాతంత్ర్యమున పెక్కు పాఠాంతరములతోనున్న మనుచరిత్ర తాళ పత్ర ప్రతులననేకమును సంపాదించి, పండితులచే పరిష్కరింపజేసి, జూలూరి అప్పయ పండిత ప్రకాండునిచే సమగ్ర వ్యాఖ్య సంతరింపజేసిన బ్రౌను చిరస్మరణీయుడు. ఆంధ్రులత్యంతముగ అభిమానించు అల్లసానివాని అల్లికజిగిబిగి అంతరించి పోకుండ అద్దానిని హారికందించిన మహాశయుడు బ్రౌను.

**4. 7. విజయ విలాసము :**

4. 7. 0 చేమకూర వేంకటకవిని నియోగియని కొందరును, శూద్రుడని కొందరును తలంచుచున్నారు. బ్రౌను ఈతనిని 'చేమకూర వెంగ్రరాజ' పేర్కొనెను.[1]

4. 7. 1. ఈ ప్రబంధమునకు 9 తా. ప్రతులు, 6, కా ప్రతులు మ ప్రా పు. భాండాగారమున కలవు.

D 769 : + గ్రంథపాతములున్నవి. పత్రమునకొక ప్రక్క "విజయ విలాసం" అని మరొకప్రక్క "విద్దిన ప్రతి" అని యుండుటచే నిది పరిష్కరింప బడిన ప్రతియని ఊహింపవచ్చును. గ్రంథమున ఆ మూలాగ్రము బ్రౌను వ్రాసిన వివరణలు. సవరణలు, ఆంగ్లీకరణము లున్నవి.

ఉదా : (a) "కన్నులు దీర్ఘముల్ నగుమొగంబవు రాతల కట్టు తమ్మిపూ", వ్రా. ప్ర. 2-108. ము. 2-104

"wretched pedantry" అని గుర్తించెను.

(b) కాగియున్నది మిగుల నంగంబు జూడ
గలవరింపు చునున్నది కలదోయేమొ.
సోకుడల్ల సన్యాసికి జూపవలయు
భామనని పల్కె నాసత్యభామనగుచు"

వ్రా॥ ప్ర॥ 3-41॥ ము॥ ప్ర॥ 3-35

---

1. Es. on Tel. Lit. Para. 76.

"41. Satiabhama in jest proposed to take her to the holy palner (her lover) to break the charm under which she seemed to be labouring".

D 776 :— మొదటి 22 పుటలలో కథారంభమున కొంతభాగము, తరువాత అక్కడక్కడ కొన్ని పద్యములున్నవి.

*D* 782 :— అవతారిక తప్ప తక్కిన గ్రంథమంతయు నున్నది. ఇది సవ్యాఖ్యానము. ఇందు పుటకు పై భాగమున "చామకూర వెంకటరాజ కవికృత విజయవిలాసము ఆ ౧ ...." అని, రెండవపుట పై భాగమున "జూలూరి అప్పయ్య శాస్త్రి చేసిన టీక" అని వ్రాయబడి యున్నది.

D 783 :— సవ్యాఖ్యానము కథారంభమునుండి 32 పద్యములు మాత్రము కలవు.

D 784 :— సవ్యాఖ్యానము కథారంభము నుండి 129 పద్యములు మాత్రమున్నవి.

*D* 785 :— సవ్యాఖ్యానము. అవతారిక తప్ప తదితర గ్రంథభాగ మంతయు కలదు. గ్రంథాదిలో బ్రౌను అను ప్రతులను సంప్రతించి యీ శుద్ధప్రతిని తయారుచేసినట్లు, దీనిని పండితుడగు జూలూరి అప్పయ్య వ్యాఖ్యానించినట్లును, ఈ సవ్యాఖ్యాన ప్రతి మచిలీపట్టణమున 1831 – వ సంవత్సరమున పూర్తి అయినట్లును పేర్కొనెను. గ్రంథాంతమున యీ విజయవిలాస ప్రబంధమునకు టీక రచించేలాగున చార్లీసు ఫిలిఫ్ బ్రౌను దొరగారు సెలవిచ్చినందున మచిలీపట్టణ మందు జూలూరి అప్పయ్యపంతులు రచించడమైనది. ఇంగిలీషు సంవత్సరము ౧౮౩౦ డిశంబరు ది ౧౦ వికృతి నామసంవత్సర మార్గశిర బ॥౧౨ వరకు సంపూర్ణ మైనది" అని అప్పయ్యశాస్త్రి వ్రాసెను. టీకా పరిసమాప్తి కాలవిషయమున పై ఇరువురికి వ్యత్యాసమున్నది. బ్రౌను 1831 అని, అప్పయ్య 1830 అని పేర్కొనిరి.

ఇందవతారికా భాగము లోపించినదనియు శుద్ధ పతి వ్రాయునప్పుడు దానిని అతని ప్రథమ ప్రతినుండి గ్రహింపవలయుననియు బ్రౌను నిర్దేశించెను.

ప్రథమాశ్వాసము 155 పద్యముల వరకున్న గ్రంథభాగము కుడివైపున టీక వ్రాయబడినవి. ఆ పిదప టీక మాత్రము పత్రమున కొకవైపున కలదు. ఇది *D* 782 ప్రతికి మాతృకగ తోచును.

## 4. 8. వైజయంతి విలాసము :

4. 8. 0. ఈ కావ్యమున కవిదేవతలనో, బ్రాహ్మణులనో పొగడక కాలక్షేపార్థము రచించినదగుటచే బ్రౌనుకు చాల నచ్చెను. ఈ కావ్యము అవశ్యము ముద్రింపదగినదనియు తెలిపెను. 'విజయము' అను పదమునకు 'వైజయంతి'(?) తద్ధితరూపమనెను. ఇందలి నాయకురాలు తన పందెమును గెలుచుకొనుట వర్ణితమని కథాంశమును సూచించెను.[1]

4. 8. 1. వైజయంతీ విలాసమునకు 3 తా. ప్రతులు, 5 కా. ప్రతులున్నవి.

**D.** 796: + గ్రంథమునందు పలుతావులందు బ్రౌను సిర్తోశములు కలవు పత్రమున కిరువైపుల వ్రాయబడినది పద్యములు క్రమముగ, సంఖ్యలను కలిగియున్నవి. బ్రౌను విషయసూచికలను పుటలకు ప్రక్కన గుర్తించెను.

**D.** 797 : - ప్రథమాశ్వాసమునందలి 67 పద్యములు మాత్రమున్నవి. పత్రమున కిరువైపుల వ్రాయబడెను. పద్యములు క్రమముగ నున్నవి.

**D.** 799 : + పాఠాంతరములు గుర్తింపబడినవి. పత్రమున కిరువైపుల వ్రాతకలదు. పద్యపాద విభజనమున్నను, పద్యములు విడివిడిగ వ్రాయబడక, వచనము వలె వరుసగ కొనసాగెను ఇది చిత్తుప్రతిగనున్నది గ్రంథాదిని బ్రౌను మున్నుడితో కవి తమ్మయకృత వైజయంతీ విలాసమును పైడిపాటి వెంకటనరసు తన కోరిక చొప్పున పరిష్కరించి, వ్యాఖ్యను రచించినట్లు పేర్కొనెను. **"The Vaijayanti Vilasam" or "Ladies Wager", also called "Vipranarayana Charitra"** అని ప్రబంధనామమును ఆంగ్లీకరించెను. ఈ పరిష్కరణము 1833-వ సం॥న జరిగినది. దీనికి పూర్వము మరొక ప్రతిని సంస్కరించినట్లు. అందు అవతారికా భాగము విడువబడెననియు ఇందు అది గ్రహింపబడుటయే కాక, పాఠాంతరములును మరొక ప్రతినుండి గుర్తింపబడినట్లు వివరించెను.

---

1. **D.** 499. పీఠిక.

*D* 803 :— ప్రథమాశ్వాసము నందలి 50 పద్యములు వ్యాఖ్యానింపబడినవి

D 802 :— అవతారికాభాగమునకు తప్ప మిగిలిన గ్రంథభాగమంతటికి వ్యాఖ్య కలదు. పైడిపాటి వెంకట నరసయ్యచే దీనికి వ్యాఖ్యను వ్రాయించినట్లు ఉపోద్ఘాతమున స్పష్టముగ బ్రౌను తెలిపెను. (D 799) కాని ఈ ప్రతిలో గ్రంథాంతమున పెన్సిలుతో "ఆరణి మఠం వీరభద్రయ్యగారు చేసిన సటీక గ్రంథము" అని యున్నది వీరభద్రయ్య బ్రౌను పోషిత వర్గములోని వాడే శైవ గ్రంథముల కొన్నింటిని పరిష్కరించి, కొన్నింటికి వ్యాఖ్యలను సంతరించెను. ఈతనిని బ్రౌను జంగమ గురువుగ పేర్కొనెను.[2] నరసయ్య పరిష్కరింప, వీరభద్రయ్య వ్యాఖ్యను సమకూర్చి యుండవచ్చును. కాని శైవుడు వైష్ణవ గ్రంథమునకు వ్యాఖ్య వ్రాసియుండునా?

4. 8 2. D 800. సంఖ్య తాళపత్రప్రతి అంతమున "ప్రార్థివనామ సంవత్సర కార్తిక శుద్ధ ౧౩ గురువారం సరికి విన్నకోట సరశింహ్మాలు దస్తూర్ని వాశి మాజేటి సర్వేశలింగమునకు యిచ్చెను" అని యుండుటచే ఈ తా. ప్రతిని బ్రౌనువారి కొరకు మాజేటి సర్వేశలింగము సేకరించినట్లూహింపనగును. ఇందు అవతారిక తప్ప తక్కిన భాగమంతయు కలదు.

4. 8 3. 1849 సం॥లో ఈ ప్రబంధమును వ్యాఖ్యాసహితముగ ముద్రించినట్లు బ్రౌను నుడివెను [3]

**4. 9. అనిరుద్ధచరిత్రము :**

4. 9. 0. కనుపర్తి అబ్బయామాత్యుడు 'అనిరుద్ధచరిత్రము' 'కవిరాజమనోరంజనము' అను రెండు ప్రబంధములకు కర్త. అనిరుద్ధ చరిత్ర మీతని తొలిరచన.

4. 9. 1 'అనిరుద్ధచరిత్రము'నకు బ్రౌను నలుగు కాగితపు ప్రతులను తయారు చేయించెను. (D. 376 - 379)

---

2. D 1087. పండితారాధ్యచరిత్ర – సంపు. 2. ఉపోద్ఘాతము.
3. తెలుగు – ఇంగ్లీషు నిఘంటువు. పు. xxi

తాళపత్ర ప్రతినుండి యథాతథముగ నెత్తి వ్రాయబడిన ప్రతి D. 376. ఇది సమగ్రము. పద్యపాద విభజన విరహితము. పద్యపాద విభజనముతో, పద్యసంఖ్యా క్రమముతో వ్రాయబడిన ప్రతి D. 377 ఈ ప్రతిలో అవతారికాభాగము లుప్తము. ఇతర ప్రతులలోని పాఠభేదములు, తీర్పుపాఠములు గుర్తింపబడిన ప్రతి D 378 ఇందు ప్రతిపద్యమునందును యతిస్థానము సూచితము. ఉదా :

కళలు వెలుంగు మోములు వి కాస విలాసము జూపుకన్నులం ... లు
జె
జలువము గుల్కుమేనులును జెక్కులపై బ్రసరించునవ్వులున్ ... జె
వ
దళుకులు చల్లు భూషణవి తానముగల్గి సటీవిచిత్రముల్ ... వ
నిలిపిన సె
[నిల్పిన] యట్లు వ్రాశెరమణీ మణినేపుణావచింపశక్యమే...నిలిపిన...సె

షష్ఠ్యంతములు తప్ప తదితర గ్రంథభాగమంతయు వ్యాఖ్యాసహితముగనున్న ప్రతి D 379 ఇందక్కడక్కడ కొన్ని పద్యములకు బ్రౌను ఆంగ్లవివరణములు కలవు. ఇందు కథాసంగ్రహమును కూడ నాతడు సంఘటించెను.

4. 9. 2. అనిరుద్ధ చరిత్రమునకు బ్రౌను తనపండిత వర్గములో నొకడైన పైడిపాటి వెంకటనరసయ్యచే 1834 సంIIలో వ్యాఖ్యానము వ్రాయించెను.* ఈ ప్రతి యందు 15-వ పత్రమునుండి ప్రతిపుటపై భాగమున "పైడిపాటి వెంకట నరసయ్య చేసిన టీక" అని గుర్తింపబడెను.

## 4. 10. ఆముక్తమాల్యద :

4. 10. 0. లాక్షణికులు ప్రాచీనాంధ్ర లక్షణ గ్రంథములలో ఆముక్తమాల్యదను విష్ణుచిత్తీయమనియు, తత్కర్త అల్లసాని పెద్దన అనియు పేర్కొని యున్నారు బ్రౌను సిద్ధాంతమును నయ్యదియే. అతడా గ్రంథమును 'విష్ణుచిత్తీయ' మనియే వ్యవహరించెను. "ఆముక్తమాల్యద" అనునది నామాంతరముగ పేర్కొనెను.[1]

* D. 379.

1. "Allasani Peddana, author of the Manu Charitra or Swarochisha Manu Charitra (c) who also wrote the Vishnu Chittiyam or Amucta Malyada" – Ess on Tel. Para. 71.

ఇది ప్రౌఢ కావ్యమనియు నందలి శైలి కఠినమైనదనియు- వ్యాఖ్యాతయే కొన్ని పద్యములకు అర్థమును చెప్పలేకపోయెననియు బ్రౌను నుడివెను.[2] వసుచరిత్ర శైలి కున్న బిగువు మనుచరిత్రమున లేదని రాయలనగా తన పాండిత్య ప్రకర్షను ప్రదర్శించుటకై పెద్దన ఆముక్తమాల్యదను రచించెను. ఐతిహ్యమును బ్రౌను ఉగ్గడించెను. మరియు నందలి నారికేళ పాకమెట్టిదన తత్కర్తయగు పెద్దనయే

క॥ అదె గన గొంటినె మదనా,
మదనారి కిశోరవదన
... ... ... ...
.. ... ... ... (అసమగ్రము)

అను పద్యమున కర్థము చెప్పుమని అతని మనుమడు అడిగినప్పుడు చెప్పలేక పోయెనను మరియొక ఐతిహ్యమును కూడ సంగ్రహించెను. ఈ పద్యము మను చరిత్రమునగాని, విష్ణుచిత్తీయమునకాని లేదనియు, ఇదియొక చాటువై యుండవచ్చునని యు తెలిపెను.[3]

4.10.1. విష్ణుచిత్తీయ ప్రతుల కొరకు బ్రౌను దేశమంతయు గాలించెను.

"విష్ణుచిత్యం టీకతో కూడ శీతారామశాస్త్రి దగ్గెర వున్నది. యిదిగాక యింకా రెండు మూడు తావులలో టీకాతో కొంత టీకా లేక కొంతవున్నది. వక తావున అడిగిన మీదట భాగవతం ద్వాదశస్కందములుగల గ్రంథం యీడుగా పెడితే యిస్తానని వకడు చెప్పినాడు. దాన్ని కండ్ల చూచినంతల్లో టీకాలేదు. మూలం మట్టుకు వున్నది. యిదిగాక వకి వకగొప్ప కోమటిశెట్టి వద్ద వున్నది। దానికిగాను వక పెద్దమనిషిని పంపించివున్నాను రాగానె హాజరు చేస్తూ వున్నాను ...... కేశవబ్రహ్మ."[4]

"యేలూరు కాపరస్తుడయ్ని మల్లంపల్లి బుచ్చయ్యశాస్త్రి వద్ద విష్ణుచిత్తీయ వ్యాఖ్యానం అడిగిపుచ్చుకొని తమవద్దకి పంపిస్తె నెలదినములలోపల తిరిగి అంద చేయిస్తూ వున్నామని ౹౧౮౩౪ సం॥ శపిటంబరు ది ౨౩ రోజున వ్రాయించిన హుకుం శపిటంబరు ది ౨౭ రోజ్ను చదువుకోవడమయ్నది.

2. P. R. T. L. P. 152.
3. Ibid. P 64.
4. Sr. of Lt. M. 401. pp. 126 – 129

బుచ్చయ్య శాస్త్రిని అడిగితె సదరహీ గ్రంథం పట్టుకుని వచ్చిన మీదట అది చూస్తె శ్రీ తాళాలపయిని వ్రాసి వున్నది ఆ గ్రంథంకు వసణాం వేసి వుండలేదు తాటి ఆకుపయిని అక్షరములు బాగా కనపడనందున వసణాం వేయించనలెనని ఆలోచిస్తె తామె వసణాం వేయిస్తామని గ్రంథం తిరిగి పుచ్చుకున్నారు. వసణాం వెయ్యడం సిధంకాగానె పంపిస్తూ వున్నాను...

దీ ౩౦ శపిటంబరు ౧౮౩౪ సం॥

జయనామ సంవ్వత్సర భాద్రపద నందివాడ గుర్రాజు[5] "

బ ౧౩ జయవారం.

"మహారాజశ్రీ సీ పీ బ్రౌను యిస్కాయరు దొరగారి సముఖానకు- గజవెల్లి కొండయ్య వ్రాసుకున్న అర్జీ విన్నపములు తెలికిచర్ల అనే గ్రామములో విష్ణు చిత్తీయమునకు పూర్వం ఉప్పుపాటి జోగీజగన్నాధరాజు చేశిన వ్యాఖ్య వున్నట్టు తెలిసినది గన్క అందున గురించిన యత్నంచేశి పంపించిన పక్షమునకు అందుకు ప్రతి వ్రాయించి తిరీగీ పంపిస్తున్నామని దీ ౨౪ అక్టోబరు ౧౮౩౪ స తారీఖున్న వ్రాయించిన ఆజ్ఞ నేను పోలపరంలో వుండగా దీ ౨౭ ఆక్టోబరు తారీఖున్న అందినది। తమ శలవు ప్రకారం సాధ్యమయ్యినంత వేగిరం అందుల ఘట్టితజి పీజుచేసి అందినట్టుగానె సముఖములోకి పంపించుకుంటున్నాను......"

దీ ౨౮ అక్టోబరు ౧౮౩౪ సంవత్సరం గజవెల్లి కొండయ్యవ్రాలు.'[6]

పై జాబులవలన కేశవబ్రహ్మము, నందివాడ గుర్రాజు, గజవెల్లి కొండయ్య ఆనువారలు వ్యాఖ్యాసహిత విష్ణుచిత్తీయ ప్రతులను బ్రౌనునకు సేకరించి పెట్టినట్లు తెలియుచున్నది. మ ప్రా. పు. భాండాగారమున 23 తాళపత్ర ప్రతులు, 9 కాగితపు ప్రతులు కలవు ఈ కాగితపు ప్రతులన్నియు బ్రౌనుదొరచే వ్రాయింపబడినవే. ఆ ప్రతుల వివరములీ క్రింద నొసగ బడుచున్నవి :-

ఆముక్తమాల్యద సమగ్రముగనున్న ప్రతియొకటి కలదు. (D 392) బ్రౌను అంగ్లములో వ్రాసిన కథాసంగ్రహమిందున్నది. 3-వ ఆశ్వాసము తప్ప మిగిలిన

5. Ibid. M. 401. P. 281.
6. Ibid. M. 401. Lt. No. 141. pp. 279-280.

భాగమంతటికి జోగి జగన్నాథరాజు రచించిన బుధ మనస్తోషిణీ వ్యాఖ్య కలిగిన D 405. ఇందు పంక్తుల నడుమ అందందు సవరణలు కలవు.

అవతారిక. తృతీయాశ్వాసము తప్ప మిగిలిన భాగమునకు బుధమనస్తోషిణి వ్యాఖ్య కలిగిన ప్రతి D 410. మూలము లేదు. ఇందును పంక్తులనడుమ సవరణలు కలవు

*D* 411 ప్రతియందును అవతారిక, తృతీయాశ్వాసము వినామిగిలిన భాగమునకు బుధమనస్తోషిణి వ్యాఖ్య ఉన్నది. ఇందును పంక్తుల నడుమ సవరణలు కలవు.

బ్రౌను జోగి జగన్నాథరాజు సంతరించిన "బుధ మనస్తోషిణీవ్యాఖ్య"ను 1834 సం॥లో తన పండితుడైన జూలూరి అప్పయ్యచే సంపూర్ణముగ సవరింప జేసెను[7] ఈ ప్రతి యందును, "The Vishnu Chittiyam or Amucta Malyada by Allasani Peddana" అని లిఖించి, ఆముక్తమాల్యదా కర్తృత్వమును పెద్దనకే అంటగట్టెను. జూలూరి అప్పయ్య పండితుడు చేసిన సవరణలు పంక్తుల నడుమ గుర్తింపబడెను.

D 412 ప్రతి సమగ్రముగ నున్నది. ఇందు గట్టుపల్లి శ్రీనివాస కవి కృత టీక సంపూర్ణముగ కలదు.

*D*. 420 ప్రతియు శ్రీనివాసకవి వ్యాఖ్యతో సమగ్రముగ నున్నది ప్రథమాశ్వాసము, ద్వితీయాశ్వాసమున 27 పద్యములకు మాత్రము గుడిపాటి వెంకటకవి రచించిన తాత్పర్యబోధినీ వ్యాఖ్య కలిగిన ప్రతి D. 402.

D. 403 ప్రతి అసమగ్రము. ప్రథమాశ్వాసములో మొదటి 6 పద్యములు' తృతీయాశ్వాసము పూర్తిగ, చతుర్థాశ్వాసములో 205పద్యములు, పంచమాశ్వాసము పూర్తిగ, షష్ఠాశ్వాసములో 19 పద్యములకు తాత్పర్యబోధినీ వ్యాఖ్య కలదు కడమ గ్రంథము లోపించినది పంక్తుల నడుమ సవరణలనేకములు కలవు. D. 404 ప్రతి అసమగ్రము. తృతీయాశ్వాసమునకు మాత్రము తాత్పర్యబోధినీ వ్యాఖ్య కలదు. ఈ ప్రతి లేఖనము 1848 సం॥ ఫిబ్రవరి 2 - వ తేదికి ముగిసినదని బ్రౌను తెలిపెను.

---

7. "This manuscript has been corrected throughout by th very learned critic Zuluri Appaya-in 1834. The third book of the poem is wanting in this copy". (D. 405).

బుధ మనస్తోషిణీ వ్యాఖ్య సవరణముతో బ్రౌను సంతృప్తి నందలేదు ఈ ప్రబంధమునకు గుడిపాటి వేంకటకవి రచించిన తాత్పర్యబోధనీ వ్యాఖ్యను సేకరించి 1848 సం॥లో కాగితములపై వ్రాయించెను (*D*. 402-404)

4. 10. 2 ఇట్లు ఆముక్తమాల్యద కావ్యమునకు సంబంధించిన వివిధ ప్రతులను, వివిధ వ్యాఖ్యానములను సేకరించి, సంస్కరించిన యనంతరము బ్రౌను 1849 సం॥ తన సొంత డబ్బు వెచ్చించి ఈ ప్రబంధములో ప్రయుక్తములయిన పదములకు అన్నింటికి అకారాది శబ్దసూచిని తయారుచేయించెను సవ్యాఖ్యాన ఆముక్తమాల్యద శుద్ధ ప్రతులను తయారుచేయుటయేకాక, పదసూచిని కూడ ఈ ప్రౌఢ ప్రబంధమునకు బ్రౌను సంతరించుట ముదావహము.

**4. 11. కుచేలోపాఖ్యానము :**

4. 11. 0. ఘట్టు ప్రభుని కుచేలోపాఖ్యానము ప్రజాదరమును పడసిన ప్రబంధము [1] ఈ కావ్యమునకు బ్రౌను 6 కాగితపు ప్రతులను వ్రాయించెను. (తా. ప్రతులు. 2) వాని వివరములు :—

D 461 — సమగ్రము తీరిన గ్రంథము
D 463 — సమగ్రము
D 464 — సమగ్రము పాఠాంతరములు గుర్తింపబడినవి
*D* 465 — సమగ్రము
D 466 — సమగ్రము ఆశ్వాసాంతగద్య లుప్తము.
D 467 — సమగ్రము

దీని తీర్పుప్రతి రూపొందించుటకు అయిదు ప్రతులను సంప్రతించిరి. అవి :

1. పెద్దప్రతియొక్క మాతృక
2. యీ బుక్కు
3 దొరగారి స్వంత తాటి ఆకు
4 కనావేటతంబులు ఆ : మనిషిది?
5. వెంకట కృష్ణమ్మనాయుడు" (D 461)

1. "The Cuchelopakhyan (T) in three cantos is likewise a very popular work".

ఈ తీరు ప్రతిని మఱికొన్ని ఉపలబ్ధ ప్రతులతో పోల్చి నూతన పరిష్కృత ప్రతిని బ్రౌను తయారు చేయించెను 2

4. 11. 1. ఈ ప్రబంధ పరిష్కరణమున బ్రౌను చేయి కూడ కలదు.

ఉదా :

ఆ॥ సమయమెఱుగ డెముడు సమయించు జీవుల
ధరణి నొకనినైన మరువడతని
భటులు నట్టి వారెయట యథారాజాత
థా ప్రజా యనంగ ధరణి వినవె (బ్రౌ, ప్ర. 1-86).

బ్రౌను ముద్రించిన ప్రతియందును ఇట్లే యున్నది. పైపద్య ప్రథమ పాద మున 'సమయమెఱుగడెముడు' (సమయమెరుగడు + యముడు) అనుటలోని దోషము స్పష్టము. వ్యావహారిక రూపమగు 'ఎముడు' అను దానిని తొలగించి బ్రౌను "సమయమీడు యముడు" అని సవరించెను "This reading is suggested by me and applauded" అనియు వ్రాకుచ్చెను. (D. 461)

వావిళ్ల ప్రతిలో (1924)

ఆ॥ సమయ మెఱుఁగఁడు హరి సమయించు నాత్మల
ధరణి నొకనినైన మరువఁడతని
భటులునట్టి వారెయట యథారాజాత
థా ప్రజా యనంగ ధరణి వినవె (1-67)

అని ఉన్నది.

'హరి' అను పదమునకు యముడు అను అర్థమున్నను యముడను పాఠముతోడి బ్రౌను సవరణ మెత్తురముగ నున్నది.

4. 11. 2. ఇందలి కొన్ని పద్యములకు బ్రౌను విషయసూచనలను, ఆంగ్ల వివరణములను అనుసంధించెను.

---

2. "the various readings found in nine manuscripts are herein recorded, with a view to the preparation of the new edition since completed." (D. 464)

"తనవారి నెరుగరెవ్వరి
నెనయరు వాక్యములు కడు విహీన స్వరముల్
విని చెవుడును కసిగుడ్డును
జననాధులకెల్ల నివియుసహజ గుణంబుల్"

(2-60) 1841

అను పద్యమునొద్ద బ్రౌను "Vemana has stolen this verse" అని పేర్కొను టాతని బహుకావ్యపఠనమును, సూక్ష్మపరిశీలనమును ప్రస్ఫుటీకరించుచున్నది. కాని ఇప్పటి 'వేమనపద్య' ప్రతులలో పై పద్యము వంటిది మృగ్యము.

ఘట్టు ప్రభువు 16-వ శతాబ్ది నడుమ నుండిన వాడని ఆంధ్రవాఙ్మయ చరిత్ర కారుల నిర్ణయము వేమన 16వ శతాబ్ది వాడని క్యాంబెల్ పండితుడు తలంచెను వంగూరి సుబ్బారావుగారు, మల్లంపల్లి సోమశేఖర శర్మగారు, చాగంటి శేషయ్యగారు వేమన 15-వ శతాబ్దివాడని యనుచున్నారు బ్రౌను. శతక వాఙ్మయ సర్వస్వకర్త (వేదము వేంకట కృష్ణశర్మ) వెమన 17-వ శతాబ్దివాడని అభిప్రాయపడిరి అట్లభిప్రాయ పడుటవలననే ఘట్టు ప్రభుని పద్యమును వేమన సంగ్రహించెనని బ్రౌను నుడివి యుండును. వేమన ఘట్టు ప్రభునికి పూర్వుడయినచో, నిది సాధ్యముకాదు. ఘట్టు ప్రభువే వేమన పద్యమును గ్రహించియుండుననవలెను

4. 11. 3. ఈ కుచేలోపాఖ్యానమునకు వ్యాఖ్యను సంతరింప బ్రౌను సంకల్పించినట్లీ క్రింది లేఖవలన తెలియుచున్నది : కుచేలోపాఖ్యానం వ్యాఖ్యతో కూడ పంపించమని వ్రాయించినారు. మూలం మాత్రమే పంపించినారు. వ్యాఖ్య కనబడ లేదు. వ్యాఖ్య చెయ్యలేదని వయిశిపాడి వెంకట నరసయ్య చెప్పుతున్నాడు ...... ..............................." ద మా. వీరస్వామి [3]

తుదకీ సంకల్పము సిద్ధించినట్లులేదు. తన వ్యాసమున దీనిని వ్యాఖ్యాసహిత గ్రంథముగ (c) అను సంజ్ఞలో గుర్తింపక పరిష్కృత శుద్ధప్రతికి చిహ్నమగు (T.తో గుర్తించెను.[4]

---

3. Sr. of Lt. M. 401. p. 344.

4 The (T) is used to denote that the text has in the last few years been completed and corrected by the aid of various manuscripts..........................................................

Such are maked (c) have, besides a corrected text, a commentary written in familiar Telugu which explains every word." — Es. on Tel. Lit. Para. 67.

4. 11. 4. బ్రౌను గౌరన మంత్రి కృత ద్విపదకావ్యములైన హరిశ్చంద్ర చరిత్ర. నవనాథ చరిత్రను 1842-వ సం.న ముద్రించి, ఆ గ్రంథపీఠికలో తత్పూర్వము లాను వసు, మనుచరిత్రలను. కుచేలోపాఖ్యానము భాగవతాదులను ప్రకటించినట్లు పేర్కొనెను .అందు బ్రౌను ఆంగ్లమున "CUCHELOPAKYA-NAM" అని వ్రాసెను.

## THE CUCHELOPAKHYANAM

### A Telugu Poem

### కుచేలోపాఖ్యానం

అను పేరుతో 1841-వ సం॥న అమెరికన్ మిషన్ ప్రెస్ నందు ముద్రితమైన ఒక ప్రతి లభించుచున్నది . ముఖ పత్రము చిరిగిపోయినది. కాని యిది బ్రౌను ముద్రించినదే యని నిరూపింపనగును. ఇందు అరసున్నలుగాని, శకటరేఫములుగాని లేవు. సీసపద్యములకు, ఎత్తుగీతులకు ప్రత్యేక సంఖ్యలు కలవు. వచనమున ప్రతిసంపూర్ణ వాక్యమునకు సంఖ్యలొసగబడెను. ముద్రణమున బ్రౌను ప్రకారవడిని '్ర' ఇట్లు ముద్రించుట కాననగును. ఇవన్నియు బ్రౌను కావ్య ముద్రణమున అవలంబించిన విధానములు. మరియు బ్రౌను పరిష్కరించిన ప్రతియందలి పద్యముల సంఖ్యయు, 1841-వ సం॥న ముద్రితమైన ప్రతియందలి పద్యముల సంఖ్యయు ఒకటిగనే యున్నది.

వావిళ్ళవారు 1924 - వ సం॥లో టిప్పణముతో కుచేలోపాఖ్యానమును ముద్రించిరి. ఈ రెండు ప్రతుల ముద్రణ విధానములోని భేదము లీ క్రింద చూపబడుచున్నవి.

1) చ॥ పిడికెడు దూసరాల్లు కడుపేర్మి దినంబును యెరి తెచ్చియా
పడతికి తద్విభుం డొసగ బ్రాహ్మణియున్ పచనంబు జేసియే
పన్డ మర్త్రియందు లోనతిథి భాగముతీసి లతాంగి భర్తకుం
గుడువగబెట్టి భుక్తిగొనుకోమలి సంతులు తాను పత్తులన్.

[1841 ప్రతి. ౧-౪౩]

చ॥ పిడికెఁడు దూసరొాళ్లు కడుఁబేర్మి దినంబును నేఱి తెచ్చియా
పడఁతికి దధ్వైభుం దొసఁగ బ్రాహ్మణియుఁ బచనంబు చేసియే
ర్పడ మఱియంతలో నతిధిభాగము దీసి లతాంగి భర్తకుం
గుడువఁగబెట్టి భుక్తిఁగొనుఁగోమలి సంతతిదాను బంక్తులన్
[వావిళ్ల. 1-34]

2. తే॥ రాతిలోకప్పు కాహార మాతతేనుగ
నిడెదుదైవంబు మర్త్యులకేలమాను
బ్రితికి నన్నాళ్ల నన్నంబు పట్టెడిడక
నాయురన్నం ప్రియచ్ఛతి యనగ వినవె
[1842. ప్రతి ౧-౭౨]

తే॥ రాతిలోఁగప్ప కాహార మాతతముగ
నిడెదు దైవంబు మర్త్యుల కేలమాను ?
బ్రతికినన్నాళ్ల నన్నంబు పట్టెడిడక
"ఆయురన్నం ప్రయచ్ఛతి" యనఁగ వినవె.
[వావిళ్ల. 1-54]

3. క॥ ఎందరికిఁబుట్టి పెరిగిరో
యొందరికిని సంభవించి యీల్గిరో మఱియిం
కెందరికిని జన్మింతురో
నందనులని మిగులప్రేమ నాటగ నేలా
[1841. ప్రతి. ౧-౮౨]

క॥ ఎందఱకుఁ బుట్టి పెరిగిరో
యెందఱకును సంభవించి యీల్గిరో మఱి యిం
కెందఱకును జన్మింతురొ
నందనులని మిగులఁ బ్రేమ నాటఁగనేలా.
[వావిళ్ల. 1-63]

౭౪ వ॥ కావున నవశ్యమను భోక్తవ్యం కృతం కర్మ శుభాశుభంబను కతంబున పూర్వజన్మంబున గా జేసిన పుణ్య పాప ఫలంబులు వెంబడి నీ జీవులనంటియుండి సుఖదుఃఖంబులనుభవింపం జేయుసదత్త దోషేణ భవేద్దరిద్రం బనియును పలుకం

౭౫ – సుకృతంబు వలన నైశ్వర్యంబును। దుష్కృతంబువలన లేమియు నరులకు ప్రాపించునవి । యట్లంబేలవి పాత్రికరార్పితంబైన విత్తంబు పరమపదంబునకు పాథేయంబని పెద్దలు బలుకుచుండుదురు క్షీణేపుణ్యేమర్త్యలోకం విశంతి యనుమాటలు ౭౬ తేటపడం దత్కర్మాను భవంబులు దీరెన।.........................."
ఈ వచనమంతయు వావిళ్ల ప్రతిలో 58 సంఖ్య కింద ఉన్నది పై ఆకరమునను బట్టి 1841-వ సం॥న ముద్రితమైన కుచేలోపాఖ్యాన' ప్రతి బ్రౌను ముద్రించినదే యని ఉటంకింపనగును.

## 4. 12. చంద్రాంగద చరిత్ర : (పైడిమఱ్ఱి వేంకటపతి)

4. 12. 0. ఈ కావ్యము గొప్పది యనియు, అర్వాచీన కావ్యమనియు బ్రౌను పేర్కొనెను.1

దీనికి 'పైడి మర్రి ప్రబంధ' మనునది నామాంతర మట. ద్విపద సోమవార మాహాత్మ్య, చంద్రాంగద చరిత్రల రచనా ప్రయోజన మొక్కటియే అయినను వీని యందలి కథలు భిన్నములని బ్రౌను వెల్లడించెను

4 12. 1. ఈ కావ్యమునకు బ్రౌను వ్రాయించిన కాగితపు ప్రతులు ౩. తా. ప్రతులు. 2

కాగితపు ప్రతుల వివరములు :

D 500 : + పాఠాంతరములు గుర్తింపబడినవి.

D 501 : + పాఠాంతరములు గుర్తింపబడినవి.

D 504 : +

4. 12. 2 D 503 తాళపత్రప్రతి అంతమున "I have taken a copy of this book. C. P. Brown. 1840" అని యుండుటచే నీ తా. ప్రతి బ్రౌను సేకరించిన దగును. పై మూడు కాగితపు ప్రతులలో D 504 మెకంజీదొర సేకరించిన ప్రతి కావచ్చును. ఇది సమగ్రమయినను అపరిష్కృత గ్రంథము. పద్య

---

1. The poem is one of considerable merit. It is of modern date. (D, 501)

పాద విభజనముగాని, పద్యసంఖ్యగాని లేదు. గ్రంథాంతమున "పరాభవ.. జ్యేష్ఠ శుద్ధ ౧౦ శుక్రవారం .. ...వ్రాశియున్నది" అని లేఖనకాలము సూచితము.

4 12. 3. ఈ ప్రతి ఆధారముగ బ్రౌను కాలేజి లైబ్రరీలోని ప్రతిని పోల్చి పాఠాంతరముల గుర్తించెను. అదియే D. 501 ఇందు బ్రౌను వ్రాసిన పీఠిక కలదు. ఈ ప్రతియందు పాఠాంతరములు మాత్రమే గుర్తింపబడినవి కాని పద్య క్రమముగాని, పద్యసంఖ్యగాని ఏర్పరుపబడలేదు. బ్రౌను ఈ కావ్యమునకు 6 పుటల ఆంగ్లకథా సంగ్రహమును అనుసంధించెను.

ఇట్లు పాఠాంతరములు గుర్తింపబడిన యీ చిత్తుప్రతికి (D. 501) శుద్ధప్రతి D. 500 అని అందలి యీ వ్రాతవలన తెలియుచున్నది : "చిత్తుప్రతి ప్రకారం మొకాఓలా చాయెడం అయ్యినది." ఈ శుద్ధప్రతిలో పద్యములు సంఖ్యలతో క్రమ బద్ధముగ వ్రాయబడినవి. ఈ ప్రతి తుదను 'C. P. Brown, 1841' అని యుండు టచే చంద్రాంగద చరిత్ర శుద్ధ ప్రతి ఆనాటికి సంపూర్తియయినట్లూహింపనగును.

**4. 13. భానుమద్విజయము :**

4 13. 0. భానుమద్విజయమునకు బ్రౌను వ్రాసిన ఉపోద్ఘాతమున నిట్లు చెప్పెను : "ఆంధ్రులు వైష్ణవ మతాభిమానులగుటచే శివపరమైన ఈ రసవత్తర కావ్యప్రతులు ఈదేశమున అరుదు దీనిని గ్రంథకర్త ఇంటిపేరుతో వెలగపూడి కావ్యమనుట సమంజసము.

ఈ కావ్యమును ముద్రించునపుడు ముఖపత్రము క్రింది విధముగా నుండవలె నని బ్రౌను సూచించెను :

"భానుమద్విజయం

పద్మావతీ పరిణయం

**THE ADVENTURES OF THE**
**PRINCESS PADMAVATI**
***Poem written by Velagapudi Krishnaia***
**in the Telugu Language**
**in five books."**

4 13. 1 ఈ ప్రబంధమునకు బ్రౌను వ్రాయించిన కాగితపు ప్రతులు 7 కలవు. ఆ ప్రతుల వివరములు :

D 606 : + పాఠభేదములు, సవరణలు ఉన్నవి. బ్రౌను ఆంగ్లములో వ్రాసిన పద్యమొకటి కలదు (చూ. అనుబంధము)

D 607 : +

D 608 : + పాఠభేదములు, సవరణలు కలవు

D 609 : +

D 610 : + అందందు పంక్తుల నడుమ సవరణలు చేర్పబడియున్నవి.

D 611 : + సటీక అందందు మూలమును టీకయును లేదు.

D 612 : — పంచమాశ్వాసములో 84 పద్యములకు మాత్రము (14-97) టీక కలదు.

4. 13. 2. ఈ ప్రబంధమునకు సమగ్రమైన ప్రతులు రెండు మాత్రమే లభించినవని బ్రౌను తెలిపెను. లభించిన ఈ రెండు ప్రతులను కాగితములపై వ్రాయించి, అందొక ప్రతిలో రెండవ ప్రతిలోని పాఠభేదములను గుర్తింపజేసెను. అధికముగా నున్న పద్యములను గ్రంథాంతమున వ్రాయించెను. బ్రౌను **"The following verses are found in a second manuscript must be inserted in the proper place"** అని యీ పద్యములను గూర్చి తెలిపెను.

4. 13. 3 ఇట్లు పాఠాంతరములు గుర్తించిన యనంతరము పాఠనిర్ణయము చేయబడెను. కొన్ని స్థలములందు బ్రౌను దొరయే స్వయముగ పద్యములను సవరించెను :

అంతట తండ్రిచేతను తర్పకుడై దవ ద్యేట నక్షరా
ద్యంత గుణింత మేర్పడగ నభ్యసమై యుపనీతు డౌచు వే
దాంతము వేదశాస్త్ర సహితంబుగ నెన్మిదియేండ్ల మీద వా
దంతయు దప్పకుండగ దృఢంబుగ నేర్చెపదాచు యేండ్లకున్.

వా. ప్ర. ౧-173.

**"eta was here inserted at my suggestion"** అని బ్రౌను తెలిపెను.

ఈ కావ్యమునకు బ్రౌను ఆంగ్లములో కథాసంగ్రహము సంతరించెను. మరి ఆంధ్రములోను కథాసంగ్రహము కూర్పబడి యున్నది.

ఈ ప్రబంధమునకు బ్రౌను టీకను వ్రాయించెను టీకాకర్త పేరు తెలియదు "This is a learned and useful commentary and sufficient as regards the more difficult passages, but the easier passages are omitted : the minute commentary on the Transcendental philosophy (yoga sastram) contained in the 5 th canto is placed is another volume" (D. 611) అని వచించెను. టీక బాగుగలేని స్థలము లందు వానిని కొట్టివేసి "I erased this commentary as absurd" అని బ్రౌను వ్రాసెను. 21 వ పత్రము క్రింద "30 aug 41" అని తేది గుర్తింపబడి యుండుటచే ఈ టీక 1841 - వ సం॥ వ్రాయబడి యుండునని యూహింపనగును. ఈ ప్రబంధమునకు బ్రౌను వ్రాసిన ఉపోద్ఘాతమును కలదు. (D 606)

## 4. 14. కళాపూర్ణోదయము :

4. 14. 0 పింగళి సూరన కృతుల మూడింటిని బ్రౌను సేకరించెను. అందు కళాపూర్ణోదయమును, రాఘవ పాండవీయమును పరిష్కరించెను లింగపురాణ మప్పటికి నామమాత్రావశిష్టమయినదని పేర్కొనెను 1 లింగ పురాణమును సూరన రచించినట్లు కవిజీవితములు మున్నగు గ్రంథములందెందును చెప్పబడలేదు కాని తాను గరుడపురాణమును రచించినట్లు కవియే 'ప్రభావతీ ప్రద్యుమ్నము'న పేర్కొనెను. గరుడపురాణమనుటకు మారు లింగపురాణమని బ్రౌను పొరబడి ఉండనోపును.

4 14. 1. బ్రౌను కళాపూర్ణోదయమునకు వ్రాయించిన కాగితపు ప్రతులు 8. (తా. ప్రతులు. 4)

కా. ప్రతుల వివరములు :

D 435. + పాఠభేదములు పంక్తులనడుమ గుర్తింపబడినవి.

D 436. — మొదటినుండి ద్వితీయాశ్వాసము 26-వ పద్యము వరకు కలదు.

---

1. Pingala Surapa Raz, author of the Raghava Pandavyam (c, the cala Purnodayam, the Prabhavati Pradyumnam and the Linga Puranam; this last is not now exitent.' The Es on Tel. Lit. Para : 75.

D. 457 + ఇది 1848-వ సం॥న పరిష్కరింపబడిన ప్రతి

D. 458 + వ ప్ర పరిష్కృత కాలము. 1847.

D 439 — ఇందు నాలుగవ ఆశ్వాసము కొంతభాగము నుండి 8-వ ఆశ్వాసము వరకున్నది ఇందు మొదటి మూడాశ్వాసములందలి కథను బ్రౌను సంగ్రహముగ ఆంగ్లమున సంతరించెను.

D. 444. — మొదటినుండి ద్వితీయాశ్వాసమున కొంతవరకే కలదు.

D. 445. — 7 ఆశ్వాసములు కలవు.

D. 446. — మొదటి నుండి 4-వ ఆశ్వాసములో కొంతవరకు కలదు. పాఠాంతరములు పంక్తులనడుమ గుర్తింపబడినవి. తీర్పుపాఠములు భాగీగనున్న ఎదుటి పుటలందు వ్రాయబడినవి. ఇందు "మూడు గ్రంథములలో బలకము కద్దు" అని పేర్కొనబడినందున ఈ కావ్యమును మూడు ప్రతులలో సంప్రదించినట్లు భావింపనగును. D. 437 సంఖ్యగల ప్రతి 1848 సం॥లో మదరాసునందు లభ్యమయిన ఒక ప్రాచీన తాళపత్ర ప్రతిని చూచి ఎట్టి మార్పులు చేయక వ్రాసినదనియు, తాళపత్రముల పుటలు కాగితమునకు ప్రక్కలందు గుర్తింపడిన వనియు బ్రౌను తెలిపెను.

4 14. 2 ఈ కావ్యమునకు బ్రౌను ఆనతిచే 1847-వ సం॥లో నూతన పరిష్కృతప్రతి తయారుచేయబడినది. ఈ పరిష్కృత ప్రతిలో 95-వ పుటనుండి "Corrected edition. 1848" అని బ్రౌను వ్రాసియుండుటచే కళాపూర్ణోదయ పరిష్కృత కార్యము 1847 సం॥లో ప్రారంభింపబడి 1848 సం॥ నాటికి సమాప్తము యియుండునని యూహింపనగును. కళాపూర్ణోదయమునకు బ్రౌను వ్యాఖ్యానమును వ్రాయించినట్లు తన నిఘంటువున పేర్కొనెను. కాని నేటా సవ్యాఖ్యాన ప్రతి మ. ప్రా. లి పు. భాండాగారమున కానవచ్చుట లేదు. ఇది అవశ్యము. ముద్రింపదగిన కావ్యమనియు బ్రౌను సూచించెను.

## 4. 15. రామాభ్యుదయము :

4. 15. 0. బ్రౌను ఆంధ్రసాహిత్యమున అద్వితీయస్థానమును తిక్కన సోమయాజికి, ద్వితీయస్థానమును అల్లసాని పెద్దనకు, తృతీయ స్థానమును అయ్యల

రాజు రామభద్రునకు ఒసగెను.[1] ప్రాచీనాంధ్ర కావ్య సముద్ధరణమున బ్రౌనుకుగల శ్రద్ధాసక్తుల కద్దము పట్టుటకీ రామాభ్యుదయ కావ్యమొక్కటియే చాలును ఎట్టి అస్తవ్యస్త స్థితిలో నీ కావ్య ప్రతి లభించినదో, దానిని తీర్చిదిద్దుట కాతడెట్టి పాట్లను పడెనో వివరించు బ్రౌను స్వీయ వాక్యములను పరికింపనగును. "This poem is much celebrated but extremely rare : for many years I never met with but one manuscript Subsequently I procured one frcm the Mackenzie collection : but that is deficient – the first book is wanting as far as the end of the introduction.

That manuscript was in confusion, for the leaves were not numbered and had been jumbled. I therefore prepared lists of "first lines" according to the present volume : then on each leaf I marked the number of the first stanza it contained and by this tedious process ultimately adjusted that ancient volume hroughout. I succeeded in doing this after the Bramins had thrown the volume aside as utterly unintelligible. Done 4 th April 1840. Afterwards obtained four more Mss and they enabled my pandits to edit the work satisfactorily" (*D* 715)

ఈ మెకంజీ ప్రతి అతి ప్రాచీనమైనదిగ బ్రౌను భావించెను. అప్పటి కది 200 ఏండ్ల క్రితము వ్రాయబడి యుండవచ్చునని నిర్ణయించెను.[2]

4. 15. 1. అయ్యల రాజు రామభద్రుని కాలకర్తృత్వముల గూర్చి ఆంధ్ర వాఙ్మయ చరిత్రకారులలో మతభేదములున్నవి. అయ్యలరాజు రామభద్రుడు రాయల సమకాలికుడు కాడనియు, సకలకథాసార సంగ్రహకర్త పుత్తేటి రామభద్రుడను మరొక కవి యనియు ఆంధ్రకవి తరంగిణీకర్త అభిప్రాయము. బ్రౌను "The Rām A'bhyudayam written by పుత్తేటి అయ్యలరాజు రామభద్రయ్య" అని కావ్యారంభమున వ్రాసెను. పుత్తేటి గ్రామవాస్తవ్యుడగు అయ్యలరాజు రామభద్రుడను నభిప్రాయము నిది ద్యోతకమొనర్చు చున్నది' అట్లయిన, రామభద్రులు, ఇద్దరు కాక, ఒక్కరే యగుదురు.

1. Ess. on Tel. Lit. Para 78
2. D. 715.

4. 15. 2 ఈ రామాభ్యుదయపు మెకంజీ ప్రతి బ్రౌనుకు 1840–వ ఏట లభించెను. తదుపరి అతడు మరికొన్ని ప్రతులను సంపాదించి, పరిష్కృత శుద్ధ ప్రతిని సెప్టెంబరు 1850–నాటికి సిద్ధపరచెను. (D. 714) దీనికి మ. ప్రా. పు. భాండాగారమున 2 తా. ప్ర. లు 3. కాగితపు ప్రతులు దొరకు చున్నవి. (D 714, 715, 718)

D 7.8 – తాళపత్ర మాతృకనుండి యథాతథముగ వ్రాయబడినది. పద్య క్రమముగాని, పాదవిభజనముగాని, సంఖ్యల వింగడింపుగాని లేదు.

D 715 + పాఠభేదములు గుర్తింపబడినవి. చిత్తుప్రతి.

D 714 + పరిష్కృత ప్రతి గ్రంథాంతమున బ్రౌను **"This new edition was complted. Sept 1850"** అని పేర్కొనెను. 14 పుటలలో కథాసరళి సూచిక తెలుగున కలదు. అందందు పదముల కర్థము ఒసగబడెను.

4. 15. 3 చిత్తుప్రతిలో మొదటి మూడాశ్వాసములను సుబ్బన్న గ్రంథ మంతటిని సరావు వెంకటాచలం మాతృకతో మొకాబిలా చేసిరి. (D 715)

క॥ ...సువుల దనపుర్యాదరినా
ససువులు రాసుతులు సకల శాస్త్ర కళా పా
ధ్యసన వ్యసనాభిముఖో
ల్లసన శ్రీశాలు రైరి లలితప్రతిభన్

బ్రా॥ ప్ర॥ ౧॥ 145॥ ము॥ ప్ర॥ 3-150

ఇచట బ్రౌను ససువుల – మొలకల – ఈ అర్థము నిఘంటువల్ల దొరికినది" అని గుర్తించెను.

ఇందారవ ఆశ్వాసమున 'కోపు' అను పదము తాను పరిశీలించిన యేయే కావ్యములందు వచ్చినదో బ్రౌను గుర్తించెను. ఇది తన నిఘంటువు నిమిత్తమై యుండును.

"లీ... ... ... ...
కోపు లెక్కడనులో కూమ్మలక్కడను

కోపు అనే మాటను గురించి రామాభ్యుదయ –4 ౪౬౦ – లీల – ౨-౩౬ రసికజన

-౩-౧౩ ... ౧౮౩ న్ను - తార - ౨ ౧౩౦ శశిరేఖ - ౨౩౮-౩-౧౩౭ తార-౪-౧౭౧ - శుకసప్తతి - ౩/౮......"

4. 15. 4. కేవలము కావ్యముల నుద్ధరించుటయే కాక, వానిని పఠించి, అందలి ప్రయోగములను గుర్తించుకొనుట యన్న, ఆతనికి గల ఆంధ్రసాహిత్య పరిజ్ఞానము అల్పప్రాయము కాదనియు, అది అతనికి భాషలోగల అత్యంత సన్నిహితత్వమునకు శబ్దదక్షతకు నిదర్శనమనియు స్పష్టము కాగలదు.

లు రీ
మత్తకోకిల॥ "జొత్తురుం జొరరాసి చోటుల జొచ్చి పుణ్యవశంబునన్

ము
వత్తురుం దివిగంగ నీ గతి । వానరోత్త + తెత్తరిన్"

........... ........................

(ఆ॥ 6॥ ప॥ 69॥ వ్రా॥ ప్ర॥ 6-79॥ ము॥ ప్ర॥ )

**"This ము I inserted on reexamining the passage in the Mc. mss - the editor had passed over the error in scanning unnoticed"** దేనినైనను బ్రౌను స్వయముగ పరిశీలింపనిదే సంతృప్తినొందడనుటను నిది వ్యక్తపరచుచున్నది.

ఆ 6. ప. 94 దగ్గర బ్రౌను **"Here the ms procured from Chinnaya stops."** అని గుర్తించెను. దీనిని బట్టి అతడు సంప్రతించిన మూడు ప్రతులలో నిది యొకటని తెలియుచున్నది. ఇచట బ్రౌను పేర్కొనిన చిన్నయ పరవస్తు చిన్నయసూరి కావచ్చునేమో !

ఉ॥ "కోమల ధాముండై పొడవుగొండకినుండు కిరీటమయ్యెను
త్రాముఁడు పెట్టి పంచిన రథంబున రాముఁడు దే జరిల్లె సం
గ్రామము గోరి సన్నహన గర్వముతోఁబురి నిర్గమించె భే
రీముఖ తూర్యఘోష బధిరీభవదాంశుఁడు రాక్షసేశుఁడున్"

(ఆ॥ 8॥ ప॥ 202)

"భేరీ ముఖ తూర్యఘోష బధిరీ భవదాంశుడు" ఇట బ్రౌను "దాంశుడు-అనే చోట సున్నవుంటే అన్వయించదు" అని వ్రాసెను. బధిరీభవత్ = చెవుడ్పడు చున్న ఆశుఁడు = దిక్కులు కలవాడు" అని అర్థము. కాన 'అంశుఁడు' అని

యుండిన అన్వయము కుదురదని పూర్ణబిందువులేని 'అకడు' అను పదము గ్రాహ్యమని బ్రౌను సూచన కర్థము.

రసవత్తరమైన యీ రామాభ్యుదయ ప్రబంధ రూపురేఖలను తీర్చిదిద్ది, రామభద్రునికృతి ఆంధ్రవాఙ్మయమున నామమాత్రావశిష్టము కాకుండ నిలిపినవాడు బ్రౌను.

## 4. 6. రాఘవపాండవీయము :

(పింగళిసూరన)

4160. బ్రౌను కాలేజి పండితుడైన కంభం నరసింహాచార్యులు 18-3-1834 నాడు బ్రౌనునకు వ్రాసిన లేఖలోని భాగము : "ఈ మధ్య పైడిపాటి వెంకటనరసయ్య పేరట వేమన గ్రంథమును గురించి వ్రాయించిన హుకుములో నన్ను రాఘవ పాండవీయానకు టీక జరిగించవలశ్నిదని ఆజ్ఞ అయివున్నది గనుక సదరహి గంథం ప్రారంభించి రెండో ఆశ్వాసములో అరువైపద్యముల వరకు ప్రతి పద్యమునకు రెండర్థములు విశదముగా యేర్పడేలాగున జరిగించడమయినది. యీ రాఘవపాండవీయానకు వీరే ప్రతులు యిక్కడ హాజరులేనందున మరివక పరిశుద్ధ ప్రతి కూడా సంపాదించడమైనది ..."[1] రాఘవపాండవీయ ప్రతుల కొరకు బ్రౌన్ 1834 నుండి వెదకుచున్నట్లాతని లేఖనవలన తెలియుచున్నది 1834 సం॥ ఆగస్టు 8-వ తేదీన బ్రౌను చల్లా సుబ్బన్నద్వారా వత్యం అద్వైత బ్రహ్మశాస్త్రులకు పరిశీలనార్థము కొన్ని తాళపత్ర ప్రతులను పంపెను. అందు ఓఢ్రాక్షరములతో సంస్కృత రాఘవపాండవీయముండెను. ఓఢ్రభాష తెలిసిన యొకరు బందరులో నుండుటచే వారియొద్దకు దానిని పంపి, తెలుగు లిపిలో వ్రాయించిరి. బ్రౌనునకు కావలసినది సూరపరాజు విరచిత ఆంధ్రరాఘవ పాండవీయము, అందునను సవ్యాఖ్యానాత్మకమైనది. కాన వత్యం అద్వైత బ్రహ్మశాస్త్రి జగన్నాథ సమీపదేశవర్తియైన పీతాంబరదేవుగారను జమీందారునకు ఆతని వకీలు తనగ్రామమునకు వచ్చినపుడు అతనిచేత రాఘవ పాండవీయ ప్రతి కొరకు ఉత్తరమును వ్రాయించెను. ఆ జమీందారుగారు తమ యొద్దనున్న ప్రతికి పుత్రిక వ్రాయించి పంపించెదనని తెలిపిరి[2]

---

1. Sr. of Lt. M. 401. P. 313 2. Ibid M. 417 pp. 125-129

"ఇది ద్వ్యర్థికావ్యమున్ను చమత్కారకావ్యమున్ను గనుక యిది చూడవలెనని బహుదినములు మట్టుకు కోరికె కలిగె వున్నందున దీన్ని గురించి బహు ప్రయత్నం చాయడమైనది. దైవ కటాక్షం వల్ల కొద్ది దినములలో సాధ్యమయ్యేటట్టె తోస్తూ వున్నది "[3] అని వత్యంవారు బ్రౌనుకు విన్నవించుకొనిరి.

అదే సంవత్సరమున అక్టోబరునెలలో నందివాడ గుర్రాజు వ్రాసిన లేఖలను బట్టి బ్రౌన్ అతని మూలమున రాఘవ పాండవీయ ప్రతులకు ప్రయత్నించినట్లు తెలియు చున్నది.[4]

మల్లంపల్లి బుచ్చయ్యశాస్త్రి బ్రౌన్ ఛందస్సును వ్రాసికొని, దానికి మారుగ తన యొద్దనున్న వ్యాఖ్యలేని రాఘవపాండవీయ ప్రతి నొసంగినట్లున్నది.[5] గుర్రాజు కపిలవాయి కృష్ణశాస్త్రి దగ్గరనున్న సవ్యాఖ్యాన రాఘవ పాండవీయములో 83 పత్రములలో 3, 4 ఆశ్వాసములను దామరాజు వెంకట్రాముని యొద్దనున్న 168 పత్రముల నాలుగాశ్వాసముల గ్రంథమును సంపాదించి బ్రౌన్ సముఖమునకు పంపెను. "దామరాజు వెంకట్రాయుడు యిచ్చిన గ్రంథంలో పదకొండు పత్రాన్ను నూటపద కొండు పత్రాన్ను మొదట కొంచెం మెర విరిగినవి. యెక్కడెక్కడ కొన్ని పత్రములు పురుగు పట్టినవి గనుక యీ సంగతి చిత్తానకు విశదం కాగలందులకు విన్నపం" గుర్రాజు వ్రాసెను[6]

4. 16. 1. మ. ప్రా పు, భాండాగారమున 12 తా. ప. ప్రతులు 4 కా. ప్రతులున్నవి. D. 674, 675 683. 686 సంఖ్యలు కాగితపు ప్రతులు.

*D* 674, 675. + కాగితమున కిరువైపుల వ్రాయబడియున్నది పద్యపాద విభజన మున్నను, వరుసగ వచనమువలె వ్రాయబడెను పద్యసంఖ్యలేదు. ఈ రెంటిలో *D* 675 అతి శిథిలము. ఇవి రెండు పరిష్కరణమునకై మాతృకను యథాతథముగ వ్రాసికొనిన ప్రతులవలె తోచును.

*D* 683. + సటీకము, పత్రమున కిరువైపుల వ్రాయబడియున్నది. పద్యములు క్రమముగ నున్నవి.

---

3. Ibid. M. 417. pp. 125 - 129.
4. Ibid M 411 P. 43
5. Ibid. M. 417. P. 463.
6. Ibid. M. 411. P. 43.

పద్యపంక్తుల మధ్య పాఠభేదములు సవరణలు గుర్తింపబడియున్నవి. ఇందు టీకాకర్త పేరు కానరాదు.

**D** 686 — ఇందు నాలుగవ ఆశ్వాసము. 101. పద్యము వరకే కలదు. ఇది టీకా సహిత పరిష్కృత శుద్ధ ప్రతి. ప్రతమున కొకవైపుననే వ్రాయబడెను. తన ఆనతి చొప్పున నరసింహాచారి దీనికి టీకను సమకూర్చినట్లు బ్రౌన్ పేర్కొనెను. ఇందు **"The poem is one of extraordinary refinement and singularly difficult every stanza bearing two separate meanings; one giving the story of the pandavas according to the Mahabharat and the other the adventures of Rama-thus the comment on each stanza is bipartite"** అని బ్రౌన్ విశదీకరించెను.

4. 16. 2 చిత్రకవితలో ద్వ్యర్థిత్యాదులు అర్థచిత్రమునకు చెందును. పాశ్చాత్య భాషలలో నిట్టి నానార్థకావ్యములు కానరావు ఇట్టి రచనలు ప్రపంచ భాషలన్నింటిలో సంస్కృతాంధ్రము లందే యున్నట్లు కనిపించును. విద్వదౌషధము లగు నిట్టి కావ్యములును బ్రౌనును ఆకర్షించుట చిత్రమే.

రాఘవ పాండవీయము 1857లో తొలినాటి ముద్రింపబడినట్లు విజ్ఞుల అభిప్రాయము. కాన బ్రౌను దీని పరిష్కరణమును తత్పూర్వమె చేసి యుండవలెను. ఈ కావ్య ప్రథమ ముద్రాపకులు ఎవరనునది తెలియుటలేదు.

## 4. 17. రాధికాసాంత్వనము :

4. 17. 0 రాధామాధవ సంవాదేతి వృత్తమునే స్వకపోల కల్పనలతో సంస్కరించి రాధికాస్వాంతనముగ ముద్దుపళని తీర్చి దిద్దినదని బ్రౌను భావన. వెంకటపతి కావ్యమున అసభ్యముగ **(rustic)** నున్న పట్టులను ముద్దుపళని రసాత్మకముగ రూపొందించెనని అతడెంచెను.1

4. 17. 1. బ్రౌను రాధామాధవ సంవాదపరిష్కరణ కార్యమున నిమగ్నుడై యున్నపుడే రాధికాసాంత్వన ప్రతితో పరిచయమేర్పడెను. రాధామాధవ సంవాదమున నున్న వ్యాకరణదోషము లిందులేవనియు ఇందలి శైలి మృదుమధురముగ

1. **Es. on Tel. Lit. Para 78**

నుండుననియు, ఇందలికథ రాధాకృష్ణుల ప్రణయముతో నాగక మరికొంత పొడిగింపబడి రాధ పెంపుడు పుత్రికయగు ఇళాదేవి కృష్ణుని పరిణయమాడుట, రాధాకృష్ణుల ప్రణయ కలహము, కృష్ణుడు రాధతో సాంత్వన వచనములు పలుకుటతో పరిసమాప్త మగుచున్నట్లు తెలిపెను. ఈ కథయు తారాశశాంక కథవలె అవినీతిదాయకమనియే అతని అభిప్రాయము. అయినను ముద్దుపళని రమణీయశైలి యతని నత్యంత మాకర్షించినది. ఈ ప్రబంధము రసిక హృదయమగు స్త్రీ కృతమే కాని కొన్ని పట్టులు మాత్రము పాండిత్యస్ఫోరకమగు పురుషరచనగ తోచుననియు, తన గురువుతోడ్పాటుతో రచించినట్లు ముద్దుపళనియే తెలిపెననియు బ్రౌను విశదీకరించెను.

4. 17 2 ఈ కావ్యమునకు బ్రౌను ఆంగ్లమున "Reconciliation" అని నామకరణమొనర్చెను కృష్ణుడు రాధతో రాజీపడుటచే నిది సార్థకమని బ్రౌను తలంచెను. తన ప్రభువునకు మరొక స్త్రీతో పరిచయమేర్పడుటచే తనకు కలిగిన స్వీయమనః క్లేశమునే ముద్దుపళని రాధిక కథనమున చిత్రించినట్లును, రాధిక పాత్రలో ముద్దుపళిని యంతర్భావము నందినట్లును బ్రౌను వచించెను. బ్రౌనుకు లభించిన తాళపత్రప్రతి ద్వయమున "ఇళాదేవీయ్యం" అను నామాంతరముండుటచే 'రాధా మాధవ సంవాద' మను భ్రాంతి తటస్థింపకుండుటకై 'ఇళాదేవీయ' మను నామమె గ్రాహ్యమనెను. కనుకనే తన నిఘంటువున రాధికా సాంత్వనమును ఇళ 'Ila' అని, రాధామాధవ సంవాదమును 'రాధమాధ' అను. సంకేతములతో సూచించినట్లు పేర్కొనెను.[2]

4 17. 3. ఈ ప్రబంధమునకు 1 తాళపత్ర ప్రతియు, 6 కాగితపు ప్రతులును మ. ప్రా. పు భాండాగారమున లభించుచున్నవి కా ప్రతుల వివరములు :

*D* 707 + పత్రమున కిరువైపుల వ్రాతతో, పద్యపాద విభజనముతో, పద్యసంఖ్యా క్రమముతో నున్నది.

D 708, 709 + ఇవి రెండు పాఠభేదములు గుర్తింపబడిన ప్రతులు. ఇందొక చోట తిరుచునాపల్లి ప్రతి ప్రస్తాపన కలదు దానితో 'మొకాబిలా' చేసిరి. పత్రమున కిరువైపుల వ్రాయుటచే, నీ ప్రతులందులేని అదనపు పద్యములు పుటలకు ప్రక్కనున్న ఖాళీస్థలములలో గుర్తింపబడినవి.

---

2. P. R. T. L. P. 72.

D 712 — మొదటి రెండాశ్వాసములకు టీక కలదు.

D 713 — చివరి రెండాశ్వాసములకు టీక కలదు. D 712, 713 కలిపిన సంపూర్ణమైన టీక యగును ఇవి చిత్తుప్రతులనియు. వీని నాధారముగ జేసికొని శుద్ధప్రతి తయారు చేయబడినదని బ్రౌను తెలిపెను.

D 711 + టీకాసహిత గ్రంథము. శుద్ధప్రతి. ఇందు కొన్ని పుటలు లేవు. (Fol. 131 to 152 వ్యాఖ్యాకర్త పేరు ఇందు కానరాదు. బ్రౌను వద్యములకు అచటనచట విషయసూచికల నొసగెను. ఈ కావ్య టీకాకర్త పైడిపాటి వెంకట నరసు [3]

4. 17. 4. D. 708 ప్రతిలో బ్రౌను ఈ కావ్యమునకు వ్రాసిన సంక్షి ప్తాంగ్ల ఉపోద్ఘాతము కలదు "The Radhica Tantvanam or The Melting soul of Radhica (or Ila), adopted daughter of Radha" అని ఈ ప్రబంధనామమును వివరించెను.

బ్రౌను కొన్ని పద్యముల భావమును సంక్షిప్తముగ అంగ్లములో సంగ్రహించెను. తనకు నచ్చిన, తాను మెచ్చిన పద్యములను బ్రౌను ప్రశంసించెను.

ఉదా: సీ॥ "ఏయెడ నారొమ్మ బాయని వీణయే
పాటలాధరి గోట మీటునొక్కొ"

వ్రా॥ ప్ర॥ 3-73॥ ము॥ ప్ర॥ 3-61

అను పద్యము కడ బ్రౌను "A very pretty lamentation" అని గుర్తించెను

ఇది యొక శృంగార కావ్యము కవయిత్రి పళని తంజాపూరు ప్రభువగు వీరప్రతాపసింహుని ఉంపుడుకత్తియయే కాక నాట్యకత్తెయు. ఈ ప్రబంధమునకు బ్రౌను గ్రంథపాతములతో కూడిన 3 ప్రతులను సంపాదించి లుప్త భాగములను పూరించి పైడిపాటి వెంకట నరసయ్యచే పరిష్కరింపజేసెను ఈ ప్రబంధము నాద్యంతములు ముద్దుపళని నిర్వహించి యుండదనియు, బహుశః ఆమె గురువగు వీరరాఘవాచార్యుల సహాయ్యమును గైకొని యుండవచ్చునని పేర్కొనెను.. ఇది కేవలము పురుషకృతమని చెప్పక, స్త్రీ రచనగ పెక్కుపట్ల కాన

3 P. R. T. L. P. 106

వచ్చుచున్నదనుట ముదావహము, ముద్దుపళని సులభ వృత్తములను స్వీకరించి, అఖండయతి, వబయోరభేదయతి మున్నగు నిరంకుశ ప్రయోగములను గావించి నట్లు బ్రౌను ఉపోద్ఘాతమున వక్కాణించెను. అఖండ యతిని ప్రాచీన లాక్ష ణికులలో కొందరు సమ్మతించిరి కొందరు సమ్మతింపరైరి. కాన దీని నిరంకుశ ప్రయోగముగ పరిగణింపవచ్చును. కాని వ బ లకు యతి (అభేద యతి) సర్వ లాక్షణిక సమ్మతము. వ బ యతిని గూర్చి బ్రౌనిట్లు నుడువుటకు కారణము దురూ హము. బ్రౌను ఇట్టి ఉపోద్ఘాతమును వ్రాయుటకు దీని టీకాకర్తలే కారకులని యెన్న నగును. ఈ టీక యందచ్చటచ్చట టీకాకర్త అభిప్రాయము లున్నవి టీకాకర్తయె యిందేపద్యములు గురువు విరచితములో, ఏవి పళని కృతములో నిర్ణయించుట చోద్యము. ఇట్టి నిర్ణయమునకు హేతువులు ఉగ్గడింపబడక పోవుట చింత్యము. ఉదా:

(i) "యీ కావ్యమందు రెండు కృషులు బైలుదేరుతున్నవి। లలిత శృంగార రసమందు చెప్పిన పద్యములు సాక్షాత్ స్త్రీ కావ్యమేకాని యిషవంటి క్లిష్టమైె పద్య ములు దాని గురువు రచించుకొన్నాడని యోచించవలశ్నిది."

(ii) "క॥ పద్మారిగేరు మోమును..." వ్రా॥ ప్ర॥ 1-53॥ ము॥ ప॥ 1-35 అను పద్యము దగ్గర "ఇదిన్ని గురువు చెప్పిన పద్యం" అని ఉన్నది

"యీ కావ్యం కృష్ణరాధికను గురించి వుండగా నిజమైన మూలం యేమంటే రాజువారు ముందుగా యీ తంజి నాయికను వుంచుకొని వుండి అటు తర్వాత దాని కూతురైన ముద్దుపళని అని యీ కవీశ్వరాలును వుంచుకొని అటువెనక తిరిగి తల్లితో సమాధానం పరిచినాడు గనుక ఆ సాంత్వనం అనగా సమాధానమును గురించి యీ కావ్యం రచించినది। యీ కథ తంజావూరిలో విననగును।" అని బ్రౌను ఈ కావ్యమును గూర్చి తాను విన్న విషయమును గుర్తించెను.

4. 17. 5. చిత్తుప్రతులలో అనేక పద్యములకు ఆంగ్లమున తాత్పర్యముల సమకూర్చెను. ఉదా :-

సీ॥ శృంగార యౌవన క్షీరాబ్ధినడుమను
దనరారు బంగారు తమ్మియనగ
దళుకు మించన మించు తను చంద్రరేఖలో
ఖరిధవిల్లు కురంగ పద మనంగ

గలదు లేదనునట్టి కౌను దీవియందు
బూచిన దింటెన పూ పనంగ
నలు వొందు నాభి పున్నాగంబునను బుట్టి
ప్రవహించు విరితేనె వాక యనగ

తే॥ జొక్కి మరులెక్కి మత్తల జుట్టి చూడ
నజు డొనర్చిన మోహన యంత్ర మనగ
మరులు గొలిపెడి పొరసాసి మరుని యిల్లు
కళలు గరగంగ ముద్దాడి కలియు టెపుడొ.

(వా॥ ప్ర॥ 3-127, 128॥ ము॥ ప్ర॥ 3-105॥)

"Like a golden Lily floating in the centre of Juvenility's ocean. Like the slit step of the antelope' foot glimmers the half visible cresent of her body-Like a blue bell blossoming on the half invisible spring of her body Like a stream of nector flowing down from the lily of her bright navel which looks like a devine spell for inspiring love is the naked part of my lovely mistress" కొన్ని పద్యముల భావమును ఆంగ్లములో ఛందోబద్ధ మొనర్చెను. (చూ. అను 11)

4. 17. 6. పరిష్కరణమునకు, టీకా వ్యాఖ్యల సమకూర్పునకు బ్రౌను పండితుల సాహాయ్యసహకారముల పొందినను కేవలము వారి పర్యవేక్షణకే విడిచెడి వాడు కాడనుట రాధికాస్వాంతన టీకవలన తెల్లమగును టీకా కర్తకు బ్రౌను సూచనల నొసగుటయేకాక తానును వివరణముల చేర్చెను ఉదా:-

(i) ..............................

గోపాల దేవుపై గోపించెనపుడెట్లు
దక్షిణ నాయకాధ్యక్షుడై"

బ్రా॥ ప్ర॥ 1 — ము॥ ప్ర॥ 1-45

అను పద్యము టీక చివర "అనేక స్త్రీలయందు సమాధానము గలిగియుండే దక్షిణ నాయకులకు శ్రేష్ఠుడైనటువంటి" అని ఉన్నది. దీని కెదురుగా క్రింది బ్రౌను వివరణ కలదు.

**What ? Dacshina Naik - who? explain thus.** దక్షిణం అనగా సామర్థ్యం। మరి దక్షిణ గుణంగల, నాయకుడు అంటే పది మంది స్త్రీలతో కలసిన వాడై పక్షపాతం వహించక అంతమంద యందలి సమాన దయతో వుండె పురుషుడు"
(ii) తే॥ నూరి పోసును నొకవేళ నారజంబు (వ్రా॥ప్ర॥ 1-86 ము॥ ప్ర 1-59) అను పద్యమున కెదురుగా బ్రౌన "నూరిపోయు **is to wash off a written lesson and drink the water, a metaphor To imbibe an art"** అని గుర్తించెను.

(iii) తే॥ "వెఱ్ఱినై దెబ్బదను గాని వెలది నీవు
నొద్దికల మీరి గడిదేరి యొద్దచేరి"
(వ్రా॥ ప్ర॥ 1-152॥ ము॥ ప్ర॥ 1-113 )

**"Here the commentator eludes explaining** గడదేరి ..... అనె మాటకు టీక వ్రాయలేదు గడిదేరి అనగా ॥దొడ్డగా। గట్టిగా" అని బ్రౌను సూచన

(iv) సీ॥ మోమునించుక మోవి నానగ హత్తి
..........................
పౌరుషరతి కెంచి పైకొన గమకించి
యటుల నిటుల బేయు కట్టి యుండు.
(వ్రా॥ ప్ర॥ 1-79॥ ము॥ ప్ర॥ 1-129॥)

"on గమకించి **see Dict. P. 647"** అని బ్రౌను వ్రాసెను.

(v) సీ॥ కొసరు పల్కులం గమ్మిగోటి కత్తుల జిమ్మి
కాసెలో చేయివేసి కడియదీసి
కన్నౌతలాగించి కౌగిట గదియించి
సరి చిత్తలులనెత్తి పనులనొత్తి
జొచ్చి కల్గమ్ములకు వచ్చి
........................

తే॥ ..............................
గౌరవంబులు దుదుకలు చెలఁగరాధ
............................ ...
ప్రా॥ ప్ర॥ 1-197॥ ము॥ ప్ర॥ 1-145॥

Give note on గౌరవం - as pilli, guvva, cucka, santo sinch[1] chese swaram" అనియు

కన్నాత లాగించి । ఈ శబ్దము । తారా శశాంకము

ఆ ం ప ంాం లకూ

Explain అల్లందులకు by your Tantra and refer to 11. 165 అట్ చ & give parallel passages pudoris ——" అని బ్రౌను సూచన.

(vi) సీ॥ "ధర బెస్తనేస్తంబు తొరసాలె పద్దులు
వెలయాలి కూరిమి విటుల నియమ
(ప్రా॥ ప్ర॥ 4-99 ము॥ ప్ర॥ 4-79)

"తొరసాలే॥ అనగా బోయవాండ్లలో వక భేదము"- In the Memoir of Hyder Vol. ౽ంం page. 68 are these words పీండ్లకు బోయవాండ్లలో భేదమైన బేదంగువాండ్లకు తొరసాల వాండ్లకు జనం వకటింటి ంంం, ంంం మందికి బారుకు నాయకులను చేశి" అని బ్రౌను వివరణ

4. 17. 7. ఈ ప్రతులందచటనచట టీకకు సంబంధించి "అవతారికకు టీక యింత విశాలంగా పెంచరాదు । కొంచెం కొంచెం వ్రాశి జరిగించ వలశ్నిది । సులభమైన పద్యములకు అయిడేసి ఆరేసి పంక్తులు చాలును."[4]

సీ॥ "తన యార్యను తమ పౌదార్య విస్ఫురణంబు......"

"ఈ పద్యమునకు విశాలమైన టీక కావలె"[5] అను సూచన లుండుటచే పైడిపాటి వెంకట నరసయ్య వ్యాఖ్యానమును మరొక పండితుడు పర్యవేక్షించినట్లు సువిదితమగును. వెంకట నరసయ్యకు అబల లనిన అలస భావమున్నట్లు ద్యోతక మగును.

4 D 712. సంపు : 1. పత్రము 3. 5. అందే పత్రము 19.

చ॥ జలరుహ పత్రనేత్ర విను చందన గంధి విరాళి యెంతొ మై
..........................................
మిలమిల తొల్లిరాఁజెలులు మిణ్గురు బూచులటంచు బట్టిచే"
(వా॥ ప్ర॥ 1-189; ము॥ ప్ర॥ 1-187॥)

అను పద్య వ్యాఖ్యాన సందర్భమున నతడు "మిలమిల యిక్కడ ప్రయోగించ వలసినది కాదు. వట్టి ప్రాసకోసం అడముండ కావ్యమందు చొచ్చింది" అని వ్యాఖ్యానించెను.[6] మహాకవుల కావ్యములందును యతిప్రాసల నిమిత్తముపయోగించిన వ్యర్థంపదము లెన్నియో కలవు. ఈ యీసడింపు టీకాకర్తకు గల ద్వేషబుద్ధిని, ఔద్ధత్యమును వెల్లడించుచున్నది. ఈ కావ్యము పట్లాతని త్రికరణ శుద్ధిని శంకించియే కాబోలు బ్రౌను మరొక పండితుని పరిశీలింప పురమాయించి యుండును ప్రతిలోని చేతిప్రాతను బట్టి ఈ పరిశీలనగావించిన వ్యక్తి జూలూరి అప్పయగ నెన్న నగును.

## 4. 18. చంద్రరేఖావిలాపము :[1]

4. 18. 0. క్రీ శ. 1830-వ సం॥లో బ్రౌన్ చంద్రరేఖా విలాపకావ్యప్రతి నొకదానిని కూచిమంచి జగ్గకవి మనుమని యొద్దనుండియే సనుపార్జించి యుండవచ్చునని క్రిందిలేఖవలన ఊహింపనగును.

"తమ పండితులు బొడ్డపాటి సుబ్బన్నశాస్త్రులు అనేక సలాములు చేసి వ్రాసుకొన్నది......

జానకీ పరిణయము ద్విపద రాధాకృష్ణ దివ్యచరిత మొదలయిన గ్రంథములు యెక్కడ వున్నవో జాడ తెలియక యిది పర్యంతమున్ను విచారిస్తూవుండగా ఆ గ్రంథములు చేసిన కూచిమంచి జగ్గన్న మనమడు గంగరాజు యీ జిల్లాలో పెద్దాపురముకు సమీపముగా వున్న కోలంక అనే గ్రామములో వున్నాడని తెలిశి నిన్నటి రోజున ఆగ్రామములోకివెళ్ళి కొన్ని పుస్తకములు సంపాదించినాను......చంద్రరేఖా

---

6. అందే. పత్రము. 145; 1. బ్రౌను వ్రాయించిన కాగితపు ప్రతులన్నింటిలోను 'చంద్రరేఖావిలాస' మనియే లిఖితమయి యున్నది

విలాసం చేసిన హాస్యకవికి అన్న అయిన తిమ్మకవి చేసినవి కొన్ని హాస్య గ్రంథములు శృంగార శతకములున్ను, రుక్మిణీ పరిణయమనే మహాగ్రంథమున్ను సంపాదించి వుంచినాను......"

దీ ౧౭ ఆగస్టు ౧౮౩౦ సంవత్సరం
మకాం జగన్నాథపురం
వ్రాలు బొడ్డపాటి సుబ్బన్నశాస్త్రులు"

4 18. 1. చంద్రరేఖావిలాప వ్రాతప్రతులను గూర్చి "దీని వ్రాతప్రతులు మదరాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయములో మూడున్నవి అవి బ్రౌనుదొరగారు సేకరించినవి." అని తెలుగులో తిట్టు కవిత్వము" గ్రంథకర్తలు పేర్కొనిరి.[2] వారు D 490, 491, 496 మాత్రము గుర్తించిరి. కాని ఈ కావ్యమునకు అయిదు కాగితపు ప్రతులు మ ప్రా పు. భాండాగారమున లభించుచున్నవి. (D. 490, 491, 492, 495, 496) వీనిలో నాలుగు బ్రౌను వ్రాయించినట్లు తెలియుచున్నది. వాని వివరములు :

D. 490 + ఇది సమగ్రము. మూలమొకవైపున మాత్రమె వ్రాయబడెను. పద్యపాద విభజనము, పదసంఖ్య కలదు ఖాళీగనున్న రెండవ పుటలో "The Tica is the బూతు భూతీయం" అను బ్రౌను గుర్తించెను. కాని యిట్టి వ్యాఖ్య యిందు కానరాదు, అట్టి వ్యాఖ్యానమును బ్రౌను వ్రాయింప నుద్దేశించె నేమోయని రావూరి వారభిప్రాయపడిరి.[3] పై అట్ట మీదను గ్రంథములో సర్వత్ర 'చంద్రరేఖావిలాస' మని యున్నది మొదటి పుటలో మాత్రము "విలాప" మని రచితము. ఇందుగూడ (D. 491) ముఖపత్రమున "విలాసం" అనియే యున్నది. బ్రౌను గ్రంథవిషయ సూచనలో కూడ "విలాస" మనియే ఆంగ్లమున రచితము. విలాసమను పేరే యాకాలమందు ప్రచారమున కుండెనేమో ? విలాసమని యున్నను తిట్టుకబ్బమగుటచే వ్యంగ్యార్థమునకు సరిపడవచ్చును." అని రావూరి వారి సూచనము[4] పైలేఖలో బొడ్డపాటి సుబ్బన్న శాస్త్రులు దీనిని "చంద్రరేఖావిలాస"

---

2. "తెలుగులో తిట్టు కవిత్వము" పుట 143
3. అందే. పుట 143.
4. అందే. పుటలు. 143-144.

మనియే బ్రౌనునకు పరిచయ మొనర్చెను కాన దీని "విలాస" మనియే ఆ కాలము వారు వ్యవహరించినట్లు తెలియుచున్నది.

D 491 + ఇందు ప్రథమాశ్వాసములో కొంత భాగము పద్యముల యొద్ద నటనట ఆంగ్లములో బ్రౌను అర్థవివరణములను సంగ్రహముగ రచించెను. పాఠాంతరములు గుర్తింపబడినవి

ఉదా :

"విష్ణులోపలి ... జనక యాగంబుఁ జూడవచ్చెను ... చంద్రరేఖ" (1-75)

"Picture of Chandra Rekha who came to see the feast"

ఈ ప్రతి మొదటి పుటలో గ్రంథమును గూర్చి బ్రౌను వ్రాసిన ఉపోద్ఘాత మున్నది.

పిండిప్రోలు లక్ష్మణకవి, రావణ దమ్మీయకృతి భర్తను గురించి బ్రౌను పొర పడిన విషయమును శ్రీరామూరివారు గుర్తించిరి.[5] ఈ ప్రతి మొదటి పుటలో "NB పిండిప్రోలు లక్ష్మణకవి also wrote against this Jamindar's father a satire called the రామన్నదమ్మీయ్యం offered me by Krishna Sastri' అని బ్రౌను వ్రాసిన వాక్యములు కలవు. దీనిని బట్టి చంద్రరేఖావిలాప కృతిపతి యగు నీలాద్రిరాజు తండ్రిని తిట్టుచు, లక్ష్మణకవి, రావణదమ్మీయమును రచించెనని యర్థమగును. కూచిమంచి జగ్గకవి కృత చంద్రరేఖా విలాపము మొదట రచితము (1700 - 1760) రావణదమ్మీయము 1797 సం॥ గోదావరి జిల్లా కుయ్యేరు గ్రామము గుత్తగొన్న ధర్మారాయని పేర రచితము. కాన నీ యిద్దరు కృతిపతులకెట్టి సంబంధమును లేదు.

4. 18. 2. D 495 496 ఇవి సమగ్రములు. వీనిలో మూలమును, వ్యాఖ్యానమును కలవు D 496 ప్రతిలో వ్యాఖ్యానము ప్రత్యేకముగా చేర్చబడి యున్నది. పత్రమునకు రెండువైపుల వ్రాయబడి, పద్యపాద విభజనముతో, పద్య సంఖ్యతో నున్నవి. D 496 ప్రతి D. 495 ప్రతికి మాతృక యగును వ్యాఖ్యానము తుదలో "తెన్నెల పింగటయ్య పండితకృత కవకివల పుట్టిల్లు అనె వ్యాఖ్యానం సంపూర్ణం" అని కలదు. ఈ ప్రతి అతి శిథిలము. గ్రంథాలయములోని గ్రంథ వివరణ పట్టికలో నిట్లు వివరింపబడెను:

"'కవకిపల పుట్టిల్లు' -ఇది చంద్రరేఖా విలాపమునకు తెన్నేల పింగటయ్య చేసిన వ్యాఖ్య దీని మాతృకలోఁగవి పేరు 'పుక్కాన్న' అని వ్రాసి మరల 'పింగ ళయ్య' అని దిద్దఁబడినది. దీనం జేసి యీ వ్యాఖ్యాతపేరు దాఁచుకొని యుండు నని తోఁచుచున్నది"

ఈ ప్రతులేకాక *D* 492, D 497 కాగితపు ప్రతులును చంద్రరేఖా విలాప మునకు సంబంధించినవియే. D. 492లో "యీ చంద్రరేఖా విలాపం సండ్డూరి సోమరాజుకు కొలిశేషగిరి రాయుడు యిండ్లు ఖరీదు యిచ్చి వ్రాయించ్చి మెస్తరు సమర్సు సరవియ్యరు దొరగారికి గ్రంథాలలెఖచో లెఖకట్టి ఖరీదుకు యిచ్చినాడు" అను వ్రాత యుండుటచే ఈ ప్రతిని మెస్తరు సమర్సు సరవియ్యరు సేకరించి బ్రౌనుకు పంపియుండవచ్చును.

4 18. 3. D 497 చంద్రరేఖా విలాపము నందలి తృతీయాశ్వాసములోని 25-వ పద్యము వరకు సంతరించిన శబ్దసూచి మొదటిపుటలో "Index to the చంద్రరేఖావిలాపము this is complete only as far as తృ. ౨౫" అని ఉన్నది. ఇది బ్రౌను తయారుచేయించినదే కానోపును.

ప్రకరణ సారాంశము :

1. బ్రౌను ఆయా శతాబ్దములలో ప్రసిద్ధికెక్కిన ప్రబంధములను సేకరించి పరిష్కృత ప్రతులను సిద్ధము చేసెను.

2. ప్రబంధములలో శృంగారాత్మకములేకాక ద్వ్యర్థిత్ర్యర్థి ప్రబంధములను (రాఘవ పాండవీయము, హరిశ్చంద్ర నలోపాఖ్యానము, యాదవ రాఘవపాండ వీయము), అచ్చతెనుగు ప్రబంధములను (నీలాసుందరీ పరిణయము, యయాతి చరిత్ర) కూడ సేకరించెను.

3 పురాణేతిహాసములలో నొక్కదానికైనను వ్యాఖ్యను వ్రాయింపక పోయి నను ప్రబంధములలో ప్రధానమైన పెక్కింటికి వ్యాఖ్యను సమకూర్చెను. (18 ప్రబంధములు. చూ. ప్ర 8)

4 ఆముక్తమాల్యదకు, హరిశ్చంద్రనలోపాఖ్యానమునకు తాను నూతనముగ వ్యాఖ్యను వ్రాయింపక, పూర్వమున్న వ్యాఖ్యలనే సవరింపజేసెను. వసుచరిత్రకు

పూర్వమున్న సోమనాథుని వ్యాఖ్యను సేకరించుటయేకాక, వ్యావహారిక భాషలో నూతనముగ మరి రెండు వ్యాఖ్యలను తన పండితులచే వ్రాయించెను.

5. పదసూచికలను తయారుచేయుట బ్రౌను ప్రబంధములతోనే ప్రారంభించెను. (శశాంకవిజయము 1830)

6. భారత భాగవతములందు మచ్చునకు ఒకటి, రెండు పద్యములను మాత్రము ఆంగ్లీకరించెను. విష్ణుపురాణములో పెక్కింటిని, పద్మపురాణమున అహల్యావృత్తాంతమును మాత్రము అనువదించెను. ఈ అనువాదములను ప్రబంధములలో నధికముగ నొనర్చెను. అందును శశాంకవిజయమును ఇంచుమించు పూర్తిగ అనువదించెనని చెప్పనగును.

7. ఇన్ని ప్రబంధములను పరిష్కరించినను, వీనిలో కుచేలోపాఖ్యానము' వైజయంతీవిలాసము, వసుచరిత్ర, మనుచరిత్రలను మాత్రమే ముద్రించెను. ముద్రణ బహువ్యయ ప్రయాసలతో కూడిన కార్యము కదా :

8. ఈ ప్రబంధముల సేకరించుటలో, బ్రౌను వాని ప్రాధాన్యమును గణింపలేదు. చేజిక్కిన వాని నన్నిటికి కాగితపు ప్రతులను తయారు చేయించి. అవి శిథిలము కాకుంత సంరక్షించెను. ఇట్లొనర్చుట వలన నామమాత్రావశిష్టములు కావలసిన పెక్కు ప్రబంధములు ఉద్ధరింపబడినవి.

9. ప్రధానమైన ప్రబంధముల సేకరించి పరిష్కరించుటకు బ్రౌను 1824 వ సం॥న (దశావతారచరిత్ర) ప్రారంభించి, 1850-వ సం॥న (రామాభ్యుదయము) పూర్తి యొనర్చెను. ఇంచుమించు పాతికేండ్లలో నొక పాతికప్రబంధములను పరిష్కరించుట అతని నిర్విరామ పరిశ్రమను వ్యక్తముచేయుచున్నది.

# 5
# కథాకావ్యముల పరిష్కరణ

5. 0. తెలుగు కథాకావ్యములలో పంచతంత్రము, శుకసప్తతి, సింహాసన ద్వాత్రింశిక, హంసవింశతి. అను వాని బ్రౌను పరిష్కరించి కాగితపు ప్రతులను తయారుచేయించెను. భోజరాజీయము, విక్రమార్కచరిత్ర, సకల కథాసార సంగ్రహము, సకలనీతి కథానిధానము గ్రంథములకు సంపాదించి కాగితములపై వ్రాయించెను. (చూ అను 1 V) ఈ కావ్యము లన్నియు 15-17 శతాబ్దములకు చెందినవి.

5. 1. హంస వింశతి :

5. 1. 0. దేశీయ ప్రజల పలుకుబడులకు నిక్షేపమనదగు అయ్యలరాజు నారాయణ కవికృత హంసవింశతి కావ్యపరిష్కరణమును బ్రౌను 1826 వ సం॥న చేపట్టి 1845 వ సం॥న పూర్తిచేసెను. 5 ఆశ్వాసముల యీ రసవత్ప్రబంధమున శృంగారనీతి పూరితములైన కథలిరువది గలవు. ఇది శుకసప్తతిని బోలిన కథ కావ్యము. గ్రంథారంభమున బ్రౌను వ్రాసిన ఉపోద్ఘాతమున్నది.

ఆయా వృత్తి విద్యల ననుసరించు వారుపయోగించు భాషను ప్రదర్శించు నుద్దేశముతో నారాయణకవి యీ కావ్యమును రచించెనని బ్రౌను అభిప్రాయపడెను ఈ కావ్యమున ప్రయుక్తమైన అనేక వృత్తి పదములకు తన బ్రాహ్మణపండితులు అర్థమును వివరింపజాలక పోయిరనియు, ఆయా వృత్తుల నొనరించు శూద్రులనడిగి వానిని తెలిసికొంటిననియు బ్రౌను వచించెను. చేపట్టిన ప్రతి కావ్యమును కూలంకషముగ అవలోకనము చేయుటలో బ్రౌను దిట్ట అనుట అతిశయోక్తి కాదు.

5. 1. 1. ఈ కావ్యమునకు బ్రౌను వ్రాయించిన కాగితపు ప్రతులు 5 కలవు

D 915 + దీనిని బ్రౌను కడపలో 1826 వ సం॥ డిసెంబరు నెలలో వ్రాయించి నట్లున్నది. పత్రముల కిరువైపుల వ్రాతలతో, పద్యపాద విభజనములతో పద్యసంఖ్యలతో క్రమముగ నున్నది.

*D* 913 — ద్వితీయాశ్వాసమున కొంతభాగము మాత్రమున్నదట. ప్రస్తుత ఈ ప్రతి మ. ప్రా. పు. భాండాగారమున లేదు.

**D 912 +** రెండు సంపుటములలో గలదు. పుటకొక్క ప్రక్కనే వ్రాయబడెను. పాఠభేదములు పంక్తుల నడుమను, ఎదుటి పుటలలో తీర్పుపాఠములును ఉన్నవి. బ్రౌను ఇందలి ప్రథమాశ్వాసమును 1826 డిసెంబరు 6 వ తేదిన, ద్వితీయాశ్వాసమును 1827 డిసెంబరున చదువుటను పూర్తి చేసెను. బ్రౌను ఈ కావ్యమునకు 1830 సం॥లో పరిష్కృత ప్రతిని సిద్ధము చేయించెను అటుపిమ్మట లభించిన ప్రతులలోని పాఠాంతరములు ఎఱ్ఱసిరాతో పంక్తుల నడుమను, ఎదుటి పుటలలోను గుర్తింపబడెను

**D. 914 +** కొంత భాగము వరకు పత్రమున కొకవైపు మాత్రమె వ్రాయబడెను. ఆ తరువాత రెండు వైపులను వ్రాయబడెను. పాఠాంతరములు పద్యముల ప్రక్కన గుర్తింపబడినవి. ఇది 1830 వ సం॥న బ్రౌను వ్రాయించిన శుద్ధప్రతి కాదగును. **"To be handsomely full found in calf with red labei, HAMSA VIMSATI - Corrected Edition"** అను సూచనను బట్టి యిది ముద్రణకు తయారుచేసిన ప్రతిగ తోచుచున్నది.

**D. 3100 +** ఇది హంస వింశతి పదసూచి.

5. 1. 2. ఈ కావ్య పాఠసంశోధనకు బ్రౌను కాదిలో మూడు ప్రతులు మాత్రమే లభించెను. **The Three MSS read"** అని పెక్కు చోట్ల ఉన్నది. **"This verse is missing in Ms. B."** అను బ్రౌను వ్రాతవలన ఈ మూడింటి నాతడు **A, B, C** అని గుర్తించుకొనినట్లు ఎన్నవగును. పిదప బ్రౌను మరిరెండు ప్రతులను సేకరించి 5 ప్రతులను పోల్చి పాఠముల నిర్ణయించెను. వీనిలో నొకటి ఖమ్మమున లభించిన ప్రాచీన ప్రతి.

ములుపాక బుచ్చయ్య, గరిమెళ్ల వెంకయ్య పరిష్కరించిన తరువాత నరసింహాచారి పరిశీలించెను. ఉదా :-

ఉ॥ డెబ్బది రెండు పాశెములు డీవి దలిర్పఁ సమస్త దుగాణముల్
జొబ్బిలు కల్మిపట్నములు చొక్కపుపేటలు పాతకంబు వో
యందులందరున్
ద్రొబ్బెడులీల జాల్దిరుపతుల్ గనుగొంటివి [యందురందులన్]
శిబ్బెపు నిబ్బరంపు జిగి చిక్కని చక్కని గబ్బగుబ్బెతల్
వ్రా॥ ప్ర॥ 1. 54. ము॥ ప్ర॥ 1-52.

"Note : The three copies correspond reading యందురందులన్. Buch says యందులందులన్" అనునది బ్రౌను సూచన. "కనుగొంటిని నందు రందులన్" అనునది నేటి ముద్రిత పాఠము." పై పాఠములేవియు సరిగా దోపవు. "కనుగొంటిని నందరందులన్" అని సవరించిన అర్థవంతముగ నుండును.

(ii) చ॥ "అకలుష దివ్యరత్నమయమౌ నొక కేళిగృహంబులోపలన్,

..................................................

వాసు
సకినెల పట్టె మంచమున దాయన వాసుతి (వాసు) పైదురం"

బ్రౌ॥ ప్ర॥ 1-73. ము॥ ప్ర॥ 1-69.

"వాసు Va'su is the three mss - Gar - Venc. says పాన్పు alone is right" అని బ్రౌను గుర్తించెను. 'తివాసిపై' అనునది నేటి ముద్రణము. బ్రౌను 'మిశ్రభాషా నిఘంటువు' నందును 'తివాసి' అను శబ్దమె కలదు. 'తిపాన్పు' అను శబ్దములేదు. కావున గరిమెళ్ల వెంకయ్య భావము దురూహము.

(iii) సీ॥ బలుకంచు గుబ్బటోల్ దలుపులు తీనెల

డుమ యు
వాకిలి నడ చావడికి, మగులు ప్రహరిగోడ.

బ్రౌ॥ ప్ర॥ 2-147. ము॥ ప్ర॥ 2-137.

"N B Here all MSS are wrong on account of the imtricacy of the authors metre - The correction I have written is made by Narasimma Chari. by the aid of an old ms. found at Cumbum"

ప్రథమాశ్వాసము 41వ పద్యమునుండి బ్రౌను సవరణము ప్రారంభమయి నట్లున్నది D -912) పండితుల పరిష్కరణానంతరము బ్రౌను అంతర్వీక్ష గావించి వారి పొరపాటులను, అర్థవివరణ నపేక్షించు విషయములను గుర్తించుట పరిపాటి.

ఉదా :

చి
క॥ అని దీవిం చక్షత పు

ష్పని చయము విభూతి పండ్లు ఫలములు దివ్యాం

బ్రౌ॥ ప్ర॥ 1-50. ము॥ ప్ర॥ 1-48.

ఇక్కడ బ్రౌను "The three copies agree - but the true reading seems to be అసి దీవిం చక్షతపు/ష్ప. The transcribers probably hesitated at this species of elision which is not common" అని సవరిం చెను. అని దీవించి + అక్షత' ఇందు క్త్వార్థంబైన ఇకారమునకు సంధి చేయబడినది. ఇది సాధువు కాదని లాక్షణికుల అభిప్రాయము. కావుననే బ్రౌను ఇట్లు వ్యాఖ్యానించి యుండును. నేటి ముద్రిత పాఠమున నిదియే గ్రహింపబడినది.

5. 1. 3. బ్రౌను తన నిఘంటు నిర్మాణమునకై అనేక పదములను హంస వింశతి నుండి సంగ్రహించెను. తాను నిఘంటువున గ్రహించిన ఆయా కావ్యము లందలి పదములను గుర్తింపనొసగిన సంకేతములను హంసవింశతి ఉపోద్ఘాతమున అతడు వివరించెను.[1]

కావ్యపఠనమున సామాన్యముగ తారసిల్లని అనేక పదములను, పలుకబళ్లను ప్రజలు విస్మరింతురుగాన వానిని ప్రజలచే చదివించు నుద్దేశముతో ఛందోబద్ధమొనర్చి కథారూపమున కవి పెట్టినట్లు బ్రౌను విశదీకరించెను. ఈ కావ్యమునందలి యీ ఘట్టములు పద్యరూపమున నున్న పూర్వనిఘంటువుల వంటివనియు, శుకసప్తతిని, కాదంబరిని పోలినది హంసవింశతి యనియు వక్కాణించెను. నిఘంటువునకు ప్రమాణముగ ఇటలీభాషయందు, పర్షియన్, హిందూస్థానీలయందు రచింపబడిన కొన్ని కావ్యముల వంటిదే హంసవింశతి యని వచించెను హంసవింశతిలోని కథావిషయము బొకాషియో (*B*occacio) రచించిన డెకమెరోన్ (Decamarone) తోను పర్షియన్ భాషలోని 'తోతినామ' (Totinama) తోను సరిపోల్చుచున్నదని బ్రౌను వ్రాకు చ్చెను.[2]

5 1. 4. ద్వితీయ సంపుట ఉపోద్ఘాతమున బ్రౌను "N. B. - That దుస్సంధి, అఖండయతి and అన్యదేశపదములు perpetually occur in this book, the author having in such cases sacrificed elegance to utility" అని గమనిక నొసగెను [3]

5. 1. 5. బ్రౌను కొన్ని పద్యములకు తెలుగులో ప్రతిపదార్థమును వ్రాసెను.

1. D. 912 I vol.
2. Ibid
3. D. 912 II Vol.

ఉదా –

౧ ౨ ౩ ౪ ౫ ౬

తే॥ తరణి తురగ ఖురోద్ధూత చరమశైల

౭ ౮

గైరిక స్థల పాంసువుల్ గప్పెననఁగ

౧౦

పశ్చిమంబునఁ గుంకుమ పంకమట్టుల

౧౨ ౧౩

సాంధ్యరాగంబు మించె నిస్తంద్రమగుచు.

వ్రా॥ ప్ర॥ 1-129. *D.* 912, I vol. ము॥ ప్ర॥ 1-116

౧ సూర్యుని ౨ గుఱ్ఱపు ౩ గిట్టలచేత ౪ ఎగర చిమ్మబడ్డ ౫ పశ్చిమ ౬- పర్వతమందు ౭ ఎఱ్ఱమంటి స్థలంలో పుట్టి ౮ పరాగము కప్పెను అనగా ౧౦ పడమట దిక్కులో కుంకుమ బురదవలెన ౧౨ సాయంకాలపు ఎఱుపు మించెన అతి జాగ్రత్తగ."

9, 11 అంకెలు పొరపాటున గుర్తింపబడలేదు కాబోలు.

కొన్నింటికి ఆంగ్లమున భావము వ్రాసెను. ఉదా :

ఉ॥ ఆటది నేర్పుతో వగల యందము చందము జూపబూని కో
లాటము వేయుకైవడిని లాలిత దృక్తరళ ప్రభావళుల్
పాటిగ పోగు వెంబడిని పార్శ్వకములంజరియింప వస్త్రముల్
దాటిగనేయు నప్పలుక తట్టున బెట్టు ఖణల్ ఖణిల్లనన్."

వ్రా॥ ప్ర॥ 2-15 ము॥ ప్ర॥ 2-13.

"Like a dancing girl adorned with blooming graces who perforns the circling dance ( the dance in which small sticks are used ) with rolling eye follows the ring of maidens so did the eye of the weaver follow the shuttle, from side to side."

శా॥ పన్నీటన్నయనంబులొత్తి తనువుం బాటీర పంకంబుతో
వెన్నారన్ పదనిచ్చె గీరి శిగనేశెన్ తాయితల్ జుట్టెడిన్

సౌన్నాపట్టె రుమాలుగట్టి జరతాచుట్టంచు డాల్ మించు మే
న్మన్నాసన్నపు దుప్పటంబు దగహాశిన్ గప్పె సొంపారగన్."
బ్రౌ॥ ప్ర॥ 1-79. ము॥ ప్ర॥ 1-75.

పై పద్యమున ద్వితీయపాదాంతమందలి 'జీన్' అను పదమును "జీన్ this certainly the Arabic word i. e. అలంకారం" అని బ్రౌను వివరించెను. సూర్యరాయాంధ్ర నిఘంటువున ఈ పదము హిందుస్థాని పదముగ గుర్తింపబడి 'లంగరు', 'గుఱ్ఱము మీదవేసెడు పల్లము' అను అర్థము లొసగబడి శుకసప్తతి ప్రయోగము చూపబడినది బ్రౌను మిశ్రభాషానిఘంటువునందు ఈ పదమునకు "A saddle పల్లము" అను అర్థము నిచ్చి హంసవింశతిలోని ఈ పద్యమే ఉదాహరింపబడినది. కాని 'అలంకారము' అను అర్థము ఇందుకానరాదు

ఇట్లు తెలుగు పలుకుబడికి కాణాచియనదగు హంసవింశతిని ఉద్ధరించి బ్రౌను ఆంధ్రభాషకు మహోపకార మొనరించెను.

5. 2. పంచతంత్రము :

5 2 0 బైచరాజు వెంకటరాజ ప్రణీత పంచతంత్రము సంస్కృత కావ్యానుకరణమయిన స్వతంత్రకావ్యమనియు, పండితుల ప్రశంసను పొందిన ప్రౌఢకావ్యమనియు బ్రౌను పేర్కొనెను. వెంకటరాజు క్షత్రియుడను విషయమును కూడ గుర్తించెను.[1]

1827వ సం॥న 6 ప్రతుల ఆధారముతో తన పర్యవేక్షణలో దీనికి సంశోధిత ప్రతిని సంసిద్ధపరచినట్లు బ్రౌను తన నిఘంటువులో పేర్కొనెను. ఈ కావ్యము క్రీ. శ. 1500 ప్రాంతమున రచింపబడియుండ వచ్చుననియు, ఇయ్యది మిగుల ప్రచారములో నున్నట్లును తెలిపెను[2] కాని శాసనాధారములను బట్టి వాఙ్మయచరిత్రకారులు ఈ కావ్యరచనా కాలమును 1550 - 60గ నిర్ణయించిరి.[3]

1. P. R. T. L. P. NB. 43
2. బ్రౌణ్య తెలుగు ఇంగ్లీషు నిఘంటు. పుట xviii.
3. ఆంధ్ర కవి సప్తశతి. పుట 242.

5 2. 1. ఈ పంచతంత్రమునకు బ్రౌను 9 కాగితపు ప్రతులను తయారు చేయించెను. వీనిలో కావ్యభాగము మాత్రము గల ప్రతులు మూడు. శేషించినవి వ్యాఖ్యాసహితములు

D 2676 + 5 ఆశ్వాసముల ప్రతి. పుట కిరువైపుల వ్రాయబడినది పద్య, పాద విభజనములతో, పద్య సంఖ్యలతో క్రమముగనున్నది. అచటనచటకొన్ని పదములకు అర్థములు గలవు

D 2677 + ఇది రెండు సంపుటముల ప్రతి. మొదటి రెండాశ్వాసములు ప్రథమ సంపుటము తుది మూడాశ్వాసములు ద్వితీయ సంపుటము. పుటకొకవైపు ననే వ్రాయబడెను. పాఠభేదములు పంక్తులనడుమ గుర్తింపబడెను. తీర్పు పాఠములు ఎదుటి పుటల యందు వ్రాయబడినవి ఇందును పదముల కర్థములున్నవి. బ్రౌను సూచనలు ఒండురెండు స్థలములలో నున్నవి.

D 2678 + పుటకొక ప్రక్కన మూలమును వ్రాసి, ఎదుటి పుటలో పాఠాంతరములు గుర్తింపబడినవి. కొన్ని పదముల కర్థ వివరణములు గలవు.

D 2685 + నాలుగు సంపుటముల సవ్యాఖ్యానప్రతి. మొదటి సంపుటములో ప్రథమాశ్వాస కథావిషయమగు మిత్రభేదములోని కొంత భాగమునకు (1–357 వరకు) టీక కలదు అందే ఆ టీకకు ఇంచుక సవరణ సహితము కలదు. రెండవ సంపుటము మొదటి దానికి పూరణము ప్రథమాశ్వాసము 358 వ పద్యము నుండి తుదివరకు టీక చేయబడెను. ఈ సంపుటమున సవరణలు లేవు మూడవ సంపుటమున ద్వితీయాశ్వాస కథాభాగమగు సుహృల్లాభము, తృతీయాశ్వాస విషయమగు సంధి విగ్రహమును, తట్టీకయును గలవు. ఇందు టీకకు సవరణలు లేవు 4 వ సంపుటమున చతుర్థ పంచమాశ్వాసములగు లబ్ధనాశన, అసమీక్ష్యకారిత్వములు టీకా సహితములుగ కలవు

D 2686 + 3 సంపుటములు. మొదటి సంపుటములో అవతారికాభాగమున్నది. మిత్రభేదము పూర్తిగ వ్యాఖ్యాతమయినది. ఇందలి టీక సవరింపబడి యున్నది. రెండవ సంపుటమున సుహృల్లాభమునకు సంధివిగ్రహములో

కొంతభాగమునకు టీక కలదు. మూడవ సంపుటమున సంధి విగ్రహములో శేషించిన భాగమునకును, లబ్ధనాశన అసమీక్ష్యకారిత్వములకును సంపూర్తిగ టీక చేయబడియున్నది.

D. 2687 + ఇది టీక కలిగిన 2 సంపుటముల సమగ్ర ప్రతి.

D. 2688 + ఇదియు టీక కలిగిన 2 సంపుటముల సమగ్ర ప్రతి

D. 3124 —

D. 3125 + టీక కలిగిన 2 సంపుటముల ప్రతి

D. 3095 పంచతంత్ర పదసూచి.

5. 2. 2. పంచతంత్ర కావ్య పరిష్కరణమున బ్రౌనునకు తోడ్పడిన పండితులెవరన్నది ఇదమిత్థముగ తెలియుటలేదు. ఒకచోట "జూలూరు అప్పయ్య చెప్పుతున్నారు "[4] అని యుండుటచే జూలూరి అప్పయ్య ఈ పరిష్కరణమున పాల్గొనినట్లు ఊహింపనగును.

5. 2. 3. రాయల్ ఏషియాటిక్ సొసైటీ పత్రిక యందు విల్సన్ పండితుని అత్యద్భుత పంచతంత్రముల వివరణము ప్రకటింపబడినదని తెలిపి, బ్రౌను దానిననుసరించి మిత్రభేదము, మిత్రప్రాప్తి, కాకోలూకీయము, లబ్ధప్రణాశనము, అపరీక్షితకారిత్వము అను పంచతంత్రములను ఆంగ్లమున వివరించెను [5] .

కృతికర్తపేరు బైచరాజు వెంగళరాజని పండితులు బ్రౌనుకు చెప్పిరి కాబోలు. కావ్యమున కృతికర్తపేరు వెంకటరాజని యుండగా (1-29) వెంగళరాజని యేల వ్యవహరించుచున్నారన్న సంశయ మాతనికి కలిగెను.

వెంకటరాజు పర్వతరాజు పుత్రుడు. 'బైచ' అనునది వారి ఇంటిపేరు పర్వతరాజు వీరభద్రరాజు పుత్రుడు. వీరభద్రరాజు తిరుమలరాజు కుమారుడు. తిరుమలరాజు బైచరాజు కొడుకు అని వంశవృక్షమును బ్రౌను ఉపోద్ఘాతమున ప్రదర్శించెను [6]

---

4. D. 2678. పత్రము. 258.
5. *D.* 2688.
6. **Ibid.**

5. 2. 4. బుచ్చయ్యశాస్త్రి మరి యిరువురు పండితుల సాహాయ్యముతో 1827వ సం॥ కడపలో ఈ కావ్యమునకు వ్యాఖ్యానమును సమకూర్చెను. 1845వ సం॥న మరికొందరు పండితులు ఈ వ్యాఖ్యానమును సవరించిరి. 185_వ సం॥న మరల ఈ వ్యాఖ్యానమును 3వ పర్యాయము ఇంకను కొందరు పండితులు పరిశీలించిరి. డి॥కి 12-2-1852లో సవ్యాఖ్యాన శుద్ధప్రతి వ్రాయుట పూర్తియయ్యెను[7] బ్రౌను ఈ కావ్యమునకు పదసూచికను కూడ తయారు చేయించెను. కావ్యపరిష్కరణమును గాని వ్యాఖ్యను గాని పదింబడిగ పరిశీలించి చిత్తికను పట్టుట బ్రౌనుకు పంపెటి.

## 5. 3. శుకసప్తతి :

5. 3. 0. ఆంధ్రుల జాతీయ జీవితమునకు దర్పణమై, శృంగార రసోల్లసిత కథావిలసితమై, సరసకవితాధోరణితో, జాతీయములతో నొప్పుచున్న శుకసప్తతి బ్రౌను నత్యంత మాకర్షించెను. ఈ ప్రశస్త ప్రబంధకర్త పాలవేకరి కదిరీపతి, ఈతని కాలము క్రీ. శ. 1650 ప్రాంతమని సాహిత్యవేత్తల నిర్ణయము.[1]

శుకసప్తతిలో వ్యావహారిక భాషప్రయుక్తమగుటచే దీనిని అవశ్యము ప్రకటింప దగిన గ్రంథముగ బ్రౌను పరిగణించెను. "This is very rare and merits publication as abounding in common colloguial expressions"[2]

ఈ ప్రబంధమునకు బ్రౌను వ్రాసిన ఉపోద్ఘాతము ఆంగ్లభాషలో నున్నది. అందిట్లు కలదు : శుకసప్తతి తెలుగుమాండలికములను ప్రకటించు కథల సంపుటి. అతి కష్టముపై ఈ అపూర్వ గ్రంథమునకు 5 అసంపూర్ణ ప్రతులను సంపాదించి, వానిని సంప్రతించి శుద్ధప్రతిని తయారు చేయించితిని. ఇది ఉత్కృష్టకావ్యమైనప్పటికి ఆంధ్రభాషాభిమానము తక్కువగ నుండి రాజావలంబనములేని కాలములో రచింపబడుటచేత దీనికి సమగ్రమైన ప్రతులు లేకపోయినవి. ఇది ప్రసిద్ధ సంస్కృత శుకసప్తతికి సరియైన భాషాంతరీకరణముకాదు. దాని ననుసరించి వ్రాయబడిన అసమగ్ర గ్రంథము. దీనిని బట్టి చూడ కవియే దీనిని పూర్తిచేసినట్లు తోపదు. ఇందు డెబ్బది కథలు లేవు.

---

7. D. 2686.

1. శుకసప్తతి పీఠిక. పుట xxxii.

2. D 836

వివిధ ప్రతులందు పరస్పర విరోధములు పెక్కులుగలవు పాదపాదములకు పాదములే మార్పులుండుటచేత నేది శుద్ధ పాఠమో నిర్ణయించుట కష్టము.

హంసవింశతియును నిట్టి గ్రంథమే. ఈ రెండు కావ్యములలో అనేక పద్యములకు పోలిక యుండుటచే ఏదోయొకటి రెండవదాని నుండి గ్రహించియుండవలెను

ఈ గ్రంథమును పరిష్కరించుటలో బహుసమర్థుడగు జూలూరి అప్పయ్య సాహాయ్యము చేసెను హంసవింశతి యందు శుకసప్తతికంటె నెక్కుడు జాతీయమైన పలుకుబడులున్నప్పటికి శుకసప్తతియే మృదుమధుర శైలియందు ఉత్కృష్టతరమైనదని అప్పయ్య అభిప్రాయము.

అప్పయశాస్త్రి యీ గ్రంథము అసమగ్రముగ నుండుటచే దీనికి సప్తతియను పేరుగాక త్రింశత్తు అను పేరు పెట్టిన బాగుండునని సూచించెను.

కదరీపతి నాయకునకు నూరేండ్ల తరువాతి వాడయిన అయ్యలరాజు నారాయణామాత్యుడు హంసవింశతిని రచించెను. కాన నారాయణాచార్యుడే శుకసప్తతి ఒరవడిగ మరికొన్ని విశేషములతో హంసవింశతిని రచించ యుండవలెను.

5. 3. 1. *D*. 834, 835, 858 అనునవి తాళపత్రములు. ఇందు *D*. 834 ప్రతిలో **"This contains stories that are not in the edition prepared in 1832, 1839"** అను బ్రౌను లేఖన ముండుటచే ఈ ప్రతి బ్రౌను సేకరించినదని చెప్పనగును. కాగితపు ప్రతులు 3. అవి :

**D.** 833 — ఇందు 3 ఆశ్వాసములు సమగ్రముగా, 4వ ఆశ్వాసమున 130 పద్యముల వరకు కలదు. అవతరిణికలేదు. పుటకిరువైపుల వ్రాయబడెను. పద్యపాద విభజనములతో, పద్యసంఖ్యలతో నున్నది. పుటకు ప్రక్కలందు విషయసూచనలు వ్రాయబడెను ఇందు 21కథలు కలవు గ్రంథాంతమున 27 పుటలలో కథల విషయసూచి పుటల సంఖ్యలతో నున్నది.

*D*. 836 — అవతారికలేదు. చతుర్థాశ్వాస మధ్యమున నిలిచిపోయినది. పుటకిరువైపుల వ్రాతయున్నది. ఇందును కథావిషయ సూచి కలదు. **D.** 833 ప్రతి కిది పుత్రిక కానోపును. **D.** 833 చిత్తుప్రతి. ఇది శుద్ధప్రతి దీనిని బ్రౌను 1831వ సం॥న వ్రాయించెను.

*D*. 837 — అవతారిక తక్క మొదటి మూడాశ్వాసములు ఒక్కొక్కటి ఒక్కొక్క సంపుటముగ సంతరింపబడి యున్నవి. మొదట ఈ సంపుటములు పత్ర మున కొక ప్రక్కగాని, పత్రము విడిచి పత్రము మీదగాని వ్రాయబడి యున్నవి. పాఠభేదములు పంక్తుల నడుమ గుర్తింపబడి యున్నవి. పాఠ భేదములున్న సుదీర్ఘపాదములు వ్రాయసి ప్రక్కల వ్రాసిరి. ఈ ప్రతి ప్రారంభములో "౧౮౩౧ సంవత్సరములో జూలూరు అప్పయ్యశాస్త్రి యేర్పరిచిన తర్వాత ౧౮౩౪ సం॥ దొరికిన పుస్తకమందు బైలుదేరిన భేద ములు (...) అడ్డంగావుండే కాకితాలమీద వ్రాయడమైనది" అను లేఖనమున్నది. ఈ ప్రతియందే బ్రౌను ఉపోద్ఘాతమును వ్రాసెను.

శుకస ప్తతికి బ్రౌను మధురలో నొకప్రతిని, తిరుచునాపల్లిలో నొక ప్రతిని సంపాదించెను. మధుర ప్రతిలో నున్న అధిక పద్యములు 4 వ ఆశ్వాసమున చేర్ప బడెను (D 838) *D* 837 ప్రతిలో తిరుచునాపల్లి ప్రతి ప్రస్తావన కలదు.

ఆంధ్రదేశమున అవుదాండ్ల అప్పయ్య దగ్గర మరొక ప్రతి యున్నదని 1832 వ సం॥న కృష్ణారెడ్డి బ్రౌనునకు తెలుపగా ఆ ప్రతిలో తాను అంతకుక్రితము వ్రాయించిన ప్రతిని పోల్చి చూడుమని బ్రౌను కృష్ణారెడ్డిని నియమించెను.[1] ఈ ప్రతులను వారు పోల్చిచూచి యుందురు.

మరికొన్ని అధిక పద్యములు గల ప్రతి 1839 వ సం॥న తనకు లభించినట్లు బ్రౌను ఉపోద్ఘాతమున ఉటంకించెను. పరిష్కరణము పూర్వకావ్యముల పద్ధతిలోనే కొనసాగెను.

5. 3. 2 అవశ్యము ప్రకటన యోగ్యముగ బ్రౌను పరిగణించిన ఈ ప్రశస్త ప్రబంధమును అనంతరకాలములో వావిళ్ళవారు అభిరామముగ ముద్రించిరి. వారి ముద్రణకు బ్రౌను తయారు చేయించిన శుద్ధప్రతి ఉపకరించెను.

## 5 4. సింహాసన ద్వాత్రింశత్తు :

5. 4. 0 సంస్కృతాంధ్రములందు తన కాలమున ప్రచారములోనున్న ద్వాత్రింశత్సాలభంజకల కథల ననుసరించి కొఱవి గోపరాజు 12 ఆశ్వాసముల

1. Sr. of. Lt. M. 411. P. 20

సింహాసన ద్వాత్రింశత్తను కథాకావ్యమును రచించెను ఈ కథాకావ్యమునకు బ్రౌను 1842 వ సం॥న పరిష్కృత నూతన ప్రతిని తయారు చేయించెను.[1]

**D.** 882 + 114 పత్రములు వరకు (4 ఆ 127 ప వరకు) కాగితమున కొక ప్రక్కనే గ్రంథము వ్రాయబడెను. తరువాత వ్రాత రెండుప్రక్కలకలదు వ్రాయని ప్రక్కలలో కొన్నింట పాఠభేదములును బ్రౌనుగారి టిప్పణు లును ఉన్నవి. పెక్కు పాఠభేదములు పద్యపాదముల నడుమ సిరికింప బడినవి. అవి అక్కడక్కడ ప్రత్యేక కాగితపు చీలికలమీద కూడ వ్రాసి అతికింపబడినవి. 11 వ ఆశ్వాసాంతమున బ్రౌను 19-9-1842 నాటికి 11 ఆశ్వాసముల వరకు ఇతరప్రతులతో పోల్చి చూచినట్లు గుర్తించెను. ఇందు 6 ఆశ్వాసములకు మాత్రము బ్రౌను వ్రాసిన కథాసంగ్రహము కలదు.

**D.** 885 + కృత్యవతరణిక మాత్రము లేదు. గ్రంథావిలో "తెలుగు సాపు మొదటి ప్రతి. సింహాసన ద్వాత్రింశతి సూచితో సం॥ శి- ౨౨" అని వ్రాయ బడియున్నది. పత్రమున కిరువైపుల పద్యపాద విభజన మున్నను, వచన మువలె నడుసగ వ్రాయబడెను. పద్యసంఖ్య యున్నది. ఈసాపుప్రతి 1842 సం॥ నవంబరు 30వ తేది నాటికి ముగింపబడినట్లు బ్రౌను వ్రాసెను గ్రంథాంతమున 43 పుటలలో ఈ గ్రంథకథాసంగ్రహము కలదు అది 1842వ సం॥ డిసెంబరునెల 29వ తేదినాటికి పూర్తిచేయ బడినది.

**D.** 884 + కృత్యవతరణిక మాత్రము వ్రాయక విడువబడెను. పూర్వప్రతులకిది తీర్పుప్రతి. అనేక పాఠాంతరములుండ అందొక దానిని తాము తీర్పు పాఠముగ గ్రహించుటకుగల కారణములను పరిష్కర్తలు వివరించిరి.

ఉదా :

(i) "గణభంగముగా - జనులెల్ల - జనులకెల్లయని యుంటే - జనులకు నెల్లయని వ్రాయదమైనది.

---

1. **"This edition was duly corrected by the editor Narasimhachari under by directions, in the year 1842" (D. 884)**

(i) "గణభంగముగా - జననంబగు యని యుంటే-
జననంబునగు యని వ్రాయడమైనది."

ఇదియు పూర్వప్రతివలె పద్యవిభజనము, పాదవిభజనమునన్ను వచనమువలె వరుసగ వ్రాయబడెను.

ఈ ప్రతి 1843వ సం॥ మేనెల 5వ తేది నాటికి ముగిసినది.

5. 4. 2. సింహాసన ద్వాత్రింశత్తును (సింహాసన ద్వాత్రింశిక) నరసింహాచారి బ్రౌను ఆదేశానుసారము 1842వ సం॥న పరిష్కరించెను. ఈ పరిష్కరణ మున నరసింహాచారి తన సవరణలకు కారణములను తెలిపెను.

ఉదా :

i) ఉ॥ అంబుజ మిత్రతేజ భవదగ్ర ఖరప్రకృతంబులైన దా
నాంబువులందు బుట్టి భువనాంతము నిండుచుగీర్తిపుండరీ
కంబు ప్రతాప సూర్యుడు వికాసమొనర్పగ నాకసంబు భృం
గంబుగ లోనబూని యధికంబగు వాసన నొప్పునెప్పుడున్.

ము॥ ప్ర॥ 2-50 వ్రా॥ ప్ర 2-49

ఈ పద్యము క్రింద "దానంబువులు యని సంధి భంగముగాయుండె దానాంబువులని వ్రాయడమైనది" అని ఉన్నది.

ii) "ఎట్లులైన నీకు నెరిగింతు నడుగుము..." (వ్రా॥ప్ర॥ 5-25) అను పద్యము క్రింద "యత్యర్థభంగముగా అట్టియైనా యుంటే - ఎట్లులైనా యని వ్రాయడమైనది" అని కలదు. ముద్రిత ప్రతిలో "ఎద్దియైన నీకు నెఱిగింతు నడుగుము" అని యున్నది. (5-23)

5. 4. 3. బ్రౌను సూచించిన సవరణలును అక్కడక్కడ కలవు. ఉదా :

న్ బ్రా లున్
పూనిన రీతి రాని తలపుల్ వడిప్రాసముల్ జలంబునన్

బా గ ర్చ చ
గాన గిలంగి నీడ్చియొక పద్యము గూర్పగ వచ్చుగాక యా

ఖ్యాన కథానుకూలముగ గావ్యము చెప్పవశంబె సన్నుతిన్
కాన గణింపనేర్చిన యునది కలుగు పుట్టుమునేయ నేర్చునే

బ్రా॥ ప్ర॥ 1-20 ము॥ ప్ర॥ 1-20

ఈ పద్యమునకు ఎదురుగా "పానగిల్లుట అనగా సంకోచించుట-యిక్కడ కానగిలంగ అని అంటె యతిభంగం గన్క-అది కూడదు -॥ బానిసెగాగ అని వుండగలదా. C. P. B." అని బ్రౌను సూచించెను.

సింహాసన ద్వాత్రింశత్తు శైలియందు కొన్ని స్ఖాలిత్యములున్నను, ఈ కావ్యము పండితాదరమును పొందినదని, దీనిని తన నిఘంటువున 'G' అను సంజ్ఞతో గుర్తించితినని బ్రౌను తెలిపెను.

ఇందలి కథలు అధికభాగము అర్థరహితమైనవనియు. బ్రాహ్మణుల అసాధారణ సాధుశీలతను ప్రదర్శించునవి యనియు బ్రౌను పేర్కొనుట చింత్యము.[2]

ప్రకరణ సారాంశము :

1. బ్రౌను 8 కథాకావ్యములను సేకరించెను వానిలో నాలుగింటిని పరిష్కరించెను. తక్కిన నాల్గింటికి కాగితపు ప్రతులు వ్రాయించెను.

2. ఈ కథాకావ్యములందు వ్యావహారిక పదములు ప్రచురముగ ప్రయుక్తమగుటచే అవి బ్రౌనును మిక్కిలి ఆకర్షించెను. కాన ఈ కావ్యములు తప్పక పరిష్కరించి ప్రచురింప దగినవిగ అతడు పరిగణించెను.

3. ఈ కథాకావ్యములలో హంసవింశతి, పంచతంత్ర, సింహాసన ద్వాత్రింశికల నుండి అనేక పదములను తన నిఘంటువున గ్రహించెను. బృహద్గ్రంథము లగు భారతేతిహాసమునకు వలె, ప్రౌఢ ప్రబంధములగు మనుచరిత్రాదులకు వలె పంచతంత్రమునకును బ్రౌను వ్యాఖ్యానమును సమకూర్చుట విశేషము.

2. "The style of the poem is much admired but most of the stories are deplorably silly and all turns upon the prodigious sanctity of Brahmins Many are nasty enough, though not nearly so filthy as the stories in the Mahabharat and the Bhagavat" (D. 884)

4. పంచతంత్ర, హంసవింశతులకు పదసూచికలను కూడ సంతరించెను.

5 సింహాసన ద్వాత్రింశిక, కథాసారమును ఆంగ్లమున 43 పుటలలో సంగ్రహించెను.

6. శుకసప్తతికి కథాంశములను సూచించు విషయసూచిక నొసగెను.

7. హంసవింశతిలోని కతిపయ పద్యములకు తెనుగున ప్రతిపదార్థమును, ఆంగ్లమున భావమును బ్రౌను వ్రాయుట ఈ కావ్యమునందాతనికి గల మక్కువను చాటును.

8. భారత, భాగవతాది పురాణములను, మనువసు చరిత్రాది ప్రబంధములను ఆంధ్రులధికముగ అభిమానించెడివారు. వానికే విశేషప్రచారము కలదు. ఈ కథాకావ్యముల ప్రశస్తిని గుర్తించినవారు అరుదు. అట్టి యెడ బ్రౌను ఆ ఉద్గ్రంథములతో సమముగా ఈ కథాకావ్యములను పరిగణించి వీనిని కూడా పరిష్కరించుటయే కాక వీనియందలి భాష ప్రజావ్యవహారమునకు సన్నిహితమగుటచే నివి అవశ్యపఠనీయ కావ్యములని ప్రకటించుట అతని సునిశిత పరిశీలనా పరిశోధనలకు తార్కాణములు. మూలనుండిన ఈ కథాకావ్యములను బహిర్గత మొనర్చిన గౌరవము బ్రౌనుదొరకు చెందును.



# 6

# ద్విపదల పరిశీలన

60. ఆంధ్ర సాహిత్య ప్రక్రియలలో ద్విపదలపై బ్రౌనుకు మక్కువ మెండు. భాష నలవరచుకొనగోరు వారికి తదితర పద్యకావ్యముల కన్న ద్విపదలు సులభశైలిలో సుకరముగ నుండునను అభిప్రాయమును ఆతడు పలుతావులలో వెలిబుచ్చెను[1] పద్యకావ్యములు సుదీర్ఘసమాసములతో సంస్కృతపద భూయిష్ఠము లగుటచే కఠినములు. ద్విపదలు కదళీద్రాక్షాపాకములలో సరళశైలిలో రచితములగుటచే నాతి కఠినములు. ఇంచుమించు ద్విపద కావ్యకర్తలందరు బ్రాహ్మణేతరులు దాదాపు పద్య కావ్యములన్నియు బ్రాహ్మణ రచనలు. అయినను వానిలో వసుచరిత్ర అపవాదము. వసుచరిత్ర కారుడైన భట్టుమూర్తి శూద్రుడు అని బ్రౌను తెలిపెను.[2]

ద్విపదలు బ్రాహ్మణేతరుల రచనలు అను అభిప్రాయము బ్రౌనునకు ప్రబలముగనుండెనని తోచుచున్నది. జంగములచే ప్రామాణిక మత గ్రంథముగ పరిగణింపబడు బసవపురాణమును గురించి వ్రాయుచు బ్రౌను అందలి కథలన్నియు అద్భుత గాథలనియు, అవి బ్రాహ్మణులు వచించు పుక్కిటి పురాణములు వంటివి కావనియు, అసంగత విషయ పూరితములు కావనియు నుడివెను.[3]

---

1. (i "The absence of these and other pedantries remders the poems written in couplets much more agreeable to a foreigner : who will value them for that simplicity which is a fault in the estimation of learned bramins." – Es. on Tel. Lit. Para – 63.

   (ii) "This volume is peculiarly well adopted to the use of those who are begining the study of Telugu."— D. 951.

   (iii) "The Prabhu Linga Lila-A Telugu poem useful to beginners in the Language. D. 953.

2. Es. on Tel. Lit. Para. 63.

3. The next legends are yet more marvellous; but they certainly have their negative merit, that they are free from the foulness of the braminical legends, and we find more of the curses therein inflicted, as absurd as they are cruel.

   — Account of the Basava Purana.

బ్రౌను 41 ద్విపద కావ్యములను సముద్ధరించెను. వీనిలో పదుమూడింటిని పరిష్కరించెను. ఒక్కదానికి పాఠాంతరములను గుర్తించెను. ఇరువదియేడింటికి కాగితపు ప్రతులను తయారు చేయించెను. పరిష్కరించిన పదుమూడింటిలో పది యిట పరిచయ మొనర్పబడుచున్నవి.

## 6. 1. సారంగధర చరిత్ర :

**6. 1. 0.** "**The Adventures of Prince Sarang Dhara a popular Telugu Romance**" అని బ్రౌను బాణాల శంభుదాస కవికృత ద్విపద సారంగ ధర చరిత్రను ప్రశంసించెను. ఈ ద్విపద కావ్యమును 1827వ సం॥ననే బ్రౌను పరిష్కరించెను. గ్రీకు పురాణములోని 'ఫోద్రా' (Phodra), హిప్పోలిటస్ (Hippolitus) ల గాథకు ఈ సారంగధర చరిత్ర సన్నిహితముగ నున్నదట ఇట్టివే మరి కొన్ని గాథలు గ్రీకు భాషలోను, ఆంగ్లభాషలోను బైరన్ మహాకవి వ్రాసిన 'పరిసిన' (Parisina - verse 255) అను కృతియందును కలవట. వీనన్నిటిలో అతి ప్రాచీన మైనది బైబిలు నందలి యోసేపు (Joseph), పొతీఫరు భార్యల (Patippar's wife) ఇతివృత్తము అని తెలిపెను. ఇతర భాషా కావ్యములందలి సామ్యములను పేర్కొనుటలో బ్రౌను సమర్థుడు. ఇది అతని బహుభాషా కోవిదత్వమును, బహు పుస్తక పరిచయమును ప్రదర్శించును [4]

6. 1. 1. ఈ కావ్యమునకు బ్రౌను 10 కాగితపు ప్రతులను వ్రాయించెను. 5 తాళపత్ర ప్రతులను సేకరించెను.

D. 1193 + 1827లో జాగ్రత్తగ పరిశీలించి, సవరింపబడిన ప్రతియిది యని బ్రౌను తెలిపెను

D 1195— చివరి 17 పంక్తులు మాత్రమిందులేవు. శేషించిన గ్రంథభాగమం తయు కలదు. పాఠభేదములు బంతుల నడుమను, ప్రక్కలను చేర్పబడినవి సుదీర్ఘములైన అధికపాఠములు 13 పుటలలో గ్రంథాంతమున చేర్పబడినవి ఈ ప్రతిని బ్రౌను 1840లో తయారు చేయించెను. 1827 వ సం॥ తరువాత లభించిన ప్రతులలోని పాఠములాధారముగ నిది పరిష్కృతము.

---

4. D. 1193.

ఇందు 1827లో పరిష్కరించిన మూలగ్రంథమునే ప్రధానముగ గ్రహించి నూతన పాఠములను పంక్తులనడుమ గుర్తించినట్లు బ్రౌను సూచించెను.

D 1198 + 1841వ సం॥ డిసెంబరు 1వ తేదీన బళ్లారి పోస్టుమాస్టర్ గారైన లేంబ్ (Mr. Lamb) దొరగారు ఈ ప్రతిని బ్రౌనుకు పంపిరి. దీనిని బెంగుళూరు మిషన్ సొసైటీకి చెందిన బెంజ్ రైస్ (Benj Rice) అను మిషనరీ దొరగారు లేంబ్ దొరగారికి పంపిరి. బెంజ్ దొరగారు తనకు తెనుగుభాషతో పరిచయము లేదనియు, తన కన్నడ మున్షీ ఈ ప్రతిని సేకరించినట్లును, అతనికి తెలుగు తెలియునుగాన ఈ ప్రతిని పరిశీలించి ఇది నిర్దోషమైనదని చెప్పినట్లును లేఖను వ్రాసిరి. లేంబ్ దొరగారు దీనిని బ్రౌనునకు బహూకరించినట్లున్నది. ఇది చేరిన తరువాత బ్రౌను ఇందలి పాఠములతో పై D 1195 ప్రతిని పరిశీలించెను D 1195 ప్రతిలో అనేకస్థలములందు బళ్ళారి ప్రతి ప్రస్తావనకానవచ్చును. ఇది కన్నడ ప్రాంతములందు లభించినది గనుక నిందలి వ్రాత కన్నడపు మోడితో కానవచ్చును.

D 1205 + గ్రంథాదిని 'దిద్దినప్రతి చూచి వ్రాశినది' అని యున్నది. దీనిని 10-5-1842లో వ్రాయనారంభించి 24-5-1842 లో ముగించిరి

D 1200 + 1840వ సం॥న పరిష్కరింపబడిన ప్రతికిది సాపుప్రతి కానోపును. దీనిని 14-5-1842న ప్రారంభించి 25-5-1842 నాటికి పూర్తి యొనర్చినట్లు బ్రౌను గుర్తించెను.

D 1201, D 1204 + ఇవి రెండు 1840 లో పరిష్కరించిన ప్రతికి సాపుప్రతులుగ తోచును. ఈ ప్రతులను వ్రాయించిన కాలము గుర్తింపబడలేదు. D 1201 లో 3వ భాగమున 260వ ద్విపద పాదముకడ "ఇక్కడ ౧౦ చరణములు దొరగారి ఆజ్ఞప్రకారము విడిచినాము." అను వ్రాత కలదు. అవి ప్రక్షిప్తములను ఉద్దేశముతో బ్రౌను ఆ పంక్తులను తొలగించి యుండును. గ్రంథాంతమున బ్రౌను ఇందు మొత్తము 2756 పంక్తులున్నట్లు గుర్తించెను.

D 1206— బ్రౌను సారంగధర చరిత్రకు టీకను వ్రాయింప నారంభించిన ప్రతి. సారంగధర చరిత్ర ప్రథమభాగమునకు వాడుక భాషలోనున్న టీక యిది. ఈ ద్విపదకావ్య మందలి శైలి సులభముగాన బాషను నేర్వపూనుకొను వారికిది ప్రయోజనకారియని, తన పండితులలో నొకవృద్ధ బ్రాహ్మణుడు తన కోరిక ప్రకారము ఈ టీకను సమకూర్చెనని బ్రౌను తెలిపెను.

D. 1202 + సటీకము. దీసి వ్రాత 1843వ సం॥ జూన్ 22వ తెది ప్రారంభింపబడి 1843 వ సం॥ సెప్టెంబరు 28 వ తేది నాటికి పూర్తిచేయబడినది.

D. 1203 + సటీకము. పైప్రతిని చూచి యిది మరల వ్రాయబడినట్లున్నది ఈ ప్రతి లేఖనము 1843వ సం॥ సెప్టెంబరు 16వ తేదీన ప్రారంభింపబడి 1843వ సం॥ నవంబరు 23వ తేదీన ముగింపబడినది

6. 1. 2. బ్రౌను ఈ ద్విపద కావ్యమును గూర్చి—

"శంభుదాసు కవి కృత ద్విపద సారంగధర చరిత్ర గౌరన చెప్పిన నవనాథ చరిత్ర మందొక భాగము మాత్రమే. నవనాథ చరిత్రమున ఈ కథ చక్కటి శైలితో కూర్చబడెను. శంభుదాసుని కావ్యములో ఆ కథ పెంపు వహించినను నింపుగలేదు. ఈ కవి గౌరనను పేర్కొనకయే, ఆతని నవనాథ చరిత్రము నుండి అనేక పంక్తులను యథాతథముగ గ్రహించెను.

గ్రంథాంతమున ఈ కవి చేమకూర అప్పనకవి చెప్పిన గ్రంథము ననుసరించి తానీ గ్రంథమును రచించినట్లు చెప్పెనుకాని, గౌరన పేరునుగాని, ఆతని నవనాథ చరిత్రమును గాని పేర్కొనలేదు "[5] అని తెల్పిరి.

చేమకూర వేంకటకవి రచించిన సారంగధర చరిత్ర కలదుగాని, అప్పనకవి కృతి కానరాదు.

6. 1. 3. 1841 వ సం॥ బ్రౌను గుండవరపు కృష్ణయ్యకు వ్రాసిన లేఖలో "ఇంక కొన్నాళ్ళలో సారంగధరచరిత్ర ద్విపదను అచ్చువెయించడంకు వుద్యుక్తులైనాము" అని వ్రాసెను [6] కాని ఈ ముద్రణ కార్యరూపమును ధరించినట్లు లేదు.

చేజిక్కిన ప్రతి తెలుగు తాళపత్ర గ్రంథమును సంస్కరించి, ముద్రింపవలయుననెడి ఉదాత్తాశయము విదేశీయుడైన బ్రౌనునకుండుట ప్రశంసనీయము.

---

5. D. 1201

6. Sr. of Lt. M. 418. P. 336.

## 6. 2. హరిశ్చంద్ర చరిత్ర :

6. 2. 0. బ్రౌను ముద్రించి, ప్రకటించిన ద్విపదలలో గౌరన హరిశ్చంద్ర చరిత్ర యొకటి. గౌరన కావ్యముల పట్ల బ్రౌనునకు ప్రత్యేకాభిమానము. అతని నవనాథ చరిత్రను సంస్కరించుటయే కాక అంపలి తృతీయాశ్వాసమును మాత్రము ముద్రించెను. స్కాంద పురాణాంతర్గతముగా సంస్కృత భాషలోనున్న హరిశ్చంద్రో పాఖ్యానము ననుసరించి యీద్విపద ప్రబంధము రచితము

6. 2. 1. ఈ ద్విపద హరిశ్చంద్ర చరిత్రకు బ్రౌను వ్రాయించిన కాగితపు ప్రతులు 9. వీనిలో 3 మూలగ్రంథము మాత్రము కలవి. 6 టీకా సహితములు.

*D* 1210 + పాఠభేదములు పెక్కులు పంక్తుల నడుమ గుర్తింపబడినవి. కొన్ని నిర్దుష్టపాఠములు ప్రక్కలందును వ్రాయబడెను ఈ కాగితపుప్రతి 1827 వ సం॥న తయారుచేయబడెను. విభిన్న పాఠాంతరములుగల యీచిత్తు ప్రతియే 1841వ సం॥న తాను ముద్రించిన హరిశ్చంద్ర చరిత్రకు మూల మనియు ఆ ముద్రితప్రతి పాదసంఖ్య లిందు ప్రతిపుట పైభాగమున సూచింపబడినదనియు బ్రౌను తెలిపెను

D 1209 + పూర్వభాగమని, ఉత్తరభాగమని ద్విధావిభక్తము. 2, 900 ద్విపద లున్నవి. పై ప్రతి కిది సాపు ప్రతి 'హరిశ్చంద్రకథ – ద్విపద. దిద్దిన ప్రతి' అని 'మొఖాపిలా అయినది' అని యిందు సూచితము.

*D* 1211— పూర్వభాగము పూర్తిగ, ఉత్తరభాగమున 190 ద్విపదలు మాత్రమున్నవి

D. 1219— సటీకము. గ్రంథావతరణికలేదు. కథాది నుండి ఉత్తరభాగమున కొంత వరకు కలదు. ఇంచుమించు 620 ద్విపదలును వాని టీకయు నుండవలసిన పత్రము లిందు సంపుటీకరణముననే చేరలేదు. టీక సవరింపబడినది. ఈ టీకను 21-1-1845 వ సం॥న ప్రారంభించినట్లున్నది. ఇది 2-7-1845 న పూర్తిఅయినట్లు బ్రౌను తెలిపెను.

D. 1220— టీకా సహితము. గ్రంథావతారికయు, పూర్వభాగాంతపు ద్విపదలును కొరవడిన ప్రతి 15-11-1845న ఈ టీకా రచనను తొడగి 26-5-1846 న ముగించిరి.

D 1217— అవతారిక తక్క తక్కిన గ్రంథమున కంత టీక కలదు. ఈ ప్రతిని 17-11-1845 న వ్రాయుటకు మొదలుపెట్టి 9-8-1846 న పూర్తి యొనర్చిరి.

D. 1216— సటీకము. అవతారికాభాగము లేదు. పూర్వభాగమున కొంతవరకు మాత్రమే కలదు. ఈ టీకా రచనను 18-8-1846 న మొదలుపెట్టి 3-9-1846 న ముగించిరి. ఇది 'సాఫుప్రతి' యని పేర్కొనబడెను.

D 1218— సటీకము. పూర్వభాగములో కొంతభాగమునకు మాత్రమే టీక కలదు. ఈ ప్రతి రచనాకాలము గుర్తింపబడలేదు.

D 1221— అవతారిక వినా, పూర్వోత్తరభాగములకు టీక కలదు. ఈ టీకను 31-5-1851 న వ్రాయనారంభించి 20-8-1851 న ముగించిరి.

6. 2 2. హరిశ్చంద్ర చరిత్ర సపరణకు బ్రౌను ఎన్ని ప్రతులను సేకరించెనో తెలియదుగాని ౨౯౮, ౬౦, ౨౦౦. సంఖ్యలు గల తాళపత్రప్రతులను సంప్రతించినట్లు పై కాగితపు ప్రతులలో నటనట సూచితము. ఈ కావ్య పూర్వభాగమును అతని పండితుడైన వెంకట నరసయ్య తీర్చుచేసెను.[1] ఉత్తరభాగమును కూడ నరసయ్యయే పరిష్కరించి యుండవచ్చును.

ఈ కావ్య టీకా కర్తయు తెలియుట లేదు.

ఈ ద్విపదకు బ్రౌను ఆంగ్లమున 4 పుటలలో కథా సంగ్రహమును సమకూర్చెను.[2] ఈ గ్రంథమును నాతడు 1841 వ సం॥న ముద్రించెను.

## 6. 3. ప్రభులింగలీల :

6. 3. 0. చామరసు అను కన్నడకవి కన్నడభాషలో రచించిన గ్రంథము ననుసరించి పిడుపర్తి సోమనకవి ప్రభులింగలీలను తెనుగున ద్విపద కావ్యముగ రచియించెను. అల్లమ ప్రభువను శైవాచార్యుని చరిత్రము ప్రధానముగాను తదితర శైవాచార్యుల చరిత్రములు ప్రసక్తాను ప్రసక్తములుగాను ఇందు అభివర్ణితములు.

1. D. 1211.
2. D 1217 పత్రము. 353 - 354

6. 3. 1. ఈ కావ్యమునకు బ్రౌను 9 కాగితపు ప్రతులను తయారు చేయించెను కాలానుక్రమణిక ననుసరించి యా ప్రతుల వివరములు :

**D** 953 + అయిదు ప్రతులలోని పాఠభేదములు గుర్తింపబడిన ప్రతి ఇందు మద్రాసు, మెకంజీ లైబ్రరీలో లభించిన ప్రతులలోని పాఠములు కూడ గుర్తింపబడినవి. పద్యపాదముల నడుమనే కాక కొన్ని పాఠాంతరములు వేరుగ కాగితపు తునుకలపై వ్రాయబడి నడుమ నడుమ అదికింపబడినవి. తాళపత్ర ప్రతులందలివే కాక కర్ణాకర్ణిగ వినిన పాఠములచు కూడ బ్రౌను గుర్తించినట్లు పేర్కొనెను : "యిందులో నేను పాఠభేదములు తగిలించినాను సరె. వక గ్రంథములో వుండకుండా మనుష్యులు చదువగా నా చెవిలో పడ్డది." ఈ ప్రతి తయారు చేయించిన కాలము తెలియదు కాని 1839 వ సం॥న వ్రాయింప బడిన శుద్ధప్రతి కిది మాతృకయని బ్రౌను తెలిపెను. విషయసూచికలు అచటనచట పుటల ప్రక్కలందు కలదు.

**D** 952 + 1839 వ సం॥న బ్రౌను ఆజ్ఞానుసారము చిలకమఱ్ఱి నరసింహాచారి పరిష్కరించిన ప్రతి అక్కడక్కడ సంస్కరణములు, లఘుటిప్పణులున్నవి. కొన్నిచోట్ల బ్రౌను ఆంగ్ల వివరణములున్నవి.

ఈ గ్రంథమందలి యితివృత్తము సంగ్రహముగ తెనుగు, ఇంగ్లీషు భాషలలో వ్రాయబడినది. తెనుగున 38, ఆంగ్లమున 30 పుటలున్నవి.

**D** 950 + పై పరిష్కరణానంతరము లభించిన నూతన ప్రతులలోని పాఠభేదములు గుర్తింపబడిన ప్రతి.[1]

**D** 951 + **D**. 950 ప్రతినే బ్రౌను పునః పరిశీలించి, సవరించి, వివరణములతో ఈ నూతన పరిష్కృత ప్రతిని 1839 లో సిద్ధముచేసెను. ఇందు 1840 వసం॥న అక్టోబరులో లభించిన ప్రతిలోని పాఠభేదములు పంక్తుల నడుమ గుర్తింపబడెను.

---

1. **"The Prabhu Linga Lila with various readings found in several manuscripts and recorded under the directions of C. P. Brown. The text is here given according to the Edition prepared in 1839 by Narasimhachari" — D. 950.**

D. 954 + సటీకము. రెండుసంపుటములు. ఈ టీక 1842 వ సం॥న జూన్ 22 వ తేది ముగింపబడినట్లు బ్రౌను తెలిపెను.

D 962 + పై టీకాసహిత ప్రతికిది ప్రతికి. రెండు సంపుటములు.

D 955 + మూలము మాత్రము వ్రాయబడిన ప్రతి.

D 958 — మొదటి 6 గతులు లేవు

D 930— ఆదినుండి తృతీయగతిలో కొంతభాగము వరకు కలదు.

6. 3 2 ప్రభులింగలీలను చిలకమర్రి నరసింహాచారి 1839 వ సం॥న పరిష్కరించెను. నరసింహాచారి పాఠనిర్ణయములను చేసినపుడు, ఆయా పాఠములను గ్రహించుటకు గాని మార్చుటకు గాని గల కారణములను వివరించెను.

ఉదా :

1) పసుసంపు సోకినప్పటి లోహమట్లు
×
కరణ గుణంబులు కడకు బోవెత్తి - (1-38)

ఈ పాదమున కెదురుగా "× అర్థభంగంగా కరుణ। కర్మ అని వుంటె। కరణ అని వ్రాయడమైనది." అని వివరింపబడినది

×
2) నవరత్నజాతి నిర్ణయము లెట్లట్ల
శివభక్తి మర్మంబుచే మించిచావు (1-43)

ఈ పాదమున కభిముఖముగా "× గణభంగంగా నున్న అర్థ భంగంగా నున్న। లట్ల। లెల్లెట్ల। అని వుంటె లెట్లట్ల అని వ్రాయడమైనది" అని పాఠనిర్ణయహేతువు చెప్పబడినది.

సంప్రతించిన ప్రతుల వివరములు *D* 953 ప్రతి చివర వ్రాయబడినది. మద్రాసు ప్రతి "**Mr Day**" అని గుర్తింపబడినట్లు బ్రౌను తెలిపెను ఆయా ప్రతులకు సంఖ్యలొసగబడినవి.

ప్రభులింగలీల పరిష్కరణము పూర్తి అయినను, ఇంకను ప్రత్యంతరముల కొరకు అన్వేషించుట బ్రౌను మానలేదు. 1844వ సం॥ జూన్ 20వ తేదీన కడప

జిల్లా, నౌసం తాలూకా మునసపు కోర్టు గుమస్తా అయిన అవధానం అప్పయ్య లేఖను బట్టి యీ విషయము విదితమగుచున్నది. ఈ లేఖలో అప్పయ్య తమ ప్రాంతమున గంద్రగుళి శివమల్లప్ప యొద్దగల ప్రభులింగలీల, బసవపురాణములకు సిట్టూరి సుబ్బయ్యచేత ప్రతులను వ్రాయించి పంపెదనని బ్రౌనుకు నివేదించెను.[2]

6. 3. 3. ప్రభులింగలీల ఆంగ్లానువాదమును బ్రౌను 1839 వ సం॥ జూన్ 5వ తేదీన ప్రారంభించి, 19 గతులను 1842 వ సం॥ డిసెంబరు 22 నాటికి పూర్తి చేసెను.[3] పూర్తికావ్యమును ఎప్పుడు ముగించెనో తెలియదు ఈ 25 గతులలో ఒక్కొక్క గతిలో ఎన్ని ద్విపదలున్నవి యని గుర్తించుటయేకాక, ఇందు మొత్తము 1740 ద్విపదలున్నవని లెక్కించెను. ఇందలి 3 వ గతిలో కొంతభాగమును బ్రౌను పద్యరూపమున ఆంగ్లీకరించెను. (చూ. అను - II )

బ్రౌను ప్రభులింగలీలానువాదమునకు 1838 వ సం॥ నే పూనుకొనినట్లు మల్లంపల్లి వీరేశలింగ శాస్త్రి లేఖవలన తెల్లమగును. ప్రభులింగలీల తమరు భాషాంతరం చేస్తూవున్న వృత్తాంతం తెలిసి పరమానందమును పొందినాను యెందునుంచి అంటే అల్లమప్రభువువారి శూన్యసింహాసన వర్ణన మొదలుగాగల కొన్నిస్థలములను అర్థము చేసుకోవడమునకే యితరులకు అసాధ్యం।"[4] దీనిని బట్టి బ్రౌను ఆంగ్లానువాదములను కూడ ఆనాటి తెలుగు పాఠకులు ఆతురతతో చదివెడివారని గ్రహింపనగును. అప్పటివారి పఠన పిపాసను బ్రౌను కాగితపు ప్రతులు ముద్రితప్రతులు ఎంతగనో తీర్చినవి.

6. 3 4 బ్రౌను ఈ కావ్యమునకు వీరభద్రయ్యచే టీకను వ్రాయించెను. ఈ టీక 1842 వ సం॥ జూన్ 22 వ తేదినాటికి ముగిసినట్లు బ్రౌను తెలిపెను.[5] ఈ టీకనే మరల నొక పర్యాయము వీరభద్రయ్య పరిశీలించినట్లున్నది. ఆ పరిశీలనము 1842 వ సం॥ జూలై 10 వ తేదీకి ముగిసినదట. ఈ సవరించిన టీకా ప్రతి వ్రాత 1842 వసం॥ జూలై 19 వ తేది నాటికి పూర్తియాయెను.[6]

6. 3. 5 ఈ ప్రభులింగలీల గ్రంథ పరిశోధనను బ్రౌను కొంత కాలం కషముగ నొనర్చినట్లు వ్యక్తమగును. తాను వ్రాయించిన ప్రతి కాగితపు ప్రతిలో

---

2. Sr. of Lt. M. 419· P. 456.

4. Sr. of Lt. M. 401 5. *D*. 954. 6. *D*. 962

ఈ కావ్యమును గూర్చి కవిని గూర్చి కవి కాలాదికములను గూర్చి, జంగములను గూర్చి, శైవసిద్ధాంతములను గూర్చి వివరించెను.

బ్రౌను పిడుపర్తి సోమన కాలమునుగూర్చి కొంత తికమకపడెను. ప్రప్రథమమున సోమన 18వ శతాబ్దికి 3 శతాబ్దముల పూర్వపువాడని జనశ్రుతికాని అతడు నన్నయ్యను కాని అతని సమకాలికులను కాని పేర్కొనక పోవుటచే, నన్నయ్యకు పూర్వుడై యుండునని బ్రౌను భావించెను. ఈ కవిని కావలి రామస్వామి తన 'Deccan Poets'లో గుర్తింపలేదని పేర్కొనెను.[7]

తన కాలమున వాడుకలో లేని ఆభరణములు కావ్యమున వర్ణింపబడుటయు, 'కంపు' అను పదము 'సువాసన' అను అర్థమున ప్రయుక్తమగుటయు ఆ కావ్య ప్రాచీనతకు తార్కాణములనెను.[8] సోమన కాలమును గురించి బ్రౌను ఇదమిత్థముగ తెల్పుకొనలేక పోయెను ఎలియట్ దొరగారు హైందవశాసనములను గురించి వ్రాసిన వ్యాసమున (**Hindu Inscriptions - Madras Journal of Lit. Jan 1838 Pg 197**)బిజ్జలుని మరణ కాలమును శకవర్షము 1087 అనగా క్రీ. శ. 1000 అని తెలిపెను. అట్లయిన బిజ్జలుడు, బసవన 11వ శతాబ్దికి చెందినవారగుదురు ప్రభు లింగలీల యందలి భాష దాని ఆధునికతను నిరూపించు చున్నది. కాని అది బసవ పురాణ, పండితారాధ్య చరిత్ర కర్తయగు పాల్కురికి సోమనాథుని శిష్యునిచే రచింప బడినది. అప్పుడీ మూడు గ్రంథములు ఒకే శతాబ్దమునకు చెందును. కాని ప్రభు లింగలీల అందరు భావించుదానికన్న ఆధునికమనీ, బహుశః ఈ కవి కృష్ణదేవరాయ లకు సమకాలికుడు కానోపును అని స్వాభిప్రాయమును వెలిబుచ్చెను.[9] పిడుపర్తి సోమన తాను పాల్కురికి సోమనాథుని శిష్యుడనని చెప్పుకొనుటవలన వారిరువురు సమకాలికులై యుండవలయునని బ్రౌను భావించెను. కాని బ్రౌను సోమనను గురించి మరికొంత పరిశోధనచేసి యీతడు క్రీ శ. 16 వ శతాబ్దివాడని తేల్చెను.[10] ఇంకను కొంత ఆలోచింపగా ప్రభులింగలీల ఆధునిక కావ్యమని 700 ఏండ్ల క్రితమిది రచింప బడినట్లు భావింపబడినను వాస్తవమునకది 200 ఏండ్ల క్రితము మాత్రమే (బ్రౌను కాలమునకు) రచింపబడినదని బ్రౌనుకు తోచెను[11] అప్పటి కింకను వాఙ్మయ

---

**7. D. 953.**
**8. 952**
**9. D. 951.**
**10. Ibid.**
**11. D. 952**

చరిత్రకు సరియగు ఆకరములు లభింపమిచే బ్రౌను ఇట్లు సోమనకాలమును గురించి భిన్నాభిప్రాయములను వ్యక్తపరచెను. 1840 వసం॥న బసవపురాణమును గురించి వ్రాసిన వ్యాసములో పిడుపర్తి సోమన వ్రాసిన పద్య బసవపురాణము, ప్రభులింగలీల కావ్యములు 16 వ శతాబ్దమునకు చెందినవని, తానింతకు పూర్వము సోమన కాలమును గూర్చి వ్యక్తపరచిన అభిప్రాయములను సవరించు కొనవలయునని తెలిపెను 12

కవిని గురించి బ్రౌను ఇట్లు పేర్కొనెను :

"జంగముల గురువుగ, మార్గదర్శిగ సోమనను ప్రజలు గౌరవింతురు అతడు వీరశైవమతమునకు చెందినవాడు వీరశైవులు విగ్రహారాధన విముఖులు పురాణాదుల యందు తిరస్కారభావము కలవారు. తత్కారణముగ వారిని బ్రాహ్మణులు ఏహ్య భావముతో చూతురు. గాఢమగు తత్త్వవిచారము వలనను, ఆత్మార్పణము వలనను భగవంతునితో ఐక్యము చెందుట ఈ మత పరమార్థము,"13

పాల్కురికి సోమన ద్విపదగా రచించిన, బసవపురాణమును పిడుపర్తి సోమన పద్యకావ్యముగా సంతరించెననియు, అందు ఆతని ఇతర రచనలు ప్రస్తావింపబడె ననియు బ్రౌను వచించెను. అతని పెదతండ్రి అయిన పిడుపర్తి బసవన దీక్షాబోధ, పిళ్లనయనారు కథ, బ్రహ్మోత్తరఖండము, మరికొన్ని గ్రంథములను రచించినట్లు సోమన పేర్కొనెను. ఆ మరికొన్నింటిలో ప్రభులింగలీల పద్యకావ్య మొకటి అని బ్రౌను తెలుపుటకు ఆధారమేమో తెలియకున్నది. సోమనాథుని తమ్ముని కుమారు డైన బసవన మరియొకడు కలడు. ఇతడు సోమనద్విపద ప్రభులింగలీలను పద్యకావ్య ముగ రచించెను. కావున బ్రౌను భావించినట్లు సోమన పెద తండ్రియైన బసవన పద్య ప్రభులింగలీల కర్త కానేరడు.

జంగములను గురించిన వివరముల కొరకు బ్రౌను కొంత శోధించి Wilk's Mysore, appendix No : IV P. 503 లో జంగములను గురించి విపులముగ

12. "None of these works equal in beauty of style the Puran and Lila in the modern version, written (Perhaps about A. D. 1600) by Somia. Hindus are always apt to give a fictious antiquity to their favourite authors; and late enquiries have shewn me that the dates mentioned in a former essay require correction."—Essay on Basava Puran.

13. D. 951.

నున్నను అందు కొన్ని స్థాలిత్యములున్నట్లు తెలిపెను. అందు జంగమ పదమునకు వ్యుత్పత్తి మూడు శబ్దముల కలయికగ చెప్పబడెను. జం = పుట్టుట; గం = గమనము; మ = మరణించుట ఈ పద విచ్ఛేదము తప్పని బ్రౌను 'జంగమ' అను పదమునకు నడయాడునది (Movable, lccomotive — as approved to sthavara, fixed, stable) అని అర్థమని వివరించెను. ఒక చిన్న వెండిబరణియందు లింగమును ధరించు ఈ మతస్థులు, నడయాడు లింగమును శివునిగ విశ్వసించి, తమ్ము జంగములుగ భావింతురట ఈ మతస్థులు బాహ్యకర్మకాండను అర్థరహితము, నిష్ప్రయోజనమైనదని ఖండించి భక్తియే ప్రధానమని ప్రబోధింతురు. లీల (ప్రభు లింగలీల), బసవపురాణము, ఆరాధ్యచరిత్ర (పండితారాధ్యచరిత్ర,) సిద్ధాంత శిఖామణి అను గ్రంథములేకాక సకలాగమ సంగ్రహమును, జంగములను గురించి విపులీకరించెనట మీ పలారాధ్యులు, ఏకోరామనారాధ్యులు, పండితారాధ్యులు, రేవణారాధ్యులను ఈ నలుగురు శివాచార్యులని బ్రౌను తెలిపెను ఇట్టి వివరములను పెక్కింటిని బ్రౌను సేకరించి గ్రంథస్థమొనర్చెను.14

'అల్లమ' పదమునకు అర్థమును అనుభవ సూత్రమను గ్రంథము నుండి ఇట్లు ఉద్ధరించెను

"అల్లమ అనగా చైతన్యం । పరిపూర్ణం । ఏకం । అచలం ।
జ్యోతిర్మయం । వ్యాపకం । తత్పంచాక్షర మంత్ర
మాద్యమమరం । సూక్ష్మాది సూక్ష్మంపరం । లింగం
బ్రహ్మ సనాతనం సుమన సాధ్యాతవ్యరూపం సదా॥
బాహ్యాభ్యంతర సంస్థితం పరశివం ప్రాణేశ్వరం భావయే*॥"

వీరశైవ సిద్ధాంతమునకు 28 ఆగమములు ప్రధానములు ఈ ఆగమముల తరువాత అనుభవసూత్రము, సిద్ధాంత శేఖరము, వీరశైవ చింతామణి పేర్కొనదగినవి. ఆ తరువాయి శంకరసంహిత, వాతూలము, లింగధారణ దీపిక, లింగధారణ చంద్రిక, విశేషార్థ ప్రకాశిక అనునవి చెప్పదగినవి. చివరగ పద్మపురాణ

14. D. 952.

* ఇది సంస్కృత శార్దూల విక్రీడిత పద్యము. దీనిని బ్రౌను పదచ్ఛేదము గావించి గుర్తించి యున్నాడు.

ద్వితీయ భాగమును వీరశైవులు ప్రధానముగ పరిగణింతురట  ఒక స్థలమున ఈ చక్కని కావ్యమునకు ఈ క్రింది గీతాశ్లోక షట్కము అనుగుణముగ నుండునని ఉదాహరించెను. అట్లే మరొక తావున 8 సంస్కృత శ్లోకములను ఉద్ధరించి, అవి శంకరాచార్య విరచిత 'అగస్త్యాష్టక'ము అని పేర్కొనెను.

పై అంశములు ఇట్టి మతవిషయక వివరణలు కేవలము ఆంధ్ర భాషాసాహిత్యములోనివేగాక ఇతర భాషా సాహిత్యములందలి విషయములను కూడ అవగాహన చేసికొనవలయుననెడి ఆతని ఆసక్తిని వ్యక్తము చేయును.

జావా ద్వీపమునందొక భాగము 'ప్రభులింగమను' పేర పిలువబడుచున్నదని బ్రౌను తెలిపి అందులకు **"See Raffles, Java P-apud (?) Ann Reg 1816 Page-516"** అను ఆకరమును చూపెను.

ప్రభులింగలీల అనేక విషయములందు ఆంగ్ల భాషలోని **Spencer's** కావ్యమునకు సదృశమైనదట ముఖ్యముగ అక్కమహాదేవి ఉపాఖ్యానము **Spencer's Una**ను పోలినదట. ఈ లీలయందలి తాత్త్వికవ్యక్తులకు గ్రీకు పురాణములందలి తాత్త్విక వ్యక్తులకు సాదృశ్యమును చూపుచు నొక పట్టికను ప్రదర్శించెను.

**Personce in this Mystery**

| | Sanskrit Name | Greek Name |
|---|---|---|
| Urania / Euphrosyme | Maya........ I.e. | Maia, Cybele. I.e. Tamasa Gunanam or the fleshy spirit |
| | Vimala....... I.e. Iris. | I.e. Rajasa Gunam or The Aspirant. |
| Una / Pasithea | Maha Devi ...I.e. Minerva. | I.e. Satwica Gunam or The heavenly spirit. |
| | ? | ? |

Allama ......I.e. [Apollo — acchas - no Mercury] Hermes
Basava ......I.e. [Apollo Nomius - or] Hercules DEITY
Siva ...... I.e. Osiris or Jove. Providence.
Parvati ...... I.e. Juns or Jsis Fate;"

శైవ కవులను పిడుపర్తి సోమన స్మరింపక పోవుటవలనను, సోమనను శివేతర కవులు పేర్కొనకపోవుట వలనను ప్రభులింగలీల వాస్తవమునకొక పాషండ గ్రంథము

**Heretical Book)** గపెన్ను దగినదైనను, శైవులు దీనిని భక్తిజ్ఞాన సంబంధి గ్రంథముగ, షణ్మతసమ్మతమైన కావ్యముగ పరిగణింతురని బ్రౌను నుడివెను. దీనితో సమానమైన బసవపురాణమును భక్తివైరాగ్య విషయాత్మక గ్రంథముగ సంభావింతురు. ఈ రెండు గ్రంథములు భక్తి ప్రబోధమున సమానములైనపనియు, వీనితో తులతూగ గలిగినది ఒక్క "చార్త్ర or పండితారాధ్య చరిత్ర" మాత్రమేయట. కాని ప్రసిద్ధి ప్రచారములలో 'లీల' అని వ్యవహరింపబడు ప్రభులింగలీలదే ప్రథమ స్థానమట.15

6. 3. 6. ప్రభులింగలీలను ముద్రింపవలయునని బ్రౌను సంకల్పించెను. 1840 వ సం॥న డిసెంబరు 12 వ తేది ధర్మవరము సుబ్బన్నకు వ్రాయించిన లేఖలో "...జంగమ పుస్తకాలలో కొన్ని కావలశి వున్నవి – అవి కన్నడభాష గనుక కన్నడ వాండ్లవద్ద విచారించవలెను – యేమంటే– ప్రభులింగలీల, బసవపురాణం, బసవ కాలజ్ఞానం – వీటిలో ముఖ్యంగా లీలకావలశినది గనుక దానికి రెండు మూడు ప్రతులు దొరికే పక్షమందు చాపా చేయించేటందుకు మాకు బావం కలిగి వున్నది."16 మరొకరికి కూడ బ్రౌను "... ఇంకా కొన్నాళ్ళకు హరిశ్చంద్రచరిత్ర ద్విపద, సారంగధర చరిత్ర ద్విపద, ప్రభులింగలీల ద్విపద మొదలయినవి కొన్ని ప్రబంధములు అచ్చు వేయించడంకు వుద్యుక్తులైనాము." అని లేఖను వ్రాసెను.17

ప్రభులింగలీలను ముద్రించవలసిన క్రమమును కూడ బ్రౌను విదితపరచెను. "యీ ప్రభులింగలీల చాపాచేయించేటప్పుడు వుండవలసిన క్రమం యేమంటే –

౧. శ్రీవీరశైవప్ర సిద్ధసిద్ధాంత
కోవిదశ్రీపాల కురికిసోమేశ
బసవ పురాణాది భవ్యకావ్యముల
ననమాత్మభక్తమా హాత్మ్యంబుదెలిపి

ఇట్లు విరామస్థలమును నిర్దేశించుచు ముద్రింపవలయునని బ్రౌను ఆశయము. మరి ఈ ఆశయము ఫలోన్ముఖమయినట్లు కానరాదు.

---

15. *D.* 952, 953.
16. **Sr. of Lt. M. 411. PP. 54 –**
17. **Ibid. M. 418 PP. 336 –**

ఇట్లు ప్రభులింగలీల కావ్యమును పరిష్కరించుటయే కాక, దాని ముద్రణకు పూనుకొని, వీరశైవమతమును గూర్చి పెక్కు విషయములను సంకలించిన బ్రౌను పరిశ్రమ గణనాతీతము.

## 6. 4. బసవపురాణము :

6. 4. 0. పాల్కురికి సోమనాథ విరచితమగు బసవపురాణము వీరశైవమత ప్రతిష్ఠాపకుడగు బసవేశ్వరుని చరిత్రగల 7 ఆశ్వాసముల ద్విపద గ్రంథము. అను ప్రసక్తముగా నిందింకను అనేక శివభక్తుల ఉపాఖ్యానములు వర్ణితములు. ఈ బసవపురాణ పరిష్కరణకు బ్రౌను 1839వ సం॥న పూనుకొనెను.

6. 4. 1. ఈ కావ్యమునకు బ్రౌను వ్రాయించిన కాగితపు ప్రతులు 5.
**D.** 970 +. 1839వ సం॥న వివిధ ప్రతులలోని పాఠములను గుర్తించిన ప్రతి. వివిధ ప్రతులందలి విభిన్న పాఠములను ప్రదర్శించుటచే నిది మిక్కిలి అమూల్యమైన ప్రతియనియు, ఈ ప్రతి నాధారముగ గొనియే పరిష్కృత నూతనప్రతి నిర్మింప బడినదనియు బ్రౌను సూచించెను.

మూలము ముగిసిన తరువాత 134 పుటలలో కథాసంగ్రహము తెలుగున వ్రాయబడెను. పిదప నీ తెలుగు కథాసంగ్రహమునకు బ్రౌను చేసిన ఆంగ్లానువాదము 160 పుటలలో నున్నది.

పిడుపర్తి సోమన బసవపురాణ పద్యకావ్యము నందు చెప్పిన చొప్పున పాల్కురికి సోమనాథుని గ్రంథముల పట్టిక గ్రంథాంతమున పొందుపరుపబడెను.

**D.** 969. +. 1839వ సం॥న పరిష్కరింపబడిన నూతన ప్రతి. పాఠభేదములు గుర్తింపబడిన పైప్రతిని ఆధారముగ చేసికొని, బ్రౌను పర్యవేక్షణలో 1839వ సం॥ సెప్టెంబరు 30వ తేది నాటికి ఈప్రతిని తయారు చేయుట పూర్తియాయెను. మాతృకలోని పాఠభేదములలో నిర్దుష్టములని యెంచ బడినవి మాత్రమిందు గ్రహింపబడినవి. ఇందును అనేక సంస్కారములు అక్కడక్కడ చేయబడియున్నవి. ప్రతిపుట పార్శ్వమందును ఆయా పుటల యందలి విషయము సంగ్రహముగా నాంధ్రముననే వ్రాయబడి యున్నది.

మూలము ముగిసిన తరువాత 126 పుటలలో గ్రంథ విషయసూచిక ఆంధ్రమున వ్రాయబడియున్నది. మూల ప్రతిపుట పార్శ్వములందలి విషయ సంగ్రహములే దీనికి మూలముగానున్నది.

దీని తరువాత దీనికి బ్రౌను చేసిన ఆంగ్లానువాదము 142 పుటలలో నున్నది. ఈ అనువాదమును బ్రౌను 1839వ సం॥ నవంబరు 7వ తారీఖునకు పూర్తి చేసెను.

ఈ ప్రతి ప్రారంభమున నొక గమనిక కలదు : "ఈ గ్రంథము చూచెటివారు ఆరు ప్రతిభేదములుగల దీని మాతృక చూచి దీనిలో అసంగతమైన ప్రతిభేదములున్నప్పటికి సావధానముగ విచారించి దిద్దవలెను."

**D** 968. +, ఇది పై పరిష్కృత ప్రతినే పునఃపరిశీలించి సవరించి, 1840వ సం॥న బ్రౌను తయారు చేయించిన ప్రతి. సంపుటారంభమున "అన ౧౮౩౭ సంవత్సరమందు చన్నపట్నంలో ఆరు ప్రతులలో వుండే ప్రతి భేదములు యెత్తి వ్రాయించి తప్పులు దిద్దించి నవీనంగా తీపురా చేసిన గ్రంథం" అని వ్రాయబడియున్నది. మూలప్రతి లేఖనము 1839వ సం॥ అక్టోబరు 5వ తేది ప్రాంతముల ముగిసినట్లున్నది.
ఆంధ్రాంగ్లములందలి కథాసంగ్రహము కలదు.

**D**. 964, +. ఇది చిత్తుప్రతులను చూచి వ్రాయబడిన సాపుప్రతి. గ్రంథాంతమున 122 పుటలలో గ్రంథస్థవిషయము సంగ్రహముగ తెలుగు వచనమున గలదు. ఆ తరువాత దీనికి బ్రౌను చేసిన ఆంగ్లానువాదము బ్రౌను స్వహస్తముతో 161 పుటలలో వ్రాయబడినది.

**D**. 965 — 6వ ఆశ్వాసమున కొంతభాగమును, 7వ ఆశ్వాసము పూర్తిగను ఉన్న ప్రతి. వ్రాతలేని పైపులందు అధిక పాఠభేదములు చేర్పబడినవి.

6. 4. 2. బసవపురాణ మాతృకలను నొసం మునసబు అవధానం అప్పయ సేకరించి పెట్టినట్లు లేఖలవలన తెలియుచున్నది.[1] ధర్మవరము సుబ్బన్నకు కూడ

---

1. Sr. of Lt. M. 419, P. 456 & 516.
2. Ibid. M. 419. P. 54,

బ్రౌను బసవపురాణ ప్రతికొరకు జాబు వ్రాసెను[2] 1839వ సం॥ అక్టోబరు 20వ తేదిలో అంగర బ్రహ్మాజి కృష్ణపంతులు తమ ప్రాంతములలో బసవపురాణ ప్రతులు లభించుచున్నవని, వలసినచో ప్రతులను పంపగలనని బ్రౌనునకు విన్నవించుచు లేఖను వ్రాసెను.[3]

వివిధ ప్రాంతముల నుండి బ్రౌను బసవపురాణమునకు 6 సమగ్ర ప్రతులను సంపాదించినట్లున్నది. "ఆన ౧౭౩౭ సంవత్సరమందు చన్నపట్నంలో ఆరు ప్రతులలో వుండే ప్రతిభేదములు యెత్తి వ్రాయించి తప్పులు దిద్దించి నవీనంగా తీపుర్ణ చేసిన గ్రంథం" అని D 968, 969 ప్రతులలో నుండుటవలన ఈ పురాణ సంస్కరణమునకు 6 ప్రతులను సంప్రతించినట్లు తెల్లమగును. తత్పరిష్కర్త లెవరను విషయము చెప్పబడలేదు. బహుశః వీరభద్రయ్య కావచ్చును.

6. 4. 3. ప్రభులింగలీలతో పాటు బసవపురాణమును కూడ ముద్రింప బ్రౌను ఉద్దేశించినట్లు ఇంతకు ముందే సూచితము. కాని ఈ పురాణ ముద్రణము ఫలవంతమైనట్లులేదు.

6. 4. 4. ప్రభులింగలీల కర్తయైన పిడుపర్తి సోమనాథుని గురించి బ్రౌను ఇట్లు వ్రాసెను. **"This poet says he was the pupil of** పాల్కురికి సోమనాథ **who wrote the** ద్విపద బసవపురాణం **and the** పండితారాధ్యచరిత్ర ద్విపద **and who one would suppose was an** ఆరాధ్య **Bramin - but Somaya seems to be a sudra - perhaps a Mudeleiar - he says - his guru was named** పండితారాధ్యుడు".[4] ఈ వ్రాతను బట్టి సోమన శూద్రుడని బ్రౌను భావించెననుటస్పష్టము.

బసవపురాణమును గురించి వ్రాసిన సుదీర్ఘ వ్యాసములో[5] బసవపురాణ కథా సంగ్రహమును వ్రాయుటయేగాక, ఆ గ్రంథమును సహితము సమీక్షించెను. పిడుపర్తి సోమన తన పద్యబసవపురాణమున పాల్కురికి సోమనను ప్రతాపదేవరాయల (ప్రౌఢరాయలు) సమకాలికునిగ పేర్కొనుటచే పాల్కురికి సోమన క్రీ. శ. 1456-1477 మధ్యకాలమునకు చెందునని బ్రౌను నిర్దేశించెను ఆంధ్రకవి సప్తశతికారులు "ఈతని కాలమును గూర్చి యభిప్రాయ భేదములు చాల కలవు. మొత్తము మీఁద

---

3. Ibid. M. 411. P. 240. 4. D. 953.
5. Account of the Basava Puran. pp. 271. 292.

నీతఁడు క్రీ శ. 1190 కిని, 1320 కిని నడుమ నుండిన వాఁడని చెప్పవచ్చును." అని వ్రాసిరి.

బసవపురాణమున చెన్నప్ప, భల్లాణకథల వంటివి పూర్వశైవ గ్రంథములందును కలవనియు, ఇవి బసవపురాణము సందేకాక, బ్రాహ్మణులు రచించిన శ్రీకాళహస్తి మాహాత్మ్యము, వైజయంతీ విలాసము, వీరభద్ర విజయము, రాజశేఖర చరిత్ర వంటి ఆంధ్రగ్రంథములందును మరి కన్నడ గ్రంథములందును కలవు.

బసవపురాణము 7 ఆశ్వాసముల ద్విపద కావ్యము. ఇందు మొత్తము 12576 పంక్తులున్నవని బ్రౌను తెలిపెను. కొన్ని అంశములలో బసవపురాణము బ్రాహ్మణ ప్రణీత పురాణములను అనుకరించెను. ఉదాహరణకు 'గు-రు' అను ద్వ్యక్షరమును 'బ-స-వ' అను త్ర్యక్షరమును ఉచ్చరించిన మోక్షము సిద్ధించును. ఇది భక్తిమార్గమును ప్రబోధించు గ్రంథము. ఇందలి కథలన్నియు భక్తి విశ్వాసములను ప్రదర్శించిన భక్తుల గాథలు.

బసవని భార్య ధరించిన పట్టుచేల నొసగుమని యొకజంగముడు కోరగా, బసవడా చీరను ఒలువగా అది ఎంతకును ఆమె ఒడలునుండి రాలేదు. చీరలగుట్ట పెరుగ సాగెను. అప్పుడా జంగముడు తనకు వలసినంత వస్త్రమును చింపుకొనును. ఈ కథ మహాభారతమునందలి ద్రౌపదీ వస్త్రాపహరణ కథకు అనుకరణమని బ్రౌను తెలిపెను. ఇందలి భక్తులను బ్రౌను 'Silly saints' గ పరిగణించుట నవ్వు పుట్టించును.

ఇంకనేక గాథలు భక్తురాండ్రయిన స్త్రీలకు శివుడు పుత్రుడుగ జన్మించుటను తెలుపును. తమ కుమారులు భక్తిపరులగుటను వ్యక్తముచేయు విధానములలో నిది యొక పద్ధతిగ తోచుచున్నట్లు బ్రౌను వచించెను.

ఇందలి కథలు ఆసక్తిజనకములైనను, సుదీర్ఘములైనవట బసవపురాణ గాథలన్నింటి నిట్లు సంక్షిప్తముగ తెలిపి, సమీక్షించిన బ్రౌను ఓపిక మెచ్చుకొనదగినది.

## 6. 5. రామాయణము :

6. 5. 0. గోనబుద్ధ భూపతి తన తండ్రియగు విఠల భూపతి కోరికచొప్పున అతని కంకితముగా రచియించిన రామాయణము రంగనాథ రామాయణమను పేర

చెలామణి యగుచున్నది. రంగనాథ రామాయణమును తెలుగులో నొక సరళమైన ఉత్తమ కావ్యముగ బ్రౌను పరిగణించెను. తెలుగులోని రామాయణములను గూర్చి పరిచయమొనర్చుచు అన్నింటిలో రంగనాథ రామాయణము సుభశైలిలో తియ్యని తేట తెలుగులో రచింపబడినదని, దీనికే అధిక ప్రసిద్ధి ప్రచారములు కలవని, బాలల, స్త్రీల పఠనకిది యుక్తమైనదని, ఛందోవ్యాకరణ, భాషయందిది ప్రామాణిక గ్రంథమని పేర్కొనెను.[1]

గ్రంథమునందు స్పష్టముగ కోన విఠలభూపతి పుత్రుడైన కోనబుద్ధరాజు కర్తయని పూర్వోత్తర కాండము లందున్నను, ఈ రామాయణ కర్తృత్వమును రంగనాథున కంటగట్టుటలోని కారణమును తాను కనుగొనలేకపోతినని బ్రౌను తెలిపెను.

బుద్ధరాజు తనతండ్రి ఆంధ్రదేశమున నొకభాగమునకు పాలకుడని చెప్పెనే కాని ఆదేశమేదో పేర్కొనలేదు. కాలమును గూర్చియు సూచింపలేదు. బహుశః అతడు నన్నయ సమకాలికుడు కానోపును. కాని యీ ఇరువురు కవులు ఒకరినొకరు ప్రస్తావింపలేదు.

వాస్తవమునకు రంగనాధుడే యీ రామాయణకర్తయనియు, అతడు తన పోషకుడగు రాజు పేరిట దానిని వెలయించెననియు కొందరి పండితుల అభిప్రాయము అని బ్రౌను ఈ రామాయణ మున్నుడిలో పేర్కొనెను.[2]

---

1. i. **Of these works (Ramayanas) the first is Ranganatha Ramayana) extremely easy and beautiful in plain and elegant Telugu – It is perhaps the most popular work in the language and is said to be suited even to the comprehension of women and children. It is a standard work in point of language, grammer style and metre."— Plans for the Revival of Promotion of Telugu L·terature. P. 60.**

   ii. "The reader will perceive from this extract that the style of the Dwipada Ramayana though poetical is clear, easy and free from pedantry."—
   Es on Tel. Lit. P. 376.

2. *D*. 982.

6. 5. 1. రంగనాథ రామాయణ ప్రతుల నిమిత్తము బ్రౌను 1834వ సం॥ ననే ప్రయత్నించినట్లు గజవెల్లి కొండయ్య లేఖవలన విదితమగు చున్నది.[3] మ. ప్రా. పు. భాండాగారమున ఈ ద్విపద రామాయణపు కాగితపు ప్రతులు 5 కలవు. ఇవన్నియు బ్రౌను వ్రాయించినవే. తాళపత్రప్రతులు 23 ఉన్నవి. వీనిలో కొన్ని బ్రౌను సేకరించినవి కావచ్చును కాగితపు ప్రతుల వివరములు :

D 982 +. ఆరు సంపుటములలో ఆరు కాండములు గల ప్రతి. కాగితమునకు ఒక ప్రక్క మాత్రమె గ్రంథము వ్రాయబడెను. ఇందు 15 ప్రతుల లోని పాఠభేదములు గుర్తింపబడినవి. రెండవవైపున 62 పుటలవరకు బ్రౌను ఆంగ్లమున కథాసంగ్రహమును సంతరించెను. బాలకాండ ప్రారంభమున బ్రౌను తాన్ప్రతిని 1839 వ సం॥ సెప్టెంబరు 19 వ తేది తయారుచేయ నారంభించినట్లును, 15 ప్రతులను సంప్రతించి 1840 వ సం॥ జనవరి 7 వ తేది ముగించినట్లును తెలిపెను. ఈ ప్రతిని నిర్మించుటకు నిర్విరామముగ పనిచేయ ఆరుగురు వ్యక్తులను నియమించెనట. అనగా 15 ప్రతులను సంప్రతించి వివిధ పాఠభేదములను గుర్తించుటకు ఆరుగురికి 3 నెలలు 21 దినములు పట్టెను, తన సూచనల ననుసరించి వ్రాయబడిన తెలుగు కథాసంగ్రహమునే తాను ఇందు ఆంగ్లీకరించినట్లు తెలిపెను.

యుద్ధ కాండాంతమునను ఈ ప్రతిని పూర్తిచేసిన సంవత్సరమును (1840), సంప్రతించిన ప్రతులసంఖ్యను, (15) బ్రౌను మరల గుర్తించెను.

ఈ ప్రతిలో కొన్ని పంక్తులపైన పువ్వుగుర్తులు కలవు. వానిని గూర్చి బ్రౌనిట్లు తెలిపెను : "ఈ పూవుగుర్తులు గల పంక్తులు ప్రక్షిప్తములని నూతన ప్రతియందు విడువబడినవి. అయినను ఈ ప్రతి యందు ఉండుట మంచిది."[4]

---

3. Sr of. Lt. M. Vol VIII Lt No. 188. P 341

4. D 982. Vol I.

D 1000 + 3 సంపుటములు. 15 ప్రతులలోని వివిధ పాఠములతో బ్రౌను ఈ ప్రతిని తయారుచేసెను. ఇది D 981 కి మాతృక. **"The present manuscript of the Ramayana formed the basis of the edition framed in 1839 – 1840" (D. 1000)** ఉపలబ్ధ సంపుటములలో యుద్ధకాండము తొలిపట్టుగల సంపుటము. మూడవదిలేదు ఉన్న మూడవ సంపుటము నాల్గవ సంపుట మనదగినది. బ్రౌను దీనిని నాలుగు సంపుటములుగ వ్రాయించినట్లు తెలిపెను. **"The present Ms bound in four volumes formed the basis of the New edition."**

**D.** 981. + . నూతన పరిష్కృతప్రతి రెండు సంపుటములు. పై ప్రతి నాధారముగ గొనియే యీ ప్రతి నిర్మితము. పాఠభేదములను గుర్తించుట, శుద్ధ పాఠముల నిర్ణయించుట అను కార్యద్వయము ఇంచుమించు ఏకకాలమున జరిగినట్లు బ్రౌను వ్రాతవలన తెలియుచున్నది మొదటి సంపుటమున మొదట 5 కాండములును, రెండవ సంపుటమున యుద్ధకాండమును సంతరింపబడినట్లు బ్రౌను సూచించెను.

పాఠములకై వివిధప్రతుల సంప్రతింపు 1839వ సం॥ సెప్టెంబరు 19వ తేది ప్రారంభమయి 1840 సం॥ జనవరి 10వ తేది ముగిసినది. పరిష్కృత శుద్ధప్రతిని నవంబరు 25వ తేది వ్రాయదొడగిరి. బాలకాండ 1839వ సం॥ డిసెంబరు 20వ తేది, యుద్ధకాండము 1840 సెప్టెంబరు 11వ తేది పూర్తియాయెను

***D.*** 984.—. బాలకాండమును, అయోధ్యాకాండములోని కొంత భాగమును కలవు. ఇది **D.** 981 నకు సాపుప్రతి. సంపుటారంభమున "తప్పులు లేకుండా పరిష్కారమైన గ్రంధం" అను వ్రాత కలదు.

**D.** 1003.—. ఆది నుండి ఆరణ్యకాండాంతము వరకు కలదు. సంస్కృత రామాయణమునను, భాస్కరరామాయణమునను లేని అధిక కథలకు ఇందు సూచికలు కలవు. **D** 981, 982 ప్రతులాధారముగ వ్రాయబడిన 3 సంపుటముల శుద్ధప్రతి యిది. "ఇది నిర్దోషమైన ప్రతి. ౧౩ ప్రతులు

దగ్గరపెట్టి దిద్దించినాము. C. P. B." అను బ్రౌను స్వహస్తలేఖనము ఇందు కలదు. ప్రతి పత్రమున "New Edition" అని బ్రౌను స్వయముగ వ్రాసెను.

6. 5. 2. రంగనాథ రామాయణ పరిష్కరణమున బ్రౌను తాను సంపాదించిన మాతృకల (మూలప్రతుల) వివరముల నొసంగెను. (D 1000) ఆ వివిధ ప్రతులను సంఖ్యలతో గుర్తించెను. 426, 427, 428, 429, 430 సంఖ్యలు గల ప్రతులు బ్రౌను సొంతము 1001, 1002, 1003, 1004, 1005, 1006, 1007, 1008, 1009 సంఖ్యలు గల ప్రతులు ఇతరులవి ఈ ప్రతులను బ్రౌను వ్యాపారులు లాటరీ యజమానులు, బడిపంతులు, కోర్టు ఉద్యోగస్థులు మున్నగువారి నుండి సంపాదించుట అతని ఆసక్తికి నిదర్శనము.[5] వీనిలో కొన్ని అతి ప్రాచీనమైనవట. ఈ పాఠముల గుర్తింపు మదరాసున జరిగినది.

ఒక్కొక్క కాండ పరిష్కారమున స్వీకరింపబడిన ప్రతుల వివరములు ఒక పట్టికలో ప్రదర్శింపబడెను

---

5. "Manuscripts 426, 427, 428, 429; 430 belong to me * No 1001 belongs to shop cash keeper (Tirumal Naid) to miller [contd]

restored 1002 శంకరబత్తుడు

restored 1003 Lottery Manager. Dropping to pieces.

restored 1004 Yagamburi Jaggaya of Anderson's school· Restored. 17 Dec.

restored 1005 Locohita Subrao.
1006. Transl̲r Sudr Court

bad
restored 1007

*To which 12 add the original ms bound in these four volumes – Total 13 And further, add the following, since received.

restored 1008 Tunksala (Bonnet)

restored 1009 Hawker Papia." (D 10?)

| BALA CANDA | AYODHYA | ARANYA | KISHKIND | SUND | YUDDH |
|---|---|---|---|---|---|
| 426 done | 426 పిచ్చి | 426 done | 426 పనికిరాదు. | 426 | 426 |
| * a very 427 good copy | 427 | 427 done | 427 done | 427 done | 427 |
| 428 * | 428 | 428 done | 428 done | 428 * | 428 * |
| 429 * | 429 | 429 done | 429 done | 429 done | 429 done? |
| 430 * పిచ్చి | 430 పిచ్చి | 430 done | 430 done | 430 పనికిరాదు. | 430 |
| 1001 * | 1001 | 1001 done | 1001 done | 1001 done | 1001 |
| 1002 * | 1002 | 1002 done | 1002 done | 1002 done | 1002 done |
| 1003 * | 1003 | 1003 done | 1003 done | 1003 done | 1003 done |
| 1004 * | 1004 done | 1004 | 1004 done | 1004 done | 1004 done |
| 1005 rejected | 1005 useless | 1005 useless | 1005 పిచ్చి | 1005 * | 1005 done |
| * This is 1006 very wild | 1006 very wild | 1006 done | 1006 done | 1006 * | 1006 done |
| 1007 rejected | 1007 missing | 1007 missing | 1007 done | 1007 done | 1007 done |
| 1008 done | 1008 done | 1008 done | 1008 done | 1008 done | 1008 done |
| 1009 | 1009 | 1009 done | 1009 done | 10 9 * | 1009 done |

ఈ పట్టికను ప్రాచీను పరిష్కారణానంతరము తయారు చేసినట్లున్నది. కాని పరిష్కారణ జరుగుచున్న కాలమునందే, ఆ పండితులచేత ప్రతి కాండమునకు పాఠములు గుర్తించిన ప్రతులనెల్ల నొక చదరపు పట్టికలో గుర్తింపజేసెను.

| అయోధ్య | | DR. AY. | |
|---|---|---|---|
| ౪౨౬ | ౪౩౦ | ౧౦౦౪<br>ఇ ౩౫ ప ౭౦ | |
| ౪౨౭ | ౧౦౦౧ | ౧౦౦౫ | |
| ౪౨౮ | ౧౦౦౨ | ౧౦౦౬<br>ఇ ౫౦. ప. ౪౦<br>ఇ౧౬౦. ప ౪౨ | |
| ౪౨౯ | ౧౦౦౩ | ౧౦౦౭ | |

అన్ని కాండలను చేర్చి ఒకే చదరమున కూర్చి, సంప్రతించిన ప్రతుల వివరములను ప్రదర్శించెను.

| నెం | బాల | అయో | అరణ్య | కిష్కిం | సుం | యు |
|---|---|---|---|---|---|---|
| ౪౨౬ | తీరింది | | | | | |
| ౪౨౭ | తీ౦ంది | | తీ | | | |
| ౪౨౮ | తీరింది | | | | | |
| ౪౨౯ | తీరింది | | | | | |
| ౪౩౦ | తీరింది | | | | | |
| ౧౦౦౧ | తీరింది | | | తీ | | |
| ౧౦౦౨ | తీరింది | | | తీ | | |
| ౧౦౦౩ | తీరింది | | తీ | తీ | | |
| ౧౦౦౪ | తీరింది | | | | | |
| ౧౦౦౫ | rejected | | | | | |
| ౧౦౦౬ | తీరింది | | | | | |
| ౧౦౦౭ | rejected | | | | | |

ఈ పట్టికలు వివరములు బ్రౌను కావ్యపరిష్కరణను ఎంత జాగ్రత్తతో ఎంత శ్రద్ధగ, ఒక్క పాఠమైనను విడువబడకుండ చేయించెడి వాడని విశదీకరించును. అంతేకాక భావి పరిశోధకులకు, పరిష్కర్తలకు ఉపకరించునట్లు ఈ వివరములను సంతరించెను.

శుద్ధ పతిలో ప్రతికాండమున గల పుటలసంఖ్య, ఆ సంపూర్ణప్రతి పుటలసంఖ్య బ్రౌను గుర్తించెను.

**Total of Pages in the new ms**

| | | | | |
|---|---|---|---|---|
| I | Bala | 636 | 27 | Fair Copy Pages. |
| II | ayod | 470 | 20 | |
| III | aran | 424 | 18 | |
| IV | Kish | 382 | 16 | |
| V | Sund | 5 6 | 22 | |
| VI | Yuddh | 2608 | 110 | |
| | | = 5046 | | |

**VII Uttara** = "

ఇట్లు పుటల సంఖ్య గుర్తించుటవలన ఒకవేళ పుస్తకమున పుటలు లోపించిన గుర్తించుటకు అనువుగ నుండునని బ్రౌను ఉద్దేశించియుండును. అంతియకాక దీనిని 'బైండు' చేయవలసిన పద్ధతిని కూడ తెలిపెను.

అయోధ్యాకాండాంతమున, ఆ కాండమును చిల్లర అప్పయ్య అనునతడు 'రుజావు' చూచినట్లున్నది. దినమునకు 192 పంక్తుల చొప్పున శుద్ధప్రతిని వ్రాసిరట

పరిష్కర్తలు ఆయాపాఠములను గ్రహించుటకు కారణములను సూచించిరి.

ఉదా :

'లలితలావణ్య విలాసరూపముల
వలనొప్ప నప్సరోవనితలలోన

పుంజకస్థలయన బొలుచు మీతల్లి' (కిష్కింధ. సర్గ. 66)
ఈ ద్విపద పాదములకు ఎదురుగా

"x భుంజకస్తల అని వుంటె సంస్కృతానుసారముగా పుంజక అని......
......" కందున్న రూపము సరికాదు. పుంజికస్థల అని ఉండదగును.

సుందరకాండమున 'శ–స' ప్రాసను గుర్తించిరి.

"...

ఉదా : నాశన క్రుతి విభూనాక భయుదవు
భాసుర బలుడవు పన్మజదత్త:" (సుందర సర్గ ౬౮)

'కుమారస్వామి' కథాసందర్భమున బ్రౌను ఈ కథ మహాభారతారణ్యపర్వమున భిన్నముగ నున్నట్లు తెలిపెను (D. 982 Vol. I)

సంస్కృత రామాయణమునకు గల ఉత్తరాది ప్రతులు, దక్షిణాది ప్రతులను కూడ బ్రౌను పరిశీలించి, మూలానుసారమైన పాఠములను నిర్ణయింప ప్రయత్నించెను. కేరీ దొరగారు పరిష్కరించిన సంస్కృత ప్రతిలో 'ప్రమతి' అని ఉన్నదని కాని అది దక్షిణాది ప్రతులలోను, తెలుగు ప్రతులలోను 'సుమతి' అని ఉన్నదని తెలిపెను.

అట్లే దక్షిణాది ప్రతులలో 'పప్లవ' అని ఉండగా, కేరీ స్వపరిష్కృత సంస్కృత ప్రతిలో 'పహ్లవ' అని యిచ్చి, ఈ పదము వస్తాదను అర్థముగల పహిల్వాన్' అను పర్షియన్ పదమునకు సంబంధించినదని వ్రాయుట సరికాదని బ్రౌను విమర్శించెను. ఆ అర్థము ఈ సందర్భమున పొసగదనియు, ఉత్తరాది, దక్షిణాది ప్రతులలో ఈ కథ విభిన్నముగ నున్నదనియు తెలిపెను.

ఇట్లు రంగనాథ రామాయణమును బ్రౌను ఎంతో పరిశ్రమించి, అతి శ్రద్ధగా పరిష్కరించెను.

## 6. 6. పండితారాధ్య చరిత్ర :

6. 6. 0. "పండితారాధ్యచరిత్ర జంగములగు శైవాచార్యుల అత్యద్భుత చర్యలను వర్ణించు పంచప్రకరణముల గ్రంథము. బసవ పురాణమును రచించిన పాలుకురికి సోమనాథుడే దీనిని కూడ కన్నడమునుండి తెనుగున ద్విపదచ్ఛందములో అనువదించెను. జంగములమధ్య విశేషించి ఆరాధ్యుల మధ్య ఈ గ్రంథమునకు బహుళ ప్రచారము కలదు." అని బ్రౌను ఉపోద్ఘాతమున ఉగ్గడించెను.[1]

1. D. 1091.

8. 6. 1. పండితారాధ్య చరిత్ర ప్రతుల నిమిత్తము బ్రౌను 1838వ సం॥ ననే మల్లంపల్లి వీరేశలింగశాస్త్రికి వ్రాయగా అతడు రాజమహేంద్రవరము, పేడన, తత్సమీప గ్రామములందంతటను అన్వేషించి, ప్రతులు లభింపమిచే, తన అన్నగారైన మల్లికార్జున పండితారాధ్యులకు ఈ విషయము విన్నవించెను. మల్లికార్జున పండితారాధ్యులు ఒక నెలదినములలో 'గంద్ర' అను గ్రామమున ఆ ప్రతిని కనుగొని. "పాల్కురికి సోమనాథ విరచితమున్ను, ప్రకరణపంచకమున్ను అయిన ద్విపద పండితారాధ్య చరిత్ర........ ...గంద్రపు కొండయ్యగారి యింటివద్ద వుండి వున్నది. అయితే ఆ గ్రంథము నాలుగువందల తాటిఆకులమీద వ్రాసివున్నది. గ్రంథసంఖ్య పదివేల పర్యంతం వుండవచ్చును." అని తమ్మునికి వ్రాసెను.[2] ఆ ప్రతి సొంతదారులు దానిని గ్రామాంతరమునకు ఇచ్చుటకు అంగీకరింపమిచే, దానిని వ్రాయించి మల్లికార్జునశాస్త్రి బ్రౌనునకు పంపినట్లున్నది ఇట్లే 1840వ సం॥ ధర్మవరం సుబ్బన్నకు పండితారాధ్యచరిత్ర ప్రతిని తలాషు చేశి పంపించవలసి" నదిగ 'హుకుం' జారీచేసెను[3] అతడుకూడ ఒక ప్రతిని సంపాదించి యుండవచ్చును ఇవి గాక బ్రౌను మరి 3 ప్రతులను సంపాదించెను మెకంజీసేకరణలో ఒక మంచి ప్రతి అతనికి లభించెను. వాకర్ (Mr Walker) అనునతడును ఒక ప్రతిని బ్రౌనునకు పంపెను.

ఈ ప్రతులాధారముగ బ్రౌను పండితారాధ్య చరిత్రకు 2 కాగితపు ప్రతులను వ్రాయించెను.

1087 + రెండు సంపుటములు. ప్రత్యంతరములలోని పాఠభేదములు ఇందు బంతులనడుమ చేర్పబడినవి. బ్రౌను వ్రాసిన ఆంగ్లసూచికలు అక్కడక్కడ కలవు. తన గ్రంథాలయముననున్న ఒక మాతృక ఆధారముగ ఈ కాగితపు ప్రతిని వ్రాయించి, మూడు ప్రత్యంతరములలోని పాఠములు ఇందు గుర్తింపజేసెను. కాని వీనిలో రెండు ప్రత్యంతరములు మొదటి రెండు ప్రకరణములు మాత్రముగల అసమగ్రప్రతులు అట్లే మరొక ప్రతిలో ప్రథమప్రకరణము మాత్రమును, ఇంకొకదానిలో 3వ ప్రకరణము కొంతభాగము మాత్రమును ఉన్నవట.

2. Sr. of Lts. M, 401. P. 95. 3. Ibid. M. 411. P. 54.

పండితారాధ్య చరిత్ర అవతారికాభాగము గద్యయందున్నదని, శైలి కఠిన ముగ నున్నదని, ఏ రెండు ప్రతులును నొక్కటిగలేక విభిన్నపాఠాంతర ములను కలిగియున్నదని బ్రౌను తెలిపెను. కాని బ్రౌను తెలిపినట్లు అవ తారికాభాగము గద్యలో లేదు. ద్విపదలో నున్నది. గ్రంథమంతయు ద్విపదాత్మము.

బ్రౌను తదుపరి మెకంజీ సేకరణ ప్రతితో, వాకర్‌గారి ప్రతితో పోల్చి పాఠ ములను నిర్ణయించెను.

ఇందు మొదటి సంపుటములో మొదటి రెండు ప్రకరణములు, రెండవ సంపుట మున 3, 4, 5 ప్రకరణములు కలవు.

ప్రథమ సంపుటము 1339వ సం॥ జూలై 1వ తేదికి ముగిసెను.

ద్వితీయ సంపుటమున బ్రౌను "ఈ చిత్తుప్రతి మిక్కిలి ప్రయోజనకారి ఇది నా పర్యవేక్షణలో వ్రాయబడినది. 6 ప్రతుల పాఠములు ఇందు గుర్తింపబడినవి. దీనిని ఆధారముగ చేసికొనియే నూతన ప్రతి వ్రాయబడెను. ఈ ప్రతి 1838వ సం॥న తయారు చేయబడెను. వివిధ పాఠములు 1840 జూన్-నవంబరు మాసము లలో గుర్తింపబడెను" అని పేర్కొనెను. ముత్యాలపేట సుబ్బయ్య దగ్గర ఒక ప్రతిని గ్రహినట్లిందు కలదు.

**D** 1088. + రెండు సంపుటములుగా నున్నది. ద్విపద పాదములు విడివిడిగా వ్రాయబడెను. అయిదేసి పాదములకొక సంఖ్య నొసగబడెను. 'లింగా ర్చన మహిమ', 'లింగధారణ మహిమ' అను రీతి కథాశీర్షికలు. ఒసంగ బడెను. పద, పదార్థ విచారము కొంతకలదు. మొదటి సంపుటములో మొదటినుండి 3వ ప్రకరణములో కొంతవరకును, రెండవ సంపుటములో మిగిలిన భాగమంతయు కలదు. ఇది పాఠనిర్ణయము చేసిన తరువాత వ్రాయబడిన ప్రతిగ తోచును. విషయసూచి కలదు.

**D** 1089 + ఇది తాళపత్ర మాతృకకు కాగితపు ప్రతి అగును. పైన పాఠములు గుర్తించిన ప్రతియొక్క పుటల సంఖ్య దీని యందు బ్రౌను గుర్తించినట్లు తెలిపెను. ఇందలి పాఠభేదములను పెద్దప్రతిలో ఎక్కించినట్లిందున్నది.

ఈ ప్రతిని సంపూర్ణముగా 1810వ సం॥ అక్టోబరులో 'మొకాబిలా' చేయడమైనది.

ఈ ప్రతిని గూర్చి బ్రౌను ఒక గమనిక వ్రాసెను. ఈ పుస్తకమును బైండుచేసిన యతడు పొరపాటుగ 16 పుటలను విడిచిపెట్టెనట పెద్ద ప్రతిలోని 1091 – 1097 పుటలు వ్యతిక్రమముగ నుంచబడినవి – 1108 – 1163 పుటలు లోపించినవని తెలిపెను.

D 1090 + రెండు సంపుటములు. పంక్తుల విభజనమున్నను, వచనమువలె వరుసగ వ్రాయబడెను. సంఖ్యలేదు.

D 1091, D 1092 ఈ రెండు ప్రతులు కలిసి సంపూర్ణ గ్రంథమగును. D 1091 ప్రతిలో మొదటి రెండు ప్రకరణములు, 3 వ ప్రకరణమున కొంతభాగ మున్నది. శేషము D 1092 లో నున్నది. ఇవియు బ్రౌను సంపాదించిన మరియొక మూలప్రతికి పుత్రిక కానోపును. ఈ ప్రతిని 'బైండరు' తప్పుగ బైండు చేసినట్లును, పుటలుండవలసిన క్రమమును తాను పెన్సిలుతో సూచించినట్లును బ్రౌను తెలిపెను ఈ ప్రతియు పరిష్కరణ సందర్భమున సంప్రతింపబడినది – "This copy was examined throughout when the new edition of the charitra was prepared, under my directions in 1841."

D 1095— ఈ ప్రతియందు పండితారాధ్య చరిత్రలోని కొంత భాగమగు పండితారాధ్యుల శివపూజావర్ణన మాత్రమే ఉన్నట్లు బ్రౌను తెలిపెను. పద్య, పాదవిభజనముతో క్రమముగ నున్నది.

D 1102— ప్రథమ ప్రకరణము కూడ సాంతముగలేదు. కావ్యారంభములో "యిందుకు వ్రాసినవేరే ప్రతి రెండు బొక్కులుగా వుండి వేరే మాతృకలో నుంచి పుట్టి వున్నది. గనుక దానికి, దీనికి భేదంకద్దు. యిందులో పక్కను వ్రాసిన అంక్కెలు బొక్కులో వుండె సైడ్డ లెక్కగా ఉన్నది" అని వివరణమున్నది 19 పుటలవరకు వచనమువలె వరుసగను, తదుపరి పంక్తుల విభజనముతో క్రమముగ వ్రాయబడెను.

D 1086 + పై ప్రతులన్నింటిని పోల్చి, శుద్ధపాఠములు నిర్ణయించి కూర్చిన ప్రతి. దీనిని జంగమారాధ్యుడు, పండితుడు అగు వీరభద్రయ్య బ్రౌను నియమానుసారము వివిధ ప్రతులను చూచి పరిష్కరించెను. ఈ పరిష్కరణ 1841వ సం॥ నవంబరు 8 వ తేదికి ముగిసెను పరిష్కర్తలకు సందేహము కలిగిన పట్టులందు "యీ చరణమునకు అర్థము విచారణీయ్యము" అని గుర్తించిరి.

ప్రతి కావ్యపరిష్కరణ విషయమున బ్రౌను సమప్రాధాన్యమును చూపుట విశేషము.

6. 7. నవనాథ చరిత్ర :

6. 7 0. శ్రీగిరియను కవి రచించిన ఆంధ్ర పద్య ప్రబంధము ననుసరించి గౌరనామాత్యుడు నవనాథచరిత్రమను ద్విపద కావ్యమును రచియించెను. 1) శివుడు 2) మీననాథుడు 3) చౌరంగి (సారంగధరుడు) 4) గోరక్షనాథుడు 5) మేఘనాథుడు 6) నాగార్జునుడు) 7) సిద్ధబుద్ధుడు 8) విరూపాక్షుడు 9) కణికుడు అను తొమ్మండుగురు రసయోగసిద్ధుల చరిత్రము అందు వర్ణితములు. వీరిలో కడపటి అర్వురు దేశాటన మొనర్చి శిష్యుల ననుగ్రహించి వారికి తమ విద్యలనేర్పుట మొదలగు విషయము లిందు గలవు

6. 7. 1. ఈ కావ్యమునకు మూలగ్రంథము మాత్రము కల కాగితపు ప్రతులు రెండింటిని, టీక కలిగిన ప్రతులు మూడింటిని బ్రౌను తయారు చేయించెను.

ఈ కావ్య ప్రతుల నిమిత్తము బ్రౌను అక్టోబరు 1841లో గుండవరపు కృష్ణయ్యకు వ్రాయగా ఆతడు "సెలవు తీసికొని చేబ్రోలువెళ్ళి శంభుదేవర మఠములో నవనాథచరిత్ర సంగతి విచారించాడు." కాని అచట తనకాగ్రంథము లభింపలేదు. ఆ విషయమునే బ్రౌనునకు విన్నవించుచు "ఈ గ్రంథము యీ దేశములో ప్రసిద్ధి కలది కాదు గనుక యిందుల కథయేమో ప్రబంధనాయకుడు యెవరో కృతి యెవరిదో యీవైనములు తమరు యిదివరలో నా పేర దయచేయించిన వుత్తరములో వ్రాయబడి వుండలేదు గనుక యీవైనములు" తెలుపుడని కృష్ణయ్య బ్రౌనునకు వ్రాసెను.[1] బ్రౌను దీనికి వెంటనే సమాధానము వ్రాసెను "మరిన్ని వ్రాయవలసినది యేమంటే

1. Sr. of Lt M. 418. P. 333.

కవి గౌరన మంత్రి చెప్పినటువంటి నవనాథ చరిత్ర అనే ఆంధ్ర ద్విపదకావ్యము అయిదు ఆశ్వాసము లు కలది ప్రబంధము ౧౪౦-౧౬౦ ఆకులు గల ప్రబంధము. మాకు ప్రస్తుతం జరూరుగా వలసినది......నవనాథచరిత్ర, యీ సారంగధరచరిత్ర సహితం కలిగినది గనుక కొందరు భ్రమపడి నవనాథచరిత్ర అని పేరు యెరుగ కుండా సారంగధర అనే పేరు అన్యాయంగా పెట్టుతారు. గనుక యిప్పుడు దొరికే గ్రంథం సారంగధర చరిత్ర అన్న పక్షమందుకవినామం చూడవలసినది. గౌరన అనే అహ్వయం వుంటే నాకు కావలసినటువంటి గ్రంథం యిదేను అని గ్రహించ వలసినది......"[2] మరి గుండవరపు కృష్ణయ్య ఈ ప్రతిని సంపాదించెనో లేదో తెలియదు.

"గుంటూరు పోష్టాఫీసు హెడ్‌రయిటర్ ముదుంబి కృష్ణమాచార్యులు" కూడ ఈప్రతి కొరకు దేశము గాలించి, గార్లపాడు అనే గ్రామకరణము గారియొద్ద ప్రతి ఉన్నట్లు, దానిని వ్రాయించిపంపెదనని బ్రౌనునకు లేఖను వ్రాసెను.[3]

1847 వ సం॥ హైదరాబాదు వాస్తవ్యులగు బేతపూడి సాంబయ్య తన సోదరు డగు బేతపూడి సుందరాయనికి వ్రాసిన లేఖలో నవనాథచరిత్ర కొరకు చాల స్థలము లందు విచారించినట్లును, లభించిన వెంటనే పంపునట్లును వ్రాసెను. ఈ లేఖను బ్రౌను "From an Aradhya to his brother" అని గుర్తించెను.[4]

ఇట్లు పెక్కురను అర్థించి, ఆజ్ఞాపించి, ఆశచూపించి బ్రౌను తాళపత్రప్రతు లకు పుత్రికలను పుట్టించెను.

D 1079 + 1841 వ సం॥ మేనెల 7 వ తారీఖున ఈ గ్రంథము సీమనుండి వచ్చిన ఇండియా హౌస్ ప్రతిని చూచి వ్రాయబడినది. దీనిని తిరుమల నాయడు, బ్రహ్మయ్యలు మాతృకతో "ముఖాబిలా" చేసిరి. ఈ ప్రతిని పరిష్కరించుటకొరకే బ్రౌను ఆంధ్రదేశమున ప్రత్యంతరములకొరకు అన్వేషించెను. పార్శ్వ విషయసూచికల నటనట బ్రౌను వ్రాసెను. ఈ ప్రతిలో గ్రంథపాతములు గుర్తింపబడినవి. "రెండో ఆశ్వాసం, మూడోఆశ్వాసం" అని వ్యావహారికభాష ప్రయుక్తము. మొదటి 38 పుటల అవతారికాభాగమును విడిచిపెట్టునది అను బ్రౌను ఆదేశము కనిపించుచున్నది.

---

2. Ibid M, 418. p. 336. 3. Ibid. M. 423 P. 209
4. Sr. of Lt. M. 418. P. 344.

D 1080 + పై ప్రతికిది పుత్రిక. దీని 27-8-1842లో D 1079 ప్రతిసిచూచి వ్రాయించెను. ఇందు మూడవ ఆశ్వాసము లేదు. "కడమ గ్రంథము అచ్చు వేయడమయినది గనుక పునఃవ్రాయడానకు అక్కర తోచ లేదు" అను గమనిక కలదు. బ్రౌను నవనాథ చరిత్ర తృతీయాశ్వాస మును 1842వ సం॥న హరిశ్చంద్రోపాఖ్యానముతోపాటు ముద్రించెను. అందుచేత ఆ భాగమునిట వ్రాయబడలేదు.

D 1085. — నవనాథ చరిత్రలో తృతీయాశ్వాసములోని అంజఁవిప్రుల ఉపాఖ్యా నమునకు మాత్రము టీక కలదు. ఈ టీక 22-7-1845న పూర్తి అయి నట్లు బ్రౌను తెలిపెను.

D. 1084 — ఇందును తృతీయాశ్వాసమునకు మాత్రమే టీక కలదు. ఈ టీకా రచన 11-6-1846న ముగిసినట్లు బ్రౌను వ్రాసెను. పై టీక ఇందు కొంత సవరింపబడినది. సంస్కారణములు పంక్తులు నడుమ గుర్తింప బడినవి

D. 1083 — తృతీయాశ్వాసమునకే టీక. దీనిని 26-10-1846లో బ్రౌను వ్రాయించెను. ఈ కథాభాగమందలి విషయములనెల్ల బ్రౌను 4 పుటలలో ఆంగ్లమున వ్రాసెను. గ్రంథారంభమున "గౌరన కవి ప్రణీత ద్విపద కావ్యంబగు నవనాథ చరిత్ర మూడవ యాశ్వాసంబున శిద్ధిశ్రేష్ఠుండగు నమ్మినాథునకొక బోయ సెప్పిన విప్రకథా సంక్షేపమును సటీకగా చేయ నైనది." అని ఉన్నది. టీకాకర్త పేరు తెలియుటలేదు.

6. 7. 2. "ద్విపద హరిశ్చంద్ర కర్తయగు గౌరన మంత్రి కృత సారంగ ధరచరిత్ర" యని బ్రౌను ఆదిలో ఈ కావ్యమును పరిచయమొనర్చెను. "ఎలుగు బంటి శిక్షించిన అసత్యవాదియగు బ్రాహ్మణుని కథ ఇట నుండి ప్రారంభించు"నని తృతీయాశ్వాసాదిలో వ్రాసెను. తనకు నచ్చిన ఈ కథను మాత్రమే ముద్రించెను

## 6. 8. ఉత్తరరామాయణము :

6. 8. 0. వాల్మీకి రామాయణము ఉత్తరకాండమును కాచవిభుడు, విట్ఠలనాథు డను జంటకవులు ద్విపదచ్ఛందములో తెనిగించిరి. వీరు రామాయణ షట్కాండము లను ద్విపద కృతిగా తెలిగించిన గోనబుద్ధ భూవిభుని పుత్రులు. అవసానకాలమున తండ్రియానతి చొప్పున వీరీ యుత్తర కాండమును తెనిగించిరి.

షట్కాండ పరిమితమగు రంగనాథ రామాయణ ప్రతులు సులభముగ లభించునుగాని ఈ యుత్తరకాండ ప్రతులు మిక్కిలి అరుదని, తానతి ప్రయాసతో మొదట 3 ప్రతులను సేకరింపగలిగితినని, తదుపరి ప్రొఫెసర్ విల్సన్‌గారు (**Prof. Wilson**) లండన్‌లోని ఇండియా హౌస్ లైబ్రరి నుండి ఒక ప్రతిని పంపించిరని బ్రౌను ఎరిగించెను.[1]

కాలమునననుసరించి ఉత్తర రామాయణము తరువాత రచింపబడిన పద్య రామాయణములు, ఈ ఉత్తర రామాయణమును వెనుకకు నెట్టినను, ద్విపద ఛ్ఛందస్సుతో నొప్పుచున్న ఈ కావ్యము సాంప్రదాయకమైన, ప్రామాణికమైన తెలుగు భాషతో అలరారుచున్నదని బ్రౌను అభిప్రాయపడెను.[2]

6. 8. 1. బ్రౌనునకు ముఖ్యాశ్రితుడగు కేశవబ్రహ్మము ఒక లేఖ వ్రాసెను: "ద్విపద ఉత్తర రామాయణం మయలాపురిలో వక తావుననున్నది. దాన్ని బైటికి రాకుండా భద్రంగా పెట్టుకుని వున్నారు. దాన్ని గురించి నిండా యత్నం చేసి వున్నాను. రావచ్చునని నమ్మకం వున్నది."[3] బ్రహ్మయ్య ఈ ప్రతిని సంపాదించి పంపియుండవచ్చును.

D. 944 +. ఈస్ట్ ఇండియా హౌస్ లైబ్రరీలోని ప్రతిని చూచి వ్రాసినది.

D. 943 +. రెండు సంపుటములు. కాగితముకొకవైపు మాత్రమె వ్రాతకలదు. రెండవవైపున అక్కడక్కడ త్యక్త గ్రంథ భాగములు సవరణలు మొదలగునవి వ్రాయబడినవి. ఇందు బ్రౌను వ్రాసిన సంగ్రహమైన ఉపోద్ఘాతమున్నది. తాను సంపాదించిన నాలుగు ప్రతులలోని పాఠాంతరములిందు గుర్తింపబడినవి. ఈ ప్రతిని 1841వ సం॥న వ్రాయించెను.

D. 942+. నూతన పరిష్కృతప్రతియని బ్రౌను సూచించెను పై ప్రతిని మాతృకగగొని. పాఠముల నిర్ణయించి ఈ ప్రతిని వ్రాసిరి. పాఠములను సవరించునపుడు అట్లు సవరించుటకుగల కారణములు పేర్కొనబడినవి. కొన్ని పట్టులందు సంస్కృత మూలానుసారముగ సవరింపబడెను. ఈ పరిష్కృత ప్రతిలో బ్రౌను ద్విపదలకు సంఖ్యలను గుర్తించెను. ద్విపద

---

1. D. 943.
2. Ibid
3. Sr. of. Lt. M. 401. 126

భాగములకు సమముగ సంస్కృత మూలములోని సర్గల సంఖ్యలను కూడ పేర్కొనెను.

6. 8. 2. లభించిన నాలుగు ప్రతులలోనే పాఠభేదములధికముగ నున్నవట ఒక ద్విపదలోని ఒక్క పదమునకే రెండు మూడు భిన్న పాఠములున్నవట. ప్రత్యంతరము లధికముగ లభింపమిచే, ఉన్న పంక్తులే సిద్ధష్టములుగ భావింపవలసి వచ్చుచున్నదని బ్రౌను తెలిపెను.

ఉత్తర రామాయణమందలి అవాల్మీక సంఘటనలను గుర్తించెను.

"యీసైదు మొదలుకుని ౧౦౮ సైదు వర్కుయున్న గ్రంథం సంస్కృతమందు లేదు- పద్యకావ్యమందున (భాస్కర రామాయణము) యున్నది." అని గుర్తింపబడెను

భారత భాగవతముల కంటె విలక్షణముగ నున్న కథ పట్టులను పేర్కొనెను.

ఉదా : "నిరుపమ బలుడైన నృపుడు యయాతి
యమిశాలి వృషపర్వు నాత్మజయైన
శమిష్ఠ దనకగ్రసతిగా వరించి
మరి దేవయానను మహిత తేజస్వి
నెరయ శుక్రుని సూతునెమ్మిగైకొనియె"

ఈ ద్విపద పంక్తుల కెదురుగ "యీ కథ" భారత భాగవతములలో వ్యతిరేకము - యేమంటే శర్మిష్ట రెండో భార్య - పూరుడు కడాపటివాడు" అని గుర్తింపబడెను.

## 6. 9. పల్నాటి వీర చరిత్ర

6. 9. 0. పల్నాటి వీరచరిత్రకు బ్రౌను వ్రాసిన పరిచయ వాక్యములు :

"తెలుగు భాషలో సంస్కృతానువాదములు, కన్నడానువాదములేకాక తమిళానువాదములు కూడ ఉన్నవి. ఈ అనువాద సాహిత్యమే తెలుగులో అధికము. స్వతంత్రములైన ఉద్గ్రంథముల సంఖ్య తక్కువ. స్వతంత్రమని పరిగణింపబడు కావ్యములందును ప్రతి పుటయు సంస్కృతానుకరణమే. కతిపయములు మాత్రమే సరళశైలిలో తెలుగు భాషను నేర్వగోరు విదేశీయులకు అందుబాటులో నున్నవి. విద్యావంతులైన స్వదేశీయులు నిరసించు పదవాఙ్మయమును అతడు పరిశీలింపవల

యను. గ్రామీణులు పదవాఙ్మయమును మిగుల ఆశక్తితో పల్లించుచుందురు. ఇవి విదేశీయులకు కాలక్షేపమును కలిగించుటయేకాక, వారి అవసరమునకు కూడ అను కూలమైనవి. ద్విపద కావ్యములగు హరిశ్చంద్ర, నల, సారంగధర, ప్రభులింగలీలా బసవపురాణము ఒక స్వదేశీయునికి సులభముగ తోపవచ్చును. కాని విదేశీయునకి అవికూడ కొంతక్లిష్టమైన రచనలే. కనుక అతడు వేమన పద్యములకన్న ఒక మెట్టు మెరుగైన పల్నాటి వీరచరిత్రతో ప్రారంభింపవలయును. సంస్కృతానువాదములైన మహాభారత, భాగవత, రామాయణములకన్న నీది చదువ ప్రయోజనకారి "[1]

తెలుగు భాషనునేర్వ అభిలషించువారికి పల్నాటి వీర చరిత్ర సుకరమను అభిప్రాయముతో బ్రౌను ఈ ద్విపదకావ్య సంస్కరణమునకు 1842వ సం॥న పూనుకొనెను.

6. 9. 1, పల్నాటి వీరచరిత్ర ప్రతుల సేకరణమున బ్రౌను పడరాని పాట్లు పడినట్లు అతని లేఖలవలన విదితమగును. ఒకవీధి గాయకునిచేత పాడించుకొని, వ్రాయించుకొని నట్లున్నది. మెకంజీ సేకరణలో బ్రౌనునకు ఒక ప్రతి లభించినది. 1843వ సం॥ తనకు కదిరినుండి ఒక ప్రతి పంపబడినట్లు బ్రౌను పేర్కొనెను. దీనిని 'కదిరి గ్రంథము', 'కదిరి కావ్యము' అని వ్యవహరించెను. (D 1157 & 1164) కడపజిల్లా నొసం తాలూకు మునసపు కోర్టుగుమస్తా అయిన అవధానం అప్పయ్య 1844వ సం॥ ఒక ప్రతిని వ్రాయించి పంపెను.[2] దానినే 'కడప గ్రంథం' అని గుర్తించినట్లున్నది. ఈ ప్రతి ప్రస్తావన కాగితపు ప్రతులందు గలదు.

Mr. Newell దొరగారును ఒక ప్రతిని పంపిరి. (D 1159 & 1160) ఇది పంపబడిన కాలము తెలియదు అట్లే 'చర్లగుడిపాడులో దొరకిన ప్రతి' (D 1115) కాలమును తెలియదు. నెల్లూరు జిల్లా కోట తాలూకా వాసియైన చిట్టేటి లక్ష్మి రాఘవప్పనాయుడు బ్రౌనునకు 16-11-1852లో వ్రాసిన లేఖలో తనకు పల్నాటి వీరచరిత్ర కొంతభాగము లభించినట్లు మరియొక గృహస్థుని యొద్ద శేషించిన అర్ధ భాగమునట్లు తెలిసినదికాని ప్రస్తుతమాగృహస్థు గ్రామాంతరము పోయినందున వెంటనే ప్రతిని వ్రాయించి పంపవలను పడలేదనియు, లభించినంతవరకు గ్రంథమును పంప

1. D. 1156. పత్రము, 99.

2. Sr. of Lt. M. 419. P. 456.

గలననియు లేదా కొంతకాలము వేచియున్న పూర్తి గ్రంథమును పంపగలననియు విన్నవించెను.[3] బ్రౌను లక్ష్మీరాఘవప్పను ఉన్నంతవరకు గ్రంథమును పంపగోరి నట్లున్నది. లక్ష్మీరాఘవప్ప 18-1-1853న బ్రౌనునకు వ్రాసిన లేఖలో తాను పల్నాటి వీరచరిత్ర మొదటి భాగమును వ్రాయించి పంపినట్లు తెలిపెను.[4] ఆ గృహస్థు వచ్చిన పిదప 2వ భాగమునుకూడ పంపియుండవచ్చును. ఇది నెల్లూరిప్రతి. కాని యీ పేకిట ప్రతి ప్రస్తావన కాగితపు ప్రతులందు కానరాదు.

1852వ సం॥న బ్రౌను గుంటూరు జిల్లా బాపట్ల తాలూకాలో చేరిన పెద గంజాము వాస్తవ్యుడైన పెద అప్పయ్య హరిదాసు దగ్గర పల్నాటి వీరచరిత్ర ఉన్నట్లు తెలిసికొనిన బౌను గుంటూరు కలెక్టరు దొరగారి మూలమున హరిదాసును ప్రతిని పంపకోరెను. ఈ హరిదాసు 1818-19 ప్రాంతములలో నెల్లూరు జిల్లా తడ వగైరా కొఠార్లకు "సూపరిటన్‌డ్యాంటు"గ పనిచేసి, అస్వస్థత కారణముగ పదవిని విరమించెను. పల్నాటి వీరచరిత్ర వ్రాసినందులకు బ్రౌను రూ 50/- ఇచ్చెదననెను. కాని యీ హరిదాసు తనకు మరల ఆ పనిని ఇప్పించులాగున రెండు జాబులను వ్రాసెను[5]

ఈ లేఖలకు బ్రౌను ఆ మ. వీరభద్రయ్యగారిచే జవాబు వ్రాయించెను. పోయిన పనిని తిరిగి పొందుటకు పల్నాటి వీరచరిత్రను ఎరచూపవద్దని, అతనియొద్ద నిజముగనే ప్రతియున్నచో, తానిచ్చెడి 50 రూ లు పుచ్చుకొని వ్రాసి పంపుమని కచ్చితముగ వ్రాసెను[6] ఈ లేఖలను 'బ్రౌన్‌లేఖలు'లో ఉద్ధరించిన బంగోరెగారు "పై జాబుల్లో దర్శనమిచ్చిన ఆ 'బీద' హరిదాసు ఆ తర్వాత ఏమయ్యాడో తెలియదు. బ్రౌన్ కోరిన పల్నాటి చరిత్ర పంపాడా ? పోనీ ఏదైనా ఉద్యోగం సంపాదించు కొన్నాడా ? ఈ ప్రశ్నలకు సమాధానాలు అంత సులభంగా దొరికేవికావు" ( P 44 ) అని హరిదాసు తదనంతర వివరణముల కొరకు పరిశోధింపవలె ననిరి. ఆ హరిదాసు "౧౬ కథల గ్రంథమును (పల్నాటివీరచరిత్ర) గోవా

3. Sr. of. Lt. M. 432. pp. 23-24
4. Ibid. M. 431. p. 67.
5. i. Ibid· M. 427. pp. 267—268.
ii Ibid. M. 427. pp. 279—287.
6. Ibid. M. 427. pp 285—287.

కాగితాలమీద ౩ బుక్కులలో వ్రాశి వారి తావున (గుంటూరు కలెక్టరయిన పార్విసుదొరగారి) దాఖలు" చేసెను. అందులో కొన్ని కథలు లోపించినట్లు బ్రౌను అతనికి 15-2-1853న లేఖ వ్రాయగా,7 దానికి సమాధానమును హరిదాసు 11-6-1853న వ్రాసెను.8 ఆ లేఖను బట్టి బ్రౌను హరిదాసునకు తానిచ్చెదననిన రూ 50/- లలో రూ 25/- లనే ఇచ్చెననియు, తక్కిన రూ 25/- లను త్వరగ పంప హరిదాసు వేడుకొనెననియు తెల్లమగును. ఈ హరిదాసు బ్రౌను పుస్తక ప్రీతిని ఊతగగొని వ్యాపారము చేయదలంచినట్లు ఆతని లేఖల వలన తెలియు చున్నది. బ్రౌను అతడాశించినట్లు ఉద్యోగమును ఇప్పించలేదు. తాను వ్రాసి యిచ్చెదనవిన కథలకన్నను అయిదింటిని అదనముగనే హరిదాసు వ్రాసియిచ్చెనట. "సదరు జాబితాలోనమోదు అయివున్న ౧౦ కథలుగాక తమ యొక్క అనుగ్రహం సంపాదించుకోవలెననే తాత్పర్యం చేత యీదేశమందు యితర్ల వద్దవుండే కథలు ౩ వ్రాశియిచ్చి వున్నాను - మొదట నేను ౫౦ రూపాయలకు వొప్పుకొని వ్రాయ వలశినకథలు కంటె ౩ కథలు యిజాఫాగా (      ) వ్రాశి యిచ్చివున్నాను. గనుక నాకు రావలశిన రు ౨౫ లు న్యాయంగా దయచేయించవలెను."9 హరిదాసు పంపిన ప్రతినే "గుంటూరు ప్రతి" గ బ్రౌను పేర్కొని యుండును.

కృష్ణారెడ్డి కూడ ఒక ప్రతిని సంపాదించిపంపెను. (D 1184).

ఇట్లు బ్రౌను వివిధ ప్రతులను వివిధ ప్రాంతముల నుండి సంపాదించెను.

6. 9. 2. ఈ మూల ప్రతులాధారముగ బ్రౌను 50 కాగితపు ప్రతులను వ్రాయించెను.10 పల్నాటి వీరచరిత్రలో ప్రధానమగు 1. కోళ్లపోట్లాట. 2. రాచ మల్లు రాయబారము 3. గురజాల యుద్ధము. 4. కల్లు ప్రతిష్ఠ. 5. బాలునికథ. 6. బాలుని యుద్ధము. 7. కన్నమనేని యుద్ధము. 8. కొమ్మరాజు యుద్ధము. 9. బ్రహ్మనాయని విఋగు-అను కథలకు సంబంధించిన కాగితపు ప్రతులివి.

---

7. Ibid  8. Ibid  9. Ibid. M. 431 P. 99

10. 'డి 1112 నుంచి డి. 1174 దాకా 60పై చిలుకు' ? - బ్రౌన్ లేఖలు. పు. 46. ఈ వ్రాత పొరపాటు.

1. కోళ్ల పోట్లాట.

D. 1112. దీని వ్రాత 19-12-1842లో ముగిసినట్లున్నదని 'క్యాటలాగు'లో పేర్కొనినారు కాని వ్రాతప్రతిలో ఆ తేది కానవచ్చుటలేదు. ఇందలి పాత్రముల బంధుత్వములు, పూర్వగాథలు కథాభాగము నందెచట వచ్చునో ఆ పుటలు పేర్కొనబడినవి గుంటూరు నుండి వచ్చిన ప్రతిలోని పాఠ భేదములు ఇందు ఎక్కించబడినవి.

D. 1121. పై ప్రతిని చూచి క్రొత్తగ దీనిని జూన్ 1850లో వ్రాసినట్లు బ్రౌను తెలిపెను.

D 1130 బ్రౌను రచించిన ఆంగ్ల టిప్పణులు పెక్కుచోట్ల కలవు. పుస్తకము మొదటి నాల్గు పుటలలో బ్రౌను ఆంగ్లమున ఉపోద్ఘాతమును వ్రాసెను. అది పల్నాటివీర చరిత్ర కంతటికి సంబంధించినది. ఈ వ్రాతప్రతి 12-8-1842 లో ముగిసినదట.

D 1149 ఇది నూతన పరిష్కృతప్రతి. బ్రౌను ఆనతిని వీరభద్రయ్య దీనిని 1850 లో పరిష్కరించెను.

2. రాచమల్లు రాయబారము :

D 11.3. 24-12 1842 వ సం॥న దీనిని వ్రాయించినట్లున్నదని 'క్యాటలాగు' లో పేర్కొనబడెను. కాని వ్రాతప్రతిలో ఈ కాలసూచన కానరాదు.

D 1122 (+) D 1150

3. గురజాల యుద్ధము :

D 1114

D 1123. ఇది 30-12-1842 లో వ్రాయబడెను.

D 1132. ఇది 26-12-1843 లో వ్రాయబడెను.

D 1151

4. కల్లు ప్రతిష్ఠ :

D 1151 చర్లగుడిపాడులో దొరకిన ప్రతితో పోల్చి, అందలి పాఠములు గుర్తింపబడినవి. గుంటూరు ప్రతి పాఠములును గలవు. గ్రంథాంతమున నొక పది పంక్తులలో కథాసారము తెలుగున కలదు.

D 1124

D 1133 బ్రౌను వ్రాసిన ఆంగ్లటిప్పణులు పెక్కుచోట్ల గలవు. దీనిని రెండు ప్రతులతో పోల్చినట్లు బ్రౌను పేర్కొనెను.

*D*. 1145. ఇది రెండవ 'వాల్యూం' (Volume)గ గుర్తింపబడినది. మొదటి సంపుటమున కన్న ఈ సంపుటము తీర్పు ముందుగనే ముగిసినదట.

D. 1152.

D. 1159. ఇది న్యూవెల్‌గారు (Mr Newell) 1847వ సంగన తనకు పంపిన ప్రతివి చూచి వ్రాయబడినదని బ్రౌను తెలిపెను.

5. బాలునికథ :

D. 1116. ఇది కడపనుండి వచ్చిన ప్రతితో పోల్చబడినది.

D. 1125.

D. 1134. అయోధ్యాపురం కృష్ణారెడ్డి పంపిన ప్రతి. దీనిని కదిరి గ్రంథముతో పోల్చిరి. కృష్ణారెడ్డి ప్రతిలోలేని భాగములను తదితర ప్రతులతో పోల్చి పూరించిరి.

*D*. 1139. ఇది 11-8-1843లో వ్రాయబడెను.

*D*. 1142 ఇది రెండుమారులు సవరించిన చిత్తుప్రతి. దీనికి సాఫు ప్రతికూడ వ్రాయబడినట్లు తెలుపబడెను.

D. 1146.

D. 1156. కల్లు ప్రతిష్ఠ తుది భాగమునుండి, బాలుని కథ పూర్తిగ నున్నది. బ్రౌను పల్నాటి వీరచరిత్రను గూర్చి ఆంగ్లమున వ్రాసిన అసమగ్రమైన ఉపోద్ఘాతము ఈ సంపుటము 91వ పత్రమున కలదు. గుంటూరు నుండి వచ్చిన ప్రతిని చూచి, మధ్యనుండి వ్రాయబడినదట. గుంటూరు ప్రతిలోని కథ క్రొత్తదని తెలుపబడెను.

6. బాలుని యుద్ధము :

D 1117 గుంటూరు ప్రతితో పోల్చబడెను. గుంటూరు ప్రతిలో 21 పత్రముల వరకే బాలకథ కలదట ఆ తరువాతి భాగము గుంటూరు ప్రతిలోలేదు.

D 1126 శివయ్య అనునతడు ఈ బాలుని యుద్ధమును సంపూర్ణముగ వ్రాసినట్లు చేవ్రాలు కలదు

D 1135 దీని కాలము 9-12-1842 అని 'క్యాటలాగు'లో నున్నది కాని వ్రాత ప్రతిలో లేదు.

D 1155 ఇది మెకంజి ప్రతి.

D 1157 ఇది కదిరి నుండి వచ్చిన బాలుచరిత్ర. దీనిలో అంక సంఖ్యగల తాళ పత్రమునుండి కొంత ఎత్తి వ్రాయబడెను. ఒక పది పుటలు (28-38( ప్రమాదముచే వ్రాయక విడువబడినట్లు బ్రౌను తెలిపెను.

D 1160. ఇది న్యూవెల్‌గారు పంపిన ప్రతి కానోపును.

D 1163. ఇది 1850 వ సం॥న తయారు చేయబడిన నూతన ప్రతి అని బ్రౌను వ్రాసెను. సందేహముగ నున్న పాఠములు 'విచారణీయం' అని గుర్తింపబడినవి యతిభంగ, ప్రాసభంగములు సూచితములు. కదిరి గ్రంథములోని కథను ఎత్తి వ్రాసిరి.

D 1164 ఈ ప్రతి వ్రాత 24-8-1844 న ముగిసెను. దీనిని కదిరి కావ్యమని పేర్కొనిరి.

7. కన్నమసేని యుద్ధము :

D 1118.

D. 1127.

D. 1136. ఇది 15-12-1842వ సం॥న వ్రాయబడెను.

D. 1158. కొన్ని పదముల కర్థములు కలవు.

8. కొమ్మరాజు యుద్ధము :

D. 1119. కడిరి గ్రంథముతో పోల్చి లుప్తభాగములు పూరింపబడినవి.

D. 1128.

D. 1137.

D. 1141.

D. 1143. దీనిని బ్రౌను "Revised and Ready" అని గుర్తించెను. అక్కడ క్కడ పదముల కర్థములు కలవు.

D. 1147.

D. 1154.

9. బ్రహ్మనాయని విఱుగు :

D. 1120.

D. 1129.

D. 1138. ఇది 17-12-1842లో వ్రాయబడినట్లున్నది. 29-6-1842లో దీనిని మొదటసారి పరిశీలించుట ఆయెనని బ్రౌను తెలిపెను.

D. 1144. దీనిని బ్రౌను 21-2-1850లో వ్రాయించినట్లు "క్యాటలాగు"లో నున్నది. వ్రాత ప్రతిలో లేదు.

D. 1148.

ఒక్కొక్క కథాభాగమునకు సంబంధించిన పై ప్రతులుకాక, సమిష్టిగ పల్నాటివీర చరిత్రను వ్రాయించిన కాగితపు ప్రతులున్నవి :

D 1140— పల్నాటివీర చరిత్రము కొంత ఆనుపూర్వితో నున్న గ్రంథము. ఇందు పల్నాటి యుద్ధమున ప్రసక్తులగు నిరుపాగుల వీరుల యొక్కయు, పూర్వజన్మ వృత్తాంతములతో కథారంభము కలదు. కోళ్ళపోట్లాట, రాచమల్లు రాయబారము, కల్లుప్రతిష్ఠ, కన్నమనేని యుద్ధము, బాలుని కథ సంగ్రహముగ కలవు. బ్రౌనునకు ఈ ప్రతి ఇట్లే లభించియుండ వలెను. ఇది పైన పేర్కొన్న ప్రతులకన్న రచనలో భిన్నమైనది. ఇతర మంజరీ రచనలకన్న నీ రచనము మేలైనది.

*D* 1153— ఇది పైదానికి ప్రతిక.

ఈ ప్రతులలో తెలిసినంతవరకు ఆయా కథాభాగములను రచించిన కర్తల పేరులు, లోపించిన కథాభాగములు ద్విపదరచనలు, మంజరీరచనలు గుర్తింపబడినవి. ఒకే కథాభాగమునకు చెందిన విభిన్న ప్రతులను బ్రౌను సూచించెను. రచనలో మార్పున్నచో తెలిపెను. వీనిని ఒక్కమారుకాక పెక్కుమారులు పరిశీలించి, పరిష్కరించినట్లు తోచును. ఒక చిన్న గ్రంథ పరిష్కరణమే ఎంతో వ్యయ ప్రయాసలతో కూడియుండును. అట్లుండ బ్రౌను వివిధరచయితలు రచించిన విభిన్న కథాభాగములు గల పల్నాటివీర చరిత్రకు, దేశమునన్న వివిధ ప్రాంతముల నుండి ఇన్ని ప్రతులను సేకరించి, సంకీర్ణముగ, అస్తవ్యస్తముగ నున్న వానిని రెండు, మూడు పర్యాయములు పరిశీలించుట ఆతని ఓర్పుకు పట్టుదలకు నిదర్శనము.

6 9. 3. ఈ ప్రతులలో కొన్నింటియందు బ్రౌను సంగ్రహవివరణలను, పరిచయములను, కొన్నింటియందు సుదీర్ఘమైన ఉపోద్ఘాతములను ఆంగ్లమున రచించెను. పలనాటి వీరచరిత్ర లేక సప్తనాయక యుద్ధము (1) పలనాడులోని గురజాల, మాచర్ల పట్టణముల నిమిత్తము జరిగెను. ఈ నాయకులలో కొందరు ఆలమందల కామందులు (Cow heros). ఈ యుద్ధము ఏడేండ్లు జరిగెను. కోళ్లపందెము ఈ పోరాటమున కారంభము. (D. 1121) అని బ్రౌను ఒకచోట పేర్కొనెను.

గురజాల, మాచర్ల పట్టణములు ఇండియా మ్యాప్ (Map)లో కృష్ణానది దక్షిణపు ఒడ్డునకు N L. 16° & E. L. 80° లలో, హైదరాబాదునకు ఆగ్నేయ దిక్కున (South East) ఉన్నట్లు బ్రౌను వ్రాసెను. (D. 1130) పల్నాటి వీరుల యుద్ధకాలమును గురించి, ఆనాటి సాంఘిక వ్యవస్థను గురించి, అందలి భాషను గురించి బ్రౌను కొంత సుదీర్ఘముగ చర్చించెను. (D. 1130). బ్రహ్మనాయని నిర్యాణకాలము స్థానిక చరిత్రలో (Local Records. Vol X. P. 287) గుర్తింపబడినది. ఆ కాలము కృష్ణదేవరాయల నిర్యాణమున కత్యంత సమీపముగ నున్నది. ఈ యుద్ధము జరిగిన కాలము శాలివాహన శకము 938 అనగా క్రీ. శ. 1015 అగును.

ఇందలి భాష, శైలి ప్రాచీనతను సూచించుచున్నవి. ఈ పల్నాటి యుద్ధము నాటికి మహమ్మదీయుల ఆచారవ్యవహారముల ప్రభావము ఆంధ్రదేశముపై ప్రసరించి

నట్లు విదితమగు చున్నదని బ్రౌను విశదీకరించెను.

వచ్చెరా పిన్నన్న వరుసతో మీరు
అడ్డదెర బట్టించె నీల వర్ణుండు
నిశ్చలచిత్తుడై పలికి నా యుండ

**Her son Brahmanna went to consult her; she sat inside the curtain and he outside Her having the curtain between her and her son shows that the fashions of the Muslimans had been introduced already. At least in the time when the pcem was written.** (**D. 1130.** పు ౨౧౪) హైందవ స్త్రీలును మేలి ముసుగులను ధరించెడివారు. తెరవెనుకనుండి మాట్లాడుట లనునది అంతఃపురఆచారము కావచ్చును. కాని బ్రౌను దానిని మహమ్మదీయుల సంప్రదాయముగ భావించెను.

కవి తనకిష్టమగు దేశరాజుల నందరిని ఇందు ప్రవేశపెట్టెనట. బెంగాలు చీరాల దేశరాజులను, 30 కోట్ల సైన్యమును యుద్ధమున పాల్గొనునట్లు కవివర్ణించెనట.

(D. 1130).

"పలనాటి వీరగాథలు : బ్రౌన్ అవగాహన" అను వ్యాసమున రచయిత్రి బ్రౌను బ్రహ్మనాయుడును **"Lady Brambi"** అని పొరపాటుగ అర్థము చేసికొనినట్లు పలనాటి వీరచరిత్ర కాగితపు ప్రతి *D* 1130 నుండి కొన్ని ఘట్టముల నుదాహరించిరి.11 వ్రాత ప్రతిని సునిశితముగ పరిశీలింపగా, బ్రౌను నాయకురాలికి **Lady Bramhi** అను నామకరణ మొనర్చినట్లు తెలియును. బ్రహ్మనాయుడును బ్రౌను స్త్రీగ అవగాహన చేసికొన లేదనుటకు నిదర్శనములు :

అని బుద్ధిగా జెప్పి అనుప, నాయకుడు
తన వతారుకు బోయి తలకొన్న వేడ్క
అభ్యంగ జలకంబు అమరంగా నాడి

**Then the hero of the poem Bramhi Naid went and bathed. And he then dressed-Description of his jewels (D 1130** పుట **3)**

11. సీత. ప్రేలిచం : పలనాటి వీరగాథలు : బ్రౌన్ అవగాహన భారతి. 1977 అక్టోబరు. పుటలు 36-42.

అకారణముగ బ్రౌను నాయకురాలికి Lady Brambi అని పేరు పెట్టలేదు. ఆ ప్రతి యందు :

Bhama బ్రహ్మిగారికి మొక్కిపని వినగాని

Is it proper for me to return without speaking to the lady?" (Ibid పుట. 10)

'భామ' అను నాయకురాలిని సూచించు పదమును పరిష్కర్తలు 'బ్రహ్మి' అని సవరించినందువలన బ్రౌను 'Lady Bramhi' అని వ్యవహరించెను.

'Lady Bramhi

నాయకురాలుకు మిక్కిలి నమ్మిన బంట్లు

ఆదిగా గొలువంగ అతివైభవముగ'

'The Lady Nagamma Baroness of Arcvelli-She had no offspring' (Ibid పుట. 48).

ఇట్లు ఆ వ్రాతప్రతి యందంతట నాయకురాలినే బ్రౌను 'Lady Bramhi' అని పేర్కొనెనుగాని బ్రహ్మినాయునికాదు. బ్రౌను పలనాటి వీరగాథను చక్కగనే అవగాహన చేసికొనెను.

నాయకురాలి పతన ఘట్టములో "Compare the similar termination of a Queens adventures in the history of Ayesha widow of Mohammad - Also of the fallen Queen of Lahore in 1846." (D 1138. పు 590) అని బ్రౌను ప్రాచీన సమకాలీన చరిత్ర సామ్యమును పోల్చి చూడుడనెను.

*D* 1139 ప్రతిలోని గాథ పల్నాటివీర చరిత్ర ఉత్తర భాగమునకు సంబంధించినదని, దీనినొక ఆధునికుడు రచించి యుండునని ఇది మూలమున కన్న భిన్నముగ నున్నదని, ఇందలి రచన కొంత సంస్కారవంతముగ నున్నదని బ్రౌను తెలిపెను. కథాంశమొకటే అయినను అవతారికాభాగము భిన్నముగ నున్నది. ఈ కవి తాను శ్రీనాథుని రచనను అనుకరించినట్లు చెప్పెను. కాని ఈ కవి రచన సుదీర్ఘ వర్ణనలతో, విడివిడి ఉపాఖ్యానములతో విసుగును కలిగించుచున్నది. అవతారికాభాగము కేవలము ఉత్తరరామాయణ అనుకరణమట.

బ్రౌను ఈ పల్నాటి వీరచరిత్రను కూడ ముద్రింప సంకల్పించెను. కాని అప్పటికాతని ఆరోగ్యము వికటించుటచే, భారతదేశమును వీడి స్వదేశమునకు తిరిగి పోవలసి వచ్చెను.

6. 10. అభిమన్యు కల్యాణము :

6. 10. 0. భారతమున గల శశిరేఖాభిమన్యుల కల్యాణ కథ యిందైదాశ్వాసములలో వర్ణితము. గ్రంథకర్త శేషము వెన్నుభట్టారకుడు.

ఇది సుగ్రహము. సరళము, హృద్యమునగు రీతిని రచితమయ్యెనంయు, విదేశీయులకిది అరంభమున చదువదగినదనియు ఈ కథ భారతమందలిదైననను వర్ణిత విషయములన్నియు. కల్పితములే యనియు ఈ గ్రంథమిట్లు తెలుగున మాత్రమే కలదనియు, ఇంచుమించు 3250 ద్విపదలు ఇందున్నవనియు బ్రౌను కథాసంగ్రహంతమున అంగ్లమున వ్రాసెను,[1]

తొట్టతొలుత ఈ గ్రంథమును 1843వ సం॥న బ్రౌను పరిశీలించినపుడు, తెలుగుభాషలో ఈ ద్విపద పఠనీయ కావ్యములలో నొకటి. ఈ కావ్య ప్రణాళిక బ్రాహ్మణమత సంబంధియైనను, ఇందలి దేవతలు, నాయకులు, నాయికలు మానవులుగ చిత్రింపబడిరి. వారి ప్రవర్తన సహజముగ ప్రదర్శితము. ఇందలి శైలి స్వచ్ఛమైనది, చక్కనిది" అని తన అభిప్రాయమును వెల్లడించెను.

6. 10. 1. బ్రౌను ఈ కావ్యమునకు 5 కాగితపు ప్రతులను తయారు చేయించెను.

---

1. "This poem is a beautiful composition, in an easy, flowing melodious style and excellently suited for foreigners who are beginning to study Telugu. It is wholly original, though the outline is found in the Mahabharat. As a separate romance it exists in Telugu alone It contains about 6500 lines in the Dwipada metre : or 3250 couplets. (D. 1023).

2. This is one of the most agreeable poems in the Telugu language - its plan is braminical, yet all the gods and goddesses and heroes and heroines are described as ordinary folks behaving in an easy natural manner. The style of language, is pure free and beautiful- D. 1025.

D 1024 + ఇది 17-3-1843 లో వ్రాయబడెను. ఈ కావ్యమందలి ద్విపద సంఖ్యను బ్రౌను ఈ ప్రతిలో చూపెను. హరిశ్చంద్ర ద్విపదలో 6268 పంక్తులు మాత్రమే ఉన్నవని, ఇందు 6253 పంక్తులున్నవని లెక్కలు చూపెను.

D 1025 + దీని వ్రాత 24-1-1843 గ గుర్తింపబడెను పాఠభేదములు గుర్తింపబడినవి. నిర్దుష్టపాఠములు పెన్సిలుతో ప్రక్కను వ్రాయబడినవి. కడపట్టు ఇందు బ్రౌను వ్రాసిన ఆంగ్ల టిప్పణములు గలవు

D 1023 + ఈ ప్రతి వ్రాత 1847 వ సం॥న మార్చి 24 వతేదికి ముగిసినదట. ఇందు ప్రతిపత్రము పై భాగమున "Corrected Edition. 1847" అని బ్రౌను వ్రాసెను. ఇందక్కడక్కడ పదముల అర్థములు పుటకు పార్శ్వములందు వ్రాయబడెను. బ్రౌను వ్రాసిన ఆంగ్ల వివరణములు ఇంచుమించు అన్ని పుటలందును కానవచ్చును. 133 వ పత్రములో నారంభించి, 43 పుటలలో ఈ ప్రబంధ కథాసంగ్రహమును ఆంగ్ల భాషలో బ్రౌను వ్రాసెను. అది 1847 వ సం॥ ఏప్రిల్ 6 వ తేదీన ముగిసినట్లు తెలిపెను ఈ ప్రతిని 'Abhimanyu Dwipada 2nd copy' అని బ్రౌను గుర్తించెను.

D 1022 + పై ప్రతిని ఆధారముగ చేసికొని 2-5-1847లో మరల నూతన పరిష్కృత ప్రతిని తయారుచేయించెను ఈ ప్రతి ఆరంభమున బ్రౌను "This is the new corrected Edn of the poem" అనివ్రాసెను. దీనిని Abimanyu Dwipada 1st copy' అని బ్రౌను పేర్కొనెను.

D 1027— ఇందు తొలి 160 ద్విపదలు మాత్రమున్నవి.

6 10.2. ఈ కావ్య పరిష్కర్తల, వ్రాయసకాండ్ర నామధేయములు తెలియవు.

మూడవ ఆశ్వాసములో లక్షణునికి శశిరేఖ నిచ్చి వివాహము చేయుటకు పూనుకొను సందర్భమున ఘటోత్కచుడు శశిరేఖగా మారి ఇతరులకు అతి సుకుమారి యైన స్త్రీగను, లక్షణునకు భయంకరముగను కనుపట్టు సందర్భములో, ఘటోత్కచుని మాయలతో కూడిన ఇటువంటి ఇతివృత్తము ఆంగ్ల భాషలో జానపద సాహిత్యమున నున్నట్లు బ్రౌను తెలిపెను.[3] ఘటోత్కచుడను పేరునకు వ్యుత్పత్తిని ఆంగ్లమున చూపప్రయత్నించెను.[4]

---

3. D. 1023. 4. D. 1025.

ప్రకరణ సారాంశము :

1. బ్రౌను 41 ద్విపద కావ్యములను సముద్ధరించెను. వీటిలో పదుమూడింటిని పరిష్కరించెను. ఒక్కదానికి పాఠాంతరములను గుర్తించెను. ఇరువదియేడింటికి కాగితపు ప్రతులను తయారు చేయించెను.

2 తెలుగు ద్విపద కావ్యములలో ప్రధానములైన రంగనాథ రామాయణ, బసవ పురాణ, పండితారాధ్య చరిత్రలను బ్రౌను పునరుద్ధరించెను.

3. ద్విపదలలో రసవత్కావ్యములైన సారంగధర చరిత్ర, నవనాథ చరిత్ర, పల్నాటి వీరచరిత్రలు బ్రౌను పుణ్యమున పఠన యోగ్యములైనవి.

4. బసవపురాణ పండితారాధ్య చరిత్రలు ఆధారముగ బ్రౌను జంగము లాచరించు శైవమతమును పరిశోధించి జంగముల ఆచారవ్యవహారములను వెలుగులోనికి తెచ్చెను.

5. "ముదివిటులు విధవలంజలు పదకవితలు" అని పండితుల ఈసడింపునకు గురియైన ద్విపద కావ్యములు అమూల్యరత్నములని, తెలుగుభాష నుడికారము వీనియందు గుప్తమైయున్నదని, భాషనలవరచుకొనువారికివి అత్యంతోపయోగకరములని బ్రౌను వానిని పరిష్కరించి, శుద్ధప్రతులు తయారు చేయించి లోకము గుర్తించునట్లు ఒనర్చెను.

6. ద్విపదలలో హరిశ్చంద్ర చరిత్రను, నవనాథ చరిత్రలో కొంతభాగమును ప్రప్రథమమున ముద్రించినవాడు బ్రౌను.

7. పల్నాటి వీరచరిత్రలో కరుణరస పూరితమయిన బాలునికథ బ్రౌనునకు అత్యంతప్రీతి పాత్రమైన ఘట్టము. ఆద్యంతముల నేర్పరుప వీలులేకుండ, బహుకర్తృకముగనున్న పల్నాటి వీరచరిత్ర ప్రతులను దేశమంతటి నుండి సేకరించి, వాని కొక ఆనుపూర్వినేర్పరచి, సునిశిత విమర్శనాపూర్వకమగు ఉపోద్ఘాతముతోడి శుద్ధప్రతిని తయారుచేసి, బ్రౌను తెలుగువారి వీరగాథను పరిరక్షించిన పుణ్యము కట్టుకొనెను.

ఇట్లు బ్రౌను ద్విపదలకు తెలుగు కావ్యములందు సముచిత స్థానమును కల్పించెను.

---

# 7

# శతకముల సంస్కరణ

7. 0. ఆంధ్రవాఙ్మయమున ప్రశస్తమగు కవితాప్రక్రియలలో శతక శాఖ యొకటి. శతకములు పండితులను, పామరులను, పిన్నలను, పెద్దలను రంజింప జేయును. ఇవి పురాణములవలె కథాప్రధానములు గావు; ప్రబంధములవలె వర్ణనా ప్రధానములు గావు; ద్విపదలవలె దీర్ఘపరిమితములు కావు. ఇవి ముక్తకములయ్యు ఏకసూత్రత గలవి; సుసంస్కృతములైనను సులభగ్రాహ్యములైనవి. వీని యందలి సారళ్యమే, సులభగ్రాహ్యతయే బ్రౌను నత్యంత మాకర్షించెను. వేమన శతకము ఉపోద్ఘాతములో బ్రౌనిట్లు నుడివెను. సులభశైలి, వివిధ విషయములు విపులముగా ఇందు వర్ణింపబడుటయే ఇందలి విశేషము. ఆ కారణముచేత ఆ భాషను అభ్యసించు వారికిది మిక్కిలి ఉపయోగకరము."[1]

శతకము లన్నింటి యందలి యీ లక్షణమే బ్రౌనును 84 శతకముల సేకరణకు, సంస్కరణకు ప్రేరేపించినది. బ్రౌను సేకరించిన ఈ 84 శతకముల కాగితపు ప్రతులు మ. ప్రా. పు. భాండాగారమున కలవు.

## 7. 1. 0. వేమన శతకము :

వేమన శతకమును ఉద్ధరించిన విదేశీయులలో బ్రౌను ఆద్యుడు కాకపోయినను అద్వితీయుడని నిస్సంకోచముగ చెప్పవచ్చు. ఆబే దుబాయ్ ఫ్రెంచిభాషలో వ్రాసిన "హిందూ మేనర్స్, కస్టమ్స్ అండ్ సెరిమినీస్" (1816) అను గ్రంథమున వేమన ప్రస్తావన గలదు దుబాయ్ ప్రస్తుతించిన యోగి వేమనను గురించి బ్రౌను పరిశోధించి, అతని పద్యములను సేకరించి, అవకాశమొదవినప్పుడెల్ల నాతని పద్యముల నాంగ్లీకరించి, గ్రీకు భాషలోని 'లూసియన్' అను వానితో వేమనను పోల్చుచుండెడి

---

1. "VEMANA — whose writings are peculiarly useful to those who study the language, the style being simple and the variety of topics very extensive". —
Verses of Vemana. P. i.

వాడు గ్రీకు దేశమున 'లూసియన్' అను నతడు ప్రజాదరణను పడసెనవాడ. అట్లే తెలుగున ప్రజాదరణమును మరగొనిన వేమన పద్యముల సముద్ధరణమునకు బ్రౌను పూనుకొనెను.

7. 1. 1. ప్రతుల వివరణము : మ. ప్రా పు భాండాగారమున వేమన పద్యములకు సంబంధించిన అనేక తాళపత్ర ప్రతులు, 17 కాగితపు ప్రతులున్నవి. ఈ కాగితపు ప్రతులన్నియు బ్రౌను తయారు చేయించినవియే. కాలక్రమము ననుసరించి పరిశీలించినచో వీనిలో D. 1773 బ్రౌను సిద్ధపరచిన మొదటిప్రతి.

*D.* 1773 ఇది 5 సంపుటముల ప్రతి. ఇంచుమించు 2238 పద్యములున్నవి. ఇందులో బ్రౌను సూచికలు, గమనికలు, ఉపోద్ఘాతమే కాక, పద్యములకు బ్రౌనుద్వార కావించిన ఆంగ్లానువాదమున్నది. 5వ సంపుటమున అశ్లీలములనికాబోలు అన్ని పద్యములకు అనువాదములేదు. అట్టి అసభ్యపద్యములు కొన్ని లాటిన్ భాషలోనికి అనువదింపబడినవి. పుటకు ఒక ప్రక్క తెలుగు పద్యములు, ఎదుటి ప్రక్క ఇంగ్లీషు అనువాదమున్నది. 5 వ సంపుటారంభములో 13 పద్యములు విడువబడినవి.

బ్రౌను ప్రథమ సంపుటమును 15-4-1824న ప్రారంభించి, 31-7-1824న ప్రారంభించి, 31-7-1824 న పూర్తియొనర్చెను

ద్వితీయ సంపుటములోని పద్యానువాదమును 8-8-1824 న ప్రారంభించి 4-11-1824 న ముగించెను. ఈ సంపుటమున 1827 వ సం॥న బ్రౌను వ్రాసిన ఒక సూచిక ఉన్నది. వేమన పద్యములకు తాను తయారుచేయించిన పద్యానుక్రమణికను గూర్చిన వివరములు, నిఘంటువున ఈ శతకమెట్లు గుర్తింపబడెనను విషయములు విశదీకరింపబడెను.

తృతీయ సంపుటమున 973-1516 పద్యములున్నవి. రోజుకు 8 పద్యముల చొప్పున 5-11-1824 న అనువాదమున కుపక్రమించి, 18-1-1825 నాటికి ముగించెను.

చతుర్థసంపుటమునందును బ్రౌను ఉపోద్ఘాతమున్నది. దీనిని 18-1-1825 న ఆరంభించి, 21-4-1825 న పూర్తి యొనర్చెను.

పంచమ సంపుటము ఒక అనుబంధము. సంప్రతించిన తాళపత్రప్రతులందు పై నాలుగు సంపుటములలో చేరని వానిని ఒక అనుబంధముగ సమకూర్చెను. ఈ

సంపుటాంతమున 23-11-1824 న బ్రౌను రచించిన వేమననాటి ఆంధ్రదేశపుస్థితి గతులు, తెలుగు భాషాప్రశంస, వేమనను గూర్చిన జనశ్రుతి, వేమన పద్యములను గూర్చిన ప్రశంసలతోడి ఉపోద్ఘాతమున్నవి.

D. 1774 — ఇది D 1773నకు ప్రతిక. కాని యిందు సుమారు 1350 పద్యములు మాత్రమే ఉన్నవి. అక్కడక్కడ సవరణలు బంతులనడుమ కూర్చబడి నవి ఒక్కొక్క పద్యమునకు క్రింద ఆంగ్లభాషాంకతరీకరణమున్నది. D. 1773 ప్రతిలోని పద్యసంఖ్యకు ఇందలి పద్యసంఖ్యకు భేదముకలదు

D. 2094. ఇది వేమన పద్యములకు బ్రౌను సమకూర్చిన పద్యసూచి. 'అ' నుండి 'హ' వరకు అకారాది క్రమమున పద్యములు వ్రాయబడి సంప్రతించిన ఆయా ప్రతు లోని వాని సంఖ్యలు గుర్తింపబడినవి. గ్రంథాంతమున ఆంధ్రచ్ఛందస్సును గూర్చి బ్రౌను వివరణమును లేఖకులెవరో చేర్చి యున్నారు. ఈ సంపుటము క్రిమిదష్టము; శిథిలము.

D. 3098. ఇది వేమన శతక పద్యసూచికి సాపు ప్రతి. దీనిని 1824వ సం॥ నవంబరు నెలలో తయారు చేయించినట్లు బ్రౌను పేర్కొనెను. మూల ప్రతుల వివరములున్నవి.

D. 1732— మూడు సంపుటములు ఇది 'బెండమూరి లంకప్రతి' నుండి ఉద్ధరిం పబడినది దీని మాతృక (మూలప్రతి) పెనుగొండ వాస్తవ్యుని యొద్ద లభించినది. కాని ఆ ప్రతిని అమ్మటకాతడు ఇచ్ఛగింపనందున దానిని కాగితములపై 1834వ సం॥ ఫిబ్రవరి నెలలో వ్రాయించినట్లు బ్రౌను తెలిపెను.

ఇందు 1116 పద్యములు మాత్రమే కలవు.

D 1723— డి 1735 న కిది ప్రతిక కావచ్చును. గ్రంథాదిలో 'బెండమూరిలంక_ వేమన పద్యముల సూచి' అని యున్నది. ఇందు జతపరుపబడిన వేమన పద్యముల వ్రాతప్రతి కిది పద్యసూచియని బ్రౌను పేర్కొనెను.

D 3101 + రెండుసంపుటములు. 1839 వ సం॥న ముద్రణకు తయారుచేసిన ప్రతి యిది. 1824 వ సం॥న చేసిన సేకరణలోలేని అనేక నూతన సూక్తులింద చిన్నచిన్న కాగితములపై వ్రాసి, ఆయాస్థలములందు

అతికింపబడినవి. మరికొన్ని గ్రంథాంతమున చేర్చబడినవి బ్రౌను తన నిఘంటువున, ఈ ప్రతిని '+' అను సంజ్ఞతో గుర్తించినట్లు తెలిపెను.

D 1736— ఇందు 252 పద్యములున్నవి. "మాతృకాగ్రంథము ఇంతే Here the original book breaks off" అను బ్రౌను సూచన కలదు

D 1737— ఇందు 794 పద్యములు మూడుభాగములుగా కలవు మొదటి భాగములో 47, 2వ భాగమున 468, 3వభాగమున 279 పద్యములున్నవి.

D 1833— ఇందు 557 పద్యములున్నవి.

D 1721 + ఇందు 1166 పద్యము లుద్ధరింపబడినవి. అవి నాలుగు భాగములుగ విభాగింపబడినవి. గ్రంథాంతమున 27 పుటలలో వర్ణాను క్రమమున పద్యసూచి కలదు ఇది 1842వ సం॥న సంతరింపబడిన ప్రతి అని బ్రౌను పేర్కొనెను, వేమన పద్యములుగ చెలామణి యగుచున్న అసంఖ్యాక పద్య సముచ్చయమును పరిశీలించి, అసంపూర్ణములు, ఈషద్భేదములు అన్యదీయములు వర్జించి, మేలయిన వానిని బ్రౌను విషయ ప్రధానముగ నాలుగు విభాగములుగ వింగడించిన ప్రతి మొదటి భాగమున 389 పద్యములు, 2వ భాగమున 434. 3వ భాగమున 269, 4వ భాగమున 74 చిల్లర పద్యములున్నవి.

D 1762 + ఇది పై ప్రతిని చూచి మరల వ్రాయించిన ప్రతి కావచ్చును. తన ఆదేశానుసారము 1842 లో ఈ ప్రతిని వీరభద్రయ నూతనముగ పరిష్కరించిన ప్రతియని బ్రౌను పేర్కొనెను. రెంటి యందలి పద్య సంఖ్య యొకటియే. ఇందలి పద్యములు 4 భాగములుగ విభాగింపబడినవి. గ్రంథాంతమున 17 పుటలలో వర్ణానుక్రమమున పద్యసూచి కలదు.

D. 1722 + D. 1721కి ఇది సాపు ప్రతి కానోపును. ఈ రెంటి యందలి పద్య సంఖ్య యొకటియే. గ్రంథాదిలో "THE VERSES OF VEMANA A new edition, enlarged and corrected by the aid of numerous manuscripts" అను బ్రౌను వ్రాత కలదు. వేమన పద్యములలో ముద్రింపదగిన పద్యములన్నియు ఇందు పేర్పికూర్చబడినవనియు ఇవిగాక ఇంకను 2000 పద్యములు మిగిలియున్నవనియు, అవి ముద్రణ

యోగ్యములు కావనియు, అవి ప్రధానముగా తత్త్వవిషయికమైనవనియు బ్రౌను తెలిపెను. 1832వ సం॥ మే 19వ తేదిన ఈ ప్రతివ్రాత పూర్తి యాయెను. గ్రంథాంతమున 29 పుటలలో వర్ణానుక్రమమున పద్యసూచి కలదు.

D 1724.— ఇందులో 306 పద్యములు మాత్రమే కలవు. బ్రౌను తాను సేకరించిన మూల ప్రతులలో 'Q' అను సంజ్ఞతో గుర్తించిన ప్రతికిది కాగితపు నకలు అని తెలిపెను. **Copied from ms Q (i e. T. T. Vol. 387 Part 2nd)**

D. 1725.— ఇందు 869 పద్యములున్నవి. ఇది 'C' అను మూలప్రతిని చూచి వ్రాసినది. **This is transcribed from T. T. 361. being the manuscript referred to as letter 'C'** అని బ్రౌను సూచించెను ఇందు 25-1-43 అని కాలము గుర్తింపబడియున్నది.

D. 1726.— ఇందు 686 పద్యములున్నవి. 1-2-1842లో దీని వ్రాత ముగిసెను.

D. 1727.— 675 పద్యములున్నవి.

7. 1. 2. తెలుగు గ్రంథములలో పరిష్కరణకు బ్రౌను చేపట్టిన ప్రథమ గ్రంథము వేమన పద్యములు. వివిధ తాళపత్ర గ్రంథములలోనున్న అనంతమైన పాఠభేదములను పోల్చిచూచి, శుద్ధ పాఠనిర్ణయమును చేయు కార్యభారమును బ్రౌను వహించెను. 1824వ సం॥న తాను సేకరించిన ప్రతుల వివరములను D 3098 లో బ్రౌను పేర్కొనెను. అప్పటికే అతడు 12 ప్రతులను సేకరించెను.

**'A'** వెంకట శివుని ప్రతి

**'B'** సంకీర్ణముగనున్న **'A'** ప్రతిని విషయముననుసరించి, విభాగించి పద్యముల క్రమమును మార్చి వ్రాసిన ప్రతి. ఈ ప్రతి నాధారముగగొని బ్రౌను వేమన పద్యములను ఆంగ్లములోనికి తర్జుమా చేసెను.

**'B'** కనకాద్రి ప్రతి. ఇందులో 1028 పద్యములున్నవి.

**'C'** కడపప్రతి. 828 పద్యములు.

'D' రంగరాయని తాటి ఆకు ప్రతి. 785.

'E' రంగరాయనిదే రెండవ ప్రతి. 502.

'F' సూర్యనారాయణ అంపిన ప్రతి ౮౮౨

'G' రామస్వామి శాస్త్రులు అంపిన కాగితపు ప్రతి. 825.

'H' కాగితపు ప్రతి. 232.

'K' ,, ,,

'Y' యానంలో అందిన పుస్తకం 152.

'R' దఫా కడప ప్రతి. 506.

'S' గుడిపాటి కృష్ణయ్య పంపిన పొట్టి ఆకుల ప్రతి. 1000. 1824వ సం॥న ఇన్ని ప్రతులను సంప్రతించి, వీనిలోని పద్యములను 9 విభాగములుగ కూర్చెను.

| | | |
|---|---|---|
| 1 - 5 ... ... ... | 1000 | నీతి |
| 6 ... ... ... ... | 300 | హాస్యము |
| 7 ... ... ... ... | 200 | భక్తి |
| 8 ... ... ... ... | 300 | గూఢతత్త్వము |
| 9 ... ... ... ... | 300 | చిర్లర. |
| | 2100 | |

వేమన పద్యములు కలిగిన ప్రాతప్రాత ప్రతి దొరుకుట మిక్కిలి దుర్లభమైనట్లును, ఒక సమగ్ర ప్రతిని సంకలనము చేయుటకు ప్రధానముగ 9 ప్రతులు తోడ్పడినవనియు, అవి బళ్ళారి, కడప, చెన్నపట్టణము, నెల్లూరు, గుంటూరు, విశాఖపట్టణము, (తానుండిన) మచిలీపట్టణముల నుండి సమకూర్చినట్లును, వీనిలో కొన్నింటియందు 500 పద్యములు, కొన్నింటిలో 700 పద్యములున్నట్లు, వీనన్నింటిని కలిపి 2100 పద్యములను తాను ఎన్నుకొనినట్లును బ్రౌను వివరించెను.[2]

2. **Verses of Vemana.** పు. iv.

బ్రౌను ఈ 13 ప్రతులతో సంతృప్తి నందలేదు. వేమన పద్యముల ప్రతుల కొరకు దేశమంతయు గాలించుచునే యుండెను. ఈ అన్వేషణలో బ్రౌను 40 కన్న అధిక ప్రతులను సంపాదించెను. తన ప్రథమ ముద్రణమున 693 పద్యములు, ద్వితీయ ముద్రణమున 1164 పద్యములు మాత్రమే ఉన్నవనియు, కాని అప్పటికే తాను సేకరించిన ప్రతులలో 2500 పద్యములు కలవనియు బ్రౌను పేర్కొనెను. మరియు 1839వ సం॥న వ్రాయించిన ప్రతిలో 40 కన్న అధికమైన మూల ప్రతుల నుండి 3000 పద్యములను సేకరించినట్లును బ్రౌను తెలిపెను.[3] 1834, 1839లో వేమన పద్యములను పరిష్కరించినపుడు 30 ప్రతులను సంప్రతించెను. "More than thirty manuscripts (Total) were examined and exactly collated for this new edition."[4] కాని ఈ ప్రతులన్నింటిని పరిశీలించి, నిగ్గు తేల్చి నపుడు తన మొదటిసేకరణ తరువాత అదనముగ నొక 40 పద్యములు మాత్రమె లభించినవని నుడివెను. అవి కూడ ఒక 15 ప్రతులందున్నవనియు. కొన్ని రెండు మూడు ప్రతులలో మాత్రమె కలవనియు, శేషించినవి ఒక్క ప్రామాణిక ప్రతిలో మాత్రమే ఉన్నవనియు పేర్కొనెను. సరియైన మూల పాఠముల కొరకు ఆతడు కావించిన అన్వేషణమె ఈ పరిశ్రమకు కారణము.

బ్రౌను తన తొలి పరిష్కరణముతో వేమన పద్యములకు స్వస్తి చెప్పలేదు. వారణాసి రామస్వామి బ్రౌనుకు 21-5-1833లో వ్రాసిన లేఖలో "తమరు రాజమహేంద్రవరం వెళ్ళినది మొదలుకొని నేటి వరకున్ను తమ శలవు ప్రకారం అప్పయ్య పంతులుగారు, వెంకట నరసయ్యగారు చెప్పిన వేమన పద్యములు యేమి యింకా మరివక పనులు యేమి జరిగిస్తూ వున్నాను[5]" అని తాను పై పండితులు పరిష్కరించిన వేమన పద్యములను వ్రాయుచున్నట్లు తెలిపెను. 1834వ సం॥ జనవరి 3వ తేదీన బ్రౌను ఒక సుదీర్ఘమైన లేఖలో వేమన పద్యముల పరిష్కరణ పద్ధతులను పైడిపాటి వేంకట నరసయ్యకు విపులముగ వ్యక్తము చేసెను.[6] ఈ లేఖను "My directions regarding editing Vemana" అని లేఖావళి సంపుటి విషయ సూచికలో పేర్కొనెను.

3. D. 3101. Vol. I.
4. Ibid.
5. Sr. of Lt. M. 401. P. 315.
6. Ibid. M. 401. P. 185.

1834వ సం॥ ఫిబ్రవరి 19వ తేది పైడిపాటి వేంకట నరసయ్య బ్రౌను లేఖకు జవాబును వ్రాసెను. దానిని బట్టి అప్పటికి 12 వందల పద్యములకు తీర్పుచేసినట్లు తెలియుచున్నది మొదట పైడిపాటి వేంకట నరసయ్య తీర్పుచేసిన పిదప, జూలూరి అప్పయ్య పునః పరిశీలించి పాఠముల నిర్ణయించెడివాడు, "సదరహి నేను తీర్చిన పద్యములలో యీ దినం వరకు 200 పద్యముల సరియంతం అప్పయ్య పండితులు గారు చిత్తుప్రతి కూడా దగ్గర వుంచుకొని సాపు తీర్పుచేశినారు "7 ఈ పండితులిరువురు ఈ పరిష్కరణ కార్యమున నిమగ్నులైనట్లు 1834వ సం॥ ఏప్రిల్ 2వ తేదీన కంభం నరసింహాచార్యులు బ్రౌనుకు వ్రాసిన లేఖవలన తెల్లమగుచున్నది: "అప్పయ్య పంతులుగారు వెంకటనరసయ్యగారు కూడ వేమన పద్యముల . తీర్పు జరిగిస్తూ వున్నారు."8

1834వ సం॥న బ్రౌను వేమన శతక పరిష్కరణమునకు ఒక పండితుని నియమించెను. కాని ఈ నూతన పరిష్కరణమున ఆ పండితుడు అనుప్రాసయుక్తమగు గ్రామ్యోక్తులను తొలగించుటయేకాక పద్యపాదములనే మార్చి, తన స్వీయ కవితతో పూరించెను. ఈ విషయమును కనుగొనిన బ్రౌను వెంటనే ఆ పండితుని పని నుండి తొలగించెను. ఆ పండితుడు ఆ పుస్తకములో ఒక పాతిక భాగమును మాత్రమే ఈ రీతి పరిష్కరించినట్లు బ్రౌను తెలిపెను 9 అటు పిమ్మటనే పైడిపాటి వెంకటనరసయ్య, జూలూరి అప్పయ పండితులకు ఈ కార్యము నప్పగించినట్లున్నది. ఇట్లు బ్రౌను వేమన శతకమును 3,4 పర్యాయములు పరిష్కరింపజేసెను.

వేమన శతక పరిష్కరణమున బ్రౌను మిక్కిలి పట్టుదల చూపెను ఈ శతక పరిష్కరణకు ఆతని పండితులు ప్రోత్సాహమును ప్రదర్శించినట్లులేదు. పైపెచ్చు బ్రౌనును ఈ పని నుండి విరమింపజేయ ప్రయత్నించినట్లు కనిపించును. బ్రహ్మయ్య వేమన శతకమున ఛందోవ్యాకరణ దోషములు కుప్పతిప్పలుగ నున్నవనియు, వానినన్నింటిని పరిష్కరించినచో నదొక క్రొత్త శతకమగునేకాని వేమన శతకము కాదనియు చెప్పెనట.10 పైగా "Correct nothing in Vemana, says he, but let his text be permanent - devote yourself rather to the classic

7. Ibid. M. 401. P. 303.
8. Ibid. M. 401. P. 309.
9. D. 3101.
10. D. 1773. vol. IV.

authors" అని పుడివెనట.[11] "ఈ వేమన పద్యాల్లో ఏముంది? చదివితే భారత భాగవతాది పవిత్ర గ్రంథాలు చదవాలి.........అని బ్రౌన్ చుట్టూ చేరిన పండితులు పదేపదే హేయిపెట్టేవారు కాబోలు" అన్న బంగోరెగారి ఊహ సరియైనదే [12] "Bramhia begs me to read the Bharatam first - Sita Rama Sastri his younger brother at 18 is a superior genius and poet - superior to his 2nd brother Rama Linga - with whom however he advised me to begin "[13] శతకములను క్షుద్రకావ్యములుగ లాక్షణికులు, విద్వాంసులు పరిగణించుటచే బ్రహ్మయ్య ప్రభృతులు బ్రౌనునకిట్టి సలహాల నిచ్చియుందురు. కాని బ్రౌను మాత్రము శతకముల సముద్ధరణ కార్యమునుండి విరమింపకపోవుట ఆంధ్రుల అదృష్టము.

7. 1. 3 వేమన శతకమును బ్రౌను ఆంగ్లానువాదముతో మొదట 1829 వ సం॥న ముద్రించెను. ఈ ముద్రణము కేవలము కొన్ని పద్యముల ఎన్నిక మాత్రమే. 1839 వ సం॥న అనగా పదియేండ్ల అనంతరము బ్రౌను ద్వితీయ ముద్రణమును ప్రకటించెను. అదియు మరికొన్ని అధిక పద్యములతో, నూతన పాఠాంతరములతోడి ముద్రణము మాత్రమే. ఈ రెండు ముద్రణములలో బ్రౌను 1164 పద్యములను మాత్రమే గ్రహించెను. కాని అతడు సేకరించిన 3000 పద్యములను తృతీయ ముద్రణమున ముద్రింపవలయునని అతని సంకల్పము. "It is to be observed that a final edition is yet to be prepared "[14] ఈ ఉద్దేశముతోనే 1842 వ సం॥న ఒక ప్రతిని తయారుచేసెను. కాని అది ముద్రణ భాగ్యమునకు నోచుకొని నట్లులేదు. ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ (హైదరాబాదు) వారు D. 1774 ప్రతిని ముద్రించిరి. 1215 పద్యములు మాత్రమిందు గ్రహింపబడినవి. పుస్తక భాండాగారమునందు లభించు మఱికొన్ని కాగితపు ప్రతులు విడువబడినవి. ఇందు ప్రచురించిన పద్యములను వర్గీకరించి, విషయానుక్రమముగ ప్రకటింపక పోవుట చింత్యము. 1824 వ సం॥ నవంబరు 23 వ తేదీన బ్రౌను రచించిన మున్నుడి మాత్రమిందు గ్రహింపబడెను. బ్రౌను సేకరించిన 3000 పద్యములను పరిశీలించి, ప్రక్షిప్తములను తొలగించి సమగ్రమగు వేమన పద్యముల ముద్రణావశ్యకత యెంతేని

11 Ibid.

12. బ్రౌను లేఖలు. పుట 68

13. D. 1773. Vol. IV

14. D. 3101.

కలదు. బ్రౌను ఆంధ్రదేశపు నాలుగు చెరగుల నుండి సేకరించి పెట్టిన ప్రతులను ఉపయోగపరచుకొనలేని ఆంధ్రుల ఉదాసీనత నేమనవలెను?

మొదటిసారి బ్రౌను వేమన పద్యములను పరిష్కరించి, ముద్రణకు ఉపక్రమించినపుడు అప్పటి కాలేజీ బోర్డు కార్యదర్శి హెచ్. హార్క్‌నెస్ (H. Harkness) వెయ్యి వరహాల పారితోషికమును బ్రౌను మహాశయుని కొసగుట సముచితమని ప్రభుత్వమునకు సిఫారసు చేసెను. కాని ఆతని ప్రయత్నములు ఫలవంతములు కాలేదు. బ్రౌను చేసినది నిష్కామ కర్మయే అయెను [15]

7. 1. 4. ఆయా సంపుటములలోను, ముద్రణ కూర్పులలోని ఉపోద్ఘాతముల లోను, 1840 లో ప్రచురించిన జంగముల మతాచార వాఙ్మయమును గూర్చిన వ్యాసము (Essay on creed, customs and Literature of the Jangams లోను 1869 లో ప్రచురించిన స్వీయ చరిత్రలోను (Some Account of the Lit rary Life of Charles Philip Brown) బ్రౌను వేమనను గూర్చి వ్రాసెను.

ముద్రణ కూర్పులలోని అవతారికలందును జంగమ మతాచార వ్యాసమందును గల వేమన అంశములను, స్వీయచరిత్ర యందలి వేమన ప్రస్తావనను శ్రీ మరుపూరు కోదండరామిరెడ్డిగారు తెనుగులోనికి అనువదించి ప్రకటించిరి [16] వేమనను ప్రస్తావించు సందర్భమునందే బ్రౌను తెనుగు భాషా మాధుర్యమును మెచ్చుకొనెను. బ్రౌను వేమనను గ్రీసుదేశ తత్త్వవేత్తయైన డెమోక్రిటస్‌తో సమముగ నెంచెను. అందువలననే తన ప్రథమ ముద్రణకు "The verses of Vemana (Democritus) The Moral Philosopher" అను శీర్షిక నొసగెను [17]

'విశ్వదాభిరామ' సమాసమున కర్థము నిట్లు వివరించెను : Visva - Da is god. అభిరామ Delighting in the Omnipotent. విశ్వత Universal అభిరామ - beautiful - That is Listen O Vema, Delight of the world ఈ పద విభాగము ప్రకారము విశ్వతా + అభిరామ అని ఉండవలెను.

---

15 బ్రౌన్ లేఖలు. పు. 71-73.

16. వేమన - పాశ్చాత్యులు. పుట. 43-64.

17. D. 1773. Vol. I

1827 వ సం॥ మార్చి నెలలో D 1773 2 వ సంపుటములో A. D. Campbell నిఘంటువు పుట 643 లో ఉన్న గమనికను చూచునది అని బ్రౌను సూచించెను. క్యాంబెల్ తన నిఘంటువున బ్రౌను ఆదియందు తయారుచేసిన 5 సంపుటముల ప్రతిలోని వేమన పద్యములను యథాతథముగ గ్రహించినట్లు అచట కలదు.

అబె దుబాయ్ రచించిన పుస్తకము వలన పరిచితుడైన వేమన యొక్క పద్యములను బ్రౌను సాకల్యముగ పరిశీలించి సముద్ధరించెనని చెప్పనగును. వేమన నీతిసూత్రకారుడైన ఒక గ్రామీణుడు అని బ్రౌను అభిప్రాయము. ఆదిలో వేమన పద్యములను చదివినప్పుడు వాని మాధుర్యమాతనిని ఆంగ్లములోనికి అనువదింప ప్రేరేపించెను. తెలుగు భాషనుండి ఆంగ్లములోనికి అనూదితము కావింపబడిన పుస్తకములలో ఇదియే ప్రథమ గ్రంథము[18] క్లిష్టములైన పద్యములకు తెలుగు వివరణమును కూడ చేర్చెను. కొన్ని ఘట్టములందు ఈ వివరణ వ్రాయుటలో అతనికి ఇరువురు బ్రాహ్మణ మహా పండితులైన తిప్పాభొట్ల వెంకట శివశాస్త్రి, అద్వైత బ్రహ్మయ్య తోడ్పడినట్లు తెలిపెను. వారే అతనికి ఈ భాషను, వ్యాకరణమును, ఛందోలక్షణములను గరపినట్లు బ్రౌను నుడివెను[19]

వేమన పద్యములు ఇటు తెలుగువారికి, అటు ఇంగ్లీషు వారికి ప్రయోజనకారులయినవి. ఆంధ్రదేశమున ఆబాల గోపాలమున కత్యంత ఆదర పాత్రమైన వేమన పద్యములను అభిరామముగ ముద్రించిన ఆద్యుడు బ్రౌను.

## 7. 2. సుమతి శతకము

సుమతి శతకమును కూడ బ్రౌను ఆంగ్లమున అనువదించెను. ఈ తర్జుమాను బ్రౌను 1832 వ సం॥ జూలై 30 వ తేదీన ప్రారంభించెను.[20] పూర్తి యొనర్చిన తేదీ తెలియరాదు. ఈ శతకమునకు ఆంగ్లానువాదమే కాక, తెలుగు టీకను కూడ వ్రాయించెను సుమతి శతకమునకు బ్రౌను వ్రాయించిన కాగితపు ప్రతులు 2 కలవు

18. "I believe no translation of a classic irto English has been attempted." — Verses of Vemana, P. ii.
19. Ibid. P. iv.
20. D. 3090.

D 3090. సవ్యాఖ్యాన, ఆంగ్లానువాదము కల ప్రతి. ఇందు ఒకవైపున తెలుగు, ఎదుటివైపున ఆంగ్లానువాదము కలదు. అన్ని పద్యములకు అనువాదము లేదు. కొన్నింటిని బ్రౌను అనువదింపలేదు. కారణము దురూహము.

D. 3091. సుమతి శతకమునకు బ్రౌను తయారుచేయించిన పద సూచిక. ఇందే కఠినపద కోశమును గలదు. పాఠశాలలో ప్రాథమిక పుస్తకములుగ నుపయోగించెడి సుమతి భాస్కర శతకములకు పదసూచి, పదకోశము అవసరమని బ్రౌను భావించెను.

సుమతి శతకమును 1842 వ సం॥న బ్రౌను ముద్రించినట్లు ఆధారములు కలవు. 1842 నాటి వర్తమాన తరంగణి పత్రికలో అమ్మకమునకు సిద్ధముగనున్న పుస్తకముల ప్రకటనలో సుమతి శతకము పేర్కొనబడెను. అట్లే 1842లో బ్రౌను ముద్రించిన గౌరన హరిశ్చంద్రోపాఖ్యాన ముఖపత్రమున గల ప్రకటనయందు సుమతి శతకమున్నది.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు D, 3090 ప్రతి ఆధారముగ సుమతి శతకమును బ్రౌను ఆంగ్లానువాదముతో 1973 లో ముద్రించిరి.

7. 3. ఇతర శతకములు :

బ్రౌను ముద్రించిన గ్రంథములలో శతకముల సంఖ్యయే అధికము. ఈ శతకముల పరిష్కరణమున జూలూరి అప్పయ్య పండితుడే బ్రౌనునకు తోడ్పడినట్లు తోచును.[21]

కలువాయి చెన్నకృష్ణ శతకము, కవి చౌడప్ప శతకము, కాళహస్తిలింగ శతకము, లావణ్యసీమ శతకము, భళిరకరివేల్పు శతకము, కోదండరామ, సిద్ధరామ, కాంతాలలామ, శతకములను బ్రౌను ముద్రించెను లావణ్య, కలువాయి, కాంతాలలామ, భళిరకరివేల్పు శతకములు శృంగారాత్మకములనియు కవి చౌడప్ప శతకము అవహేళనతో కూడిన హాస్యవ్యంగ్య శతకమనియు బ్రౌను పేర్కొనెను. ఈ అయిదింటి నొక్క సంపుటమున సంకలనమొనర్చెను. తిరుచునాపల్లి, మదరాసు, మచిలీపట్టణములలో అనేకప్రతులతో పోల్చిచూచి ఈ శతకములను 1832లో పరిష్కరించి, 1839 లో ముద్రించెను.

---

21. *D*. 1479.

క. చౌడప్ప శతకమునకు పద్యసూచిని కూడ బ్రౌను తయారుచేయించెను (D. 1483.) D 1497 ప్రతి అంతమున 5 పుటలలో అచ్చు ప్రతి ప్రకారము పదముల సంఖ్య, పద్యారంభము వ్రాయబడినవి.

ఉదా:- శ్రీకారము — ౧ ; శ్రీపతిపుల్లురి — ౨ ;
వనజభవాదులు — ౩ ; ఉండగనెచ్చును — ౪.........

బ్రౌను తనకు లభించిన ఎంత చిన్న తాళ పత్ర ప్రతినైనను విడువలేదనుటకు కోదండరామ శతకము నిదర్శనము. ఆ శతకమున అతనికి లభించినవి 13 సీస పద్యములు మాత్రమే. "ఖండ నారాతి భీమకోదండరామ" అను మకుటము తోడి యిందలి సీసపద్యములు ప్రశస్తరచనలు. దీని కర్త తెలియరాదు ఈ అల్పసంఖ్యాక పద్యములనే బ్రౌను ముద్రింపవలంచినట్లున్నది పరిష్కృత ప్రతిలో నీ గమని కలదు "ఇది ఛాపాచేశేటప్పుడు షరా వ్రాయవలసినది యేమంట్టే మా దగ్గర కలిగ్ని పద్యములు యిన్నే గనక యీ శతకమునకు నిండుప్రతియే పెద్ద మనిష్కి దగ్గెర వుండి నా మేము చాపాచేయిస్తున్నాము గనుక అందులో పది ప్రతులు అతన్కి యిస్తున్నాము." (D. 1531) బ్రౌను తన పద్ధతి ననుసరించి సీసమును, ఎత్తుగీతిని వేరువేరు సంఖ్యలతో గుర్తించుటచే నీ ప్రతిలో ఉన్న పద్యములు 13 అయినను సంఖ్య 26 అని గుర్తింపబడినది.

చంద్రవదన శతకమునందును లభించిన 27 పద్యములను "మే. చితంబరం వా॥ రామస్వామి రుజువు" చేసిరి. పిదప తిరుచినాపల్లిలో 1829 వ సం॥ నవంబరు 20వ తేదిన శేషము కొండల్ రాయడు 54 పద్యములను మొకాబిలా చేసెను. (D. 1560)

'నీలకుధరాధ్యక్షా! జగన్నాయకా!' అను మకుటముతో శార్దూల మత్తేభ వృత్తములు గల జగన్నాయక శతకము పురుషోత్తమక్షేత్రమున (పూరి) వెలసిన జగన్నాథస్వామి స్తుతి రూపమయినది. సంస్కృత సమాసమయమై అనుప్రాసములతో నీ శతకము నీరసముగ నున్నది. కనుకనే బ్రౌను "ఇదిఒకమొక పనికిమాలిన క్లిష్ట రచనము. తెలుగు ఛందస్సున రచింపబడినను ఇది సంస్కృతమయము." అని ఆంగ్లమున వ్రాసెను.[22]

22. D. 1561.

దేవకీనందన శతకమునకు ఒక మూలప్రతి India House Library లో, ది తాను వ్రాయించిన కాగితపు ప్రతిలో 5 వ పుటనుండి 204 వ పుటవరకు గల పద్యములు అందుండి ఎత్తి వ్రాయబడినవయి. 105 వ పుటనుండి శేష పద్యములు ఇతర ప్రతులలోసి వసియు బ్రౌను తెలిపెను. ఆంధ్ర దేశమునందేకాక దేశాంతరముల నుండి కూడ ప్రతులను సేకరించుట ఆతని అభినివేశమునకు తార్కాణము.

బ్రౌను భాస్కర శతకమును సమగ్రముగ పరిష్కరించి, వ్యాఖ్యను సంతరించెను. ఈ శతకమున ఒక్క పద్యమును బ్రౌను ఆంగ్లములోనికి అనువదించెను:

దానముసేయగోరిన వదాన్యుడు నీయగ శక్తిలేని చో
నైన బరోపకారమునకై యొక డిక్కున దెచ్చియైననీ
బూనును మేఘ దంబుధికి బోయి జలంబులు దెచ్చి కుర్వదే
వాన సమస్త జీవులకు వాంఛిత మింపెసలార భాస్కరా.

"If the liberal man when inclined to make a gift, should lack the power, let him bestow what he takes from another."

భాస్కర శతకమును మొదటనెవరు పరిష్కరించిరో గాని, "జూలూరి అప్పయ్య తిరిగి పరిశోధించదమైనది" అను వ్రాతను బట్టి అప్పయ్య దీనిని పునః పరిశీలించినట్లు తెలియుచున్నది. [3] దీనికి మ. ప్రా. పు. భాండాగారమున 6 కాగితపు ప్రతులున్నవి. సుమతి శతకముతో పాటు భాస్కర శతకమునకును బ్రౌను పద సూచిని తయారుచేయించెను. (D 3092).

"తల్లిని బోలరెవ్వరున్" అను మకుటముతో చంపకోత్పలమాలికా వృత్తములతో మాతృదేవతాస్తుతి రూపమున వ్రాయబడిన 'మాతృశతకము' కర్త మత్తూరి అప్పావు మొదలి. 1840 వ సం॥ ఏప్రిల్ 24 వ తేదికి పువ్వాడ అమ్మన్న ఈ శతకమును సంపూర్ణముగ మొకాబిలా చేసెను. మనుచరిత్ర పరిష్కర్త, విద్వద్వరేణ్యుడైన జూలూరి అప్పయ తయారు చేసిన ప్రతిని చూచి ఈ మాతృశతకమునకు మారు ప్రతి వ్రాయబడినట్లును, చూచి వ్రాసిన లేఖకుడు గ్రహించిన నిర్దుష్ట పాఠములనే కాక, తిరస్కృత పాఠాంతరములను గూడ గుర్తించినట్లు బ్రౌను గ్రంధాదిలో పేర్కొనెను.[24]

23. *D*. 1631.

24. D. 1653.

శివముకుంద శతకమున 110 పద్యములున్నవి. "శివముకుంద పరమానందా" అను మకుటముగల యీ కంద పద్యముల శతకము వేదాంత విషయకము గ్రంథ కర్త పరమానంద యోగి ఈ శతకమును "రాయవరపు సోమరాజున్ను, దాగంటి వెంకట కృష్ణమ్మ"యు మాతృకతో మొకాబిలా చేసిరి 25

"శ్వేత కుక్కున్న కేసరీ" అని మకుటముగల 120 ఉత్పలమాలికా వృత్తముల శతకము, కర్త ఆశ్వాసకవి దీనికి "మాతృక బందరులో నరాకా సం॥మందు చిక్కి వ్రాయించుకుని జూలూరి అప్పయశాస్త్రి చాత దిద్దించుకున్నారు". గ్రంథాంతమున "దిం॥ పిఠిరేవడ 1832 సం॥ ఈ శతకము సంప్రతించి తీర్పుచెయ్యడమైనది జూలూరి అప్పయ వ్రాలు" అని ఉన్నది.26

సిద్ధరామ శతకమున 97 పద్యములు మాత్రమున్నవి. "చిత్కళాధామ శ్రీ గురు సిద్ధరామ" అను మకుటము గల యీ సీసపద్య శతకము శైవ సిద్ధాంత ప్రశంసాపరము. కేదార దేశికుని శిష్యుడైన సిద్ధరామ గురునకిది అంకితము చేయబడి నది. గ్రంథకర్త పేరు లేదు. గ్రంథాదిలో బ్రౌను "I printed this set of hymns in 1840. యిది ఛాపా అయినది" అని వ్రాసెను.27 ఆ ముద్రిత ప్రతి నేడు కానరాదు.

చెన్నకేశవ శతకమున 107 పద్యములున్నవి. మొదట సంస్కృత శ్లోకము, దాని క్రింద తెనుగు పద్యము వ్రాయబడెను. ఇందలి సంస్కృత పద్యములు రమణీయములనియు, వాని క్రింది తెలుగు పద్యములు నీరసములనియు బ్రౌను పరామర్శించెను 28

ప్రకరణ సారాంశము :

1. బ్రౌను 81 శతకములను సేకరించి, పరిష్కరించెను.
2. వీనిలో 10 శతకములను ముద్రించెను. రెండిటికి పదసూచికలను (సుమతి, భాస్కర), రెండింటికి పద్యసూచికలను (వేమన, కవి చౌడప్ప), రెండింటికి టీకలను (సుమతి, భాస్కర) తయారుచేయించెను.

---

25. D. 1780. 26. D. 1786. 27. D. 1806.

28. "Each of the following is a beautiful sanscrit verses and the Telugu version appended to it is quite miserable."—D.

3. వేమన, సుమతి శతకములను ఆంగ్ల భాషలోనికి అనువదించెను. తెలుగు కావ్యములలో ఆంగ్లములోనికి అనూదితములైన ప్రథమ పద్యకృతులివియే ప్రథమ అనువాదకుడు బ్రౌను. తెనుగు కవితా మాధుర్యమును, తెనుగు భాష తియ్యదనమును ఆంగ్ల భాష నెరిగిన అందరకిట్లు ఆమె తలపెట్టిన బ్రౌనకు ఆంధ్రులు ఆ జన్మము ఋణపడిన వారగుదురు.

4. వేమన, సుమతి శతక ముద్రాపకులలో ఆద్యుడు బ్రౌను ముద్రితమైన ఆద్య-తెలుగు కావ్యము "వేమన పద్యములు." తెనుగు కావ్యముల ముద్రణ భిక్షను ప్రసాదించినవాడు బ్రౌను.

5. శతకములను నిఘంటువులందు ప్రమాణముగ గ్రహించిన కేంబెల్ **(Campbell)** మార్గమును బ్రౌను అనుసరించి, తన నిఘంటువున శతకముల నుదాహరించెను.

6. దేశము నాలుగు చెరగుల చెల్లాచెదరైయున్న వేమన పద్యసుమములనేర్చి శతకమాలగ కూర్చి, వానిని విషయప్రధానముగ వింగడించి, భావిపరిష్కర్తలకు మార్గదర్శకుడయ్యెను.

7. "విశ్వదాభిరామ వినురవేమ" అను మకుటముగల పద్యములు పరశ్శతములుగ నున్నట్లు కనుగొనిన ఆద్యుడును బ్రౌను మహాశయుడే. వీనిలో కొన్ని ప్రక్షిప్తములు కానోపునని పరిశీలించినవాడును నాతడే.

8. శతకములలోని భాషాసరళత, భావవిస్పష్టత, నీతి బోధకత, వానిని ప్రాథమిక పాఠశాలలలో పాఠ్యపుస్తకములుగ పరిగ్రహింప ప్రోత్సహించుచున్నవని బ్రౌను భావించెను.

క్షుద్ర కావ్యములుగ నెన్నబడుచు పండితుల ఉదాసీనతకులోనై మరుగుపడిన ఈ శతక మాణిక్యములను వెలుగునకు తెచ్చిన మహాశయుడు బ్రౌను.

---

# 8

# ప్రకీర్ణకము

8. 0. అయిదు ప్రకరణములలో (3 నుండి 7 వరకు) పురాణేతిహాసములను, శృంగార ప్రబంధములను, కథా కావ్యములను, ద్విపదలను, శతకములను – బ్రౌను సముద్ధరించిన తీరు కొంత వివరింపబడెను. ఈ కావ్యములకు బ్రౌను నిర్దుష్టపాఠములను నిర్ణయించి, శుద్ధప్రతులను తయారుచేయుటయే కాక వీనిలో కొన్నింటికి వ్యాఖ్యానములను వ్రాయించెను. కొన్నింటికి పదసూచికలను, ఒండు రెండింటికి పద్యసూచికలను పెక్కింటికి విషయసూచికలను, ఉపోద్ఘాతములను, కథాసంగ్రహములను సమకూర్చెను. ఆయా కావ్యములందు తనకు నచ్చిన ఘట్టములను, పద్యములను ఆంగ్లములోనికి అనువదించెను. బ్రౌను వ్రాయించిన వ్యాఖ్యానాదులను గూర్చి ఈ ప్రకరణమున స్థూలముగ వివరింపబడును.

తెలుగు భాషా స్వరూపావగాహనార్థము తనకు ఇతరులు వ్రాసిన లేఖలను తానితరులకు వ్రాసిన వానిని బ్రౌను సంపుటములుగ సంకలనపరచెను. ఈ లేఖా వాఙ్మయమును గూర్చియు ఒకటి రెండభిప్రాయములు ఇట ప్రస్తావింపబడును.

## 8. 1. వ్యాఖ్యానములు :

8. 1. 0. ప్రాచీన కాలములోని పండితులు ప్రౌఢములై, పండితైకవేద్యములైన కావ్యములకు మాత్రము వ్యాఖ్యాప్రాయములైన టీకలను రచించెడివారు. సంస్కృత సాహిత్యములో ప్రచురముగనున్న వ్యాఖ్యానముల ఒరవడిలోనవి రచింపబడియుండవచ్చును. కాని ప్రాచీనాంధ్ర వ్యాఖ్యానములు సంస్కృత వ్యాఖ్యానముల

వలె విస్తృతములు విషయ పూర్ణములు కావు. కేవల శబ్దార్థములకును వ్యాకరణాలంకార విశేషములకును మాత్రమె పరిమితమైనట్టివి.

8. 1 1. తెలుగు సాహిత్యములో వ్యాఖ్యారచన 16వ శతాబ్దమునుండి ప్రారంభమైనట్లు తెలియుచున్నది. వీనిలో ప్రాచీనమైనది క్రీ. శ. 1575 ప్రాంతము వాడైన ముద్దరాజు పెదరామన 'రాఘవ పాండవీయము'నకు రచించిన ఆదర్శ వ్యాఖ్య. తరువాత చిత్రకవి అనంతయ్య (1680) హరిశ్చంద్రనలోపాఖ్యానమునకు, సోమనాథకవి (1650-1750) వసుచరిత్రకు వ్యాఖ్యానములను రచించిరి. గంగాధరుడు (1673-85), అతని కుమారుడు త్రియంబకరాయమఖి రసికరంజని, రామాయణ వ్యాఖ్యలు రచించిరి. తాళ్ళపాక తిరువేంగళాచార్యులు "శృంగారామరుక శతకము" నకు నొక టీకను వ్రాసెను. వాదెండ్ల గోపకవి కృష్ణమిశ్రుడు రచించిన 'ప్రబోధ చంద్రోదయ' నాటకమునకు చంద్రికావ్యాఖ్యను వెలయించెను.

# ON COMMENTS

Among the Telugu Poems two only have been illustrated by commentators : and even these the Tica or Scholar notes explain merely the prinoipal difficulties, the whole being inaccessible to all but professed scholar.

I have therefore persuaded a learned Pandit, Buchaya Sastri to compose an explanatory comment on the Vasu Charitra; the plan being, that he constraes it regularly and fully explains it, to a pupil who writes it down word for word. This work will be very voluminous; but he is enjoined to emit euery point that the old scholiast exnlaius. This commentary I propose to amend by submitting it to other sound scholars.

But this is not enough I am certain that there is not a single Telugu poem, worth reading that is not also in need of an easy commentary : I have acccrdingly directed Vencat Narsu as a commencements to write a "translation" into colloquial-Telugu, of two short and useful poems, which though compa ratively easy are likely to be very useful. Such explanations being intended for the ignorant, and early learner, af course om t all critical niceties It is mere plain construing.

Every Telugu Poem when printed, ought I am convinced to be accompanied by such a comment; just as all the Latin Authors, whether easy or difficult, are at the present day. This will be a principal step towards the restoration of learning.

Since writing the above, comments have been framed for the Tara Catha, and for the Pancha Tantra

The above remarks were writt n in 1827 – Ihe plan has succeeded well. The first two commentaries framed on Tara and the Pancha Tantram have been drafted a new by other learned men and at present 1834 twelve leading words have been successfully edited with verbal explanations. These are the following

1. Vasu Charitra } By Zuluri Appaya
2. Manu Charitra }
3. Das Avatara Charitra by G. Vencaya
4. Tara Catha – by Narsimma Sastri
5. Sumati Satacam } By Vencat Narsu.
6. Bhascara Satacam }
7. Aniruddha Charitra by Zuluri Appaya
8. Vijaya Vilasam by Vencatnarsu Sastri.
9. Cavi Carna Rasayanam By Zuluri Appaya.

10 Bilhanam by Vencatsur

11. Bhallana Charitra by

12. Radha Madhava by Vencat Narsu

13. Ila Deviyam by Vencat N[n]

14. Raghava Pandaviyam by Narasimma Sastri.

— P. R. T. L. PP. 104 – 105

౮ 1. ౨ ఆధునిక కాలములో వెలసిన వ్యాఖ్యావైఖరికి మార్గ దర్శకుడు సి. పి. బ్రౌను దొర. అతడు సేకరించిన ప్రాచీనాంధ్ర కావ్యములు పెక్కింటికి తన పోషణములోనుండిన పండిత మండలిచే వ్యాఖ్యానములు వ్రాయించెను. ఇవి టీకా తాత్పర్య యుక్తములై, లఘు వివరణములతో కూడియున్నవి. కొందరు వ్యాఖ్యాతలు వీనిని 'ప్రతిపదటీకలు'గ పేర్కొనిరి.

బ్రౌను వ్రాయించిన వ్యాఖ్యాన గ్రంథములలో ముఖ్యముగ పేర్కొనదగినవి: మను, వసు చరిత్రలకు, వైజయంతీ విలాసమునకు వెలసిన వ్యాఖ్యానములు బ్రౌను దొరయే మను, వసు, వైజయంతీ విలాస ప్రబంధములను వ్యాఖ్యలతో ప్రప్రథమముగ ముద్రించెను. కావ్యములకు వ్యాఖ్యానములు రచింపజేయు విషయమున బ్రౌను పాశ్చాత్య పద్ధతినే అవలంబించెను. (చూ. ప్రక్క పుట)

బ్రౌను తన 'స్వీయచరిత్ర' లో ప్రాచీన వ్యాఖ్యాతలను గూర్చి వ్రాయుచు వారికి పాండిత్య ప్రకటనయందే దృష్టియనియును, మూలాభిప్రాయమును పాఠకులకు సుబోధకమగునట్లు వ్రాయవలయునను భావము వారికి తక్కువనియును తెలిపెను. ఆనాడు వెలసిన వ్యాఖ్యానములు చాలవరకు, వ్యాఖ్యాతల పాండిత్యప్రకర్షను ప్రకటించునవేకాని, ప్రాథమికుల కుపకరించునవి కావని బ్రౌను అభిప్రాయపడెను.

౮. 1. ౩. బ్రౌను వ్రాయించిన వ్యాఖ్యాన గ్రంథముల వివరములు క్రింది పట్టికయందు పొందుపరుపబడినవి :

| కావ్యము - కవి | వ్యాఖ్యాత / టీకాకర్త | వ్యాఖ్యా రచనా కాలము. | ముద్రణ కాలము |
|---|---|---|---|
| 1. పంచ తంత్రము- దూబగుంట నారాయణకవి | | 1827. | |
| 2. శశాంక విజయము - శేషము వేంకటపతి. | నరసింహాచారి. | 1827. | |
| 3. రాధామాధవ సంవాదము- వెలుదండి తిరువేంగళయ్య. | పమిడిపాటి వెంకటనరసయ్య. | 1829. | |
| 4. విజయ విలాసము- చేమకూర వేంకటకవి. | జూలూరి అప్పయ్య. | 1830 డిసెంబరు, 11 | |
| 5. దశావతారచరిత్ర- ధరణిదేవుల రామయ్య. | గరిమెళ్ల వెంకయ్య | 18 31. | |
| 6. మనుచరిత్ర- అల్లసాని పెద్దన. | జూలూరి అప్పయ్య | 1831 డిసెంబరు. | 1851. |
| 7. కవి కర్ణ రసాయనము - సంకుసాల నృసింహకవి | జూలూరి అప్పయ్య | 1882. | |
| 8. అనిరుద్ధ చరిత్ర- కనుపర్తి అబ్బయామాత్యుడు. | పైడిపాటి వెంకటనరసయ్య | 1834 | |

| కావ్యము - కవి. | వ్యాఖ్యాత/టీకా కర్త | వ్యాఖ్య రచనా కాలము | ముద్రణ కాలము |
|---|---|---|---|
| 9. వసు చరిత్ర - రామరాజభూషణుడు. | 1. ముసలపాక బుచ్చయ్య. 2. జూలూరి అప్పయ్య ఈ ఇరువురును రెండు వ్యాఖ్యానముల రచించిరి. | 1834 | 1844 |
| 10. ప్రభులింగలీల - పిడుపర్తి సోమన | వీరభద్రయ్య | 1842 జూలై, 19 | |
| 11. సారంగధరోపాఖ్యానము - చేమకూర వేంకటకవి. | | 1843 మే, 29 | |
| 12. సారంగధర చరిత్ర - బాణాల శంభుదాసకవి. | | 1843 సెప్టెంబరు, 28 | |
| 13. హరిశ్చంద్రోపాఖ్యానము - వీరశరభకవి; | | 1846 జూన్ 27 | |
| 14. హరిశ్చంద్ర చరిత్ర - గౌరన. | | 1846 అగస్టు, 9 | |
| 15. వైజయంతీ విలాసము - సారంగుతమ్మయ | వెంకటసరసు | | 1849 |

| కావ్యము - కవి | వ్యాఖ్యాత/టీకాకర్త | వ్యాఖ్యరచనాకాలము | ముద్రణకాలము |
|---|---|---|---|
| 16. కళాపూర్ణోదయము - పింగళి సూరన | | | |
| 17. చంద్రరేఖావిలాసము | తెన్నేల పింగటయ్య | | |
| 18 నవనాథచరిత్రము - గౌరన తృతీయాశ్వాసములో అంజనీ విప్రుల ఉపాఖ్యానమునకు మాత్రము | | | |
| 19. భామమద్విజయము - వెలగపూడి కృష్ణకవి | | | |
| 20. భాస్కర శతకము | | | |
| 21. రాఘవ పాండవీయము - పింగళసూరన | నరసింహాచారి | | |
| 22. రాధికాసాంత్వనము - ముద్దుపళని | | | |
| 23. సుమతి శతకము | | | |
| 23. సుమతి శతకము | | | |
| 24. హరిశ్చంద్రనలోపాఖ్యానము - రామరాజభూషణుడు | | | |
| 25. హరిశ్చంద్రోపాఖ్యానము - శంకరకవి | | | |

8. 1. 4. బ్రౌను వ్రాయించిన వ్యాఖ్యలను పరిశీలింపగా ఈ క్రింది విశేషములు తెలియుచున్నవి :

1. పండిత, విద్వాంసులకేకాక తెలుగు చదువనేర్చిన వారికందరకు తెలుగు కావ్యములు సుబోధములుగ నుండవలయునను ఉద్దేశముతో బ్రౌను వ్యాఖ్యలను సమకూర్చెను. **"Every Telugu poem printed, ought, I am convinced to be accompanied by such a comment, just as all the Latin authors, whether easy or difficult, are at the present day. This will be a principal step towards the restoration of learning "**[1]

2 కావుననే ఈ వాఖ్యములు సులభశైలిలో, వ్యావహారిక భాషలో రచింపబడినవి. "వసుచరిత్ర" ముద్రిత గ్రంథపీఠికలో బ్రౌను ప్రాచీన వ్యాఖ్యాతలు కావ్యములోని వ్యాకరణాలంకారచ్ఛందో విశేషములకు మాత్రమే ప్రాధాన్యమునిచ్చి రచించిరనియు, తానట్లుకాక ప్రతిపదమునకు అర్థమును వివరించి సామాన్యులకి సులభగ్రాహ్యములగునట్లు వ్యాఖ్యలను సంతరించితినని పేర్కొనెను.

ఉదా : మీసు విచ్చేయుడనుచు । సమృద్ధ । రోష
మె । సగ । డిగ్గునలేచి । యయ్యసుర విభుడు ।
నగరిలోనికి బోవ । దానవగురుండు
న । చ్యుతుడె । చక్కబెట్టెడు ననుచుజనియె.

— దశావతార చరిత్ర. D. 528. సంపు. 1. 1-202

టీక॥ మీరు పోండియని శుక్రునితో బల్కి । వృద్ధి
బొందినటువంటి । కోపము । అతిశయించగా ।
అతి త్వరగా లేచి । రాక్షస రాజైన ఆహయగ్రీవుడు ।

---

1. **P. R. T. L. P. 105**

అంతఃపురములోకి బోగానే। రాక్షసులకు గురువైన

ఽ ౧౦

శుకుడు। విష్ణుదేవుడే। వీణ్ని చక్క చేసును।

౧౧

అని అనుకొంచున్ను లేచి పోయెను॥

3 పై పద్యమున జూపినట్లు పద్యమునందలి పదములను వ్రాసి అర్థముల నొసగక, వానికి సంఖ్యలనిచ్చి వివరించు విధానము ఈ వ్యాఖ్యలలో కానవచ్చును- ప్రతిపద విభాగమొనర్చి, అర్థమునిచ్చు విధానమును పాటింపబడినది. ఈ రెండు పద్ధతులను ఈ వ్యాఖ్యాతలు అనుసరించిరి.

4. పద్యములకు దండాన్వయములను వ్రాసిరి.

5 కేవలము ప్రతిపదార్థముచేతనే సువ్యక్తము కాని వానికి విపులార్థములను, వివరణములను ఒసగిరి.

ఉదా :

మ "అనిమేషస్థితి మాన్చె చిత్తరపు చూప స్వేదతావ్యత్తి మాన్చె" అను పద్యము ప్రతి పదార్థానంతరము " అనగా భ్రమరము యొక్క భావనము చేతను వచ్చుని పురుగు భ్రమరమైనట్టుగానే మనుష్యుడైన ప్రవరాఖ్యుని యొక్క భావనచేతను దేవతాస్త్రీ అయిన వరూధిని మనుష్యత్వమును పొందెనని తాత్పర్యము। అనిమేష స్థితిన్ని। అస్వేదతావృత్తిన్ని బోదకళయున్ను। దేవతాధర్మములన్ని। చిత్తరపు చూపున్ను। నవస్వేద సమృద్ధిన్ని। మోహ విభ్రాంతిన్ని। మనుష్య ధర్మము లన్ని విచారించవలెను॥" అను వివరణ కలదు.

— మను చరిత్ర D 641. సంపు. 1 2-37

6. ఛందోవ్యాకరణ విశేషములను సయితము వివరించెడివారు.

ఉదా :

i. ఉ. ఎక్కడి వాడొ యక్ష తనయేందు జయంత వసంతకంతులం

... ... ... ... ... ...

... ... ... ... ... ...

దక్కగొనంగరాదె యకటా నను వీడు పరిగ్రహించినన్

టీక॥ ... ... యీ పద్యము నాలుగో చరణము మొదటనుదక్కఁగొనంగ అనే శబ్దాదిపుండే దకారమునకు తకారమాదేశమైన దనిన్ని కేవలం దకారమునకైతే టకారము విశ్రమము చెల్లదనిన్ని తెలియవలెను..." —— అందే. 2-38

ii. నిర్మలధర్మ రత్నమయ నిర్మిత విస్ఫుట హర్మ్యసంచయాం

... ... ... ... ...

... ... ... ... ..

హర్మ్యఖ పద్మగంధ విభవాను భవాంచిత గంధవాహముల్.

టీక॥ ......యీ పద్యములోను నిలింపవాహినీ హర్మ్యఖ పద్మగంధ అనిన్ని వార్మ్యఖ అనే పాఠమందు, ఆహర్మ్యఖ అని అర్థము రావలసినందుకు, అకారము లేకపోవడము చేతను, హర్మ్యఖ అని వుంటే అపశబ్దమవుతున్నది, గనకనున్ను యీ రెండు పాఠములు సమాధానములేక, నిలింపనిమ్నగాహర్మ్యఖ అని వుంటే యుక్తముగా వుంట్టుందన్నదని తోచి ఆ ప్రకారము తీర్పుచేసి టీక వ్రాయడమయినది॥ యిందులో వాహినీహర్మ్యఖ అని కవి అజ్ఞానముచేత ప్రయోగించినట్టుగా తోస్తున్నది."

(అనిరుద్ధ చరిత్ర, D. 879, 1-15).

iii. సీ॥ తనలోని రత్నసంతతులధోగతి పాలు

... ... ... ... ... ...

తన మూలధనముకు దగిన లాభము గూర్చ

... ... ... ... ... ...

టీక॥ "..... ఇది ధనమునకు అని వుండవలసినందుకు కవి ఛందమే విచారించి వ్యాకరణమందు అన్యాయంచేసినాడు," (అందే 1-21, 22.)

iv. ... ... ... ... ... ...

నొక సూద్రసుతుడె చాలుర్వీతలంబెల్ల......

"టీక॥ ......... చాలుననేడి పదము ద్రుత ప్రకృతి గనక దానికి అచ్చు పరమౌకొంచూనుండగా ద్రుతలోపముచేసి చెప్పినందున లక్షణ భంగమయ్యినది, ఇందుకు, లుక్సంశ్లేషోనాచి ద్రుతస్య, అని శబ్దాను శాసన సూత్రము॥"

(దశావతార చరిత్ర. D. 528. సంపు. 1. 1-10, 11.)

7. అలంకారములను వివరించెడివారు.

ఉదా : మణిమయంబైన యారాజమౌళి మోళి
చిత్రరుచినొప్పె ధవళాత పత్రమపుడు
హాటకాచల శృంగ శృంగాట కాగ్ర
విభ్రమ చ్ఛుభ్ర శరదభ్ర విభ్రమమున.

"టీక॥ ......... ఇక్కడ మేరు శిఖరమునకు రాజు కిరీటమునకున్ను । శరత్కాల మేఘమునకు శ్వేతచ్ఛత్రమునకున్ను । ఉపమానోపమేయ భావము."

(D 453. కవికర్ణరసాయనము. 1-74)

8. లోకోక్తులను, సామెతలను విశదీకరించెడివారు

౯ ౧౦ ౧౧
: ఉదా ... ... ... ... హరీ । దీనికి । ం

౧౨ ౧౩ ౧౪ ౧౫
కేనేమందును । డాగబోయిన । దలారిల్లయ్యె । నేడే । దకుం

౧౬ ౧౭ ౧౮
బోనా । జిక్కితి । వంటయింటి శశమై । బోనంపు పెన్గాటికిన్

౧౩

టీక॥ "..........దాగికొనబోయినప్పటికిన్ని । తలారి వానియిల్లే దొరకెను । అనగా చావుకువెరచి దాగబోయి తరిలావాని యిల్లే జొచ్చెననగా । తలారివాడే చంపే వాడు గనుక చచ్చేచోటికే దాగబోయెనని లోకములో సామెత । అలాగె నా భయానికి వెరచి యిక్కడికి దాగవచ్చి నాకే చిక్కితివని తాత్పర్యము । ... ... వంట యింటి కుందేలనగా ప్రయాసములేక వండేచోటికే వచ్చి చిక్కినదనుట ॥"

(D 528. దశావతారచరిత్ర 1-261)

9. పురాణగాథలెవటివో పేర్కొనెడివారు. ఆ గాథలను కూడ సంక్షిప్తముగ నుడివెడివారు. ఉదా :

౨ ౧ ౩ ౪ ౫
అలయవు । బ్రహ్మహత్యకు । బరాంగన గూడుటకో । టలేదు । జ్ఞా

౬ ౭ ౮ ౯
తులపగ । నీకవశ్యకము । మోసముసూడవు । యజ్ఞ । విఘ్నముల్

౧౦ ౧౧ ౧౨ ౧౪ ౧౫
సలుపుటకై । పరో । న్నతికి । నైపవునీవు । సురేంద్ర । పట్టమున్
౧౭ ౧౩ ౧౩
నిలిపిన । ధాతదూరవలె । నన్ననవేటికి । గో తభేదనా

"టీక॥ బ్రహ్మహత్య జేయడానకు । అలసట పడవు । అనగా విశ్వరూపుణ్ని జంపి యింద్రుడు బ్రహ్మహత్యబొందీ నాలుగు భాగములుగా ఆ పాపము భాగించి । స్త్రీలకు । వృక్షములకు । భూమికి । ఉదకములకున్న । పంచిపెట్టి పోగొట్టుకొన్నకథ భాగవతం షష్టస్కంధములో తొమ్మిదో అధ్యాయమందు చెప్పివున్నది । పరస్త్రీని
౩ ౪
బొందుటకు । వెరపులేదు । యింద్రుడు గోతమ భార్యయైన అహల్యను పొందినకథ యీ గ్రంథమందెయేడూ ఆశ్వాసములో చూడవలెను । ......................... రామాయణమందు కూడా అహల్యాకాముకుడై దేవేంద్రుడు సహస్రయోనిత్వమును మెషవృషణత్వమును పొందినట్టు బాలకాండలో ప్రత్యక్షముగా నున్నది. చూడవలెను..................."

(D. 528. దశావతార చరిత్ర 2-34)

10 ద్వ్యర్థికావ్యయగు రాఘవ పాండవీయమునకు భారత, రామాయణార్థములను రెంటిని విడివిడిగ వ్యాఖ్యానించిరి. ముద్దరాజు పెదరామన వ్యాఖ్యయే కొంత అనుసరింపబడినది. ఈ వ్యాఖ్య వ్యావహారిక భాషలో మరికొంత వివరణతోనున్నది.

11. ప్రాచీనులు ద్విపదలను పదకవితలని నిరసించిరి. వానికి వ్యాఖ్యలను సమకూర్చినవారులేరు. కాని బ్రౌను ప్రభులింగలీల, నవనాథచరిత్ర (తృతీయాశ్వాసములో అంజనీ విప్రుల కథ), సారంగధర చరిత్ర హరిశ్చంద్ర చరిత్రకు వ్యాఖ్యలను వ్రాయించెను.

ఉదా : మునినాథునకు భక్తిమ్రొక్కియేనిక- మునినాథునకు ఋషిశ్రేష్ఠుడైన విశ్వామిత్రునకు - భక్తి మొక్కి - భక్తితో నమస్కరించి — ఏనింక - ఇకనునేను."

(D. 1217 హరిశ్చంద్ర చరిత్ర: 1-1420)

12. బ్రౌను పండితుల వ్యాఖ్యానములను పునఃపరిశీలించి, "Give note on గళరవం" Explain అల్లందులకు by your Tantra and refer to I1 165

ఆచ్చో and give parallel Passages pudoris reticutis." (D. 712. రాధికాసాంత్వనము. సంపు. 1. 1-197)

"The commentator has omitted to explain the last two lines టీక సమగ్రంగంకాదు." (D. 749. వసుచరిత్ర. సంపు. 2. 4-14, .5). ఇటువంటి సవరణలను, సూచనలను చేసెడివాడు.

బ్రౌను వ్యాఖ్యానములు వ్రాయించునపుడు శబ్దార్థముకాని, పద్యార్థముకాని సులభముగ కుదరనిచో ఆ విషయమున పండితుల నడుమ జరిగిన వాదప్రతివాదము లను వ్రాయించి ఉత్తమ వ్యాఖ్యలు వెలువడుటకు మార్గదర్శకుడయ్యెను. ఇవియే తరువాతి కాలమున విపుల వ్యాఖ్యారచనమునకు దారితీసినవి.

ఈ విధముగ అనేక ప్రసిద్ధ కావ్యములకు పండితులచే వ్యాఖ్యానములు వ్రాయించి, వానిని ముద్రించి తెలుగు కావ్యములు ఖిలములు కాకుండ బ్రౌను సంరక్షించెను. అచ్చుకాని వానిని మంచికాగితములపై నల్లసిరాతో వ్రాయించి భద్రపరచెను. బ్రౌను నిరంతర ప్రయత్న ఫలితముగ ఇరువది సంవత్సరములలో ముఖ్యమైన తెలుగు కావ్యముల కన్నింటికి వ్యాఖ్యలు తయారయ్యెను. ఆనాటి తెలుగువారు అత్యుత్సాహముతో ఆ వ్యాఖ్యానముల నాదరించిరని బ్రౌను తెలిపెను.

ఇట్లు బ్రౌను పండితులచే వ్యాఖ్యలు వ్రాయించి, వానిని ముద్రించి తెలుగు సాహిత్యమునకు, తెలుగువారికి మహోపకారము గావించి ధన్యుడయ్యెను.

## 8. 2 పదసూచికలు :

8 2 0 ప్రాచీనకాలములో సంస్కృత సాహిత్యమునగాని, తెలుగు సాహిత్యమునగాని పదసూచికలు కానరావు. సంస్కృత సాహిత్యములో సూత్రయుగములో (Sutra period) వేదములకు అనుక్రమణికలు తయారుచేయబడినవి. ఇందు ఋక్కు యొక్క మొదటి పదము (first words of each hymn), ద్రష్ట అందు స్తుతింపబడినదైవము, ఆ వేదములోని శ్లోకసంఖ్య, శ్లోకము ఏ ఛందస్సులో వ్రాయబడినదియు తెలుపబడినవి. ఋగ్వేదములో పైచెప్పబడిన విషయములేకాక ఋక్కులసంఖ్య, శ్లోకసంఖ్య పదములసంఖ్య, అక్షరములసంఖ్య (Syllables) మొదలగు విషయములు అధికముగ చెప్పబడినవి. కాని పదసూచికలు మాత్రము ప్రాచీనకాలములో

వెలువడియుండలేదు. 19వ శతాబ్దముననే సంస్కృత సాహిత్యముల పదసూచికలు వెలువడినట్లు తెలియుచున్నది.

8 2. 1. తెలుగుభాషకు సోదరభాషయైన తమిళ సాహిత్యమునందును ప్రాచీన కాలములో పదసూచికలు వెలువడియుండలేదు. తమిళ సాహిత్యమందు పదసూచికలు 20వ శతాబ్దముననే వెలువడినవి. "తిరుక్కురళ్" అను గ్రంథమునకు కంద్దైయాపిళ్ళై "తిరుక్కురళ్ అగరాది'' అను పదసూచికను తయారుచేసెను. ఇది 1961 సం॥లో ముద్రితమైనది కాని ఇదియు సమగ్రమైనది కాదు.

వి. ఐ. సుబ్రమణియన్ అనునతడు సంగ సాహిత్యమునకు చెందిన 'పురనానూరు' కావ్యమునకు 'పురనానూరు పదసూచిక (Index of Puranaanuuru) అను పేరుతో ఒక పదసూచికను వ్రాయుటకు 1954 వ సం॥న పూనుకొనెను. ఇది 1962 వ సం॥న ముద్రితమైనది. ఇందు 'పురనానూరు' కావ్యములోని పదములన్నియు తమిళభాషలోని అక్షరక్రమము ననుసరించి వ్రాయబడియున్నవి. అంతియకాక ప్రతి ముఖ్యపదమునకును (head words) అర్థమును, రోమనులిపిలో వర్ణనాత్మక లిపియును వ్రాయబడియుండుట ఇందలి విశేషము

8 2. 2. లాటిన్ ఆంగ్లసాహిత్యములలో మొట్టమొదట సిసిరో (Cicero), షేక్స్పియరు (Shakespeare) తమ రచనలకు 'విషయసూచిక'లను సిద్ధము చేసిరి. కాని ఇవియు పదసూచికలు కావు. తదనంతరకాలములో వెలసిన ప్రాచీన పదసూచికలలో వాక్యగతమైన పదములే సూచింపబడినవి. కాని ప్రత్యేకముగ పదములు సూచింపబడలేదు. ఆధునిక కాలములోనే ఈ సూచికారచనా విధానము అభివృద్ధి చెందినది ముఖ్యముగ ఇంగ్లండులోని 'Index Society' వారు ఈ కార్యమునకు పూనుకొనిన తరువాతనే పదసూచి విధానము వృద్ధిచెందినది.

8. 2. 3. తెలుగు సాహిత్యములో 19వ శతాబ్దమున పదసూచికలు వెలువడినవి. మొట్టమొదట ఈ పదసూచికలను తయారుచేయించినవాడు బ్రౌను, ఆంగ్ల సాహిత్యమును క్షుణ్ణముగ అభ్యసించిన వాడగుటచే పదసూచికల ప్రాముఖ్యమును తెలిసికొని తెలుగు సాహిత్యములోని కొన్ని కావ్యములకు బ్రౌను పదసూచికలను తయారు చేయించెను. ఇవి నిఘంటు నిర్మాణమునకును, వ్యాకరణము రచించుటకును, భాషాశాస్త్రాధ్యయనమునకును మిక్కిలి ఉపకరించును.

బ్రౌను తయారుచేయించిన శబ్దసూచికల వివరణములు :

1. D. 823, 824 శశాంకవిజయ శబ్దసూచిక ... ... ... 1830 సం॥
2. D. 842 మనుచరిత్ర, శబ్దసూచి ... ... ... ... 1832 సం॥
3. D. 3100, 3102, హంసవింశతి పదసూచి ... ... ... 1832 సం॥
4. D 3095 పంచతంత్ర పదసూచి ... ... ... ... 1848 సం॥
5. D. 423. ఆముక్తమాల్యదా శబ్దసూచి ... ... ... ... 1849 సం॥
6. D. 631. దశావతార చరిత్ర - పదసూచి ... ... ... 1850 సం॥ ఏప్రిల్, 3.
7. D. 3091. భాస్కరశతక పదసూచి
8. D. 3091. సుమతిశతక పదసూచి

పై పదసూచికలేకాక వేమన పద్యములకు, చౌడప్ప శతకమునకు పద్యసూచిక లను గూడ బ్రౌను తయారుచేయించెను.

8. 2. 4. బ్రౌను పదసూచికాల నిర్మాణమున పాటించిన నియమములు :

1 తాను తయారుచేయించిన శుద్ధప్రతిని ఆధారముగ చేసికొని సూచిని సిద్ధపరచెడివాడు.

2. తత్సమాచ్ఛిక పదములకొన్నింటికి ఆరోపములను కూర్చెను.

ఉదా : <u>తత్సమములు :</u>

పద్మ - ఆ. ౩౧ - ప్ర ౩౧ - ౪౫ - తే - ౨౦౩ - ౨౧౪ - ౨౩౧.
పద్మంబు - చ - ౨౪౭
పద్మగర్భుడు - పం ౧౮. (ఆముక్త, సూచి).

<u>ఆచ్ఛికములు :</u>

చెలువ - అవ - ౬ - ద్వి - ౪౬ తృ - ౧౧౫
చెలువంబు - ద్వి - ౯.
చెలువగు - పం - ౭౬.
చెలువము - పం - ౧౨౨ (మను. సూచి).

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు కూర్చిన పదకోశములందు దేశ్యవైకృత పదములు, తత్సమక్రియలకు మాత్రమే ఆరోపములు కూర్చబడినవి.

3. విభక్త్యంతపదములకు ఆరోపములివ్వబడెను. విభక్తులకుమాత్రము ప్రత్యేక ఆరోపములొసగబడలేదు.

ఉదా ; పతితుడు, పద్మగర్భుడు పద్మాక్షుల.
పద్మినులు . పద్యంబులన్, పతికిన్, పనివింటన్,
బలిత్వమున [ఆముక్త. సూచి)
ఉత్తమునకు (పంచ. సూచి .

అకాడమీ కోశ సంకలనకర్తలు ఈ విధానమునే అనుసరించినను, తోడ తోన్ మున్నగువానికి ప్రత్యేక ఆరోపముల నిచ్చిరి.

4. సమాపక, అసమాపక క్రియలు, సహాయకక్రియలు (auxiliary Verbs) శబ్దపల్లవములు, గ్రహింపబడినవి. ఆశీర్వాప, విధ్యర్థకములును చూపబడెను.

ఉదా : అగు, అగుచున్, అగుటకు, అగుటగాక. అగున్, అగునె. కలిగెడుగాక, కలిగె గాదె. సేయవలదుర. (సుమతి సూచి)

అంగీకరించి, అగుటంచేసి (మను. సూచి).

బలిమిన్ (ఆముక్త సూచి).

5. సమాసములకు ఆరోపములున్నవి.

ఉదా : అఖిల సత్రపజయును, పణిరాజవల్లి, ఫణీంద్ర, ఫణ్యంగన, పద్మేక్షణ' సమాస ఘటితపదములను విడదీసి చూపలేదు.

# MODE OF COMPILING INDEXES

See P 45)

Let the Index be compiled by a sensible a man who thouroughly understands his author - give him three careful assistants. Take as many sections of foolscape paper (country paper) as many be requisite, perhaps 40 or 50,each containing eight or ten leaves and let these be marked like the pages of the dictionary - with letters at the top - this will be best understood by examining the Indexes to the poems prepared by me —

Take forty slips of wood four inches long and an inch square - paste paper over them and mark them with numerical figures large enough to read at ten feet off - Three of each number will take thirty slips These will serve to mark the verses -

To denote the chapter or cants I use ప్రథమ/ద్వితీయ etc. the initials of ప్రథమ/ద్వితీయ etc,, according to the native custom. This

Make a frame of wood, of a thick plank or block supporting two slight posts or legs, with a trench at the top - This is two feet high and broad - thus the trench (one inch deep and wide) is two feet long. This stands at the right hand of thé reader - who begins by placing on it the slips of wood giving the chapter and verse. Thus -

The three Writers sitting at desks opposite him, with a portion of the alphabet before each, he reads out the verse; word by word; each man enters such words as fall to his share and looking at the figure placed on the "horse" marks it down.

This mode has most fully succeeded - and hereby complete verbal indexes are framed more rapidly than I had expected-They finished about thirty lines a day while new to the work : afterwards, one hundred or even two hundred.

When the whole poem is indexed the Index is transcribed from dictation; the man who dictates ranging the words in each page alphabetically. This task which occupies two writers is as almost tedious as the former-

The Tale of Tara, which was my first attempt, is about 3750 lines ( 940 Verses ) in length, and it occupied only three months to complete. But certainly my assistants were first rate
— P. R. T L. pp 87-88

6. సంధి సంఘటిల్లిన రూపములు చూపబడినవి.

సంధిలోని పూర్వపదములనగాని, పరపదములనుగాని యథాస్వరూపముతో చూపలేదు.

ఉదా :- అంతకంతను, దంతపుకరకట్టులు [మను. సూచి)
నెపమెన్నక, మాటలాడకు (సుమతి. సూచి).

7. విశేష్య విశేషణముల మీద, అవ్యయములమీద వచ్చు కన్ (గిన్) కాన్ (గాన్) అను ప్రత్యయములకు, ఏవార్థకములకు, ఎదాదులకు, ప్రశ్నార్థకములకు ప్రత్యేక ఆరోపములులేవు.

8. సూచికి గ్రహించిన కావ్యమునందలి ప్రతి పదమునకు ఆరోపము కలదు. ఆ పదములు గల ఆశ్వాససంఖ్య పద్యసంఖ్య సూచింపబడెను. అకారాదిపదములు అకారాది క్రమమున వివరింపబడినవి. కాని హలాదిపదముల క్రమములో మాత్రము బ్రౌను కొంతమార్పు చేసెను. ఒక వర్గములోని వివిధాక్షరములతో (అనునాసికాక్షరమును వదలి) ప్రారంభించు పదజాలమంతయు అకారాది అచ్చుల క్రమముగ కూర్పబడెను. తదుపరి శ-ష-స-హ లు గ్రహింపబడినవి.

తాను పదసూచికలు తయారు చేయించిన విధానమును బ్రౌను వివరించెను (చూ ప్రక్కపుట మైక్రోఫిల్మ్)

పదసూచికలు బహుళ ప్రయోజకములు. పదముల అర్థవివరణకు, సాధుపాఠ నిర్ణయమునకు, భాషాస్వరూపనిర్ధారణకివి ఉపయోగకరములు. ఇట్టి పదసూచికలు బ్రౌనునకు పూర్వము ఆంధ్రభాషయందు కానరావు. ఇట్టి పద సూచికలను బ్రౌను ఎనిమిది కావ్యములకు తయారుచేయించెను. ఇంతటి ఉత్కృష్టకార్యమును గావించిన బ్రౌనును అధునిక అకాడమీ పదప్రయోగ కోశ సంపాదక వర్గము విస్మరించుట చింత్యము.

## 8. 3. విషయసూచికలు :

బ్రౌను గ్రంథములందలి విషయముల క్రోడీకరించి, విషయసూచికలను గ్రంథాదిలో నొసగుట తెలుగువారికి బ్రౌను నేర్పినవిద్య. గ్రంథాంతర్గత ఉపాఖ్యానములకు, చిన్న చిన్న పట్టములకు పాఠకుల సౌలభ్యము నిమిత్తము పార్శ్వశీర్షికలను వ్రాయుటకు కూడ మార్గదర్శకుడు బ్రౌను. ఇతడు కొన్ని కావ్యములకు ఆంగ్లమున మాత్రమే విషయసూచికలను వ్రాసెను (శుకసప్తతి, సింహాసనద్వాత్రింశత్తు). కొన్నింటికి తెలుగు (ఉత్తరరామాయణము) కొన్నింటికి ఉభయ భాషలలో (ప్రభులింగలీల, బసవపురాణము) విషయసూచికలను వ్రాసెను.

## 8. 4 ఉపోద్ఘాతములు :

బ్రౌను తాను పరిష్కరించిన కావ్యములకు ఉపోద్ఘాతములను వ్రాసెను. ఆధునికులు గ్రంథారంభమున వ్రాయు "పరిచయ వాక్యములు" మున్నుడి, పీఠికలు బ్రౌను ఉపోద్ఘాతములననుసరించి వ్రాయబడుచున్నవి. బ్రౌను ఇంచుమించు తాను సేకరించిన కావ్యములకన్నింటికి ఉపోద్ఘాతములను వ్రాసెను. ఇందులో కొన్ని సుదీర్ఘములైనవి కొన్ని సంక్షిప్తములైనవి. ఇందు బ్రౌను కవి, కవికాలము, కవినిగురించిన వివరములు, పరిష్కరణకు గ్రహించిన ప్రత్యంతరములు, కృతిభర్త, మొదలగు విషయములను చర్చించెడివాడు. సుదీర్ఘ ఉపోద్ఘాతములలో కావ్యవిమర్శ, ఆనాటి సాంఘిక పరిస్థితులు, చారిత్రక విశేషములు ఉండెడివి. బ్రౌను సమకూర్చిన ఉపోద్ఘాతములుకల కావ్యములలో ముఖ్యమైనవి క్రింద అకారాదిక్రమమున చూపబడినవి :

1. అనిరుద్ధ చరిత్ర.
2. ఆముక్తమాల్యద
3. ఉత్తరరామాయణము
4. కవికర్ణరసాయనము
5. కాశీఖండము.
6. కాళహస్తి మహాత్మ్యము.
7. చంద్రరేఖా విలాపము.
8. చంద్రాంగద చరిత్ర.
9. దశావతార చరిత్ర.
10. పంచతంత్రము.
11. పండితారాధ్య చరిత్ర.
12. పద్మపురాణము.
13. పరమయోగి విలాసము.
14. పల్నాటి వీరచరిత్ర.

15. ప్రభులింగలీల
16. బసవపురాణము
17. భానుమద్విజయము.
18. మనుచరిత్ర.
19. రాఘవ పాండవీయము.
20. రాధామాధవసంవాదము.
21. రాధికాసాంత్వనము
22. రామాభ్యుదయము.
23. రామాయణము.
24. వసుచరిత్ర.
25. విక్రమార్కచరిత్ర.
26. విజయవిలాసము.
27. విష్ణుపురాణము.
28. వేమన పద్యములు.
29. వైజయంతీ విలాసము.
30. శశాంక విజయము.
31. శ్రీ పర్వతపురాణము
32. శుకసప్తతి
33. సకలకథాసార సంగ్రహము.
34. సారంగధర చరిత్ర.
35. సారంగధరోపాఖ్యానము.
36. సింహాసనద్వాత్రింశత్తు.
37. హంసవింశతి.
38. హరివంశము

## 8. 5. కథాసంగ్రహములు :

బ్రౌను కొన్ని కావ్యములకు తెలుగునను, ఆంగ్లమునను కథాసంగ్రహములను సమకూర్చెను, ఈ కథాసంగ్రహములు తెలుగు కావ్యములను చదువు విదేశీయుల కుద్దేశింపబడినవి. వీనిలో కొన్ని విపులమైనవి. కొన్ని సంగ్రహములైనవి. కొన్ని కావ్యములకు కథాసంగ్రహములను పండితులచే తెనుగున వ్రాయించి, తదుపరి వానిని ఆంగ్లములోనికి అనువదించెను.

బ్రౌను వ్రాసిన కథాసంగ్రహములుగల కావ్యముల పట్టిక క్రింద ప్రదర్శించనము.

1. అనిరుద్ధ చరిత్ర.
2. అభిమన్యు కళ్యాణము.
3. *ఆముక్తమాల్యద.
4. ఉత్తర రామాయణము.
5. ఉషాపరిణయము.
6. *కంచికావ్యము.
7. *కన్యకాపురాణము.
8. కాళహస్తిమహాత్మ్యము.
9. కళాపూర్ణోదయము.
10. *కృష్ణరాయవిజయము.
11. చంద్రాంగద చరిత్ర.
12. నవనాథ చరిత్ర.

13. *నిజలింగ చిక్కయ్య (?) 14. పల్నాటి వీరచరిత్ర.
15. *పారిజాతాపహరణము. 16. ప్రభులింగలీల.
17. బసవపురాణము 18. భానుమద్విజయము.
19. *మనుచరిత్ర. 20. రామాభ్యుదయము.
21. *వల్లభాంబాపరిణయము. 22. వాణీవిలాసవనమాలిక.
23. *వైజయంతీవిలాసము. 24. *సమీరకుమారవిజయము.
25. సారంగధరచరిత్ర. (Es on. Tel. Lit).
26. సింహాసన ద్వాత్రింశిక. 27. హరిశ్చంద్ర చరిత్ర. (శరభయ్య).

8 6. అనువాదములు :

బ్రౌను తానుచదివిన, పరిష్కరించిన తెనుగు కావ్యములందలి కొన్ని భాగము లను ఆంగ్లములోనికి అనువదించెను. ఈ అనువాదములు గద్యపద్యాత్మకములు. పద్యానువాదములు అనుబంధమున (II చూపబడినవి. వచనాత్మకములు ఆయా కావ్యపరిష్కరణ సందర్భమున ప్రస్తావితములు. మడికిసింగన పద్మపురాణములోని దియు, దశావతార చరిత్రలోనిదియునగు అహల్యచరిత్రలను ఆంగ్లములోనికి అనూది తము కావించెను విష్ణుపురాణమును, శశాంకవిజయమును ఇంచుమించుగ పూర్తిగ అనువదించెననియే చెప్పదగును తదితరములలో కొన్ని పద్యములను మాత్రము అనువదించెను. ఈ అనువాదములు కొన్నియెడల యథామాత్రకములు. కొన్ని యెడల భావానువాదములు. కొన్ని పట్ల తాత్పర్యముల కూర్పు. నీలాసుందరీ పరిణ యము వంటి అచ్చతెనుగు కావ్యములు భాస్కర. వేమన, సుమతివంటి శతకములు, పల్నాటి వీరచరిత్రలవంటి ద్విపదలు, అప్పకవీయము వంటి లక్షణ గ్రంథములు గ్రహింపబడినవి.

---

* గుర్తుగల కావ్యముల కథాసంగ్రహములను బ్రౌను వ్రాసెను. అవి "Literary Collections" (Mss. Ear. *D*. 302 , Microfilm) లో నున్నవి.

ఈ అనువాద ప్రక్రియలో బ్రౌనుచే ఏకదేశానువాదములు కల కావ్యములు :

1. ఉత్తర రామాయణము (కంకంటి) 2. కవికర్ణ రసాయనము
3. చంద్రరేఖా విలాపము 4 దశావతారచరిత్ర
5 నీలాసుందరీపరిణయము 6 పద్మపురాణము
7. ప్రభులింగలీల 8. భాగవతము దశమస్కంధము
9. భానుమద్విజయము 10 భాస్కర శతకము
11. రాధికాసాంత్వనము 12 వసుచరిత్ర
13. విజయ విలాసము 14 విష్ణుపురాణము
15. వేమన పద్యములు 16. శశాంక విజయము
17. సుమతి శతకము 18. హంసవింశతి

## 8. 7. లేఖలు

తెలుగు కావ్య సముద్ధరణ పరిశీలనలో లేఖావాఙ్మయ ప్రస్తావన అప్రస్తుతముగ తోచవచ్చును కాని బ్రౌను సేకరించి, సంపుటములుగ సమకూర్చిన ఈ లేఖలు అతని నిర్విరామ, నిష్కామసాహిత్య కృషిని ప్రతిఫలించు దర్పణములు.

శాసనస్థాధారములు, గ్రంథస్థ నిదర్శనములే 18 వ శతాబ్ది వరకు భాషాచరిత్ర నిర్మాణమునకు వాఙ్మయ చరిత్ర రచనకు ఆధారములు. 19వ శతాబ్దినుండి శాసనము లధికముగ వెలువడలేదు. వాని స్థానమున కైఫీయతులు, ఆర్జీలు, లేఖలు తెలుగు భాషా చరిత్రకారుని కుపకరించు సాధనములైనవి. వీని కర్తలు తెలుగువారే అయినను సంకలనకారులు మాత్రము పాశ్చాత్యులే. కైఫీయతులను సేకరించిన ప్రథముడు మెకంజీ, ఆర్జీలను సమకూర్చిన ఆద్యుడు జె సి. మారిస్ లేఖలను సంకలన మొన ర్చిన మొదటివాడు బ్రౌను

తెలుగు పాఠ్యగ్రంథముల ప్రచురణకు, తెలుగు వ్యాకరణరచనకు, ప్రామాణిక బృహన్నిఘంటువుల కూర్పునకు ఆకరములు, ఆధారప్రాయములు అయిన ముడి సామాగ్రి కొరకు బ్రౌను ఈ లేఖలను సమకూర్చెను. ఇవి ౨౦ సంపుటములుగ మ. ప్రా. పు. భాండాగారమున భద్రపరుపబడి ఉన్నవి.

ప్రకీర్ణకము

ఈ లేఖలను (1) బ్రౌనుకు ఇతరులు వ్రాసినవి (2) బ్రౌను ఇతరులకు వ్రాసినవి. (3) ఇతరులవి-అని త్రివిధముగ విభజింపనగును. 'ఇతరులవి' అనగా భాషాదృష్టితో పత్రికలనుండి, ఇతరులనుండి, కచేరీలనుండి బ్రౌను సేకరించినవి. వీనిలో మొదటి విభాగమునకు చెందినవి అధికము. మూడవ రకమునకు చెందినవి తక్కువ. బ్రౌను స్వయముగా వ్రాసినవి అతిస్వల్ప సంఖ్యాకములు.

పాశ్చాత్య భాషలలో లేఖలు ఒక విశిష్టసాహిత్య ప్రక్రియగా ప్రసిద్ధిని పొందినవి. తెలుగు వాఙ్మయమునందును లేఖావాఙ్మయమును ఒక ప్రత్యేక ప్రక్రియగ గుర్తింపనగును. ఈ లేఖావాఙ్మయమునకు మూలపురుషుడనదగిన వ్యక్తి బ్రౌను. బ్రౌను సేకరించిన లేఖలలో అనాటి సాహిత్య, సాంఘిక, చారిత్రక విశేషములు నిబద్ధములు.

బ్రౌను లేఖలు తెలుగు కావ్యసముద్ధరణమున కాతడొనర్చిన కృషికి కొలబద్దలు. ఆ లేఖలు బ్రౌను కావ్య ప్రతుల సంపాదనమునకు పడినపాట్లను ప్రస్ఫుటీకరించును. తెలుగు కావ్యముల ముద్రణకు అతడు చూపిన ఆతురతను వ్యక్తీకరించును. అతని సాహితీమిత్రులను పరిచయమొనర్చును. అతని ఆర్థికకష్టములను ఎత్తిచూపును. అతని వితరణగుణమును విశదీకరించును.

ఈ లేఖలు భాషాచరిత్రకారులకును, దేశచరిత్రకారులకును తరచినకొలది తరుగని నిధులు. అందువలననే అవి ప్రత్యేక పరిశోధనాంశములు.

ఈ సిద్ధాంతవ్యాసమున ఆయా ప్రకరణములలో బ్రౌను కావ్యసముద్ధరణమునకు సంబంధించిన లేఖలు ఉద్ధరింపబడినవి. వానిని మరల ప్రస్తావించుట చర్వితచర్వణమగును. లేఖలను ఒక ప్రధాన సాహిత్యప్రక్రియగ తెలుగువారు గుర్తించునట్లు చేసినవ్యక్తి బ్రౌను అనునది విస్మరించరాదు. ఈ లేఖలందు తెలుగుభాషాసముద్ధరణమునకు అవిచ్ఛిన్నముగా, అహోరాత్రములు బ్రౌను నిర్వహించిన పరిశ్రమ ప్రదర్శితము.

ప్రకరణసారాంశము :

1. శిథిలావస్థలోనున్న తెలుగు కావ్యములను ఉద్ధరించినంతమాత్రమున తన కర్తవ్యనిర్వహణము పూర్తియైనట్లు బ్రౌను భావింపలేదు. ప్రౌఢప్రబంధములకు,

పురాణేతిహాసములకు, శతకములకు, ద్విపదలకు వ్యాఖ్యానములు సమకూర్చుట అవసరమని భావించెను.

2. బ్రౌనునకు పూర్వము రాఘవపాండవీయమునకు, హరిశ్చంద్రనలోపాఖ్యానమునకు, ఆముక్తమాల్యదకు, వసుచరిత్రకు మాత్రమే టీకలుండినవి. బ్రౌను 25 కావ్యములకు వ్యాఖ్యలను సమకూర్చెను. ఇన్ని వ్యాఖ్యలను బ్రౌను సమకూర్చినను వానిని ఉపయోగించుకొనక పోవుట ఆంధ్రుల దురదృష్టము.

3. ప్రాచీన లాక్షణికులగు బాలసరస్వతి, అప్పకవి మున్నగువారు వాఖ్యానించుటకు వ్యావహారిక భాష నుపయోగించిరి. బ్రౌనుగు తన వ్యాఖ్యలను వ్యావహారిక భాషయందే సంతరించెను.

4. పదసూచికలను తెనుగు వారెరుగరు. పదసూచకల ఉపయోగమును గుర్తించివారివి తెలుగుకావ్యములకు సమకూర్చిన బ్రౌను ప్రశంసనీయుడు. తెలుగు కావ్యములకు పదసూచికలను సంతరించిన ఆద్యుడును బ్రౌనే

5. కావ్యపరిష్కరణమున కేవలము పాఠాంతరములను మాత్రము గుర్తించిన చాలదని, దానికి విషయసూచిక, ఉపోద్ఘాతము, కథాసంగ్రహముండుట ఆవశ్యకమని తెనుగువారికి గరపిన గురువును బ్రౌనుదొరయే.

6. ఆంధ్రేతరుల ఉపయోగార్థము అనేక తెలుగు కావ్యములందలి రసవద్ఘట్టములను ఆంగ్లములోనికి అనువదించిన భాషాప్రియుడు బ్రౌను.

7. సాహిత్య చరిత్ర కత్యంతము ఉపకరించు సమకాలీన లేఖలను సంపుటములుగ సమకూర్చిన ప్రథముడు బ్రౌను.

ఇట్లు బ్రౌను తెలుగు భాషా సముద్ధరణము బహుముఖముల పరివ్యాప్తి నందెను.

# 9

# బ్రౌను సహచరులు

సి. పి. బ్రౌను తలపెట్టిన ఈ వాఙ్మయ మహాయజ్ఞమును ఆతడొక్కడే నిర్వహింపలేదు. అసహాయ శూరతతో ఏకైకముగ ఇంతటి బృహత్కార్యమును కొనసాగించుట ఎవరికైనను అసాధ్యము, బ్రౌను తెలుగు కావ్య సముద్ధరణకు స్వదేశీయుల సాహాయ్యమును కోరెను; అనేకులు సహకరించిరి. ఉద్యోగకారణమున ఆతడు వివిధ ప్రాంతములకు బదిలీ అయినను, కడపలో తన 'బంగళాను' తెలుగు కావ్య పునర్నిర్మాణమునకు కేంద్రముగ నొనర్చెను. ఈ 'బంగళా'ను 'బ్రౌనుకాలేజి' అని వ్యవహరించెడివారు.[1]

మృతప్రాయముగ నుండిన తెలుగు వాఙ్మయమును పునర్జీవింపచేయవలయుననెడి కాంక్ష బ్రౌనుకు ఒక వ్యసనముగ సంక్రమించినది. ఆతని సహచరులును త్రికరణశుద్ధిగ ఈ కార్యమున కుపక్రమించిరి. అందువలననే "My fellow-Lahourers the Brahmans", my learned and laborious assistants" అని వారిని ప్రశంసించెను.[2] తాను నిఘంటు నిర్మాణమున, బైబిలు అనువాదమున నిమగ్నుడై యుండ తన పండితులు కావ్యముల పరిష్కరించుచు, వ్యాఖ్యానము సంతరించుచు పదసూచికలను సమకూర్చుచు నుండినట్లు బ్రౌను తెలిపెను. తన పోషణలో నిరంతరము 10 నుండి 20 దాక సాహితీకార్య నిర్వాహకులు ఉండిరట.[3] ఆంధ్ర సాహిత్య పునర్నిర్మాణమున బ్రౌనుతో సహకరించిన వీరందరును ఆంధ్రులకు చిరస్మరణీయులే. కాని వీరిని గురించిన వివరములు అధికముగ తెలియునవకాశములేదు.

---

1. Thus there were three separate sets of Brahmins engaged under my roof, which people called "Brown's College' — Brown, C. P ; English and Telugu Dictionary 19. P. XX.
2. Ibid P. xxi.
3. "Indeed there were always from ten twenty Brahmins and Sudras in my pay; employed in transcribing native authors, in preparing correct editions; in framing indexes and commentaries." — Ibid. P. xvi.

ఉంతవరకు ఆంధ్రవాఙ్మయచరిత్ర గ్రంథములందు వీరిలో ననేకులకు స్థానము కని పింపదు. తెలిసినంతవరకు వారి వివరములు ఈ ప్రకరణమున సమకూర్చబడెను.

ఈ కార్యమున బ్రౌనుకు తోడ్పడినవారిని 1. పండితులు 2. సాహితీమిత్రులు 3. ప్రభుత్వోద్యోగులు 4. పోషితులు అని నాలుగువర్గములుగ విభజింపనగును. పండితులు పరిష్కర్తలుగ, వ్యాఖ్యాతలుగ. టీకాకారులగ, పదసూచీగ ధనకారులుగ వ్యవహరించిరి. సాహితీ మిత్రులు, ప్రభుత్వోద్యోగులు, ప్రతులన సమకూర్చిరి. నిజపోషిత వర్గములో వ్రాయసకాండ్రు 'మొకాబిలా' చేయువారు, పుస్తకసంపాద కులు, ముద్రణ కార్యముల చేయువారు మొదలైన వారుండిరి.

## 9. 1. బ్రౌను పండితుల పరిచయము :

### 9. 1. 1. అప్పయ్యశాస్త్రి జూలూరి :

బ్రౌను **'Juluri Appaia, a poet and Grammarian', 'The Learned author Zuluri Appayya Sastri', Zuluri Appayya a Brahmin of extraordinary learning'** అని అప్పయ్యను ప్రశంసించెను. ఇతడు బ్రౌను కొలువున నుండిన ఉద్దండ పండితులలో అగ్రగణ్యుడు. మచిలీ బందరు వాస్తవ్యుడు. చల్లమ పాపనలు ఈతని తల్లిదండ్రులు. బ్రౌను ఆజ్ఞానుసారము అనేకాంధ్ర గ్రంథములను పరిష్కరించెను. వ్యాఖ్యలు, టీకలు రచించెను. బ్రౌను భాషా పరిశ్రమలో ఆతనికి చేదోడు వాదోడుగ నుండిన గొప్ప విద్వాంసుడు. అప్పయ, పండితుడు వ్రాసిన వ్యాకరణము ప్రస్తుతమలభ్యము. ఇతని కృతులు మూడు లభించుచున్నవి "కృష్ణ ; హరీ ; యదువంశభూషణా !" అను మకుటముతో, కృష్ణ స్తుత్యాత్మకముగా ఉత్పలమాలికా వృత్తములతో నొక శతకమును రచించెను. 'రామ పంచాశత్కందములు' శ్రీరామ స్తుత్యాత్మకములు 'శ్రీనివాస తారావళి' తిరుపతి వెంకటేశ్వరుని మీద విప్రలంభశృంగార రసాత్మకములైన 27 పద్యముల లఘుకృతి

అప్పయ్య పరిష్కరించిన కావ్యములు సాకల్యముగ తెలియుటలేదు కాని జైమిని భారతము (D. 14), పద్మపురాణము (D. 18), ఆముక్తమాల్యద ( D 105), శశాంక విజయము (D. 818), సురాభాండేశ్వరీయము (D. 897), భాస్కర శతకము (D. 1637), మాతృ శతకము (D. 1653), శేషాద్రిశతకము

కేసరి శతకము (D 1786) అను వానిని పరిష్కరించినట్లు స్పష్టముగ తెలియు చున్నది.

మనుచరిత్ర, వసుచరిత్ర, కవికర్ణరసాయన, విజయవిలాసములకు వ్యాఖ్యాన ముల సమకూర్చెను. అప్పయ్య టీకలు, వ్యాఖ్యలు సరళముగ, సుగమముగ సామాన్య ప్రజల కందుబాటులో నుండును. కావుననే బ్రౌను ములుపాక బుచ్చయ్య వ్యాఖ్యల కన్న అప్పయ్య వ్యాఖ్యలనే ఆదరించెడివాడు. అప్పయ్య బ్రౌను అభిమతమును అవగాహన చేసికొని వ్యాఖ్యలను రచించెను. "**Zuluri Appaya has for more than twenty years enjoyed the reputation of being the most learned of Telugu scholars. His patience, his humility and his good sense always commanded great respect.**" (D. 759, వసుచరిత్ర) అని బ్రౌను అప్పయ పండితుని ప్రశంసించెను. బ్రౌను మెచ్చిన, బ్రౌనుకు నచ్చిన పండితుడు అప్పయ్య.

**9. 1. 2. చిన్నయసూరి, పరవస్తు :**

జగమెరిగిన వైయాకరణుడు చిన్నయసూరి. సూరి బ్రౌను సమకాలికుడేకాక ఆతనిచే నియుక్తుడైన ఉద్యోగిగ బ్రౌను స్వహస్తలేఖనము రుజువు చేయుచున్నది. క్రీ. శ. 1840వ సం॥ తన యొద్ద ఉద్యోగములో నున్నవారిని తెలుపుచు "**Paravastu Chinnaya, the catani, Editor of Dasavatara**" అని బ్రౌను పేర్కొనెను.[1] దశావతార చరిత్రను సూరి సంస్కరించినట్లు బ్రౌను తెలిపెను. కాని వ్రాతప్రతిలో దానికెట్టి నిదర్శనములును కనిపించుటలేదు. సూరి పరిష్కరించిన ప్రతి ఒకవేళ నష్టమైయుండవచ్చును. ఇప్పుడు లభించుచున్న ప్రతిని గరిమెళ్ల వెంకయ్య పరిష్కరించి. వ్యాఖ్యను వ్రాసెను. సూరిచే బ్రౌను ఇంకే కావ్యములను పరిష్కరింప చేసెనో తెలియవచ్చుట లేదు. రామాభ్యుదయము వ్రాతప్రతి యందొక పుటలో "**Here the ms. procured from Chinnaya stops**" అను బ్రౌను వ్రాత కలదు.[2] ఇతడు చిన్నయసూరియే కావచ్చును. బ్రౌను లండనుకు వెళ్ళిన

---

1. **D. 1330 Entire Grammar of Telugu, p 482.**
2. **D.** 715 రామాభ్యుదయము పత్రము. 145.

తరువాత అక్కడ చిన్నయసూరి బాలవ్యాకరణమును చదివి, అందలి విషయములను గుర్తించెను.[3] తన సమకాలికులలో గణనీయులైన పండితులతో బ్రౌనునకు పరిచయము కలదు.

### 9. 1. 3. చెంచయ్య

శశాంక విజయమును అయిదుగురు పండితులు పరిష్కరించిరి. వారిలో చెంచయ్య ఒక్కడని తెలియుచున్నది. "The three Mss read ఔషధంబుసా, but chencaia shows that అసాధారణం (ఔషధంబుసా, is the only sense.' (D. 818. పత్రము. 58 2 అ. 41 ప). "A verse of great difficulty - Buchaia and Chencia can barely make it out," (Ibid. పత్రము. 47. 2 అ 10 ప.) అను బ్రౌను వ్రాతలవలన చెంచయ్య కావ్యపరిష్కరణకు బ్రౌనుచే నియుక్తుడయిన పండితుడని తెలియుచున్నది దశావతార చరిత్రయందును (D. 520) "చె॥చెంచయ్య తీర్పు" అని పెక్కుతావులందు కలదు. విష్ణుపురాణ పరిష్కరణయందును చెంచయ్య పాల్గొనెను (D. 312) ఇతనిని గురించిన మరేట్టి వివరములు లభించుటలేదు.

### 9. 1. 4. తాతాచార్యులు, తిరుపతి :

తాతాచారి కథల' సంకలన గ్రంథమున బ్రౌను అతనిని ఇట్లు పరిచయ మొనర్చెను

"నెల్లూరి దేశస్థుడైన తాతాచార్యులు కావ్యతర్క వ్యాకరణములయందు నిండా ప్రవీణత గలవాడు. యితను ప్లవనామ సంవత్సరమునకు సరిఅయిన ౧౮౪౧ సం॥లో చెన్నపట్నములో వుండే సి. పి. బ్రౌన్ దొరగారి వద్దకి వచ్చి తాను బ్రతికివుండిన పర్యంతరము ఆయనవద్ద కొలువులో వుండినాడు. యీ తాతాచార్యులు నిండా పెద్ద మనిషి సరసుడు గనుక, సంభాషణలో సమయోచితమైన చిత్ర చిత్ర కథలు చెప్పుతూ వచ్చినాడు........."

తాతాచారి బ్రౌను కొలువులో చేరక పూర్వము ఒక వీధిబడిని నిర్వహించి యుండవచ్చునను విషయము క్రింది లేఖవలన తెలియుచున్నది.

---

3. కథలు గాథలు. పు 99.

మహారాజశ్రీ బ్రౌన్ దొరవారి సముఖానకు — **తిరుపతి తాతాచార్యులు** వ్రాసుకున్న మనవి - మా విద్యార్థులకు చూచి వ్రాసుకోవడమునకు నైషధం ప్రథమ సర్గ సవ్యాఖ్యానముగా నున్న అమరం త్రికాండలు సిద్ధపతి మూలమున్న దయచేయ వలెనని కోరుతున్నాను. వీటిని రెండునెలలు గడువు పుచ్చుకొని దయచేయవలసినది

చిత్తగించవలెను

తాతాచార్యుల వ్రాలు"[1]

బ్రౌనునకు తెలుగుకావ్యములను బోధించిన వారిలో తాతాచార్యులు ఒకరు. 1842 వ సం॥ నుండి తాతాచార్యులు బ్రౌనునకు అధ్యాపకుడుగ వ్యవహరించి నట్లున్నది అతడు ప్రాంశువు. స్థూలకాయుడు. 50 ఏండ్లవాడు చతురుడు. ఉభయ భాషా ప్రవీణుడు. వినమ్రుడు. కవి. తర్క-జ్యోతిష వైద్యశాస్త్రముల నెరిగినవాడు. బ్రౌనునకు కావ్యముల పఠించు సందర్భములందు కొన్ని కథలను చెప్పుచుండెడివాడు వానిని బ్రౌను ఒక సంకలనముగ కూర్చి 1855 వ సం॥ ఆంగ్లానువాదముతో ప్రకటించెను.

తాతాచార్యులు తదితర పండితులవలె పాండిత్య ప్రదర్శనకు పూనుకొనెడివాడు కాడు. ఆ గుణము బ్రౌనును ఆకర్షించెను. గ్రాంథికభాషను ఉపయోగింపక వ్యావహారికభాషలో తాతాచార్యులు కథలను చెప్పెను.

కావ్యపఠనమందేకాక, తాతాచార్యులు కావ్యపరిష్కరణమునను బ్రౌనునకు తోడ్పడెను. పల్నాటి వీరచరిత్రయందు "Tatach thinks it should be దొంతగులు & renders orugulu, pillows......" అని యున్నది.[2] వసుచరిత్ర టీకయందును తాతాచార్యుల సవరణలు కలవు.[3] బ్రౌనునకు అత్యంతప్రియ పాత్రులైన పండితులలో తాతాచార్యులు ఒకరు

## 9. 1. 5. నరసింహాచార్యులు, కంభం :

బ్రౌను కాలేజిలో పనిచేసిన పండితులలో నరసింహాచారి యొకడు. ఇతని పుట్టు పూర్వోత్తరములు తెలియకున్నది. శశాంకవిజయమునకు చకోరీయ వ్యాఖ్యానమును

1. Sr of Lt. M. 401. P. 324.
2. D. 1130. P. 8
3. D. 759. 1 అ 61 ప.

నరసింహాచారి రచించెను విక్రమార్క చరిత్ర కాశీఖండము, హంసవింశతి, హరిశ్చంద్రోపాఖ్యానము మున్నగు కావ్యములను పరిష్కరించెను. సంస్కృతగ్రంథమైన ఆనందతంత్రమునకు ఇతడే వ్యాఖ్యను సమకూర్చెను. "శ్రీ మద్రాజాధిరాజాతి తర వినుత వాక్చాతురీ వైభవేన। ఫిల్లి ప్పార్క్రీసు బ్రౌన్నూపరివృఢ మణినాసంతతం పోషితేన। శ్రీ మౌద్గల్యాన్వవాయ ప్రజనిత నరసింహార్య నామ్నా ప్రణీతా। టీకా లోకోప కర్త్రీ విజయతు విదుషాం మానసంతోషయంతీ।"[1]

నరసింహాచారి బ్రౌనునకు వ్రాసిన లేఖనుబట్టి ఇతడే ఆనందతంత్ర వ్యాఖ్యను రాఘవపాండవీయ వ్యాఖ్యను వ్రాసినట్లు రుజువగుచున్నది.[2]

బ్రౌను సేకరించిన సంస్కృతాంధ్ర గ్రంథముల నన్నింటిని వింగడించి, వానికి పట్టికలను తయారుచేసి, కడప బంగళాలోని గ్రంథాలయమును క్రమబద్ధముగ నరసింహాచారి తీర్చెను.[3]

### 9. 1. 6. నరసింహాచారి, చిలకమర్తి :

ఇతడు 1839 వ సం॥లో బ్రౌను ఆజ్ఞానుసారము ప్రభులింగలీల ద్విపద కావ్యమును పరిష్కరించెను (D. 950, 952.)

### 9. 1. 7. నరసింహాచార్యులు, సముద్రాల :

బ్రౌను 'కాలేజి నౌకర్ల'లో ఇకడొకడు మాత్రము తెలియుచున్నది. జీత బత్తెములను యజమాని క్రమముగ నొసగనిచో ఆ కాలమందు సమ్మెలను చేసెడివారు కారనిపించుచున్నది. క్రీ. శ 1831 వసం॥ బ్రౌనునకెట్టి ఆర్థికక్లిష్టత కలిగినదో తన పండితులకు రెండునెలల జీతము బాకీ పడెను. ఆ సందర్భమున ఆ పండితులు వినయపూర్వక విజ్ఞాపన పత్రమును బ్రౌను సముఖమునకు సమర్పించిరి :

మహారాజశ్రీ సి. పి. బ్రౌన్ యిస్కొయరు దొరగారి సముఖానకు –

తమ కాలేజి నౌకర్లు వ్రాసుకున్న అర్జీ విన్నపం మాకు జనేవరు నెల తాలుకు। ఫెబ్రేవరు నెల తాలూకున్ను జీతములు యిదివరకు ముట్టకండా వున్నది

1. Ibid. M. 401. P. 321.
2. Sr, of. Lt M. 416. P. 313.
3. Ibid. P. 309.

మార్చినెల వరా జరుగుతూ వున్నది......... మా మనవి ముఖ్యముగా చిత్తగించి సదరహీ రెండునెలల జీతమున్ను దయచేయించవలెనని మిక్కిలి వినయ పూర్వక ముగా వేడుకుంటూవున్నాము – దివ్యచిత్తానకు తేవలెను –

ఆన ౧౭౩౪ సంవత్సరం – ది ౧౮. మార్చి –

కంభం నరసింహాచార్యుల చేవ్రాలు
జూలూరి అప్పయ్యచే వ్రాలు
వెంకట నర్సు వ్రాలు
సముద్రాల నరసింహాచార్యుల చే వ్రాలు
వారణాశి రామస్వామి వ్రాలు"[1]

9. 1. 8. బుచ్చయ్యశాస్త్రి, ములుపాక :

ఇతనిని బుచ్చన్నశాస్త్రి అని వ్యవహరించుటయు కలదు ఇతడు కవీశ్వరుడు వసుచరిత్రకు ప్రతిపదార్థప్రకాశిక వ్యాఖ్యానారంభమున :

క. నూర్లార్లు లెక్కసేయక
పేర్లందిన విబుధజనులఁ బిలిపించుచువే
మార్లర్థమిచ్చు వితరణి
చార్లీసు పిలుపు బ్రౌనుసాహెబు కరుణన్.

అని బ్రౌనును ప్రసుతించెను.

"......ములుపాక **Buchana Sastri in Nandaloor wrote the** వెంకటేశ్వరమహాత్మ్యం మామ్మమహాత్మ్యం **in the uttara kanda of the Padma Puran (*D* 3:40)** అని బ్రౌను ఇతని కృతులను స్థలమును పేర్కొనెను.

ఆంధ్రకవుల చరిత్రకర్త కందుకూరి వీరేశలింగంపంతులు ఈ కవిని గుర్తించిరి.[1] వారు తన ఈ కృతులలో ఒక్క వేంకటేశ్వర మహాత్మ్యమునుమాత్రమే పేర్కొనిరి. బుచ్చయ్య గుండ్లూరి యందుండెడివాడట. తదుపరి కడప ప్రాంతములందలి నంద లూరుకు వచ్చియుండును. కాని పంతులుగారు "ఇతని కాలము తెలియదు ఇతడు నూరు సంవత్సరముల పమువాడయియుండును." అని ఊహించుటయు, తన సమీప కాలస్థునే గుర్తింపలేక పోవుటయు చింత్యము.

1. **Ibid M. 401 P 321.**
1. ఆంధ్రకవుల చరిత్ర. తృ. భా. పుట. 173–174.

బుచ్చయ్య భారతము (D 166), విష్ణు పురాణము (D ?12), శశాంక ...యము (D 818), సురాభాండేశ్వరీయము (D 909), హంస వింశతి (D 912) ...వతార చరిత్ర (D 520) పంచతంత్రము (D 2688), భాగవతము (D 10?) ...న్నగు కావ్యముల పరిష్కరణ కార్యములో తోడ్పడెను.

ఇతని శైలి కొంత ప్రౌఢముగ నుండుటవలన కాబోలు బ్రౌనునకితని వ్యాఖ్య ...చ్చలేదు. కావ్య పరిష్కరణలో ఈతని సాహాయ్యమును బ్రౌను స్వీకరించెను. ...ని వ్యాఖ్యానముల నీతనిచేత ఎక్కువగ వ్రాయించలేదు. బ్రౌను తయారు చేయిం...న వ్రాతప్రతులందు పెక్కింట బుచ్చయ్య నామము కానవచ్చును.

### . 1. 9. వీరభద్రయ్య, ఆరణిమఠం :

వీరభద్రయ్యను "a learned Jangam Friest", a learned Jangam ...uru" అని బ్రౌను పేర్కొనెను. బ్రౌను వీరభద్రయ్యచే ప్రభులింగలీలకు టీక ...వాయించెను. పండితారాధ్య చరిత్రను పరిష్కరింపజేసెను. ద్విపద కావ్యము లను పెక్కింటిని వీరభద్రయ్యచే బ్రౌను పరిష్కరింపచేసినట్లు తోచును

### ). 1. 10. వెంకయ్య, గరిమెళ్ల :

కడపలోని బ్రౌను బంగళాలో ప్రతి నిత్యము జరుగుచున్న సాహిత్య ...సంస్కరణోద్యమములో ముఖ్యపాత్ర వహించిన పండితులలో వెంకయ్య మరొకడు. ...ఇతడు ఉదయగిరి వాస్తవ్యుడు. బ్రౌను కార్యార్థము కడపలో వసించి భారతారణ్య ...పర్వమును పరిష్కరించెను. బ్రౌను సెలవు పెట్టి సీమకు వెళ్ళినపుడితడు నిరాశ్రయుడై ...కడపలోనే జిల్లాకోర్టులో చిన్న ఉద్యోగము నిమిత్తము "గ్రస్తంబంధొర" వారిని ...శ్రయించెను. కాని అచట ఖాళీలేనందువలన కొన్ని దినములు "నేట్టివు రజిష్టరు ...దగ్గెరనున్ను కొన్ని దినములు శిరస్తాదారుణి దగ్గెరనున్ను వుండి సర్కారు పనికి ...సహాయము" చేసెను. ఇంతలో ఆ దొరవారు వెళ్ళిపోయిరి. ఆ తరువాత "మేస్తరు ...కావిరీ ధొరవారి" యొద్ద రెండు సంవత్సరములు 5 వరహాల జీతమును పుచ్చుకొని ...నిచేసెను.[1] బ్రౌను సీమనుండి తిరిగివచ్చిన తరువాత ఆతని కొలువులో చేరి ...యుండును.

---

. Sr. of Lt. M. 416 306

భారతములోనేక వెంకయ్య కవిచిర్ణరసాయనము, దశావతార చరిత్ర, సత్య భామాసాంత్వనము కవిరాజ మనోరంజనము అను కావ్యములను పరిష్కరించెను. ఇతడు దశావతార చరిత్ర వ్యాఖ్యాత కూడ

ఇతడు అస్వస్థత కారణముగ కొంతకాలము సెలవు పెట్టినట్లును లేఖలవలన తెలియుచున్నది. బ్రౌను దగ్గర ఇతడు లేఖకుడుగ మొకాబిలాకారుడుగ, పరిష్కర్తగ వ్యాఖ్యాతగ పనిచేసెను " **Garimilla Vencaya of Udayagiri – a young-man, good scholar, versed in prosody and a beautiful writer** " అన్న బ్రౌను ప్రశంసలకు పాత్రుడైన పండితుడు వెంకయ్య 2

9 1. 11. వెంకటనరసయ్య, పమిడిపాటి (పైడిపాటి) :

ఇతడు బ్రౌనునకు వ్రాసిన లేఖలో "తమ కవీశ్వరుడు పైడిపాటి వెంకట నరసయ్య" అని తన్ను పరిచయము చేసికొనెను. ఇతడు కవీశ్వరుడు కావుననే బ్రౌను "చన్నపట్టణములో కవీశ్వరుల యొక్కయున్ను, రాజులయొక్కయున్ను పూర్వోత్తరములు పద్యాలుగా చెప్పేపనికి సిఫారసు" చేసెను. ఇతడు కంభంలో నుండెడివాడు. తదుపరి కడపకు వెళ్లినట్లున్నది. బ్రౌను సిఫారసు చేసిన ఉద్యోగ మితనికి వచ్చినదో లేదో తెలియదు.

అనిరుద్ధచరిత్ర, రాధామాధవ సంవాదములకు వ్యాఖ్యలను రచించెను. వైజయంతీ విలాసము, విక్రమార్కచరిత్ర, హరిశ్చంద్ర చరిత్రలను పరిష్కరించెను. అన్నింటికన్న బ్రౌనునకు అత్యంత ప్రీతిపాత్రమగు వేమన పద్యములను సవరించెను.

పైడిపాటి వేంకట నృసింహకవి నృసింహవిలాసమను మూడాశ్వాసముల గ్రంథమును రచియించినట్లును, నెల్లూరి మండలములోని పైడిపాటి గ్రామనివాసుడయి గ్రామచతుష్టయము నందు స్థావరజీవనము కలవాడయినట్లు నృసింహ విలాస వచనమును బట్టి తెలియుచున్నదని "ఆంధ్రకవుల చరిత్ర" కర్త కందుకూరి వీరేశలింగము పేర్కొనెను 1 "ఈ కవియొక్క కాలమేదియో కాన రాదు గాని యితడాధునికుండయినట్లు తెలియుచున్నది" అని లిఖించెను బుచ్చయ్య

2. విష్ణుపురాణము. D. 812. సంపు. 1. ప్రతము. 185.

1. ఆంధ్రకవుల చరిత్ర. తృ. భా. పుట 213

శాస్త్రి రచనలను తెలిపిన బ్రౌను అదేమి కారణమో వెంకటనరసయ్యే కృత కావ్యము లను పేర్కొనలేదు. బ్రౌను పరివారములోని వెంకట నరసయ్యయే నృసింహ విలాస కృతికర్తయనుట ఊహ్యము.

9. 1. 12 పైని పేర్కొనిన పండితులేకాక దంపూరి వేంకటసుబ్బశాస్త్రి' వంగీపురం వెంకటకృష్ణమచారి, బొడ్డపాటి సుబ్బన్న, వారణాసి రామస్వామి, సముద్రాల అనంతాచార్యులు మున్నగువారును బ్రౌను కావ్యసముద్ధరణమున సహక రించిరి. వెంకటసుబ్బయ్యశాస్త్రి హరిచంద్రోపాఖ్యాన పరిష్కరణమున తోడ్పడెను. బొడ్డపాటి సుబ్బన్న కావ్యాలంకార చూడామణిని వ్రాయించి బ్రౌనునకు పంపెను' సముద్రాల అనంతాచార్యులు బందరులో 'సూచీ పని' చేయుచుండెను.

## 9. 2. ప్రభుత్వోద్యోగులు :

గ్రామ కరణములు, కోర్టు మునసబులు, కుంఫిణి ఉద్యోగులు, మిరాసీదారులు మున్నగువారు తాళపత్ర సేకరణమున బ్రౌనునకు సహకరించిరి. వీరు తమ అధికారమును వినియోగించి, అనేక గ్రామములను గాలించి, బ్రౌను కోరిన కావ్య ములను ఆతనికి సమర్పించిపెట్టిరి. వీరిలో కొందరు పండితులు. అట్టివారిని బ్రౌను పరిష్కరణ కార్యమునందును వినియోగించుకొనెను అట్టివారు కొందరిక్రింద పరిచయము చేయబడుచున్నారు.

### 9. 2. 1. అద్వైత బ్రహ్మశాస్త్రి, వఠ్యం :

ఇతడు "గుంటూరు జిల్లా యిలాకా రేపల్లి తాలూకాలో చేరిన కారుమూరు కాపురస్తుడు."[1] 'సదరు కోర్టు పండితుడు'గ నియమితుడయ్యెను. క్రమముగ ఆదాలతు కోర్టు ప్రథమ పండిత పదవిని పొందెను. ఇతడు బ్రౌను దొరకు ఆప్త మిత్రుడు. లిఖిత ప్రతుల సేకరణమున, వివిధ భారత లిపులలో గల సంస్కృత గ్రంథములను తెలుగులిపిలో వ్రాయించి పంపించుటయందు బ్రౌనునకు తోడ్పడెను.[2]

శబ్దార్థనిర్ణయములో గురుమూర్తి శాస్త్రిని వలె బ్రహ్మయ్యశాస్త్రిని కూడ బ్రౌను ప్రామాణికునిగ గ్రహించెడివాడు.[3] అస్తవ్యస్తముగనున్న తారాశశాంక విజయ

---

1. Sr. of. Lt M. 424. P. 16 2 Ibid. M. 417. P. 125,
3. D. 3140 పుట. 612.

ప్రబంధ ప్రతిని కథాక్రమము వరుస తప్పకుండ కూర్చి బ్రౌనునకు సమర్పించెను. (D. 318) శశాంకవిజయ, దశావతార చరిత్రల పరిష్కరణమందును పాల్గొనెను.

వసుచరిత్ర కావ్యముద్రణను బ్రౌను బ్రహ్మయ్యశాస్త్రి పర్యవేక్షణలో ప్రారంభించెను. బ్రహ్మయ్య సమర్థుడు. కాని అతని ఆరోగ్యము వికటించి, ముద్రణ కార్యము పరిసమాప్తికాకపూర్వమే పరమపదించెను.

బ్రౌను బ్రహ్మయ్యను రెండుస్థలములందును "my very learned friend Bramhaya" అని పేర్కొనెను.[4]

## 9. 2. 2. అనంతాచార్యులు, శంకరమంచి :

అద్వైత బ్రహ్మశాస్త్రితోపాటు అదాలతు కోర్టులో నితడు రెండవ పండితుడు. ఇతడును బ్రహ్మయ్యశాస్త్రితో కలిసి బ్రౌనునకు పుస్తకసేకరణమున తోడ్పడెను.[1] పిండిప్రోలు లక్ష్మణకవి మేనల్లుడైన మంగన్నకు విరోధముగా వ్యాజ్యము తీర్పుచెప్పిన సదర మీను అనంతాచార్యులే. ఈ విషయము లక్ష్మణకవి బ్రౌనునకు వ్రాసిపంపిన పద్యమును బట్టి తెలియుచున్నది :

మ. అవురా శంకరమంచివాఁడవె యనంతాఖ్యుండవై తీర్పెఱుం
గవు మంగన్నకుఁజేసె నీవు బుధమార్గభ్రష్టతన్ జోగిరా
గవరాలంది పినాకినిం బశుపతీకల్లోలినిం బట్టి స
త్యవదూసత్వము దానియందిడితి వాశాయత్తులిట్లే కదా.

— ఆంధ్రకవుల చరిత్రము తృ. బా. పుట. 224-225

## 9. 2. 3. కృష్ణయ్య, గుండవరము :

ఇతడు కుంఫిణీవారి ఉద్యోగి. బ్రౌనునకు పుస్తకముల సేకరణలో సాహాయ్యము చేసెడివాడు. గౌరన నవనాథ చరిత్ర ప్రతులకొరకు బ్రౌను ఇతనికి వ్రాసెను.[1]

---

4. D. 818. శశాంకవిజయము. ఉపోద్ఘాతము. P. R. T. L. P 74.
1. Sr. of Lt. M. 416. P. 331.
1. Ibid. M, 411. P. 86.

9. 2. 4. కృష్ణమాచార్యులు, మాడుంబ :

ఇతడు గుంటూరు 'పోష్టాఫీసు హెడురయిటరు' . గోరన నవనాథచరిత్ర ఉనికిని తెలిసికొని, బ్రౌనునకు విషయమును వివరించి, దానిని తెప్పించుటకు తగిన ఏర్పాటులను చేసెను.•

9. 2. 5. గుర్రాజు, నందివాడ :

ఇతడు "డిస్ట్రిక్టు మునసపు". ఇతడును గ్రంథ సముపార్జనమున బ్రౌనునకు అత్యంతము తోడ్పడెను.*

9. 2. 6. గురుమూర్తి శాస్త్రి, రావిపాటి :

కుంఫిణీ ప్రభుత్వపు రోజులలో గురుమూర్తిశాస్త్రి చెన్నపురి ఫోర్టుసెంటు జార్జి కళాశాలలో తొలుత క్రీ శ. 1816 వ సం॥న తెలుగు ఉపాధ్యాయుడుగ నియమితుడయ్యెను. తరువాత క్రీ. శ. 1820 వ సం॥న కళాశాల తెలుగు ప్రధానోపాధ్యాయ పదవి నలంకరించి క్రీ శ. 1836 వ సం॥ వరకు ఆస్థానమున 16 ఏండ్లు పనిచేసెను.

విదేశీయులు ప్రవేశపెట్టిన విద్యావిధానముల నవలంబించి గ్రంథరచనల కుపక్రమించిన ఆద్యులలో గురుమూర్తి శాస్త్రియొకడు. ఇతని రచనలు మూడు : 1. విక్రమార్కుని కథలు 2. పంచతంత్ర కథలు 3. తెలుగు వ్యాకరణము.

విక్రమార్కుని కథలు, పంచతంత్రము అనునవి వచనగ్రంథములు. పాఠశాలలో పాఠ్యగ్రంథములగుటకు ఉద్దేశింపబడినవి. విక్రమార్కునికథలకు 'ద్వాత్రింశత్సాలభంజికలు, అని నామాంతరము. ఇది 1819, 1828, 1850, 1858 సం॥లలో నాలుగు మారులు ముద్రితమైనది తెలుగునేర్చుకొన వలసిన ఆంగ్లేయులకెల పఠనీయముగ నుండెడిది.

పంచతంత్రము క్రీ. శ. 1834 వ సం॥న రచింపబడి, ప్రకటింపబడెను. సంస్కృత పంచతంత్రమునకు వచనానువాదము. ఇది అయిదు పర్యాయములు ముద్రితము.

---

•. Ibid. M. 4.3. P. 209.

*. Ibid, M. 416. P, 331.

గురుమూర్తివారి తెలుగు వ్యాకరణము విలక్షణమైనది. సంస్కృత వ్యాకరణ సంప్రదాయముల ననుసరింపక ఆంగ్ల వ్యాకరణముల పద్ధతిలో కొంతవరకిది తీర్చిదిద్దబడినది వ్యావహారిక భాషకూడ గ్రహింపబడినది.

బ్రౌను గురుమూర్తిశాస్త్రిపట్ల అధికగౌరవము కలవాడు. "That distinguished scholar, the late Head Telugu Examiner of the college Gurumurthy Sastry, who died about three years ago fully concurred in the opinions given in the present Essay. I mention his name because, his talents, learning and good sense always entitled his judgement to respect."[1]

గురుమూర్తిశాస్త్రి బ్రౌనునకు వ్రాసిన లేఖలను పరిశీలించిన అయ్యవి బ్రౌనునకు కలిగిన శబ్దార్థములను గూర్చిన సందేహములకు సమాధానములుగ కన్పట్టును [2] కావ్యపరిష్కరణమునందును గురుమూర్తిశాస్త్రి కొంత తోడ్పడినట్లు కానవచ్చును. ఇతడు బ్రౌను పోషితవర్గములోనివాడు కాకపోయినను ఆశ్రితవర్గములోని వాడనుటలో సందేహములేదు.

### 9. 2. 7. లక్ష్మణకవి, పిడిప్రోలు :

ఇతడు దాక్షారామ సీమయందలి కుయ్యేరు గ్రామమునకు కరణము మిరాసీదారుడు. ఇతనిని బ్రౌను 'a noble poet' అని మెచ్చుకొనెను.* లక్ష్మణకవి 'రావణదమ్మీయము' అను నామాంతరముగల 'లంకావిజయము' అను ద్వ్యర్థి కావ్యమునకు కర్త. బ్రౌను పండిత పక్షపాతి యని యెరిగి, తన మేనల్లుడైన మంగన్నకు జరిగిన అన్యాయమును విచారించి న్యాయము చేకూర్చుమని బ్రౌనునకు విజ్ఞప్తిచేసెను. బ్రౌను మంగన్న పక్షమున న్యాయము జరిపించెనట. లక్ష్మణకవి తిట్టుకవిత్వమున దిట్ట. శిష్టుకృష్ణమూర్తికితడు ప్రత్యర్థి.

### 9. 2. 8. వీరాస్వామి, ఏనుగుల :

ఇతడు అప్పటి 'మద్రాసు సుప్రీమ్ కోర్టు'లో (1819) హెడ్ ఇంటర్ప్రెటర్ తెలుగు, తమిళ, ఆంగ్ల భాషలలో అనువాదము చేసెడివాడు. ఇతడు బ్రౌనునకు పండిత మిత్రుడు. వీరివురి మధ్య ఉత్తర ప్రత్యుత్తరములు నడచినవి వీరాస్వామయ్య కాశీయాత్ర నుండి తిరిగి వచ్చుచు మార్గమధ్యమున మచిలీపట్టణములో

1 Es. on Tel. Lit. Para. 60

2. రావిపాటి గురుమూర్తిశాస్త్రి : 'తెనుగు వ్యాకరణము' 1951. పీఠిక.

* బ్రౌన్‌లేఖలు. పుట. 127.

బ్రౌనును కలిసికొనెను. అప్పుడు బ్రౌను మదరాసులోని లంగరు పాపయ్య గృహమందుగల స్కాంద పురాణమును పంపుమని వీరసామయ్యను కోరెను. లంగరు పాపయ్య దుబాసి పండితుడు. అతని మరణానంతరమే వీరస్వామయ్య వారింటిలోని స్కాంద పురాణ ప్రతిని బ్రౌనునకు సంపాదించిపెట్టెను. అనాటి ప్రముఖులలో వీరాసామయ్య ఒకడు. ఇతడే 'కాశీయాత్ర' కర్త.

9. 2 9. పైన పేర్కొనిన వారేకాక, కంభమునకు మూడామడల దూరములోనున్న ఉయ్యాలవాడ గ్రామకరణమైన మిడుతూరి లక్ష్మీనరసు, దువ్వూరు కరణమైన లక్ష్మీపతి, కడపజిల్లాలో చేరిన నొసం తాలూకా మునసపు కోర్టు గుమస్తా అయిన అవధానము అప్పయ్యయు గ్రంథ సంపాదనమున బ్రౌనునకు తోడ్పడిరి. అవధానము అప్పయ్య ప్రభులింగలీల, బసవపురాణము, చందాంగదచరిత, పల్నాటి వీరచరిత్ర మున్నగు గ్రంథములను సేకరించి, ప్రతులు వ్రాయించి బ్రౌనునకు పంపెను 1

9. 3. బ్రౌను పోషితవర్గము :

9 3. 1. బ్రౌను తెనుగుకావ్య సముద్ధరణ కొరకు తన డబ్బును వెచ్చించి కొందరు నవుకరులను, పుస్తక సంపాదకులను, వ్రాయసకాండ్రను, ముద్రణాలయ వర్గమువారిని, పండితులను నియమించెను. బ్రౌనునకు తోడ్పడిన పండితులను గూర్చి ముందే తెలుపబడెను. తదితర పోషిత వర్గమునంతటిని కూడగట్టుకొని ఒక్క త్రాటి మీద నడిపించిన వ్యక్తి కడప అయోధ్యాపురం కృష్ణారెడ్డి.

బ్రౌను ఇంగితమెరింగి అతని తలలోని నాలుకగ మసలినవాడు కృష్ణారెడ్డి. బ్రౌనునకు అన్నింట చేదోడు వాదోడుగ నుండిన నమ్మకమైన బంటు. బ్రౌను ఉద్యోగకారణమున పలుతావులందు తిరుగుచున్నను, కృష్ణారెడ్డి కడప బంగళాలోని గ్రంథాలయమును పరిరక్షించుచు, అక్కడ జరిగెడి కావ్య పరిష్కరణ మున్నగు కార్యములను శ్రద్ధగ జరిపించుచు, బ్రౌనునకు లేఖల మూలమున విషయములనన్నింటిని తెలిపెడివాడు. కృష్ణారెడ్డి కడపకోర్టు నాజరుగ పనిచేయుచు, బ్రౌను కార్యములను కొనసాగించెడివాడు. ఇతడెంతో శ్రద్ధాళువు గనుకనే బ్రౌను "a most noble and excellent assistant" అని ప్రశంసించెను.

కృష్ణారెడ్డి కడప ప్రాంతములోని ఒకరైతుబిడ్డ. ఇతడు మునసబు పదవినలంకరించి క్రీ. శ. 1844వ సం॥ మార్చి 24వ తేదిన పరమపదించెను.

---

1. Sr. of Lt. M. 419. P. 456.

1. D. 1330. Entire Grammar of Telugu. P. 482.

బ్రౌను బంగళా యాజమాన్యమునంతయు కృష్ణారెడ్డికి అప్పగించియుండెను. కడపలోని బ్రౌను ఆస్తిపాస్తులు, అద్దెలు, పండితుల జీతబత్తెములు. బంగళాపునర్నిర్మాణ విషయములు మున్నగు వానినన్నింటిని కృష్ణారెడ్డి కడు శ్రద్ధతో నిర్వహించెడివాడు. బ్రౌను తలపెట్టిన బృహత్కార్య నిర్వహణలో కృష్ణారెడ్డి తోడ్పాటు ఎంతయేని కలదు.

బ్రౌను తనయొద్ద పనిచేయుచున్న వారిని గురించి ఒకచోట గుర్తించెను[1].

## 9. 3. 2. లేఖకులు :

క్రిమిదష్టములైన, శిథిలములైన తాళపత్రములనుండి కావ్యముల నుద్ధరించు ఉద్దేశముతో బ్రౌను వానికి కాగితపు ప్రతులు వ్రాయించెను. తాళపత్రములను ఇచ్చుటకు సొంతవారు అంగీకరింపనపుడు బ్రౌను వానికి పుటికలను కాగితములపై వ్రాయించెడివాడు. ఇట్లు కాగితపు ప్రతులను వ్రాయనెందరో లేఖకులు అతని నియామకములో నున్నట్లు తెలియుచున్నది. బ్రౌనుచే నియుక్తులైన కొందరు వ్రాయసకాండ్ర వివరములీ క్రింద పట్టికలో కలవు

| లేఖకుడు | కావ్యము | స్థలము | లేఖా కాలము |
|---|---|---|---|
| అంకాళు (లేఖకుడు) | అనేక కావ్యములు | కడప | 1830 |
| అప్పయ్య, గంజాం | పల్నాటివీరచరిత్ర | పెదగంజాం కాపురస్థుడు | 1852 |
| అప్పయ్య, నందిరాజు | కామందకీయము (నీతిసారవ్యాఖ్యా సహితము) | కసుచెరెపల్లె | 1832 |
| అమ్మన్న, పువ్వాద కామాక్షయ్య కా. (తెలుగు రయిటరు) | | | |
| కృష్ణయ్య, గుండువరపు | అనేక కావ్యములు | కడప దగ్గర గ్రామము | 1829-1841 |
| కొండయ్య, తూములూరు | అహల్యా సంక్రందన విలాసము | కడప | 1831 |
| నారాయణయ్య, దంపూరి (అయిదు సంవత్సరముల నుండి నౌకరు) | పంచతంత్రము మొ॥ కావ్యములకు పదసూచికలు తయారు చేయుట | | |

| లేఖకుడు | కావ్యము | స్థలము | లేఖా కాలము |
| --- | --- | --- | --- |
| నృశింహస్వామిదాసులు, మద్రాసు (అతని గుమస్తా కూడా వ్రాయసకాడే) | అనేక గ్రంథములు | | 1834 |
| రామస్వామి, వారణాసి (పెద్దెంద్లు బ్రౌనుకడ పని చేసెను) | వేమన పద్యములు మొ॥ | | 1833 |
| వీరసెంకయ్య వెంకటాచలం | అనేక కావ్యములు | కడప | 1830 |
| శేషయ్య, తోటమాలి (తెలుగు లేఖకుడు కిసం॥) | ,, | | 1851 |
| సుబ్బారాయడు, అయినాల హరిప్రసాద్ | కాశీఖండం | చిత్తూరి టప్పాలాఫీసులో వాలంటరీగ వ్రాసేవాడు | 1846 |

9. 3. 3. మొకాబిలాకారులు :

'మొకాబిలా' అను పదము తెలుగుకాదు నిఘంటువులందీ పదము కానరాదు. బ్రౌణ్య మిశ్ర భాషా నిఘంటువునందు 'మొకాబిలా' అను పదమునకు **comparison, collation, setting face to face,** సంప్రతించడము. ఎదురెదురగా పెట్టడము, మొకాబిలా చేసుట **to compare'** అని అర్థములు చూపబడినవి. ఈ పదమును

'బ్రౌను కాలేజి' లో పనిచేసినవారు ఉపయోగించిరి. తదుపరి ఈ పదమునకు ప్రచారమున్నట్లు కానరాదు. తయారుచేసిన కాగితపు ప్రతిని మాతృకతో పోల్చుటను 'మొకాబిలా' చేయుట అని ఆనాటి పండితులు వ్యవహరించిరి. బ్రౌను శతాధిక తెలుగు కావ్యములకు కాగితపు ప్రతులను తయారుచేయించెను. అన్నింటియందు మొకాబిలా చేసిన వారి నామములు కానరావు. కొన్నింటియందు మాత్రమే గుర్తింపబడెను. తెలిసినంతవరకు ఇతర ప్రతుః తో పోల్చు నీ పనికి బ్రౌను నియోగించినవారు, వారు మొకాబిలా చేసిన గ్రంథములు ఈ క్రింది పట్టికలో ప్రదర్శితములు గ్రంథములు అకారాదిగ గ్రహింపబడినవి.

| గ్రంథనామము | ఆశ్వాసము | మొకాబిలా చేసినవారు |
|---|---|---|
| D. 328. అనంత వ్రతోపాఖ్యానము. | పూర్తిగ | బోయ్నిపల్లె అప్పయ్య |
| D. 449. కవికర్ణ రసాయనము. | ,, | చట్టు రామాచార్యులు, మయిలవర్పు శేషయ్య |
| D. 456. కవిరాజమనోరంజనము. | ,, | వీరవెంకయ్య సుబ్బన్న |
| D. 460 కృష్ణలీలా విలాసము. | ,, | రాయసం బసవయ్య బోయ్నిపల్లి అప్పయ్య |
| D. 1560 చంద్రవదనా శతకము. | ,, | శేషయ, కొండల్ రాయుడు |

| గ్రంథనామము | ఆశ్వాసము | మొకాబిలా చేసినవారు |
|---|---|---|
| D. 337 చతుర్వాటికా మాహాత్మ్యము. | ,, | గరిమెళ్ల వెంకయ్య, వెంకట్రామయ్య. |
| D. 520. దశావతారచరిత్ర | కొంతభాగము | రాయగరుడయ్య, కొండలయ్య. |
| | ,, | రాయసంగరుడయ్య, కిచ్చయ్య, |
| | అహల్యకథ | రాయసం గరుడయ్య, శేషయ్య. |
| D. 584. బలరామ చరిత్ర | పూర్తిగ | గరిమెళ్ల వెంకయ్య, వెంకట్రామయ్య |
| D. 30. బృహన్నారదీయము | ,, | అప్పన్న శాస్త్రిలు. |
| D. 34 బ్రహ్మోత్తరఖండము. | ,, | వారాణాశి రామస్వామి, నండూరి వెంకటాచార్యులు |
| D. భద్రా పరిణయము. | శివ ఆశ్వాసము | స్థానాపు వెంకటాచలం. |
| D. 600. భల్లాణ చరిత్ర | పూర్తిగ | చట్టు రామాచార్యులు, మైలవరపు శేషయ్య. |
| D. 1165 భల్లాణ చరిత్ర | ,, | చట్టు రామాచార్యులు, వారాణాశి రామస్వామి. |
| D. 47. భాగవతము. | ప్రథమస్కంధము పంచమస్కంధము | శిద్దవటం అచ్చి, చెంచయ్య బోయిన్నపల్లె చంచయ్య అల్లుడు కోనప్ప. |

| గ్రంథనామము | ఆశ్వాసము | మొకాబిలా చేసినవారు |
| --- | --- | --- |
| D. 1653. మాతృశతకము | పూర్తిగ | పువ్వాడ అమ్మన్న |
| D. 663. రఘువంశము (సంస్కృతము) | ప్ర.ఆశ్వాసము. తృ.చ.షష్ఠ | కే. సుబ్బారావు, సుబ్బన్న. |
| D. 688. రాఘవ పాండవీయము. | పూర్తిగ | సముద్రాలనరసింహాచార్యులు వారణాశి రామస్వామి, |
| D. 705. రాధామాధవ సంవాదము. | పూర్తిగ | మాజేటి సర్వేశలింగం. |
| D. 715 రామాభ్యుదయము. | ప్ర.ద్వి ఆశ్వా. అష్ట. ఆశ్వా | సుబ్బన్న, వెంకటాచలం. |
| D. 1000. రామాయణము. | అయోధ్యా కాండం | చిల్లర అప్పయ్య. |
| D. 719. రుక్మాంగద చరిత్ర | పూర్తిగ | చట్టు రామాచార్యులు, మయిలవరపు శేషయ్య. |
| D. 729. లంకావిజయము. | ,, | మయిలవర్పు శేషయ్య, బిధివోలు చితంబరం |
| D. 733. లక్ష్మీనృసింహ విలాసము. | ,, | అవుధాండ్ల అప్పయ్య. కొర్రపాటి చంనప్ప. |
| D. 788. విష్ణుమాయా నాటకము. | ,, | చట్టు రామాచార్యులు, మైలవర్పు శేషయ్య. |
| D. 791. వీరభద్ర విజయము | ,, | వారణాశి రామస్వామి, కొర్రపాటి చన్నప్ప |

| గ్రంథనామము | ఆశ్వాసము | మొకాబిలా చేసినవారు |
|---|---|---|
| D 316 వైశ్యపురాణము | పూర్తిగ | కొత్రపాటి చన్నప్ప<br>దేవరాజు శ్రీనివాసు |
| D 808 శశాంకవిజయము | ,, | సరాపు వెంకటాచలం సుబ్బన్న |
| D 809 శశాంకవిజయము | ద్వి. ఆ | కృష్ణయ్య, సుబ్బన్న |
| D 814 శశాంకవిజయము | పూర్తిగ | అవుధాండ్ల అప్పయ్య<br>కొత్రపాటి చన్నప్ప |
| D 1780 శివముకుంద శతకము | ,, | రాయవరపు సోమరాజు,<br>చాగంటి వెంకటకృష్ణమ్మ |
| D 837 శుకసప్తతి | ,, | గరుడయ్య, వీరాస్వామి |
| D 848 శృంగార సుధాసముద్ర పూర్ణ చంద్రోదయము | ,, | పెద్దశేషయ్య, బిడ్డు రామయ్య |
| D 363 శ్రీ పర్వతపురాణము | ,, | వారణాశి రామస్వామి,<br>కొత్రపాటి చన్నప్ప |
| D 851 షట్చక్రవర్తి చరిత్ర | ,, | సముద్రాల నరసింహాచార్యులు<br>వారణాశి రామస్వామి |
| D 867 సానందగణేశ్వర విలాసము | ,, | వారణాశి రామస్వామి,<br>కొత్రపాటి చన్నప్ప |
| D 879 సారంగధరోపాఖ్యానము | ,, | కృష్ణయ్య, కొండలరాయడు |

| గ్రంథనామము | ఆశ్వాసము | మొకాబిలా చేసినవారు |
|---|---|---|
| D 324 స్కాంధపురాణము | పూర్తిగ | చట్టురామాచార్యులు, కాండూరి<br>నరసింహాచార్యులు |
| D 888 సీతావిజయము | ,, | వారణాశి రామస్వామి,<br>కొత్రపాటి చన్నప్ప |
| D 895 సునందాపరిణయము | ,, | అవుధాండ్ల అప్పయ్య,<br>కొత్రపాటి చన్నప్ప |
| D 910 సూర్యతనయా పరిణయము | ,, | రాయసం, బసువయ్య<br>మొగవోలు బ్రహ్మ |
| D హరివంశము | 6–10 ఉ భా | వారణాశి రామస్వామి<br>కొత్రపాటి చన్నప్ప |
| D 922 హరిశ్చంద్ర నలోపాఖ్యానము | పూర్తిగ | సరాపు వెంకటాచలం |

9. 3. 4 ఆంధ్రదేశమునందే కాక, ఇతర ప్రాంతముల నుండియు ఎందరో తాళపత్ర ప్రతులను బ్రౌనునకు సేకరించి పెట్టిరి బ్రౌను లేఖలను పరిశీలించిన వాడ్రేవు వీరేశలింగము, మాజేటి రెడ్డి మాజేటి సర్వేశలింగము, బాయణి కృష్ణయ్య మున్నగువారు పుస్తకసంపాదకముం ప్రధానులని తెలియును

## LITERARY ACQUAINTANCES

Velala Appanna Pantulu, Zemindar of Vencatagiri in the Nellore District is a m n of learning and taste.

His Vakil at the suds is Maidavel Subba Rao (of Village Pamindu) living at Parthavasaradhi Temple in Triplicane in the house of Tiruvengalaya He is a sensible proper person - The Rama Lavanya S ma Satacam was obtained through him

Cavali Vencat Lacshmaya, late Manager to Col Mackenzie, now has a gageer at Tinnallcor near Tiruvallocr in Chirglupet - he visited me in March 1829. His son (the Patron) is C. Vencat-subbaya.

He introduced me to Cavali Venkat Cri htamma, at 17. Son of his elder hrother in Bengal Cavali Ramasami (Author of the History of poets and C) This is a ..................................... fluent in the Be gal Character - an indent puppy.

Duccton C V. Lackmaya, Jogudar of Tinnattoor at Madras·

Shekh Hamid, a gentlemanly person - who read with me in 1819 and made lady in Amulet

Mangamuri Leshmi Narsu at Nellore and his brother Chensu Ramaya.

## LITERARY ACQUAINTANCES

Naricanti (or Chitral Chinna Sami Naydu is at Cumbaco nam at Tanjore was the painter to the King - His son is తిరుపల్లి సామినాయుడు and his grandson Iirm Naydu was my servant His direction is best man at Tanjore But Krishna Rao of pondy is the (?)

(?) Iiru Naydu, carc of Bala Crishtamma Sbetti, Madras

My original - Hawker is చందా వీరాసామి care of Rao Mr Lewis's Writer Anna Sami Naydu -

The first Painter who came to me at Trichy were పెద్దసామి of చిన్నకృష్ణుడు - and his brd చిన్నదాసి - sons of సారంగపాణి in the service (as a Painter) of the Raja of Tanjore - x very second rate exept as to portraits Candalla (Traye Murti) whose real name is Singa-nna Chari is the Aurhor of a Tica on the Sri Bhagavata denominated శుకహృదయరంజని. This he has brought me, I being Triatchinapally where he resides at 63, Chitna Subba Rao, painter of dresses of all the classes came to me 18 April '29 - a coarse workman ignorant of anatomy, Aliyasami అళియసామి another painter has worked.

Ram Rao, at Tanjore (1829) aged 28 - a most respectable and goodman - has written a Mahratta Grammar and translated Telemachus into Mahratta. His knowledge of English is surprising. He is amply qualified to be Headmaster in the College both in English and Mahratta - No Sanscrit or Sahitya Knowledge.

Vencut Rao - Serishtadar to the Resident at Tanjore aged 30 (1829) - in acquirements similar to the above but not nearly his equal has engaged to suporinted my writers employed to copy mss. for me in the Rajahs Library - Me'dapacam Sheshachalam. Printer - *D*irect thus ......యీ జాబు చన్నపట్నం పెద్దినాయణి పేటలో కోశంగి మొదల్యారు తోటకాడ ఛాపాఖానా మెడపాకం శేషాచలానికి యిచ్చేది-

The Tappa Writer at Rajy - is దసవాడ వెంకట నారాయణప్ప.

In 1826. I was at Naggery - At చింతలపట్టుడ a village there I met రాంపిచెర్ల వెంకట రామరాజు a poor humble fellow, connected with a zamindar. He sold me the Molli Ramayan.

P. R. T. L PP. 121 - 125

ఛాపఖానా మంగునాగలింగము, కంపోజిటరు చిన్నయ్య, కన్నడము కంపోజిటరు వీరాస్వామి మున్నగువారు బ్రౌను ముద్రణాలయమున పనిచేసినట్లు తెలియుచున్నది.

## 9. 4. సాహితీమిత్రులు :

ఆనాటి సాహిత్యాభిమానులందరును బ్రౌనునకు మిత్రులు. బ్రౌను వారి గ్రంథాలయములను ఉపయోగించుకొనుటకు ఎట్టి ఆటంకమును ఉండెడిదికాదు. అట్టి తన సాహితీమిత్రులను గూర్చిన వివరములను బ్రౌను ఒక తావున పొందుపరచెను.[1]

మచిలీపట్టణములో మామిడి వెంకయ్య, కడపలో గజ్జెలరెడ్డి, పుంగనూరులో ఆ రాజాగారు, మదరాసులో అంగరు పాపయ్య, గద్వాలలో సీతారాం భూపాల్ జమీందారుగారు, కాకినాడ జమీందారీ వంశమునకు చెందిన దంతులూరు జగన్నాథ రెడ్డి, గూడాల జమీందారు బంధువైన చెలికాని వేంకటరాయడు, మచిలీపట్టణమునందే రాజా జగన్నాథరావు మున్నగు వారందరు బ్రౌను సాహితీకృషికి తోడ్పడినారు

“Plans for the Revival of Telugu Literature” అను వ్యాసములో తనకు పరిచితులైన సాహిత్యవేత్తలను గురించి తెలిపెను (చూ. ప్రక్కపుట.)

పురాణం హయగ్రీవ శాస్త్రియు పువ్వాడ వెంకటరావును బ్రౌను సాహితీవర్గములోని వారే. బ్రౌను పరిష్కరించి, శుద్ధప్రతులను తయారు చేయించిన కావ్యములను కొన్నింటిని వీరు ముద్రించిరి. (భాగవతము, భారతము).

భాషాభిమానులు బ్రౌనును మన్నించుటలో ఆశ్చర్యములేదు.

## ప్రకరణ సారాంశము :

ఈ ప్రకరణమున వ్యక్తుల పేర్ల పట్టికలను బట్టి బ్రౌను ఎందరు వ్యక్తులను కూడగట్టుకొని ఈ సాహిత్య వ్యవసాయమును కొనసాగించెనను విషయము విదితమగుచున్నది. విభిన్నవర్ణములకు, వర్గములకు, ప్రవృత్తులకు చెందిన నూర్లకొలది వ్యక్తులచే ఈ వాఙ్మయేష్టిని నిర్వహించిన బ్రౌను చిరస్మరణీయుడు. ఆధునిక సాహిత్య సంస్థలందును ఇందరు విభిన్నవ్యక్తుల సమిష్టి సాహచర్యము కానరాదు.

1. బ్రౌన్ లేఖలు. పుట. 128.

# 10

# పునరాలోకనం

పూర్వ ప్రకరణములలో బ్రౌను తన కాలమున నిర్జీవముగనున్న తెనుగుభాషను శక్తిమంతముగ నొనర్చి, చైతన్యవంతముగ రూపొందించిన విధము పరిశీలింపబడెను బ్రౌను చేసిన సేవలలో ఉత్తమోత్తమమయినది, అతని నామమును ఆంధ్రసాహిత్య చరిత్రయందు సుస్థిరముగ సువర్ణాక్షరములతో లిఖింపజేయునది అతడు తెనుగు కావ్య సముద్ధరణకు చేసినసేవ అతడు నడుముకట్టకుండినచో నేడు మహాకావ్యములని ప్రఖ్యాతినొందిన అనేక కావ్యములు నామరూపములులేక పోయెడివే. బ్రౌను విస్మృత మైన, అజ్ఞాతముగనున్న, బహుళ ప్రచారములేని అనేక ఆంధ్రకావ్యములను వెలుగు లోనికి తెచ్చెను. తెనుగు కావ్యోద్ధారకుడు బ్రౌను అనుటలో అతిశయోక్తి లేదు. "ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారం బ్రౌను జీవిత భాండాగారం" అనుట ప్రత్యక్షర సత్యము.[1]

1. తెనుగు కావ్యసముద్ధరణకు బ్రౌను చేసిన మొదటిపని వివిధప్రాంతముల నుండి తాళపత్రములను సేకరించుట, తాళపత్రముల సాహాయ్యముతో పాఠనిర్ణయము చేయుట కష్టముగాన వానికి కాగితపు ప్రతులను వ్రాయించెను, బ్రౌనునకు పూర్వము మెంకజి దొరయు కొన్నింటికి కాగితపు ప్రతులను తయారుచేయించెను కాని అధిక సంఖ్యాక కావ్యములకు తాళపత్రపుచెరను విడిపించినవాడు బ్రౌను.

2. గ్రంథపాతములతో, విభిన్నపాఠభేదములతోనున్న తాళపత్రములను పరిష్కరించి సంశోధిత ప్రతులను సంతరించుటను తెలుగువారికి నేర్పిన గురువు బ్రౌను. సమర్థులగు పండితుల సాహాయ్యముతో అతడు చేసిన నిరంతరకృషి ఫలితముగ ప్రధానమగు తెలుగు కావ్యములన్నియు నిర్దుష్టముగ సిద్ధమయ్యెను.

3. బ్రౌను కృషిఫలితముగ తెలుగు కావ్యములకు పుటలసంఖ్యలు విరామ చిహ్నములు, పదవిభాగములు, పద్యవిభజన, పద్యసంఖ్యలు, ఉపోద్ఘాతములు, విషయ సూచికలు మున్నగునవి యన్నియు నేర్పడినవి.

---

1. రావు : 'సి. పి బ్రౌను' (గ్రంథవిమర్శనము) భారతి. 1963 జూలై. పుట

4. గ్రంథపరిష్కరణమునసేకాక, కావ్యముద్రణమునను బ్రౌను ముద్రలు నేటికిని నిలిచియున్నవి. అతనికి పూర్వము తెలుగులో ముద్రణమున్నను, దానిని విశేషప్రచారమునకు దెచ్చినవాడు బ్రౌను. ప్రాచీనాంధ్రకావ్యములు అందరకు అందుపాటులోనికి వచ్చి సాహిత్యపఠనము విస్తృతమగుటకు తోడ్పడిన ముఖ్యసాధనము ముద్రణయంత్రము. దీని ప్రాముఖ్యమును తెలుగువారు గుర్తించునట్లొనర్చిన వాడు బ్రౌను. తెలుగు ముద్రణ సౌలభ్యము కొరకు కొన్ని మార్పులను తెచ్చెను. (చూ.2.7) తెలుగుకావ్యములను శీర్షికా ముఖపత్రములతో **(Title pages)** అలంకరించినవాడును బ్రౌను.

ఉదా :

**The Tale of**
**Nala & Damayanti**
**written in Telugu**
**Dwipada Metre**
***By* Raghava**
**A. D. 1620.**

బ్రౌను చూపిన ఈ పద్ధతియే ఇప్పటికిని పాటింపబడుచున్నది.

5. బ్రౌను దొరది భాషాదృష్టి. కావ్యసముద్ధరణము అతని లక్ష్యము. మత వైషమ్యమనునది అతని యందెచటను కానరాదు. అతడు పూనుకొనిన ఆంధ్రకావ్య సముద్ధరణ కార్యములో మొదట చేపట్టిన గ్రంథములు భాగవత, భారత, రామాయణ, విష్ణుపురాణాదులు వీనిలో ఆంధ్రులత్యంతమభిమానించు ఉద్గ్రంథములగు భాగవత, భారత, రామాయణములను ముద్రించెను. వీనిని ముద్రించినవాడిలో బ్రౌను దొరయే ఆద్యుడు (చూ.3) పురాణేతిహాసములందలి శైలీసారళ్యము బ్రౌనును ఆకర్షించెను.

6. బ్రౌను ప్రసిద్ధికెక్కిన ఆంధ్రప్రబంధములను సేకరించి పరిష్కృత ప్రతులను సిద్ధము చేసెను. కేవలము శృంగార ప్రబంధములనేకాక ద్వ్యర్థి ప్రబంధములను (రాఘవ పాండవీయము, హరిశ్చంద్రనలోపాఖ్యానము, యాదవరాఘవ పాండవీయము) అచ్చ తెనుగు ప్రబంధములను (నీలాసుందరీ పరిణయము, యయాతిచరిత్ర) కూడ సేకరించెను. టీకా సహితముగ మనుచరిత్ర, వసుచరిత్ర, వైజయంతీవిలాసములను ; కుచేలోపాఖ్యానమును మొదట ముద్రించినవాడు బ్రౌను.

భారత, భాగవతములందు ఒండు, రెండు పద్యములను మాత్రము అంగీకరించిన బ్రౌను ప్రబంధములలో పెక్కు భాగములను అనువదించుట ఆతని రసికతకు నిదర్శనము

అనేక ప్రబంధములకు కాగితపు ప్రతులను బ్రౌను తయారు చేయించుటవలన నామమాత్రావశిష్టములు కావలసిన పెక్కు ప్రబంధములు ఉద్ధరింపబడినవి. కావ్యములను పరిష్కరించి, శుద్ధ ప్రతులను తయారు చేసినపుడు, ఆయా గ్రంథపరిష్కరణమునకు ఎన్ని తాళపత్ర ప్రతులు పరిశోధింపబడినవో ఏ ప్రతి విలువగలదో మున్నగు వివరములనన్నింటిని బ్రౌను వ్రాయించెను ఇట్టి పద్ధతులను తెలుగువారికి బోధించిన ఆచార్యుడు బ్రౌను శుద్ధప్రతిని సిద్ధముచేయు పద్ధతిని బ్రౌను నిర్ణయించి, తరువాతి వారికి మార్గదర్శకుడయ్యెను

7. శుకసప్తతి, హంసవింశతి, పంచతంత్రము వంటి కథాకావ్యములు వ్యావహారిక పద బాహుళ్యములగుటచే అవి అవశ్యము పఠిష్కరించి, ముద్రింపదగిన కావ్యములుగ బ్రౌను పరిగణించెను. అతని నిఘంటు నిర్మాణమున కథకముగ నుపకరించిన కావ్యములీకథాకావ్యములు కథాకావ్యముల ప్రశస్తిని లోకమునకు వెల్లడించిన వాడు బ్రౌను వీనియందలి భాష ప్రజావ్యవహారమునకు సన్నిహితముగ నుండుటచే అవి అవశ్యపఠనీయ కావ్యములని ప్రకటించినవాడును బ్రౌను మహాశయుడే

8. పండితుల సమాదరణమునకు నోచుకొనక, అధికముగ ముఖస్థముగనుండిన ద్విపదకావ్యములకును ఆంధ్రవాఙ్మయమున సముచిత స్థానము నొసగిన వాడు బ్రౌను. ద్విపద సాహిత్యమును జంగముల సాహిత్యముగ తొలిసారిగ పరిచయము చేసినవాడు బ్రౌను.

9. తెలుగు కావ్యములలో ఆంగ్లములోనికి అనూదితములై ప్రథమ పద్యకృతులు వేమన, సుమతిశతకములు. ప్రథమ అనువాదకుడు బ్రౌను. ఈ రెండు శతకముల ముద్రాపకులలో ఆద్యుడు బ్రౌను. ముద్రితమైన ఆద్య తెలుగు కావ్యము 'వేమన పద్యములు' చెల్లాచెదరుగ నున్న వేమన పద్యముల నేర్చికూర్చి గ్రంథరూపమున వెలువరించిన వాడును బ్రౌను, 'విశ్వదాభిరామ వినురవేమ' అను మకుటము గల పద్యములు వేనవేలున్నట్లు కనిపెట్టిన ఆద్యుడును బ్రౌను. వీనిలో కొన్ని వేమన

కృతములుగా కావని తలంచిన వాడును బ్రౌను శతకములలోని భాషానాశ్యము, విస్పష్టభావములు, నీత్యుపదేశములు పరిశీలించి వానిని ప్రాథమిక పాఠశాలలలో పాఠ్యపుస్తకములుగ నియమింప బ్రౌనుకు దోహదమొనర్చెను.

10. పాశ్చాత్య విమర్శన విధానములను తెలుగు సాహిత్యమున ప్రవేశపెట్టిన వాడు బ్రౌను ఈ పద్ధతులను ఆతడు తన తెలుగు కావ్యాధ్యయనముస, ముద్రించిన గ్రంథముల సంస్కరణమున, వ్యాఖ్యారచనమున, వివిధవాఙ్మ సంకలనముస ఉప యోగించెను.

బ్రౌను ప్రకటించిన వీరశైవ సాహిత్యము మీది వ్యాసమునందు జంగముల ఆచార వ్యవహారముల వివరణయేకాక వారి సాహిత్య పరామర్శయు కలదు. శైవ కావ్యములలో ప్రభులింగలీల (పిడుపర్తి సోమనాథుడు) ఉత్తమమైనదిగ భావించెను. తెలుగు సాహిత్యమును ఆంధ్రేతరులకు పరిచయముచేసిన వారిలో ఆద్యుడు కావలి రామస్వామియైనను అతని గ్రంథము కేవలము కవి జీవితవిశేషములనే చాటుచున్నది కాని బ్రౌను వ్యాసములు విమర్శయుక్తములై తెలుగు సాహిత్య విశిష్టతను నిరూపించు చున్నవి

బ్రౌను వివిధ కావ్యములకు రచించిన ఉపోద్ఘాతములు గణనీయమైనవి. సాహిత్య పరామర్శమునకే కాక భాషా విమర్శలకును అవి బాటలు వేసెను. ఆనాడు ఉపలబ్ధమైన ఆంధ్ర వాఙ్మయము సంతటిని విమర్శక దృష్టితో పరిశీలించిన పరిశోధకుడు బ్రౌను. ఇవి క్రొత్త పోకడలతో అమూల్యలై తెలుగువారికి తెన్నులు చూపినవి.

11. వ్యాఖ్యాన రచనకు దోహదము చేసినవాడు బ్రౌను. (చూ 8:1 ) బ్రౌను పద్య ప్రసతులను వ్రాయుంచుటతో తృప్తిపొందక, కొన్ని తెలుగు కావ్యములకు వ్యాఖ్యానములను వ్రాయించిపెట్టెను. బ్రౌనునకు పూర్వమున్న వ్యాఖ్యానములు కేవలము వ్యాఖ్యాతల పాండిత్యప్రకర్షను ప్రదర్శించునవనియు, సులభగ్రాహ్యములు కావనియు, మూలమును పాఠకులకు సుబోధక మొనర్చునవియే వ్యాఖ్యానములు ప్రయోజన మనియు బ్రౌను అభిప్రాయము. ఈ విషయమును తనచే నియుక్తులైన పండితుల దృష్టికి తెచ్చెను.

12 తెలుగున పదసూచికలను, పద్యసూచికలను సంతరించుటకు మూలపురు షుడు బ్రౌను మనుచరిత్ర, ఆముక్తమాల్యద దశావతారచరిత్ర, తారాశశాంక

విజయము మున్నగువానికి పదసూచికలను వ్రాయించెను. (చూ. 8:2) వీనిలో తత్సమ పదములను కూడ స్వీకరించుట విశేషము.

13. తెలుగు కావ్యములకు ఆంగ్లమున వివరణములను వివరించినవాడను బ్రౌను. అవి కథాసంగ్రహరూపమున వెలసెను.

14. సాంఘికచరిత్ర నిర్మాణమునకు, సాహిత్య చరిత్ర రచనకు, దేశచరిత్ర నిరూపణకు, భాషాపరిణామ పరిశీలనకు లేఖలు మూలాధారములను సత్యమును గుర్తించి వానిని సంపుటములుగ కూర్చి భద్రపరచిన అద్యుడను బ్రౌను.

15. 20వ శతాబ్దమున గిడుగువారు ప్రతిపాదించిన వ్యావహారిక భాషోద్యమమునకు బీజము నాటినవాడు బ్రౌను. గ్రాంథికభాషలో నున్న తెలుగు వావ్యములకు పాఠనిర్ణయముల తీర్పు, వ్యాఖ్యానములు, టీకలు, ఉపోద్ఘాతములు, కథాసంగ్రహములు మున్నగునవన్నియు వ్యావహారిక భాషలోనే బ్రౌను కొనసాగించెను నిత్యవ్యవహారమున నున్న భాషయే, పాఠ్యగ్రంథములందును ఆవశ్యకమనుట బ్రౌను ప్రగాఢ విశ్వాసము. ఉచ్చారణమున వినిపించని అర్ధానుస్వారమును, లేఖనమున తరచు విడువబడు శకటరేఫను బ్రౌను పరిత్యజించి అధునికులకు సుగమ మార్గమేర్పరచెను.

14. విదేశీయుడైనను, ఏకాకియైనను దేశీయ పండితమండలిని కూడగట్టుకొని పరివారమును నియమించుకొని, సాహితీ మిత్రులను సంపాదించుకొని, వారి సహకార సాహాయ్యములతో పెక్కు గ్రంథముల పరిష్కరించెను. తెలుగువారికి పరిష్కరణ విధానములను గరపి; శుద్ధప్రతులను వ్రాయుంచుటనేర్పి, కావ్యముల ముద్రించుటలోని సౌలభ్యమును చూపి పురుగుల పొట్టకు ఎరయగుచుండిన తెలుగు కావ్యముల జీర్ణోద్ధరణ కావించిన బ్రౌను-మహాశయునికి ఆంధ్రులు అజన్మము ఋణపడియున్నారు.

తన మాతృభాషకాని తెలుగు భాషను వలచి, అశ్రమముగ అభ్యసించి అభిమానముతో మహాకృషి గావించి, తత్కావ్యసంపదను సముద్ధరించిన బ్రౌనుదొర-ఆంధ్రసాహితీ చరిత్రలో సంకీర్తనీయ యుగపురుషుడుగా సమాదరింపబడుననుట సహృదయైక వేద్యము

"విద్వానేవ విజానాతి విద్వజ్జన పరిశ్రమమ్."

# అనుబంధము - I

బ్రౌను సేకరించిన కాగితపు ప్రతులను తయారు చేయించిన కావ్యములలో ప్రధానమైన కొన్నింటి వివరములు సిద్ధాంత వ్యాసములో ప్రదర్శితములు. తదితరముల నీ అనుబంధమున కూర్చుట జరిగెను. వీనిలో పురాణేతిహాసములు ప్రబంధములు కథా కావ్యములు, ద్విపదలు అకారాదిగ నొసగబడినవి.

బ్రౌను సేకరించిన శతకములు 84. గ్రంథవిస్తరభీతిచే వాటి వివరములిట విడువబడినవి.

i. పురాణేతిహాసములు :

| కావ్యము | కవి | వివరములు. |
|---|---|---|
| 1. అనంత వ్రతోపాఖ్యానము. | తిరుమలరాయుడు | కా. ప్ర. 1. D. 3281 +. |
| 2. కూర్మ పురాణము | ? | కా. ప్ర. 1. D. 18.— (తా. ప్ర 1.) |
| 3. చతుర్వాటికామాహాత్మ్యము | లింగమకుంట్ల రామయ | కా. ప్ర. 1. D, 837 + గరిమెళ్ల వెంకయ్య, వెంకట్రామయ్య యెకాపిలాచేసిరి |
| 4. జైమిని భారతము | పిల్లలమర్రి పినవీరన | కా. ప్ర. 1. D. 14 +. ఇది 'పంచపాఠ్యాలు' కొరకు చూచిన కావ్యమని బ్రౌను తెలిపెను (తా. ప్ర. 8.) |
| 5 పాండురంగ మాహాత్మ్యము | తెనాలి రామకృష్ణకవి | కా. ప్ర 1. D 340 — (తా. ప్ర. 8) |
| 6. బాలభాగవతము | కోనేరు నాథుడు | కా. ప్ర. 2. D 27 — D 28 — |
| 7. బృహన్నారదీయము | ? | కా. ప్ర. 2. D 29 + D 30 +. |
| 8. బ్రహ్మోత్తరఖండము | ముత్తరాజు వెంకటకృష్ణ | కా. ప్ర. 1. D. 82 —. (తా. ప్ర. 2.) |

| కావ్యము | కవి | వివరములు |
|---|---|---|
| 9. బ్రహ్మోత్తరఖండము | పుల్లయ్య (పురహరయ్య) | కా ప్ర 1. D. 34 —. (తా. ప్ర. 1) |
| 10. భీమేశ్వర పురాణము | శ్రీనాథుడు | కా ప్ర. D. 348 +. (తా ప్ర 3) |
| 11. మనువంశపురాణము | పోచిరాజు వీరనామాత్యుడు | కా. ప్ర 2 D. 160. +. D. 162<br>(తా. ప్ర 1) |
| 12. మార్కండేయపురాణము | మారన | కా. ప్ర 1. D 301— (తా ప్ర. 2) |
| 13 ముక్తిచింతామణి | వెంకటార్య | కా. ప్ర 2 D 347 + 348 + |
| 14 లక్ష్మీనృసింహావతారము | ఎఱ్ఱన | కా ప్ర 1 D 351. |
| 15. వరాహపురాణము | నందిమల్లయ, ఘంటసింగయ | కా. ప్ర. 1. 304 — (తా. ప్ర. 2) |
| 16 వేంకటాచల మాహాత్మ్యము | తరిగొండ వెంకమాంబ | కా. ప్ర 3. D 352— 354 (తా. ప్ర 1) |
| 17. వెంకటేశ్వర మాహాత్మ్యము | ములుపాక బుచ్చయ్య | కా. ప్ర 355 — |
| 18. వైశ్యపురాణము | | కా ప్ర 2 D 316 + D 320—(తా. ప్ర. 3) |
| 19. శ్రీపర్వతపురాణము | శేషనాథుడు | కా. ప్ర 2. D 360 + D. 363 + (తా ప్ర 2) |
| 20 సత్పుర మాహాత్మ్యము | కూచిమంచి తిమ్మకవి | కా ప్ర 1 D 366 + తా ప్ర 4) |
| 21. స్కాందపురాణము | | కా ప్ర 3 D. 332 — పాఠాంతరము లు గుర్తింపబడినవి<br>D 323 —<br>D 324 — పాఠాంతరములు గుర్తింపబడినవి |

ii. శృంగార ప్రబంధములు :



| కావ్యము | కవి | వివరములు |
|---|---|---|
| 1. అంబరీష చరిత్రము | రంగశాయి కవి | కా ప్ర. 1. D. 370 + (తా. ప్ర. 1 D. 371.)<br>ఇది మెకంజీలైబ్రరీలోని ప్రతినిచూచి వ్రాసినదని బ్రౌను తెలిపెను |
| 2. అచలాత్మజా పరిణయము | వేంకటాచార్యుడు | కా ప్ర. 1 D 372. +. |
| 3 అధ్యాత్మ రామాయణము | పెద్దన సోమయాజి | కా ప్ర 1 D, 375 + |
| 4. అభిమన్యు పరిణయము | పిణె లక్ష్మీపతి | కా ప్ర 1 D. 381. – (తా ప్ర 1D. 382) |
| 5. అహల్యాసంక్రందన విలాసము | వేమనారాధ్యుల సంగమేశ్వరుడు | కా. ప్ర 1. D. 384 + (తా ప్ర 1 D 385)<br>దీనికి మూలము ఒంగోలు నివాసస్థుడైన వేములపాటి వెంకయ్య ఒసగినట్లు బ్రౌను తెలిపెను |
| 6. అహల్యా సంక్రందనము | సముఖము వెంకట కృష్ణప్పనాయకుడు | కా ప్ర 1. D. 386 + (తా. ప్ర 1.D 387).<br>పాఠాంతరములు గుర్తింపబడినవి |
| 7. ఆదిలక్ష్మీ విలాసము | అక్కినేపల్లి నరసింహకవి | కా ప్ర. 1 D. 388. +. (తా ప్ర 1 D 389)<br>"This poem is so obscured with pedantry that it is quite worthless"<br>అను బ్రౌను వ్రాత కలదు |
| 8. ఆనందసుందరీ చాతుర్యలీలావిలాసము | నాగేంద్రకవి | కా. ప్ర 1. D. 390– (తా. ప్ర. 1. D. 391) |
| 9. ఉత్తర హరిశ్చంద్ర కథ | తక్కెళ్ళపాటి లింగన | కా ప్ర. 2. D. 425 +. పాఠాంతరములు గుర్తింపబడినవి బ్రౌను వ్రాత అందందు కలదు<br>D. 426 – సటీక. |

